# శ్రీ గణేశపురాణం

## ఉపాసనాఖండము

## మొదటి భాగము


రచన :

డా॥ వేదవ్యాస I.A.S. Ph.D



ప్రచురణ :

VEDIC UNIVERSITY

UNIVERSITY OF VEDIC SCIENCES, INDIA - USA

Plot No. 56, Road No. 8, Jublee Hills, Hyderabad - 33.

వెల : రూ. 150/

# విషయసూచి

## I. గణేశ స్తోత్రాలు

# II. గణేశ మంత్రాలు





# ముందుమాట

శ్రీగణేశ మహాపురాణంలో స్తుతించబడిన 'మహాగణపతి' 33 కోట్ల దేవతలలోనూ ప్రధమారాధ్యుడు — అనగా మొట్టమొదటగా ఆరాధింప తగిన అగ్రపూజార్హుడు!

సమస్త మంత్రములలోనూ 'శక్తి' కి కారణములైన బీజాక్షరము లన్నింటిలోకి ముందుగా ఉచ్చరించబడేదే — ఓంకారము! అలా మంత్రాక్షరములలో ప్రణవంలాగా సమస్తదేవతలలోనూ ప్రధమంగా పూజించబడేవాడే గణనాధుడు. గణములనగా ఛందోగణములకు అధిపతి! అక్షరస్వరూపుడు — గురువు, లఘువు, పూర్ణానుస్వార, అర్ధాను స్వార రూపమై శబ్దంగా వెలువడే మంత్రస్వరూపమైన 'శబ్దబ్రహ్మమే' ఈ గణపతి!

గణపతి బీజాక్షరమైన 'గ'కార స్వరూపుడే ఈ మంత్రగణపతి మూలరూపము! నక్షత్రమండలములో దేవతాస్వరూపుడై, హస్తానక్షత్రంలో దర్శనమిచ్చే నక్షత్ర పురుషుడే గణపతి! ముఖమునందు హస్తా నక్షత్ర ముతో ప్రకాశించేవాడే "హస్త-ముఖు"డైన ఈ 'హస్తిముఖుడు!' కన్యారాశి

స్వరూపములో 'కన్యక' అనగా బ్రహ్మచారిణి. ఆ రాశిలో దర్శనమిచ్చే నిత్య బ్రహ్మచారి స్వరూపుడే ఈ గణపతి!

ముక్కోటిదేవతలకూ మూలమైన 33 దేవతాగణములకూ ప్రతీకగా 32 రూపాలు ధరించిన **సర్వదేవతాస్వరూపుడే** ఈ ద్వాత్రింశతి గణపతులకూ అనగా 32 గణపతుల మూర్తులకూ మూలకారణుడు.

భక్తులకు అఖండలక్ష్మీ ప్రదాతగా '**లక్ష్మీగణపతి**', విద్యాహీనులకు సమస్తవిద్యలనూ అనుగ్రహించే '**విద్యాగణపతి**' రూపంలో, యోగసిద్ధిని ప్రసాదించేవారికి బుద్ధిశక్తిని అనుగ్రహించే సిద్ధి బుద్ధులకు అధినాధుడైన మూలాధారస్థితుడగు '**కుండలినీశక్తి**' స్వరూపుడే ఈ గణపతి.

మూలాధారంనుండి ప్రారంభించిన శ్వాసయే దీర్ఘమైన ప్రాణాయామంద్వారా శిరస్సులో ఓంకారంలాగా ప్రతిధ్వనించి, ముక్కులోంచి శబ్దంగా బయలువెడలే ఈ వేదస్వరంయొక్క మూర్తిరూపమే — **పొడుగాటి తొండ**ముగల ఏనుగుతలతో రూపకల్పన చేయబడ్డ ఈ గణపతి మంత్రమూర్తియొక్క రహస్యము.

'**చింతామణి గణపతి**'గా భక్తులకు చింతించిన సమస్త కోరికలు సిద్ధింపచేసేవాడు ఆకాశంలో సింహరాశిపై వెలిగే కన్యారాశిలో కనిపించే సింహవాహనుడైన '**హేరంబ గణపతి**'గా సాక్షాత్కరించినాడు. '**విష్ణు గణపతి**'గా, '**బ్రహ్మ గణపతి**'గా, '**శక్తి గణపతి**'గా, '**వీర గణపతి**'గా ఇలా భక్తులు ఏవి కోరితే అవి ప్రసాదించే 32 దివ్యమూర్తులలో గణపతి సర్వదేవతా స్వరూపుడై మంత్రశాస్త్రంలోనూ, పురాణాలలోనూ, యోగశాస్త్రంలోనూ మనకు దర్శనమిస్తాడు. ఈ గణపతి తత్త్వము అతి నిగూఢమూ, ఎన్నో

రహస్యార్థములతో కూడివున్నది. దేవరహస్యంవంటిది.

ఈ గణేశపురాణంలో ప్రతిపాద్యుడైనవాడు — గణపతిరూపంలో పరబ్రహ్మమే! అనగా సాక్షాత్తూ పరమాత్ముడే అని గ్రహించాలి! అప్పుడే ఈ గణేశతత్త్వం మనకు బోధపడుతుంది.

ఇక్కడ ఒక ముఖ్యమైన అంశం విదేశీ పరిశోధకులు తరచూ అడిగేప్రశ్న ఒకటి ఉన్నది. అదేమిటంటే — "మీ హిందూమతంలో ఒక్కొక్క పురాణంలో ఒక్కొక్క దేవుడిని గురించి వర్ణించారు! ఏ పురాణానికి చూస్తే ఆ పురాణంలో ఆ దేవతయే అన్నిటికంటే పరమం అంటూ రాస్తారు! ఇంతకీ హిందూమతంలో ఈ సమస్త సృష్టికీ మూల కారణమైన భగవానుడు ఒక్కడా? అనేకమా?"

ఈ ప్రశ్న అమెరికాలో హిందూమత ప్రచారానికై వెళ్ళిన చిన్మయా మిషన్ ఉపన్యాసకురాలైన ఒక మహిళను అడిగారు. చక్కగా అన్నింటిలో శిక్షణపొందిన ఆమెకు శాస్త్రోక్తంగా తాను నేర్చినవి తిరిగి చెప్పడమే వచ్చుకాని ఇలాంటి ప్రశ్నను ఎన్నడూ ఎదుర్కొనలేదు. నిజానికి ప్రతీ హిందువూకూడా ఇలాంటి ప్రశ్నను ఆలోచించుకోవాలి.

'మన హిందూమతంలో భగవంతుడు ఒక్కడా? అనేకమా? లేక మన మతంలోని పురాణాలూ, శాస్త్రాలూ ఒకదానికొకటి విరుద్ధమా? ఎందుకంటే దేవీభాగవతంలో స్త్రీమూర్తియైన దేవియే త్రిమూర్తులకన్నా పరదైవం అంటూ పైకెత్తేస్తూ వ్రాస్తారు. శివపురాణంచూస్తే అదే పద్ధతిలో శివుడే పరదైవం అంటారుకదా! ఇక విష్ణుపురాణంలోనూ, భాగవతం లోనూ చూస్తే శ్రీమహావిష్ణువే సర్వేశ్వరుడని, ఇతర దేవతలు ఆయన

అనుచరులని, పరివారగణం అని రూపకల్పన చేయబడింది. నిజానికి ఇందులో ఎవరు పరమాత్ముడు?

వ్యాసమహర్షి వ్రాసిన 'బ్రహ్మసూత్రాలనుకనుక చూస్తే అందులో ఈ విశ్వానికి అతీతమైన పరవస్తువు పరబ్రహ్మతత్త్వమే — అనీ, ఈ పరబ్రహ్మ ఆకాశంవలే ఈసృష్టి అంతా సర్వత్రా వ్యాపించివుంటాడనీ చెప్పబడింది. కాబట్టి ఆకాశానికీ, కాలానికీ, మనస్సుకూ ప్రహరీగోడలు లేనట్టే — ఈ పరబ్రహ్మ తత్త్వానికికూడా ఒక ఆకారంఅంటూ లేదని — కాబట్టి ఈ సృష్టికి పరతత్త్వమైన పరబ్రహ్మ నిరాకారమనీ, ఏగుణమూ లేని నిర్గుణుడని మాయకు అతీతుడనీ చెప్పబడింది. కాబట్టి ఈ సమస్తసృష్టి మాయ అని శంకరాచార్యులవారి అద్వైతాన్ని ఆధారం చేసుకొని కొందరు వాదిస్తారు. ఇందులో ఏదినిజమో నిర్ణయించడం అంత తేలికేమీకాదు!

ఈ ప్రశ్న మనస్సులో ఉదయించిన హిందువుడికి రకరకాల ఈ పురాణాలు వేరువేరు దేవతలను అందరికన్నా పరమాత్ములైనవారిగా వర్ణించేవిచూస్తే గందరగోళంగానూ, విచిత్రంగానూ ఉంటుంది! ఈ కోణంనుంచి గణేశపురాణాన్ని పరిశీలిస్తే ఈ గణపతి ముక్కోటిదేవతలలో ఒకదేవుడా? లేక ఇతడే సమస్త సృష్టికి ఆదిభూతుడైన పరమాత్మయా? ఏది నిజం? దీనికి సరైన అర్థం గోచరించాలంటే లోతైన ప్రాచీన వేదమతంయొక్క పునాదులదాకా వెళ్ళాలి! ఎందుకంటే ప్రపంచంలో అతి ప్రాచీనమైన ఈజిప్టుదేశపు మతం, టిబెట్టు, చైనా — ఇంకా ఇప్పటి క్రైస్తవమతం, ఇస్లాము పుట్టకముందు అరేబియాలోవుండే ప్రాచీన మతమూ — వీటన్నిటిలోనూ హిందూమతంలోలాగే రకరకాల దేవతలు

కనిపిస్తారు. అతిప్రాచీనమైన ఈ మతాలలో ఏకేశ్వర ఆరాధన తెలియదా? వేదమంత్రాలను దర్శించిన మహాఋషులకు **భగవానుడు** ఒక్కడా అనేకమా తెలియదా?

ఇది తెలియాలంటే ఇప్పటికీ మన దేవాలయాలలో అనుసరించే **"పంచాయతన పూజావిధానం"** తెలియాలి. **'పంచాయతనం'** అనగా ఐదు గురు దేవతలను ఒక అరచేతిలోని వ్రేళ్ళవలే నక్షత్రాకారంగా భావించే విధానం! ఈ పంచాయతనంలో ఐదుగురు దేవతలుంటారు.

(1) ఆదిత్యుడు

(2) అంబిక లేక జగన్మాత

(3) శ్రీమహావిష్ణువు

(4) గణపతి లేక గణేశుడు

(5) సదాశివుడు

ఈ ఐదుగురూ కలిసి పంచాయతనం అంటారు. గణపతి ఈ పంచాయతనంలో ఒకడుగా ఉంటాడు. ఏ దేవాలయంలో పూజావిధానం కావలసినా ఈ ఐదుగురు దేవతలనీ ఒక క్రమంలో ఆవాహనచేసి ఇందులో ఒకరిని 'కేంద్రబిందువు'లో పెట్టి ప్రధాన దేవతగా అర్చిస్తారు. అంటే శివాలయంలో గనుక అయితే కేంద్రబిందువులో శివుడు, గణపతి ఆలయమైతే గణపతిమూర్తిని మధ్యకేంద్రంలో ఉంచాలి! ఇదే **'పంచాయతన విధానం'**.

**"ఆదిత్యమంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం"**

అని ఈ పంచాయతనం వర్ణించబడివున్నది. ఈ గణేశపురాణం లోని అనేకరకాల గణేశమూర్తులను కోరికలనుబట్టి వేరువేరు దేవాలయా

లలో స్థాపించవలసిన గణేశుని అర్చామూర్తులుగా అర్థం చేసుకోవాలి.

ఇకపోతే సాధకుడు ముక్తికోసం పరమాత్ముడైన ఒకేఒక్క దేవుడిని సర్వశ్య శరణాగతిచేసి ఆయనద్వారానే మనస్సును ఆత్మలో లీనంచేసి యోగసమాధిని పొందాలిగదా? ఆ పరతత్త్వం, పరమాత్మా ఎవరు?

**'సాధకుడి మనస్సు ప్రాణంద్వారా పనిచేస్తూవుంటుంది'** అన్నదే యోగశాస్త్ర రహస్యం! ఈ ప్రాణశక్తి మనిషిలో కన్నులద్వారా, శ్వాసద్వారా, ముఖంద్వారా, చెవిద్వారా ఇలాగ పంచేంద్రియాలద్వారా పనిచేస్తూ మనకి వినికిడి, వాసన, భోజనంవంటి బ్రతికివుండటానికి అవసరమయ్యే ప్రక్రియల్ని నిర్వహిస్తూ వుంటుంది. **ఈ ఐదు ఇంద్రియాలకూ అధిష్ఠాన దైవతములే పంచాయతన పూజలోని ఐదుగురు దేవతలు!**

ఇందులో ఎవర్ని ఆరాధించాలి అంటే — సాధకుడు తన మనస్సును, ప్రాణశక్తిని ఆత్మతో లయంచేసి శ్వాసద్వారా ప్రాణాయామం తో లయం చేయవచ్చు లేదా ముఖంద్వారా బీజాక్షరసహితమైన మంత్రం ద్వారా లయం చేయవచ్చు. లేదా నేత్రములలోని దృష్టిని ఏకాగ్రంచేసి భ్రూమధ్యదృష్టిద్వారా యోగ సమాధిని పొందవచ్చు! ఇలా ఐదు ఇంద్రియాలద్వారా సాధకుడు తన మనస్సును, ప్రాణాన్ని అంతర్ముఖం చేసుకోవాల్సి ఉంటుంది. ఏ ఇంద్రియంద్వారా ప్రాణశక్తిని అందిపుచ్చు కొని పైకి పాకిపోయినా చివరికి చేరే గమ్యం ఒక్కటే. అది తనలోని అంతరాత్మ లేక జీవాత్మ! అది ఒక్కటే. ఇంటికి ఐదుద్వారాలలోంచి ప్రవేశించినా లోపల ఇంటిఆవరణ చేరవచ్చు. బయటికి చూసేందుకు ఐదూ వేరువేరు ద్వారాలుగా కనిపిస్తాయికాని అవన్నీ తీసుకువెళ్ళే మధ్య

హాలులోనే అవన్నీ కలుస్తాయి! ఈ ద్వారాల వంటివే ఇంద్రియాలు. కాబట్టి ఏ సాధనామార్గంద్వారా అన్వేషించినా, సాధనచేసినా చేరుకునేది యోగిగా చివరికి అంతరాత్మనే. కాబట్టి ఈ ఐదు ఇంద్రియాలకు అధిష్టానదేవతలు ఐనవారే పంచాయతన విధానంలోని ఐదుగురు దేవతలలోనివాడే **'గణపతి!'** కాబట్టి ఏ దేవతా ఉపాసనతో ప్రారంభించినా చివరకు యోగసాధనద్వారా మనస్సు వెళ్ళివెళ్ళి విశ్వానికి కేంద్రమైన పరమాత్మయందే లీనమౌతుంది. ఈ దృష్టితో అర్థంచేసుకుంటే గణపతి పరమాత్మస్వరూపుడెలాగో అర్థమౌతుంది. ఒకే పరతత్త్వాన్ని అనేక విధాలుగా ఎందుకు చెప్పారో బోధపడుతుంది.

**'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'**

'నిజానికి సత్యం ఒక్కటే! కాని బ్రహ్మవేత్తలు దాన్ని వేరువేరు విధాలుగా చెప్పారు' అన్న బంగారుసూత్రమే వేదాలలోని హిందూమతానికి కీలకమైన రహస్యాన్ని బోధిస్తుంది.

అంతేకాదు! హిందూమతంలోని వేరువేరు దేవతలు ఎందుకున్నారో తెలపడమేకాక — ప్రపంచంలోని వేరువేరు మతాలలోని దేవతలుకూడా చివరకు ఒకే కాండానికి మొలిచిన కొమ్మలవంటివారని తెలుస్తుంది! శ్రీరామకృష్ణపరమహంసకూడా తన సాధనద్వారా ఈ సత్యాన్నే అనుభవంలో గ్రహించారు.

శ్రీగణేశపురాణ పారాయణద్వారా, గణపతి ఉపాసనలద్వారానూ ఏకనిష్ఠతో సద్గురు పాదపద్మాలను శరణుపొంది విధిపూర్వకంగా ఉపదేశం పొంది సాధనచేస్తే ప్రతీవారూ చివరకు పరమాత్ముడైన భగవానుని

చేరుకుని ముక్తిని పొందుతారు! ఇదే ఈ గణేశ పురాణంయొక్క ప్రయోజనం.

ఈ దృష్టితో ప్రతీవారూ ఈ 'శ్రీగణేశపురాణాన్ని' పారాయణ చేసుకోవాలని పూర్వపు తెలుగు అనువాదం కఠినంగానూ, జఠిలంగానూ ఉన్నందున నేను మళ్లీ స్వయంగా రసవత్తరమైన భాషలోకి అనువదించాను.

ముఖ్యంగా ఇందులోని గణేశ స్తోత్రాలలోని రహస్యార్థాలను వివరిస్తూ అనువాదం చేశాను. ఇది శ్రద్ధతో, భక్తితో గమనిస్తూ చదివితే అట్టివారు తప్పక తరించగలరు!

ఈ **"గణేశపురాణం"** ద్వారా ఈ గ్రంధాన్ని పారాయణచేసే భక్తులందరికీ ఆయురారోగ్య ఐశ్వర్యాలతోపాటు పరాసిద్ధిని అనుగ్రహించాలని పెరుమాళ్ళకు మంగళాశాసనంచేస్తూ

బహుధాన్య వైకుంఠ ఏకాదశి,

**సాయినిలయం,**

**28-12-1998**

హైదరాబాద్

ఇట్లు

మీ

వేదవ్యాస

# 1

# భృగు సోమకాంత సంవాదం

(మూలం)

## ప్రథమో అధ్యాయః

ఓం నమస్తస్మై గణేశాయ, బ్రహ్మవిద్యా ప్రదాయినే।
యస్యాగస్త్యాయతే నామ। విఘ్నసాగర శోషణే॥ 1

**ఋషయః ఊచుః :-**

సూత సూత మహాప్రాజ్ఞ వేదశాస్త్ర విశారద ।
సర్వవిద్యానిధే త్వత్తో వక్తాఅన్యో నోపలభ్యతే ॥ 2

జన్మజన్మాంతరీయం నః స్థితం పుణ్యం మహత్తరం ।
తేన సందర్శనం జాతం సర్వజ్ఞస్య సతస్తవ ॥ 3

వయం ధన్యతమా లోకే జీవితంన స్సుజీవితం ।
పితరో వేదశాస్త్రాణి తపాంస్యాశ్రమ ఏవచ ॥ 4

అష్టాదశ పురాణాని విస్తరాత్ వితాన్శ్రానః ।
అన్యాన్యపి హి నః శ్రోతుంమిచ్ఛామో వద సత్తమ ॥ 5

శౌనకేయే మహాసత్రే సత్రా ద్వాదశ వార్షికే ।
త్వత్కథామృత పానాన్నో నాన్య ద్విశ్రామ కారణం ॥ 6

**సూత ఉవాచ :-**

సాధుపృష్టం మహాభాగ భవద్భిః పుణ్య కర్మభిః ।
సాధూనాం సమచిత్తానాం మతిర్లోకోపకారిణీ ॥ 7

మమాపి అపరితోషో అస్తి కథానాం కథనే ద్విజాః ।
అతోహం సాధువృత్తేభ్యః కథయిష్యే విశేషతః ॥ 8

అన్యాన్యుపపురాణాని వర్తంతేఽష్టాదశైవ చ ।
గణేశం నారదీయం చ నృశింహాదీ న్యథాపి చ ॥ 9

గణేశస్య పురాణం యత్తత్రాదౌ కథయామ్యహం ।
దుర్లభం శ్రవణం యస్య మర్త్యలోకే విశేషతః ॥ 10

యస్య స్మరణమాత్రేణ కృతకృత్యో భవేన్నరః ।
ప్రభావమస్య గదితుం నేశః శేష శ్చతుర్ముఖః ॥ 11

సంక్షేపతో బ్రవీమ్యేత త్తథాపి భవదాజ్ఞయా ।
బహు జన్మార్జితైః పుణ్యై రస్యతు శ్రవణం భవేత్ ॥ 12

పాషండినాం నాస్తికానాం నభవేత్పాప కర్మిణాం ।
నిత్యత్వా న్నిర్గుణత్వాచ్చ అనాదిత్వాచ్చ తత్వతః ॥ 13

గణేశస్య స్వరూపంచ వక్తుం కేనాపి న శక్యతే ।
తథాప్యుపాసనాసక్తైః నిర్గుణం తన్నిరూప్యతే ॥ 14

ఓంకాం రూపీ భగవాన్ యో వేదాదౌ ప్రతిష్ఠితః ।
యం సదా మునయో దేవాః స్మరంతీంద్రాదయో హృది ॥ 15

యం పూజయంతి సతతం బ్రహ్మేశానేంద్ర విష్ణవః ।
యో హేతుస్సర్వజగతాం సర్వకారణ కారణం ॥ 16

యదాజ్ఞయా కస్సృజతే అథ విష్ణుర్యదాజ్ఞయా పాలన మాతనోతి।
యదాజ్ఞయా సంహరతే హరోపి, యదాజ్ఞయా సంచరతే దినేశః॥ 17

యదాజ్ఞయా వాతి సమీరణోపి, యదాజ్ఞయాపః ప్రవహంతి దిక్షు ।
యదాజ్ఞయా భాని పతంతి భూమౌ, యదాజ్ఞయా అగ్నిర్జ్వలతి త్రిలోకే ॥ 18

తస్య యచ్చరితం గుప్తం కస్యాపి న నివేదితం ।
తదహం వః ప్రవక్ష్యామి సాదరం శ్రూయతాం ద్విజాః ॥ 19

బ్రహ్మణా కథితం పూర్వం వ్యాసాయామిత తేజసే ।
భృగవే కథితం తేన సోమకాంతాయతే చపి ॥ 22

వ్రతైర్యజ్ఞైస్తపోభిశ్చ దానాస్త్రీర్థైశ్చకోటయః ।
భవం యేషాం పుణ్యానాం తేషాం బుద్ధిః ప్రజాయతే ॥ 23

గణేశాఖ్య పురాణస్య శ్రవణే ద్విజసత్తమాః ।
మాయా యేషాం సంసారే సదారాపత్య భూమిషు ॥ 24

మయూరేశ కథాయాం తే, సాదరాః మునిసత్తమాః ॥
శ్రూయతామస్య మహిమా సోమకాంత ప్రసంగతః 25

## కథా ప్రారంభః

సౌరాష్ట్రే దేవనగరే సోమకాంతో భవన్నృపః ।
వేదశాస్త్రార్థ తత్వజ్ఞో, ధర్మశాస్త్రార్థ తత్పరః ॥ 26

దశనాగ సహస్రాణి, హయానాం ద్విగుణానిచ ।
రథినాం షట్సహస్రాణి ప్రయాంతం అనుయాంతిచ ॥ 27

పదాతయో అప్య సంఖ్యాతాః అగ్నిశస్త్రధరా స్తథా ।
కోదండధారిణశ్చాన్యే నిషంగద్వయ ధారిణః ॥ 28

బుధ్యా బృహస్పతిం జిగ్యే సంపదా ధనదంచ యః ।
క్షమయా పృథివీం జిగ్యే గాంభీర్యేణ మహోదధిం ॥ 29

సూర్యాచంద్రమసౌ జిగ్యే భాసా కాంత్యాచ యోనృపః ।
ప్రతాపే నానలం జగ్యే, సౌందర్యేణ మనోభవం ॥ 30

యస్యామాత్యా ప్రబలినః పంచాసన్ దృఢవిక్రమాః ।
నీతి శాస్త్రార్థ తత్వజ్ఞాః పర రాష్ట్రవిమర్దినః ॥ 31

రూపవాన్ప్రథమస్తత్ర, విద్యాధీశ స్తథాపరః ।
క్షేమంకరో జ్ఞానగమ్యః సుబలః పంచమస్మృతః ॥ 32

రాజకార్యకరా నిత్యం రాజ్ఞః ప్రియతమాః భ్రుశం ।
ఏతైర్నానావిధాదేశాః ఆక్రాంతాః స్వపరాక్రమాత్ ॥ 33

ఏతే ఽ అతిసుందరా నానాభూషా వస్త్రైరలంకృతా ।
తస్యరాజ్ఞో భవద్భార్యా సుధర్మా గుణశాలినీ ॥ 34

యద్రూపమవలోక్యైవ, రతి రంభా తిలోత్తమాః ।
లజ్జితా నసుఖంక్వాపి లేభిరే నచ మేనిరే ॥ 35

అనేక రత్నఖచితే, తాటంకే కాంచనే శుభే ।
బిభ్రతీ కర్ణయోః కంఠే నిష్కం ముక్తాఫలాని చ ॥ 36

కటౌ రత్నమయీం కాంచీం, తాదృశే నూపురేంఘ్రిగే ।
అంగులీయాన్యుత్తమాని కర పాదాంగులీషు చ ॥ 37

వాసాంస్యనేక వర్ణాని మహార్హాణి సహస్రశః ।
భగవద్భజనే సక్తా తథాచాతిథి పూజనే ॥ 38

సేవనే అహర్నిశం భర్తుర్వచనేచ రతా సదా ।
హేమకంఠ ఇతి ఖ్యాతః పుత్రోభూదనయోః శుభః ॥ 39

గజాయుత బలో ధీమాన్, విక్రమీ శత్రుతాపనః ।
ఏవమాసీ త్స్రేమకాంతః పృథివ్యాం రాజసత్తమః ॥ 40

సర్వాన్రాజ్ఞో వశే కృత్వాచక్రే రాజ్యం ధరాతలే ।
నిత్యం ధర్మరతోయజ్వా దాతా త్యాగీ ద్విజోత్తమాః ॥ 41

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనా ఖండే సోమకాంత వర్ణనం నామ ప్రథమో అధ్యాయః ॥**



# భృగు సోమకాంత సంవాదం

## 1-వ అధ్యాయము

*"శబ్దబ్రహ్మయై — వాక్కులకు ఛందోగణాలకూ అధిపతి — 'గణపతి' స్వరూపి యైన 'బ్రహ్మణస్పతి'కి భక్తిపూర్వక నమస్కారము! సమస్త కార్యములకూ విఘ్న భయం నివారించే "విఘ్నపతి"కి నమస్కారము. మాకు సమస్త సంపదలనూఇచ్చే "లక్ష్మీగణపతి"కి, లక్షని కటాక్షించే మహా గజమునకు నమస్సులు! 'సిద్ధి'-ని కలిగించే యోగ జ్ఞానస్వరూపమైన 'బుద్ధీ'శునకు నమస్సులు. సమస్త దేవతాగణములకూ ప్రధముడైనవాడూ — 'అక్షర', బీజాక్షర, మంత్రరూపదేవతా గణాలకు ప్రధమ ఆరాధ్యుడైన 'ఓంకార స్వరూపియైన "గణనాధున"కు నమస్సులు!*

*"ఓ బ్రహ్మరూపీ! జ్ఞానప్రదుడవు! ఓ విష్ణురూపీ సంపత్ప్రదుడవు! ఓ రుద్రరూపీ 'కర్మ'లను భస్మంచేసే వైరాగ్య స్వరూపుడవు! నీవే పరబ్రహ్మవు! సమస్త వేదరాశికీ అక్షరరూపియైన ఓఛందస్వరుడా! నీకివే నా నమోవాకములు! ప్రసన్నుడవుకమ్ము!"*

*— వేదవ్యాసకృత గణపతి ప్రార్ధన.*

బ్రహ్మవిద్యాప్రదాయకుడైనటువంటి గణేశునకు నమస్కారము. విఘ్నములనే సాగరములను అగస్త్య ఋషివలే శోషింపచేయు గణపతికి మనసా నమస్కరించుచున్నాను.

పూర్వం నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులు లోకకళ్యాణార్థం పన్నెండు సంవత్సరాలపాటు జరిగే సత్రయాగాన్ని తలపెట్టారు. అందులో భాగంగా ప్రతిరోజూ సాయంసమయంలో సత్కథాశ్రవణంచేసేవారు! ఒకనాడు సత్కాలక్షేపం చేసే సంకల్పంతో ఆ యజ్ఞస్థలానికి విచ్చేసిన సూతమహామునితో యిలాఅన్నారు.

"ఓ సూతమహామునీ! నీవు సకల శాస్త్రాల పురాణాల సారం ఎరిగినవాడవు! సకల విద్యలకూ నిధివైన నీవంటి వక్త లభించటం జన్మజన్మాంతరములలో చేసిన మహాపుణ్యం వలనగాని జరుగదు! మేమంతా అటువంటి నీ దర్శనమాత్రం చేత ధన్యులమైనాము! మా మనస్సులను పావనమొనరించే భగవత్కథలను నీనుండి వినాలన్న ఉత్సాహంతో వున్నాము. కనుక అట్టి పరమ కమనీయములూ, పావన కరములూ మంగళమయములైన భగవత్కథలను మాకు శ్రవణానంద ముగా వినిపించి మమ్మల్ని కృతార్థులను చేయవలసింది!"

అమోఘ తపస్సంపన్నులూ, నిగ్రహానుగ్రహ సమర్థులూ అయిన ఆ ఋషుల ప్రశ్నను విన్న సూతుడిలా బదులిచ్చాడు.

"ఓ పరమపావనులైన మునిసత్తములారా! పావనమైన మీయొక్క ప్రశ్న సకల లోకాలకూ ఉపకరించేదీ, నన్నూ తరింపచేసేదీను! కనుక మీరు కోరినవిధంగా సత్కథా కాలక్షేపం చేయాలని నాకూ ఉత్సాహంగానే ఉన్నది!

"ఓ పావనులారా! మద్గురువరేణ్యులైన వ్యాసమునీంద్రుల వారిచే రచింపబడిన అష్టాదశ పురాణాలనూ, అష్టాదశ ఉపపురాణాలనూ కూడా మా గురుదేవుల అనుగ్రహంతో ఆసాంతం నేర్చుకున్నాను. వీటిలో ముఖ్యమైన ఉపపురాణంగా చెప్పతగిన శ్రీగణేశపురాణాన్ని మీకు విని పిస్తాను. ఈ పురాణంయొక్క విశేషమేమిటంటే ఇది అంతతేలికగా లభించేదికాదు! ఈ గణేశుడిని స్మరణమాత్రంచేతనే విఘ్నములనే మంచు తెరలు ఆయన అనుగ్రహమనే సూర్యోదయంతో పటాపంచలైపోతాయి. విఘ్నపతి భక్తులకు తమ మనోభీష్టసిద్ధీ, సకలకార్యసిద్ధీ కలుగుతుంది.

ఎన్నో జన్మజన్మాంతరాల పుణ్యంవల్లనే ఇటువంటి కథాప్రసంగం వినడం, చెప్పడం లభిస్తుంది. ఐతే నాస్తికులైనవారూ, శ్రద్ధారహితులూ ఎంతమాత్రం ఈ పురాణశ్రవణానికి అర్హులుకారు! ఈ గజాననుడు భక్తవత్సలుడు! అనంత మహిమోపేతుడు! నిత్యసత్య స్వరూపుడు. ఈయన నిర్గుణతత్త్వంగానూ, సగుణమూర్తిగాకూడా ఆరాధించబడు తున్నాడు. సకల వేదాలకూ, మంత్రాలకూ ఆదిలో వెలువడిన ప్రణవ స్వరూపుడే గజాననుడు.

ఈ వినాయకుని అట్టి ప్రణవస్వరూపునిగానే ఇంద్రాది సకల దేవతలూ తమ హృదయాలలో నిరంతరం ధ్యానిస్తూ ఉంటారు. ఈతడే అఖిల జగములకూ కారణమైనటువంటివాడు. ఆదిమధ్యాంతరహితుడు. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు తమతమ కార్యభారాన్ని (సృష్టి స్థితి లయాలను) ఈ గణేశుని అనుజ్ఞమేరకే నిర్వర్తిస్తున్నారు. ఈయన ఆజ్ఞవల్లనే వాయువు వీస్తున్నాడు, అగ్ని ప్రజ్వరిల్లుతున్నాడు, జలములూ ప్రవహిస్తున్నాయి! అట్టి సర్వేశ్వరుడు సకల జగన్నియామకుడైన గణేశుని

చరిత్రను మీకు తెలియచేస్తాను. ఎంతో రహస్యమైనటువంటిదీ, అమోఘ మైనట్టి ఈ పావనచరితాన్ని భక్తిశ్రద్ధలతో ఆలకించండి!

ఈ గణేశపురాణాన్ని ముందుగా బ్రహ్మ వ్యాసమహర్షికి ఉపదే శించాడు. ఆయన భృగువుకూ, ఆ భృగుమహర్షి తరువాతికాలంలో సోమకాంతమహారాజుకూ ఉపదేశించారు.

ఈ పురాణాన్ని భృగుమహర్షికీ సోమకాంత మహారాజుకూ మధ్య జరిగిన సంవాదంగా తెలియజేస్తాను. సావధానమనస్కులై ఆలకించండి!

**కథాప్రారంభము :**

పూర్వం సౌరాష్ట్రదేశంలో దేవనగరమనే రాజ్యం ఉండేది! ఈ రాజ్యాన్ని సోమకాంతుడనే మహారాజు పరిపాలించేవాడు. ఎంతో పరాక్రమ వంతుడై, జనరంజకంగానూ, ధర్మబద్ధంగాను ప్రజలను కన్నబిడ్డలవలే ప్రేమగా పాలించేవాడు. సౌందర్యంలో మన్మధుడిని తలదన్నేలా — సార్థక నామధేయుడిగా (చంద్రుని వెన్నెలవంటి శరీరకాంతి కలిగి) ప్రకాశించేవాడు. ధర్మబద్ధంగా పరిపాలన చేయటంవల్ల ఆతడి రాజ్యం సుభిక్షంగా, సస్యశ్యామలమై, ధనధాన్యాలతోనూ పాడిపంటలతోనూ అల రారుతూ, శత్రువులకు కన్నెత్తి చూడరానిదై ఉండేది!

ఈరాజుగారి కొలువులో నీతికోవిదులు, సకల శాస్త్రపారంగతులూ, ప్రభుభక్తి పరాయణులూ ఐన ఐదుగురు మంత్రులుండేవారు. వారు రాజుకు సరైన సలహాలనిస్తూ, వ్యూహరచనచేస్తూ సమర్థవంతంగా పరిపాలన నిర్వహిస్తూండేవారు! సోమకాంతుడు తన భుజపరాక్రమంచేత అనేక దేశాల రాజులను సామంతులను చేసుకొని వారినుంచి కప్పము

తీసుకునేవాడు. ఆమంత్రులు వరుసగా 1) రూపవంతుడు, 2) విద్యాధీశుడు, 3) క్షేమంకరుడు, 4) జ్ఞానగమ్యుడు, 5) సుబలుడు అన్నపేర్లతో పిలువబడేవారు.

ఆరాజుకు సుధర్మ అనే భార్య ఉండేది. అమిత సౌందర్యవతి, సకలసద్గుణ సంపన్నుయైన ఆ మహాపతివ్రత రాజుకు తలలో నాల్కలాగా ఆతడు చేసే దేవతాది పూజలలో తోడ్పడుతూ సర్వఅలంకారములతోనూ శోభిల్లుతూ మంగళస్వరూపిణిగా ఉండేది.

ఆ పుణ్యదంపతులకు అమిత బలపరాక్రమోపేతుడూ, గుణవంతుడూ బద్ధిశాలీయైన హేమకంఠుడనే కుమారుడుండేవాడు. ఇలా సకల సిరిసంపదలతో, కీర్తిప్రతిష్టలతో ప్రకాశించే సోమకాంత మహారాజు లోకకళ్యాణార్థం ఎన్నో యజ్ఞయాగాదులు నిర్వహిస్తూ, దాతయై తన రాజ్యాన్ని నిష్కంటకంగా పరిపాలించేవాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని

**'భృగు సోమకాంత సంవాదం'** అనే మొదటి అధ్యాయం.



## 2

# సోమకాంత వర్ణనం

(మూలం)

## ద్వితీయో అధ్యాయః

**సూత ఉవాచ:-**

శ్రూయాతాం ఋషయ స్సర్వే అసోమకాంతస్య దుష్కృతం ।
అకస్మా దభవత్తస్య గలత్కుష్ఠో తి దారుణః (దుఃఖదః) ॥ 1

ధర్మశీలస్య రాజ్ఞోథ పూర్వకర్మ విపాకతః ।
శుభంవా ప్యశుభం కర్మ నముంచతి సరం క్వచిత్ ॥ 2

యస్యాం యస్యామవస్థాయాం కృతం భవతి కర్మయత్ ।
తస్యాం తస్యామవస్థాయాం భుజ్యతే ప్రాణిభిర్ధ్రువం ॥ 3

దుఃఖసాగర మగ్నోఽభూదప్లవో జలదౌ యథా ।
వేదనామలభద్భృహ్వాం భుజంగేనేవ దంశితః ॥ 4

నానా క్షతసమాకీర్ణః స్రవద్రక్త ఇత స్తతః ।
పూయ శోణితవాన్ రాజా కృమిభి ర్వ్యాహ్వలీకృతః ॥ 5

అస్థి శేషోఽభవద్రాజా యక్ష్మణేస్రవసమావృతః ॥
చింతయా వ్యాకులీభూతః సర్వేంద్రియ రుజాన్వితః ॥ 6

తతోఽమాత్యాన్ జగౌ రాజా మన స్సంరుధ్య యత్నంతః । 7

రాజా ఉవాచ :-

ధిఙ్మే రాజ్యంచ రూపంచ ధిగ్బలం జీవితం ధనం।
కేనేదం కర్మబీజేన వ్యసనం సముపస్థితం ॥ 8

కాంత్యా సోమో జితో యేన సోమకాంత స్తతోభవమ్ ।
యేన మే సాధవో దీనాః శ్రోతియా ఆశ్రమా అపి ॥ 9

పాలితాః పుత్రవ జ్ఞాన పదా లోకాస్తథాపరే ।
యేన మే నిర్జితాబాణైః శత్రవో ఘోరరూపిణః ॥ 10

యేన మే సకలాపృథ్వీ కృతాన్య వశవర్తినీ ।
సమ్యగారాధితో దేవః పరమాత్మా సదాశివః ॥ 11

దుష్ట సంగమహీనేన చిత్తనిగ్రహ కారిణాః ।
యేన మేవ పుషాపూర్వం ఇష్టగంధా నిషేవితాః ॥ 12

తదిదానీం పూతిగంథం అతోమే జీవితంవృథా ।
అతోహం కాననం యాస్యే సర్వేషాం అభ్యనుజ్ఞయా ॥ 13

హేమకంఠ సుతం సర్వే బుద్ధివిక్రమ సంయుతం ।
సించంతు రాజ్యహేతోర్మే పాలయంతు పరాక్రమైః ॥ 14

ఇదానీం నప్రదర్శిష్యే ముఖం లోకే కథం చన ।
నమే రాజ్యైర్నదారైర్వా జీవితేన శ్రియాపివా ॥ 15

ప్రయోజనం మహామాత్యాః కరిష్యే స్వహితం వనే । 16

**సూత ఉవాచ :-**

ఇత్యుక్త్వా నిపపాతో ర్వ్యాం తరుర్వాత హతో యథా ॥ 17

పూయశోణిత ఘర్మౌఘైః వ్యాప్తోసౌ ద్విజసత్తమాః ।
కోలాహలో మహానాసీద మాత్యానాం చ యోషితాం ॥ 18

హా హాకారశ్చ లోకానాం క్షణమాసీత్సుదారుణః ।
వస్త్రప్రోంఛన వాతాద్యైః ఔషధైః క్షిప్రకారిభిః ॥ 19

మంత్రి మంత్ర ప్రయోగైస్తం సచేతన మకారయన్ ।
స్వస్థేజాతే నృపే తస్మిన్నమాత్యాః ప్రాబ్రువన్నిదం ॥ 20

**అమాత్యాఊచుః :-**

తవ ప్రసాదా దమరేంద్రతుల్యం భుక్తం సుఖం సర్వజనే ష్వసిద్ధం ।
కథం త్విదా నీం త్వదృతే వసామ: కథంచ జీవేమ పశుఘ్న తుల్యాః ॥ 21

కరోతు రాజ్యం తవ సూనురేకః ప్రభూత కోశో బలవాన్ రిపుఘ్నః ।
విహాయ సర్వం సుఖమద్య రాజన్ సహైవ యామస్తు
వనాయగంతుం ॥ 22

**సూత ఉవాచ :-**

తతస్సు ధర్మా వచనం జగాద వనే నృపం సేవితు మేకవీరా । 23

వ్రజే సహానేన ప్రధాన వర్యాః । ప్రశిష్ట రాజ్యం సహమే సుతేన ॥ 24

దుఃఖస్య భోక్తా నపరోస్తి నైవ సుఖస్య వా పూర్వకృతస్య జంతోః ।
యథా యథా కర్మఫలం ప్రసక్తం తదేవ భోగ్యం
స్వయమేవ తాదృక్ ॥ 25

మయాపి నానావిధ భోగవత్యా సుఖేన రాజ్యం పరిభుక్త మస్య ।
స్త్రీణాంహి భర్తాగమనం సహైవ పరత్ర లోకే మునిభిః ప్రదిష్టః ॥ 26

తతః పుత్రో హేమకంఠో వినీతః శోకసంకులః ।
ఉవాచ తస్మిన్సమయే సోమకాంత మిదం వచః ॥ 27

**హేమకంఠ ఉవాచ :-**

నమే రాజ్యేన దారైశ్చ ప్రాణై ర్ధనచయైరపి ।
త్వాం వినా నృపశార్దూల కృత్యం నైవాస్తి యత్క్వచిత్ ॥ 28

యథా స్నేహం వినా దీపో వినా ప్రాణం యథా తనుః
వృథా రాజ్యం తథా రాజస్త్వాంవినా ధర్మపాలక ॥ 29

సూత ఉవాచ :-

శృత్వా హృష్టమనా రాజా పుత్రం ప్రోవాచ ధర్మత: ।
అమాత్యానాం సుధర్మాయాః పుత్రస్య వచనామృతం ॥ 30

రాజోఉవాచ :-

పితు ర్వాక్యరతో నిత్యం శ్రద్ధయా శ్రాద్ధకృత్తథా ।
పిండదో యో గయా యాంతు సపుత్రః పుత్ర ఉచ్యతే ॥ 31

అతో నీత్యా సమాయుక్తః కురు రాజ్యం మమాజ్ఞయా ।
అమాత్యయుక్తః శాధిత్వం పుత్రవచ్చాఖిలాః ప్రజాః ॥ 32

ధర్మశాస్త్రార్థ తత్త్వజ్ఞో నీతిజ్ఞో ఖిలతో షకృత్ ।
పిత్రూనుద్ధరతే యస్తు పుత్రవాన్ పుత్ర ఉచ్యతే ॥ 33

అహం వనం గమిష్యామి గలత్కష్టోఽతి గర్హితః ।
పత్న్యా సుధర్మయా సార్ధం అనుజానీహి సువ్రత ॥ 34

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**ద్వితీయో అధ్యాయః ॥**



# సోమకాంత వర్ణనం
## 2-వ అధ్యాయము

సూతమహర్షి ఇలా కొనసాగించాడు: "ఇలా సోమకాంతమహారాజు ధర్మబద్ధంగా ప్రజారంజకమైన పరిపాలన చేస్తుండగా ఆతడికి పూర్వజన్మ కర్మ పరిపాకంవల్ల అతిదారుణమైన కుష్ఠువ్యాధి సంక్రమించింది. శుభాశుభ కర్మలేవైనప్పటికీ అవి అవశ్యము అనుభవించి తీరవలసిందే నన్న శాస్త్ర వచనాన్ని అనుసరించి, సోమకాంత మహారాజు. ఆ వ్యాధిని నిబ్బరంగా అనుభవించసాగాడు!

కాని, నానాటికీ అతని ఆరోగ్యపరిస్థితి క్షీణించసాగింది. శరీరమంతా రసిఓడుతూ దుర్గంధభూయిష్టమై అతనికే దుర్భరంగా తోచసాగింది. ఎముకలగూడు వంటి శరీరంమాత్రం శేషమాత్రంగా మిగిలింది. అప్పుడు ఆరాజు మంత్రులను ఒకనాడు తనవద్దకు పిలిపించి వారితో ఇలా అన్నాడు.

"ఓ అమాత్యులారా! నా శరీరారోగ్యం నానాటికీ క్షీణిస్తున్నది! ఈజన్మలో నాకు తెలిసినంతవరకూ అన్నీ సత్కార్యాలనే చేశాను. సాధు సజ్జనులసేవ, ప్రజారంజకమైన ధర్మబద్ధమైన రాజ్యపరిపాలననూ ఏ మాత్రం ఏమరుపాటులేకుండా అప్రమత్తుడనై నిర్వర్తిస్తూనే ఉన్నాను! బహుశ ఇది నా పూర్వజన్మలోని దుష్కర్మ తాలూకు ఫలితం కాబోలు. దుర్గంధభూయిష్టమైన ఈ శరీరంతో ఇంకా ఇలాగే నేను రాజ్యపాలనను చేయదలచుకోలేదు. నా అనంతరం నా కుమారుడైన హేమకంతుని రాజ్యాభిషిక్తునిగాచేసి మీరు అతనికి అండదండలుగా నిలిచి పరిపాలన కొనసాగించండి!

మీ అనుమతితో నేను అరణ్యములకు వెళ్ళవలెనని నిశ్చయించాను. సర్వసంపదలనూ పరిత్యజించి జీవితపరమార్థాన్ని సాధించటానికి వానప్రస్థాశ్రమం స్వీకరిస్తాను."

ఈ వాక్యం పూర్తిచేసి శరీరబాధ అధికం కాగా సొమ్మసిల్లిపోయాడు సోమకాంతుడు. అప్పుడు శైత్యోపచారములతోనూ, మంత్రతంత్ర ఔషధములతోనూ అతడిని సచేతనుడిని చేసి, మంత్రులు ఆరాజుతో యిలా అన్నారు.

"ఓ మహారాజా! నీ దయకు అనుగ్రహానికీ పాత్రులమై ఎన్నో భోగభాగ్యాలను వైభవాలనూ నీవల్ల, అనుభవించాము. ఇప్పుడు మీరే దుఃఖాన్ని శరీరబాధను అనుభవిస్తూంటే కృతఘ్నుల్లా మేము మా పదవులకు అంటిపెట్టుకోవాలనుకోవటంలేదు. మీ అభీష్టంమేరకే హేమకంతునికి రాజ్యాభిషేకం గావించి, మీతో అరణ్యాలకు అనుసరించి వస్తాము! అందుకు అనుమతించండి!" అంటూ వేడుకున్నారు.

అప్పుడు ఆరాజు భార్యయైన రాణీ సుధర్మ మంత్రులను వారిస్తూ ఇలా అంది.

"ఓ మంత్రిపుంగవులారా! నేను పాతివ్రత్య ధర్మాన్ని అనుసరించి నా భర్తతో కూడా అడవికెళతాను. మీరు నా కుమారునికి సహాయకులుగా ఉండి పరిపాలన సాగించండి! అదే మీకూ, నాకూ — ఉభయ తారకము"

అలాగే కుమారుడైన హేమకంతుడు కూడా :—

"తండ్రీ! మీ సేవకన్నా నేను ఇంక కోరుకునేదేమీలేదు! ఈ రాజ్యము, ధనమూ వీటివల్ల నాకేమీ ప్రయోజనంలేదు. మిమ్మల్నే అనుసరించి వచ్చి మీసేవలో తరిస్తాను" అన్నాడు.

అప్పుడు రాజైన సోమకాంతుడు తన కుమారుని చేరబిలిచి "నాయనా! కుమారుడైన వాడికి పితృవాక్య పరిపాలనచేయటం, శ్రద్ధతో పితరులకు శ్రాద్ధాదికములు చేయటమూ, గయలో పిండప్రదానము చేయడమూ ప్రధానకర్తవ్యాలని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి!

కనుక నీవు ఈ మంత్రివర్యుల సాయంతో రాజ్యపాలన కొన సాగించు! ధర్మబద్ధుడవై ప్రజారంజకంగా రాజ్య పరిపాలన చేయడమే నీ ప్రస్తుత కర్తవ్యం! నేను ఒక్కడినే భార్యాసహితుడనై అరణ్యాలకువెళ్ళ నిశ్చయించాను!" అని అతనిని తనతో తోడ్కొని రహస్య ఆలోచనా మందిరంలోకి వెళ్ళి అతడికి నానావిధములైన ఆచార వ్యవహారములనూ రాజనీతి రహస్యములనూ ఇలా ఉపదేశించసాగాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'సోమకాంత వర్ణనం'** అనే రెండో అధ్యాయం.

3

# ఆచారనిరూపణం

(మూలం)

## తృతీయో అధ్యాయః

**సూతఉవాచ:-**

తత ఉద్ధాయ రాజా స గృహిత్వా దక్షిణే కరే ।
పుత్రం వివేశ హర్మ్యాగ్రం యత్ర మంత్రయతే సదా ॥ 1

యత్ర సింహాసనం దివ్యం కాంచనం బహురత్నయుక్ ।
ముక్తా ప్రవాల ఖచితం భాతి శక్రపదం యథా ॥ 2

తత్రాసతుః పితాపుత్రౌ భాతో ద్వావప్యనేకథా ।
ప్రతిరత్నం గతౌ యస్మాత్సముదాయ వృతావివ ॥ 3

ఆచారం ప్రథమం ప్రాహ నీతిం నానావిధాం నృపః ।
పుత్రాయ కరుణాయుక్తో యశసే స్వకులస్యచ ॥ 4

**సోమకాంతి ఉవాచ :-**

యామ మాత్రావశిష్టాయాం నిశాయాం జాగ్రతః పుమాన్ ।
త్యక్త్వా శయ్యాం శుచిస్థానే ఉపవిశ్య గురుం స్మరేత్ ॥ 5

దేవతాం చింతయిత్వేష్టాం ప్రణమేత్ స్తుతిపూర్వకం ।
ప్రార్థ్య పృథ్వీం క్షమస్వేతి పాదస్పర్శం జగన్మయే ॥ 6

ప్రాతర్నమామి గణనాథ మశేష హేతుం బ్రహ్మాది
దేవ వరదం సకలాగ మాఢ్యం ।
ధర్మార్థ కామ ఫలదం జనమోక్ష హేతుం
వాచామగోచర మనాది మనంతరూపం ॥ 7

ప్రాతర్నమామి కమలాపతి ముగ్రవీర్యం నానావతార
నిరతం నిజరక్షణాయ ।
క్షీరాబ్ధి వాస మమరాధిప బంధుమీశం పాపాపహం
రిపుహరం భవ ముక్తిహేతుం ॥ 8

ప్రాతర్నమామి గిరిజాపతి మిందుమౌళిం వ్యాఘ్రా
జినావృత ముదస్తదయం మనోజే ।
నారాయణేంద్ర వరదం సురసిద్ధ జుష్టం సర్పాంస్త్రి శూల
డమరూన్ దధతం పురారిం ॥ 9

ప్రాతర్నమామి దిననాథ మవాపహారం
గాఢాంధకారహర ముత్తమలోక వంద్యం ।
వేదత్రయాత్మక ముదస్త సురారిమాయం
జ్ఞానైకహేతు మురుశక్తి ముదారభావం ॥ 10

ప్రాతర్నమామి గిరిజాం భవభూతి హేతుం సంసార సింధు
పరపార కరీం త్రినేత్రాం ।
తత్వాదికారణ ముదస్త సురారి మాయాం మాయామయీాం
సురమునీంద్రా నుతాం సురేశీం ॥ 11

ఏవ మన్యాంశ్చ సంస్కృత్య దేవా న్మునిగణాం స్తథా ।
మానసై రుపచారైశ్చ పూజయిత్వా క్షమాపమేత్ ॥ 12

తతోగచ్ఛే త్పోదపాత్రో గ్రామస్య నైఋతీం దిశం
మృదంగుహీత్వా సుశ్వేతాం బ్రాహ్మణః క్షత్రియో రుణాం ॥ 13

వైశ్య శూద్రౌ తథాశ్యామాం స నదీతీరతః ఖనేత్ ।
నోర్వరాయా న వల్మీకాత్ బ్రాహ్మ ణాగారతః క్వచిత్ ॥ 14

తృణాది నా చ్ఛాదయిత్వా ధరాం మూత్రపురీషయోః ।
కృత్వోత్సర్గం దివారాత్రౌవుదగ్దక్షిణ దిఙ్ముఖః ॥ 15

ఆదౌ గుదం ప్రమృజ్యైవ తృణకాష్టాదినా నరః ।
పంచవారం మృదా ద్భిశ్చ క్షాళయే త్తదనంతరం ॥ 16

దశవారం వామహస్తం సప్తవార ముభౌకరౌ ।
లింగం తథైక వారంతు వామహస్తం త్రివారతః ॥ 17

మూత్రోత్సర్గే క్షాళయీాత ద్వ్యాకరౌ చ ద్వివారతః ।
పాదౌ సదైకవారంతు గృహస్థస్యైవ మీరితం ॥ 18

వ్రతవాన్ద్విగుణం కుర్యా త్రిగుణం వనగోచరః ।
యతి శ్చతుర్గుణం కుర్యాద్రాత్రౌ వర్ధంతు మౌనవాన్ ॥ 19

అర్ధం పాదం దివారాత్రౌ శౌచం స్త్రీశూద్ర ఏవచ ।
తత ఆచమ్య కాష్టంతు క్షీర కంటక వృక్షయోః ॥ 20

గృహిత్వా ప్రార్ధనా పూర్వం దంతాన్ జిహ్వాం విశోధయేత్ ।
బలమోజో యశస్తేజః పశు బుద్ధి ధనా నిచ ॥ 21

మేధాం బ్రహ్మధియం చైవ త్వం మే దేహి వనస్పతే ।
తతః శీత జలైస్స్నానం కృత్వా మలహారం పురా ॥ 22

తతో మంత్రైశ్య గృహ్యోక్తైః సంధ్యోపాస్తిం తతశ్చరేత్ ।
జపం హోమంచ స్వాధ్యాయం తర్పణం దేవ పూజనం ॥ 23

వైశ్వదేవం తథాతిథ్యం భోజనం ద్విజసాక్షికం ।
పురాణ శ్రవణం దానం పరనిందా వివర్జనం ॥ 24

పరోపకారం కుర్యాచ్చ ద్రవ్య ప్రాణ వచో మృతైః ।
పరాపకారం నో కుర్యా దాత్మ స్తవనమేవచ ॥ 25

గురుద్రోహం వేదనిందాం నాస్తిక్యం పాపసేవనం ।
అభక్ష్య భక్షణం చైవ పరదార నిషేవణం ॥ 26

స్వదార వర్జనం చైవ కుర్యాత్ ఋతుగతిం చరేత్ ।
మాతా పితృ గురూణాం చ గవాం శుశ్రూషణం సదా ॥ 27

దీనాంధ కృపణేభ్యశ్చ దద్యాదన్నం సవస్త్రకం ।
ప్రాణాత్యయేపి సత్యస్య త్యాగం నైవ సమాచరేత్ ॥ 28

ఈశ్వరానుగ్రహో యేషాం సాధూనాం చ ప్రపాలనం ।
అపరాధానుసారేణ ధర్మశాస్త్రం విలోక్యచ ॥ 29

పృష్ట్వావా పండితాన్ దండం కుర్యా న్నీతివిశారదః ।
విశ్వాసో యస్య నైవస్యా త్తత్ర నో విశ్వసేత్క్వచిత్ ॥ 30

విశ్వస్తే త్యంతవిశ్వాసో నకర్తవ్యో బుభూషతా ।
కృతవైరే థ విశ్వస్తే కదాపి నచవిశ్వసేత్ ॥ 31

షడ్గుణానాం ప్రయోగేన వర్ధ యేద్రాష్ట్ర మాత్మనః ।
దానం స్వశక్త్యా కుర్వీత క్షీణతామన్యథా వ్రజేత్ ॥ 32

పరే వ్యాకులితే యాన మథమం పరిచక్షతే ।
చారదృష్టి ర్ధూత వక్త్ర ఉద్యద్దండో నృపోభవేత్ ॥ 33

దండస్యైవ భయాల్లోకాః స్వేస్వే ధర్మే వ్యవస్థితాః ।
అన్యథా నియమో నస్యా త్పారక్యం స్వీయ మిత్యదః ॥ 34

అథమో యది నిందేత స్తువీత యదివా క్వచిత్ ।
నకృద్ధే న్నచ తుష్యేచ్ఛ కిం తయాచింతయాపి చ ॥ 35

పూర్వాపకారీ యదిచ పునర్వా శరణం వ్రజేత్ ।
పూర్వంచ ధనికోయః స్యాత్పరిపాల్యః సదైవహి ॥ 36

మంత్రగుప్తి: సదాకార్యా తన్మూలం రాజ్యముచ్యతే ।
కామాది షడ్రిపూన్జిత్వా తతోన్యా న్విజయీత చ ॥ 37

వృత్తిచ్ఛేదం ప్రజాచ్ఛేదం దేవతోచ్ఛేద మేవచ ।
అరామ చైత్య యో చ్ఛేదం నకుర్యా న్నృప సత్తమః ॥ 38

పర్వకాలే దదేర్దానం యశసే త్యాగమేవచ ।
న మిత్రవంచనాం కుర్యాత్ స్త్రీషు గోప్యం వదేన్నచ ॥ 39

ఋణతో బ్రాహ్మణంచైవ పంకతోగాం సముద్ధరేత్ ।
అనృతం నవదేత్క్వాపి సత్యం క్వాపి నహాపయేత్ ॥ 40

అమాత్యానాం ప్రజానాంచ భృత్యానాం చిత్తహృద్భవేత్ ।
బ్రాహ్మణేభ్యో నమస్కుర్యా ద్దేవతాభ్య స్సదైవచ ॥ 41

**సూత ఉవాచ :-**

ఇత్యన్యదపి శిక్షాప్య హేమకంఠం : సుతం నృపః ।
ఆచారం సహధర్మేణ నీతిశాస్త్రం యథాశృతం ॥ 42

క్షేమంకరం రూపవంతం విద్యాధీశం తదైవచ ।
అహ్వాయామా సచామాత్యాన్ సుముహూర్తం విలోక్యచ ॥ 43

సంభారా నుపకల్ప్యైవ నానాస్థానగతా న్నృపః ।
బ్రాహ్మణాన్వేద విదుషో యజ్ఞకర్మ సునిష్ఠితాన్ ॥ 44

రాజ్ఞోథ మహతో రాజపత్నీశ్చ సుహృద స్స్వకాన్ ।
ఆహ్వాయామాన నృపతిః శ్రేణీముఖ్యాంశ్చ నాగరాన్ ॥ 45

అభిషేకాయ లోకాయ పుత్రస్య రిపుఘాతినః ।
గణేశం పూజయిత్వేష్ట దేవతాంచ యథావిధి ॥ 46

వాచయిత్వా స్వస్త్యయనం మాతృపూజన పూర్వకం ।
కృత్వాభ్యుదయకం శ్రాద్ధం బ్రాహ్మణాస్తర్ప్య చాంధసా ॥ 47

కారయిత్వా మంత్రఘోషైః అభిషేకం సుతస్యసః ।
ఉవాచ సోమకాంత స్త్రీన్ మంత్రిముఖ్యా నిదంవచః ॥ 48

రాజోవాచ

మమాయం సుతిత్యేవ మమాత్యాబుద్ధిరస్తువః ।
భవాతా మేవ హస్తేషు సుతఏషనిరూపితః ॥ 49

మమానుశాసనం యద్వత్కృతం నీతివిశారదైః ।
తథాస్యశాసనం కార్యం శ్రేణీ ముఖ్య సమన్వితైః ॥ 50

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే ఆచారాది నిరూపణం నామ తృతీయో అధ్యాయః ॥**



# ఆచారనిరూపణం

# 3-వ అధ్యాయము

## సోమకాంతమహారాజు కుమారునకు ఆచారమూ ధర్మము రాజనీతులను ఉపదేశించుట

అలా రహస్యమందిరంలో రాజైన సోమకాంత మహారాజు తన కుమారుడైన హేమకంతుని స్వర్ణమయమై, బహురత్నఖచితమై, ఇంద్రుని స్వర్గసింహాసనంతో సమానంగా మెరిసిపోతున్న తన సింహాసనంపైన ప్రక్కన కూర్చుండబెట్టుకుని అతని వీపుపై ప్రేమగా ఆశ్వాసంకలిగేలా తన కుడిచేతిని ఉంచి అతనితో యిలా అన్నాడు.

"కుమారా! అనేకవిధములైన ధర్మాలన్నింటిలోనూ సదాచారము మిక్కిలి విశిష్టమైనది. రాజైనవాడు దీనిని తప్పక పాటించాలి! అందు వల్లనే ఆయువూ, ఆరోగ్యమూ, కీర్తి వర్ధిల్లుతాయి. దేవతానుగ్రహమూ, వంశాభివృద్ధీ కూడా కలుగుతాయి. ఆ సదాచార విశేషాలన్నీ శ్రద్ధగా విను!

## సదా-చారము :-

అర్ధరాత్రి ఇంకా యామం (షుమారు రెండున్నరగంటలు) కాలం వుండగానే సూర్యోదయానికి ముందుగా బ్రాహ్మీముహూర్తంలోనే నిద్ర లేవాలి! వెంటనే పడుకున్న శయ్యను వీడి శుచియైన స్థానంలో కూర్చుని తన ఆచార్యుని (గురువును), దేవతలనూ, ప్రణవం (ఓంకార) సహితంగా భూమాతను ధ్యానించాలి. భూమిపై పాదాలుంచుతున్నందుకు అపరాధ క్షమాపణ కోరి, ఆ తరువాత బ్రహ్మాది దేవతలకు సైతం వరప్రదుడై, సకల ఆగమములచేతా కొనియాడబడుతున్నవాడూ, చతుర్విధపురుషార్థ ములను ప్రసాదించేవాడూ వాక్కులకూ, మనస్సుకూ అతీతుడూ ఐన గజాననునికి నమస్కరించాలి. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లనూ స్మరించి, మానసోపచారముల పూజచేసి ఆ పిదప బహిప్రదేశానికి చేతిలో నీటిపాత్రను తీసుకుని గ్రామానికి నైఋతిదిక్కుగా వెళ్ళాలి. బ్రాహ్మణుడైనవాడూ, క్షత్రీయుడూ ఎఱ్ఱటి ఒంద్రుమట్టినీ, వైశ్యశూద్రులు నల్లటి ఒంద్రుమట్టినీ తీసుకుని నదీతీరములో బ్రాహ్మణగృహాలూ పుట్టలూవున్న ప్రదేశాలను విడచి — దూరంగా శౌచవిధులను నిర్వ ర్తించాలి.

దివారాత్రములలో ఉత్తర-దక్షిణ దిశలుగా మూత్రపురీష విసర్జన చేయాలి. ఆ తరువాత ఐదుసార్లు మట్టితో, నీటితో చేతులు కడు క్కోవాలి. పదిసార్లు ఎడమచేతిని, ఆ తరువాత మరో ఏడుసార్లు రెండు చేతులనూ, ఒక్కసారీ మట్టితో పాదములనూ శుద్ధిచేసుకోవాలి! వ్రతం ఆచరించేవాడు ఇందుకు రెండురెట్లూ, వానప్రస్థుడైనవాడు మూడురెట్లు, సన్యాసులు నాల్గురెట్లూ శుద్ధిచేసుకోవాలి! స్త్రీలు శూద్రులు ఇందులో సగము, పాతికవంతూ మాత్రం శుద్ధిచేసుకుంటే చాలు.

ఆ తరువాత శుద్ధాచమనంచేసి గానుగ, వేప వంటి పుల్లలను ప్రార్థనాపూర్వకంగా (ఓ వృక్షమా! బలాన్నీ, ఓజస్సునూ, తేజస్సునూ, బుద్ధినీ, సంపదలను ప్రసాదించవలసింది) అని ప్రార్థించి వాటిని సేకరించి దంతధావన (పళ్ళు తోముకోవాలి) చేయాలి.

ఆతరువాత నదీ లేక చెరువులో **'అపవిత్రః పవిత్రోవా'** అన్న మంత్రంతో మలాపకర్షణ స్నానాన్నీ, ఆతరువాత మంత్రపూరితంగా అఘమర్షణస్నాన **"అపోహిష్ఠానాన్ని మయోభువ"** ఇత్యాది మంత్రాలతో చేసి, సంధ్యావందనాదికాలను నిర్వర్తించాలి! ఏకాగ్రచిత్తుడై **గాయత్రీ మంత్ర జపం** చేశాక, గురూపదిష్ట మంత్రాన్ని జపించాలి! హోమాన్ని శాస్త్రోక్తంగా ఆచరించి మంత్రదేవతా తర్పణాన్నీ, స్వాధ్యాయనమూ (వేద శాస్త్రగ్రంథాల అధ్యయనం) చేయాలి! దేవతాపూజలు చేశాక వైశ్వదేవ మిచ్చి, బ్రాహ్మణులనూ అతిధులనూ కూడి భుజించాలి!

ఆతరువాత పురాణశ్రవణం చేయాలి! రాజైనవాడు 'అభక్ష్యభక్షణం' (తినకూడనివి తినడం), ఇతరులను నిందించటం మానాలి! ఇతరులకు ఉపకారం చేయడానికే తన మాటనూ, ద్రవ్యాన్నీ శక్తియుక్తులనూ వినియోగించాలి. దానధర్మాలు తప్పక ఆచరించాలి! తన భార్యను విసర్జించటం, ఋతుమతిగా వున్నప్పుడు సంగమించకపోవటంకూడా దోషమే! పరదారలపట్ల దోష-బుద్ధి కూడదు!

మాతాపితరులసేవ, గో, బ్రాహ్మణుల సేవ గురుశుశ్రూష అవశ్యం ఆచరించాలి! దీనులైనవారికి అన్నవస్త్రాలనిచ్చి ఆదరించాలి! సాధువులను సగౌరవంగా సత్కరించి వారి ఆశీస్సులుపొందాలి. ప్రాణం పోయినా

సత్యవచనాన్ని మాత్రం వీడకూడదు! సాధుసత్పురుల సేవాఫలితం అనంతమైనది. దానివల్ల భగవదనుగ్రహం తప్పక లభిస్తుంది. శ్రద్ధా భక్తులతోనూ అనన్యమనస్సుతోనూ వారిని సేవించాలి.

ఇక రాజ్యపాలన విషయంలో రాజెప్పుడూ ఏమరుపాటు చెంద కూడదు. దోషులను అపరాధానుసారమే నిష్పక్షపాతంగా దండించాలి. తనయందు విశ్వాసపాత్రులుగాని వారిని విశ్వసించకూడదు. ఒకప్పుడు శత్రువుగా ఉండినవాడిని కూడా గ్రుడ్డిగా విశ్వసించడం దగ్గరగా మసల నీయడం చేయకూడదు! అలాగే తన శక్త్యానుసారం దానములు చేయాలి. దానం చేయనప్పుడు సంపద క్షీణించి రాజు దరిద్రుడౌతాడు. సమర్ధవంతమైన పాలనకై గూఢచారులనే నేత్రాలనుకలిగి సదా అప్ర మత్తుడై వుండాలి. సరియైన దండనీతిని పాటించినప్పుడే ప్రజలు ధర్మ వర్తనులై భయభక్తులతో మెలుగుతారు. అలా జరగనప్పుడు రాజ్యంలో అరాజకత్వం చెలరేగుతుంది. రాజైనవాడు బహిశ్శత్రువులతోపాటు తన అంతశ్శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆరింటినీ జయించాలి. వృత్తిచ్ఛేదము, సంతానచ్ఛేదము, దేవతాచ్ఛేదము కూడనివి! ఆరామములను, నీడనిచ్చే వృక్షాలను ఎన్నడూ నరకరాదు! సర్వ కాలములలో దానధర్మములు విరివిగా చేయాలి. త్యాగబుద్ధి గలిగి ప్రజలకు ఆదర్శప్రాయుడై జీవించాలి.

మిత్రద్రోహమూ, స్త్రీలకు రహస్యాలు చెప్పడం ఎన్నడూ చేయ కూడని పనులు! తాను ప్రసన్నతతో, సహృదయతతో ప్రజానీకము యొక్కా భృత్యులయొక్కా అభిమానాన్ని ఆదరాన్ని చూరగొనాలి! బ్రాహ్మణులను ఋణ విముక్తుల్ని చేయటం, గోవులను సంరక్షించటం

విధిగా ఆచరించాల్సినవి. ఎల్లవేళలా దేవబ్రాహ్మణ పూజలు చేయటం ధర్మజ్ఞుడైన రాజు ఆచరించాల్సిన ధర్మములు" అంటూ ఇంకా అనేక యితర రాజనీతులను, ధర్మ సూక్ష్మాలనూ సోమకాంతమహారాజు తన కుమారుడైన హేమకంఠునకు ఉపదేశించాడు.

ఆ తరువాత ఒక శుభముహూర్తాన్ని నిర్ణయించి మంత్రులు సమకూర్చిన సకలసంబారములతోనూ సమస్త రాజలాంఛనాలతోనూ ఎల్ల రాజలోకమూ, పురప్రముఖులూ చూస్తుండగా — పూజించి, నిర్విఘ్నతకై గణపతిని, ఇష్టదేవతారాధనను సల్పి సమంత్రకంగా వేదవిదులైన బ్రాహ్మణోత్తముల మంత్రఘోషలమధ్య మహావైభవంగా **పట్టాభిషేక మహోత్సవాన్ని** నిర్వహించాడు.

మంత్రులతో "ఓ అమాత్యవరులారా! ఇతడు నా కుమారుడూ, వారసుడూను! మీరంతా నాయందు చూపినట్లే అభిమానాన్నీ, అనురాగాన్నీ, యితనికీ పంచివ్వండి! నా ఆజ్ఞవలెనే ఇతని ఆజ్ఞను కూడా మీరూ, మీతోపాటూ మన రాజ్యంలో అందరూ నిర్వర్తించవలసింది!" అని ఆదేశించి, తన కుమారుణ్ణి వారికి అప్పగించాడు. అనంతరం బ్రాహ్మణ సమారాధనతో ద్విజులనూ, దానధర్మాలతో సమస్త ప్రజలనూ సంతృప్తిపరిచాడు సోమకాంతమహారాజు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని

**'ఆచారనిరూపణం'** – అనే మూడవ అధ్యాయం.



4

# సోమకాంత తపశ్చర్య

(మూలం)

## చతుర్థో అధ్యాయః

**సూత ఉవాచ:-**

జాతే అభిషేకే రాజాసౌ చకార ద్విజపూజనం ।
మణి ముక్తాప్రవాళాని దదౌ సాంగం గవాయుతం ॥ 1

తోషయామాస సర్వాంస్తాన్ గజగోశ్వ ధనాంశుకైః ।
నానాదేశ్యాని వాసాంసి సువర్ణాంతరితాని చ ॥ 2

నానావర్ణాని కాశ్మీర దేశజాని మహాంతి చ ।
రాజభ్యో రాజపత్నీ భ్యో గ్రామముఖ్యే భ్య ఏవచ ॥ 3

తద్భృత్యేభ్యో గుణిభ్యశ్చ దదౌ రాజా యథార్హతః ।
అమాత్యేభ్యో దదావన్యాన్ గ్రామా న్నృహు ధనాన్యపి ॥ 4

తతో వనం యయౌ రాజా దుఃఖ శోక సమన్వితః ।
పూర్వజన్మార్జితైర్దోషైః । అత్యంత మలినోఽశుచిః ॥ 5

తస్మిన్ ప్రయాతే లోకానాం హాహాకారో మహానభూత్ ।
స్వం స్వం కార్యం విహాయైవ ప్రతిజగ్మర్నరా ధిపం ॥ 6

అమాత్యాః రాజభార్యాచ హేమకంఠ స్సుహృద్వృతః ।
ఉత్తిష్ఠన్ ప్రపపాతాగ్రే స్కలన్ వరున్ దా న్నపి ॥ 7

అమాత్యా నాగరా స్తంతు దుఃఖితా అప్యవారయన్ ।
గవ్యూతి ద్వితయం గత్వా తస్థౌ రాజాశ్రమాన్వితః ॥ 8

దృష్ట్వా వాపీం శీతజలాం నానా వృక్ష సమాన్వితాం ।
ఉవాచ నాగరాన్సర్వాన్ । అమాత్యా స్వజనానపి ॥ 9

అపరాద్ధం మయా యద్యచ్చిరం రాజ్యం ప్రకుర్వతా ।
తత్ క్షంతవ్యం నమామ్యేష బద్ధాంజలిపుటం జనాః ॥ 10

కృపా విధేయా పుత్రే మే యది దైవాత్సమాగతే ।
విజ్ఞాపయామి నస్సర్వాన్ మయి స్నేహో నహీయతాం ॥ 11

గచ్ఛంతు నగరం సర్వే సస్త్రీవృద్ధా స్సమాగతాః ।
పుత్రేణ పాల్యమానా మే తిష్ఠంతు విగతజ్వరాః ॥ 12

అనుజానంతు మాం సర్వే। సుచిత్తో యామ్యహంవనం ।
యుష్మాసు తు ప్రయాతేషు మనోమే నిశ్చలం భవేత్ ॥ 13

ఉపకారం మహాంతం మే కుర్వంతు కృపయాఖిలాః ।
దుఃఖితో నిష్ఠురం వక్తుం । మర్తుకామోపి నోత్సహే ॥ 14

మహాత్పాపం మయ్యైవైతజ్జన్మ జన్మాంతరార్జితం ।
యద్వియోగోహి రాజ్యస్య లోకానాం హితకారిణాం ॥ 15

పరంతు కింకరోమ్యేష యద్గలత్కృష్టవానహం ।
సర్వోపి స్వకృతం భుజై। సుకృతం దుష్కృతంథా ॥ 16

**సూతఉవాచ :-**

ఇతిశృత్వా వచోరాజ్ఞో మూర్ఛితా స్సుహృదస్తథా ।
ఘ్నంతః కేచిత్పాణితలైః శిరాంసి భ్రుశ దుఃఖితాః ॥ 17

కేచిత్పరస్పరం చక్రుః అభిజ్ఞాః పండితాశ్చయే ।
సాంత్వనం పూర్వజాతావాం నృపాణాం చరిత్రైన్నృపే ॥ 18

అనిర్వాచ్య మనస్థాంతత్ సమీక్ష్యే యు రథాపరే ।
యథా స్వరూపే విజ్ఞాతే యోగినో జ్ఞానవృత్తయః ॥ 19

దుఃఖితం సోమకాంతం తం వనంగంతుం సముత్సుకం ।
నియమ్య దుఃఖం ధైర్యేణ ధీరాః కేచి దథాబ్రువన్ ॥ 20

జనాఊచుః :-

పోషయిత్వా పాలయిత్వా। ననస్త్వం త్యక్తుమర్హసి ।
యధా నత్యజతే । శైత్యం జల మౌష్ణ్యం తనూనపాత్ ॥ 21

మర్యాదాం జలధిర్వాపి సూర్యః ప్రాకాశ్యమేవచ ।
కధంవా నగరం యామ। స్త్వాంవినా జనవత్సల ॥ 22

యధోడు తినా హీనం వ్యోమ తారాన్వితం నృప ।
పురం తద్వన్నశోభేత త్వాం వినా శత్రుకర్షణ ॥ 23

సహైవ యామ స్తీర్థాని । ద్వీత్రాణి వయమప్యుత ।
రూపంతే కాంతిమత్కాంత భవితా తీర్థసేవనాత్ ॥ 24

తత స్సహైవ యాస్యామో నగరం ధ్వజసంకులం ।
హర్షేణ మాహతాయుక్తా । వాద్యబంది పురస్సరాః ॥ 25

సూతఉవాచ :-

ఇతి తద్వచనం శృత్వాక్రోధ దుఃఖ సమన్వితః ।
ఉవాచ రాజా తాన్నత్వా మైవం మైవం పునః పునః ॥ 26

తతో బ్రవీద్ధే మకంఠః । సామాత్యో వత్సలం నృపం ।
స్నేహ కారుణ్య భావేన వినయేన సమన్వితః ॥ 27

**పుత్ర ఉవాచ :-**

వినా త్వాం నోత్సహే గంతుం కర్తుం రాజ్యం చ జీవితుం।
న మయా దృష్టపూర్వస్తే విరహస్త్రం సహే కథం ॥ 28

**రాజోవాచ :-**

ఏతదర్థం మయాపూర్వం ధర్మశాస్త్రం సునీతిమత్
ఉపదిష్టం తవశుభం నవృథా కర్తుమర్హసి ॥ 29

శ్రూయతే జామదగ్న్యేన జననీ నిహతా పురా ।
పితృవాక్యాను రోధేన నీతిజ్ఞేన సుధీమతా ॥ 30

రామస్తు రాజ్యం త్యక్త్వైవ వనం యాతః సహానుజః ।
అదృష్ట్వా కారణం సీతాం తత్యాజ లక్ష్మణో వనే ॥ 31

హేమకంఠ పురం శీఘ్రం అమాత్యై స్త్రిభిరన్వితః ।
అతో మమాజ్ఞయా గచ్ఛ కురురాజ్యం మయార్పితం ॥ 32

విజ్ఞే యథా కార్యసక్తె చిత్తం తస్య పరాత్మని ।
యథావ స్థాపితే విత్తే చిత్తం లోకస్య వర్తతే ॥ 33

తథా మయి వనం యాతే। స్వాంతం మే త్వయి వర్తతే ।
దైవయోగేన సుభగో । జాతో యాస్యే పునర్గృహం ॥ 34

భవిష్యతి తథా ధర్మే మద్వాక్యం కారిణస్తవ ।
నతథా సహయాతేన తస్మాద్గచ్ఛ వ్రజామి చ ॥ 35

**సూతఉవాచ :-**

అమాత్యా నాగరా పుత్రః ప్రయాతుం కృతమానసాః ।
కష్టేన మహతా యుక్తాః నమశ్చక్రుర్ నృపం తథా ॥ 36

అనుజ్ఞాతా స్తతస్తేన ఆశీర్భిరభినంద్య చ ।
ప్రదక్షిణీకృత్య నృపం నివృత్తా నగరం ప్రతి ॥ 37

అగ్రే కృత్వా మహాసేనాం గజాశ్వ రథపత్తినీం ।
ఛత్ర ధ్వజయుతో మానీ హేమకంఠోఽగమత్పురీం ॥ 38

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**చతుర్థో అధ్యాయః ॥**



# సోమకాంత తపశ్చర్య
# 4-వ అధ్యాయము

సూతుడు తిరిగి యిలా చెప్పసాగాడు!

"ఓ మహర్షులారా! ఇలా సోమకాంతమహారాజు తన కుమారుడైన హేమకంఠుని రాజ్యాభిషిక్తునిగాచేసి, సద్బ్రాహ్మణులకు విలువైన మణిమాణిక్యాలనూ, ఇతరులందరికి వారివారికి తగినట్లుగా ఏనుగులను, ఆవులను, జాతిగుఱ్ఱాలనూ, ధనధాన్యాలనూ యిచ్చి భూరిగా సత్కరించాడు. దేశవిదేశాలనుంచి వచ్చిన రాయబారులకు చీనిచీనాంబరముల నిచ్చీ, జలతారు శాలువలతోనూ సత్కరించాడు. మంత్రులకు సైతం అనేక గ్రామాలను బహూకరించాడు. ఇవన్నీ, ముగించుకుని తరువాత తన దేహపుబాధ భరించలేనంతగా పెరిగిపోగా ఎంతో బాధతో అరణ్యానికి వెళ్ళటానికి ఉద్యుక్తుడైనాడు.

ప్రజాభిమానాన్ని చూరగొని, వారికి తలలో నాలికై, కన్నబిడ్డల్లా ప్రేమతో తమను పాలించిన ఆ సోమకాంతమహారాజును విడిచివుండలేక హాహాకారాలతో ప్రజలంతా ఆతనిని అనుసరించారు. తమ పనులన్నీ విడిచి ప్రజలూ, ఆయనను అనుసరించడంకోసం మంత్రులు, రాణులూ, కుమారుడైన హేమకంఠుడూ ఆతని వెనుకే పరుగెత్తారు. అలా రెండు క్రోసులదూరం నడిచాక రాజు అలసి అక్కడ ఒక శీతలోద్యానవనం లో కూర్చుని ప్రజలతో యిలా అన్నాడు :

"ఓ నా ప్రియప్రజలారా! రాజ్యపరిపాలన సమయంలో నావలన మీకు జరిగిన అపరాధములనన్నింటినీ క్షమించమని అంజలిఒగ్గి ప్రార్థి స్తున్నాను. నాకుమారుడైన హేమకంఠునియెడల కూడా దయతో వ్యవహ రించండి! నాపట్ల మీరు ఎలాంటి స్నేహభావాన్నీ ఆప్యాయతనూ కలిగివున్నారో అలాగే హేమకంఠునిపట్ల కూడా ఆదరం కలిగివుండండి. మీరందరూ రాజధానికి తిరిగివెళ్ళి అతని పరిపాలనలో సుఖవంతులై ఉందురుగాక! శాంతస్వస్థచిత్తముతో నాకు అరణ్యానికి వెళ్ళేందుకు అనుమతినివ్వండి! మీరంతా పురమునకు మరలివెళ్ళాక నేను ప్రశాంత చిత్తంతో అడవికి వెడతాను. కనుక మీరు నాయందు దయయుంచి ఈ ఉపకారము చేయండి. ఆహా! జన్మాంతరీయమైన పాపంవల్లనేకదా! మీ అందరితోనూ రాజ్యంతోనూ ఈ వియోగం సంభవించింది, రోగ భూయిష్టమై అసహ్యాన్ని కల్గించే దుర్భరమైన ఈ కుష్టువ్యాధిగ్రస్తుణ్ణైన నేనెలాగ పరిపాలించగలను? ఎవరికైనా తమ దేహప్రారబ్ధం అనుభవించక తప్పదుకదా!" అన్నాడు. ఆ రాజుయొక్క వియోగాన్ని సహింపలేని కొందరు ప్రజలు ధైర్యం తెచ్చుకొని

"ఓ మహారాజా! మమ్మల్ని పోషించటంచేతా, పాలించటంచేతా, రక్షించుటచేత నీవు మాకు తండ్రివైనావు! కన్నబిడ్డల్లా వాత్సల్యంతో చూసుకున్న నిన్ను మేమెలా విడువగలము? చంద్రుడులేని ఆకాశంలా, నీవులేని రాజ్యం శోభించదు! గనుక మేమూ నిన్ను అనుసరించి వచ్చి నీతోపాటే కొన్ని పుణ్యతీర్థములనూ సేవించుకుంటాము. దైవకృపవల్లా, పుణ్యతీర్థ సంసేవనంవల్ల నీకు శరీర స్వస్థతచిక్కితే తిరిగి మనమంతా రాజధానిని చేరుకుందాము" అన్నారు.

"ఓ ప్రజలారా! మీరిలా మారుపలకటం భావ్యంకాదు! ఇది మీకు తగదు!" అంటూ మూడుసార్లు పలికి వారించిన సోమకాంతుడితో పుత్రుడైన హేమకంఠుడిలా అంటున్నాడు.

"ఓ తండ్రీ! నీవులేని నాకు ఈ రాజ్యభోగములమీదగాని జీవితేచ్ఛ గాని ఎంతమాత్రమూ లేదు! ఇప్పటివరకు ఎన్నడూ నిన్ను వీడి వుండలేదు. ఇప్పుడుమటుకు ఎలా ఉండగలను?" అన్న హేమకంఠుడి తో రాజు

"కుమారా! నీవిలా అంటావనే నీకు మొదటగా నీతిశాస్త్రవచనా లనూ, ధర్మాలనూ ఉపదేశించాను. వాటిని వృధాకానీయకు! పూర్వం పరశురాముడు తండ్రియాజ్ఞ ననుసరించి మాతృవధ చేశాడు! అలాగే శ్రీరాముడు పితృవాక్య పరిపాలనకై రాజ్యంవీడి అరణ్యములకు వెళ్ళాడు. ఇక లక్ష్మణుడు సరేసరి! భాతృఆజ్ఞానుసారం కారణం అడగకుండానే సీతాదేవిని అరణ్యాలలో విడిచాడు! కనుక ఓ కుమారా! నీవు నా అభీష్టం మేరకు నగరానికి వెళ్ళి ఈ ముగ్గురు మంత్రుల సహాయంతో

ధర్మబద్ధంగా, ప్రజారంజకమైన పరిపాలన సాగించు! నేను అరణ్యాలకు వెళ్ళినా నీవు నా అంతరాత్మ స్వరూపుడవే కనుక నా హృదయంలోనే నాతో కూడా వుంటావు! దైవానుగ్రహంచేత తిరిగి నా శరీరం ఆరోగ్య వంతమై, కాంతివంతమైతే — తిరిగి నేను నగరానికి వస్తాను. కనుక ఇప్పుడు నీవు నన్ను అనుసరించి రావటం అధర్మం! నీవు వెంటనే శీఘ్రముగా పట్టణానికి వెళ్ళు!" అని చెప్పగా రాజాజ్ఞను శిరసావహించిన పురజనులూ, మంత్రులూ హేమకంతునితోసహా కలిసి రాజ్యమునకు వెళ్ళటానికి సిద్ధమైనారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'సోమకాంత తపశ్చర్య'** అనే నాల్గవ అధ్యాయం.



5

# సుధర్మా - చ్యవన సంవాదం

(మూలం)

## పంచమో అధ్యాయః

**సూత ఉవాచ:-**

తతో మాతరమభ్యేత్య స్నేహకాతరయాధియః ।
తాం జగాద కథం మాతః త్యజసే అనపరాధినం ॥ 1

**పుత్ర ఉవాచ :-**

సహైవయాతు పుత్రో యయాతి వాచ్యస్త్వయాపితా।
తన వాక్యానురోధేన యదిమాం సహ నేష్యతి ॥ 2

తదావాంసేవనం కుర్యాం నమేరాజ్యే మతిస్తదా ।
కింతద్రాజ్యం సుఖం దద్యా ద్భవద్భ్యాం రహితస్య మే ॥ 3

**సుధర్మ ఉవాచ :-**

ఏతావద్దుఃఖ శోకాభ్యాం యుక్తో రాజా నమేవచః ।
కరిష్యతి మహాబాహో తస్మాద్గచ్ఛ మమాజ్ఞయా ॥ 4

పాతివ్రత్యేన ధర్మేణ । పరవత్యాస్మి బాలక ।
భర్తురన్యో న దేవోస్తియోషితాం మాన్యఏవ చ ॥ 5

**సూతఉవాచ :-**

ఇత్యాకర్ణ్య మనశ్చక్రే మాతరం స సుహృత్సుతః ।
ప్రదక్షిణీకృత్య తతోఽనుజ్ఞాంప్రాప్య పురం యయౌ ॥ 6

అలంకృతై ర్నాగరికైః పతాకా ధ్వజపల్లవైః ।
సిక్తమార్గం సుగంధాఢ్యం యథేంద్ర నగరంతథా ॥ 7

దత్వాతాంబూల వాసాంసి విసృజ్య స్వజనానన్ నృపః
ప్రవివేశ గృహం శ్రీమత్ హర్షశోకసమన్వితః ॥ 8

చకార రాజ్యం। ధర్మేణ సుతవత్పాలయన్ ప్రజాః ।
ధర్మార్థకామ మోక్షేషు యథాశక్తం మనోదధే ॥ 9

**ఋషయ ఊచుః :-**

కథంరాజా సోమకాంతః కింవనం సముపాగతః ।
కింసహాయశ్చ । కించక్రే కర్మనో వద విస్తరాత్ ॥ 10

**సూత ఉవాచ :-**

హంత వః కథయిష్యామి సోమకాంతో యథా వనం ।
గత్వ చకార యత్కార్మమ్ సాదరం శృణుతానఘాః ॥ 11

సుబల జ్ఞానగమ్యాభ్యాం అమాత్యాభ్యాం సుధర్మయా
ధర్మపత్న్యా యుతో అణ్యం ప్రవివేశ దురాసదం ॥ 12

అగ్రతః ప్రకృతిర్యాతాః మధ్యే రాజాథ పృష్ఠతః ।
ధర్మపత్నీ సుధర్మాగాత్ సీతేవ రామపృష్ఠతః ॥ 13

ఏకాశనా శ్చ చత్వారః ఏకచిత్తా వనాలయాః ।
సమదుఃఖ సుఖాశ్చాపి వనాద్వన ముపాయయుః ॥ 14

క్షుధా తృష్ణా శ్రమైర్వాపి నిమ్నోన్నత గతాధ్వభిః ।
అత్యంతం కర్షితాచ్ఛాయామాశ్రిత్య ఉపావిశన్ క్వచిత్ ॥ 15

పునర్వనాంతరం । గత్వాదదృశు స్తే సరో మహత్ ।
యత్ర మాతంగ దద్మశాః నక్రా భాంతి సకచ్ఛపాః ॥ 16

తాలా స్తమాలా స్సరళాః ప్రియాళాః వకుళాశ్శుభాః ।
సరళాః పనసా జంబు నింబాశ్వద్ధ వటాదయః ॥ 17

వృక్షా నానాలతాజాలై ర్వేష్టితాః పరితో బహుః ।
యత్రాస్తే తిమిరంగాఢం గిరిదర్యుదరే యధా ॥ 18

యత్రవాయుః సుఖస్పర్శః పద్మకాదంబ గంధవాన్ ।
యస్మాన్నయంతి మునయః కుసుమాని ఫలాని చ ॥ 19

యత్ర హంసా బకాశ్యేనా శుభాః కాకాశ్చ కోకిలాః ।
శారికా శ్చక్రవాకాశ్చ నానారావాన్ వికుర్వతే ॥ 20

స యత్ర శీతోష్ణకరాంశుసంధి ర్నానాలతా పుష్ప కుజాశ్రితానాం ।
క్షుట్ తృడ్భయం యత్ర నచైవ మృత్యుః యథా
స్వర్గే పుణ్యవతాం ద్విజేంద్రాః ॥ 21

తత్ర గత్వా జలంసర్వే పపుః శీతం శ్రమాపహం ।
స్నాత్వా నిత్యక్రియాం కృత్వా ఫలాని బుభుజుశ్చ తే ॥ 22

సుష్వాప చ క్షణం రాజా కచ్ఛే కోమలవాలుకే ।
ధర్మపత్నీ సుధర్మాచ పాద సంవాహనే స్థితా ॥ 23

తస్యానుమత మాజ్ఞాయ ద్వావమాత్యావగచ్ఛతాం ।
ఆదాతుం కందమూలాని ఫలానిచ బిసానిచ ॥ 24

దదర్శ తత్రాద్భుత రూప ముగ్రం బాలం సుధర్మాప్రభయా
జ్వలంతం ।
ఉత్కృష్టరూపస్య కృతే స్మరంతం జాతం పురా
బాలమితి స్మమేనే ॥ 25

దృష్ట్వైవ తం సాజహృషే సుధర్మా మేనేచ తం సా హితకారిణంచ ।
క్షుబ్ధం ప్రసన్నం హృదయం నమీక్ష్యాపకారిణం
చోపకరంహి వక్తి ॥ 26

పప్రచ్ఛ తం కశ్చ కుతః ప్రయాతః కస్యాసి పుత్రో జననీచ కా తే।
వదస్వ శబ్దామృత ధారయా మే సఖేవ కర్ణౌ పరితోషయాశు ॥ 27

**సూత ఉవాచ :-**

ఇతిస్మ ప్రష్టస్స జగాద బాలః తాం రాజపుత్రీం సుధయా గిరామే।
పితా భ్రుగుర్భామిని మే పులోమా మాతా జలార్ధీ స్వగృహా
దిహాగాం ॥ 28

చ్యవనః ఖలు నామ్నాహం పితురాజ్ఞా కరశ్శుభే ।
త్వంచ అకా కతమో యంతే కథం వనమిదం గతః ॥ 29

స్రవంతి కథ మంగాని వర్షాకాలే గిరేరివ ।
అతిదుర్గంధతా చాస్యకేన వా వదకర్మణా ॥ 30

కృమిభార సమాకీర్ణ అముం వాసే వసేకథం ।
స్వయం చారుతరాభూత్వా సుకుమారీ సులోచనా ॥ 31

చారు ప్రసన్నవదనా చారు సర్వాంగ శోభినీ ।
కచ్చిత్పూర్వం నపిత్రాతే సుహృద్భి ర్భాతృభిర్ద్విజైః ॥ 32

విజ్ఞాతోయం పరః కుష్ఠీ కృమిభారా కులోపిచ ।
కథమేనం వృతవతీ దుర్గమంచాగతా వనం ॥ 33

**సూత ఉవాచ :-**

ఇతి పృష్టా సుధర్మా సా మునిపుత్రేణ ధీమతా ।
వ్యాచష్టే సకలం తస్మై శోకహర్ష సమన్వితా ॥ 34



విఘ్న గణపతి

సుధర్మ ఉవాచ :-

సౌరాష్ట్రదేశే విఖ్యాతం దేవతాఖ్యం పురం మహత్ ।
తత్రాయం సోమకాంతో మే భర్తా రాజ్యం చకారహ ॥ 35

అతిమానీ వదాన్యశ్చ శూరో దృఢపరాక్రమః ।
అసంఖ్యాత బలోపేతో రిపురాష్ట్ర విమర్దనః ॥ 36

యజ్వాతి సుందర శ్రీమాన్ సుహృదానంద కారకః ।
వివేక్తా సర్వకార్యాణాం నీతిశాస్త్రవిశారదః ॥ 37

రాజ్యంస్వం బుభుజే రాజా బహుకాలం ద్విజోత్తమ ।
ఇమా మవస్థాం సంప్రాప్తః పూర్వకర్మ విపాకతః ॥ 38

అమాత్యద్వయ సంయుక్తో వన మేతత్సమాగతః ।
భ్రమంతీ పృష్టలగ్నాస్య పుత్రే రాజ్యం ప్రయచ్ఛతః ॥ 39

సుబల జ్ఞానగమ్యాభ్యాం ప్రకృతిభ్యా మిహాగతౌః ।
రాజ్ఞో నుజ్ఞా సమాధాయ ఫలార్థం తౌగతౌ వనే ॥ 40

ఇహాస్మాన్రాక్షసాః ప్రేతాః భూతాని మృగపక్షిణః ।
నానావిధాః భీషయంతి కథం నో భక్షయంతిన ॥ 41

న జానే దుఃఖ భోగాయ స్థాపయంత్యగ్రతోపి చ ।
దుఃఖస్యాంతం నపశ్యామి కర్మణో దుష్కృతస్యచ ॥ 42

కటుతిక్తామ్ల లవణ మధుర స్నిగ్ధ భోజనే ।
నతథా రుచిరస్యాభూత్పరీతస్య ద్విజాతిభిః ॥ 43

యథేదానీం కందమూల కషాయామ్ల ఫలాదిషు ।
దరిద్రాణాం మహాహారః పాకోపి భక్షితస్యచ ॥ 44

న తథా శ్రీమతాం శక్తిరశనే పాకఏవచ ।
యశ్శేతే కోమలే దివ్యే శయనేస్మ మనోరమే ॥ 45

ఇదానీం యత్రకుత్రాపి పశ్య కాలవిపర్యయం ।
యస్యదిగ్వ్యాపినశ్వాసన్ నానాపరిమళాశ్శుభాః ॥ 46

పూయ శోణితదిగ్ధస్య పూతిగంధోపి సాంప్రతం ।
య ఆనందమయే సింధౌ మగ్నో భూ త్తుండితైర్వృతః ॥ 47

స ఇదానీం దుఃఖమయే కృమిభిః పరివారితః ।
కథం తరేమ దుఃఖాబ్ధిం నజానే భృగునందన ॥ 48

భవ పోత ఇవా గాధే మజ్జంతం నౌరివార్ణవే ॥ 49

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే సుధర్మా చ్యవన సంవాదోనామ పంచమో అధ్యాయ సమాప్తః**



# సుధర్మా - చ్యవన సంవాదం
## 5-వ అధ్యాయము

సూతమహర్షి తరువాత కధనిలా కొనసాగించాడు : ఓ మహర్షు లారా! తండ్రి ఆదేశమును మీరలేని హేమకంతుడు తన తల్లియైన సుధర్మను ప్రేమగా సమీపించి ఇలాఅన్నాడు. "ఓ తల్లీ! నన్ను యిలా ఒంటరిని చేసి వెళ్ళటం మీకేమన్నా న్యాయమా? మీతోపాటూ నన్నూ అరణ్యాలకి వచ్చేలా తండ్రిగారికి చెప్పి నీవు దయతో ఒప్పించు! వారంగీకరిస్తే మీ ఉభయులకూ సేవచేస్తూ నాజీవితాన్ని సార్ధకం చేసు కుంటాను. మీకు దూరమైనాక — ఇక ఈరాజ్యమన్నా, నాకు జీవిత మన్నా — ఏమాత్రం కాంక్షలేదు!" అంటూ బ్రతిమాలాడు. అందుకు మహారాణియైన సుధర్మ తన కుమారుణ్ణి అనునయిస్తూ శిరస్సున ముద్దాడి ఇలాఅంది.

"నాయనా! తీవ్రమైన శారీరక అస్వస్థతకు గురైవున్న మీతండ్రి ఇందుకు ఏమాత్రం ఒప్పుకొనరు. పైగా అది ధర్మవిరుద్ధం కూడాను! నేను మాత్రం మీతండ్రిగారిని సుఖాలలో అనుసరించినట్లే, ఈ బాధలలో కూడా తోడుగావుంటాను. అదే నిజమైన పతివ్రతకు ఆచరణీయం! కనుక నీవు యిక ఏమాత్రం ఆలస్యంచేయక, మీ తండ్రిగారి ఆదేశాను సారం మన నగరానికి ఈ పరివారంతోపాటు వెనక్కు మరలటం శ్రేయ స్కరం!" అంటూ నచ్చచెప్పింది! సూతులవారు ఇలా చెప్పసాగారు. "ఓ ఋషులారా! ప్రేమపూర్వకమైన తల్లి అనునయ వాక్యాలనువిన్న హేమకంఠుడు ధర్మబుద్ధితో తన మాతాపితరులకు ప్రదక్షిణ నమస్కా రాలుచేసి, తన పరివారంతో తన రాజ్యానికి వెనుతిరిగాడు! తిరిగి తన రాజభవనంలో ప్రవేశించి దుఃఖంతోనూ, సంతోషంతోనూ, సమ్మిళితమైన అంతరంగంతో తన ప్రజానీకాన్ని పుత్రప్రేమతో తండ్రి బోధించిన రీతి లోనే ఎంతో ధర్మబద్ధంగా, రాజ్యపాలనను చేయసాగాడు.

## సోమకాంత మహారాజు అరణ్యానికి వెళ్ళటం :

ఆతరువాత జరిగిన కథావిధానం గురించి ఋషులు ప్రశ్నించగా సూతమహర్షి ఇలా చెప్పాడు.

"ఓమహా ఋషులారా! అనంతరం సోమకాంతమహారాజు అరణ్యా నికి ఎలావెళ్ళిందీ, అక్కడ ఏమేం చేసిందీ అంతా వివరంగా చెబుతాను సావధానచిత్తులై వినండి!"

"సుబల, జ్ఞానగమ్యులనే మంత్రులిద్దరూ తనకు ముందు నడవగా, భార్య సుధర్మ తనను నీడయై అనుసరించగా, రాజు ఘోరా

రణ్యంలో ప్రవేశించాడు. వారందరూ వానప్రస్థధర్మములైన ఒంటిపూట భోజనం, నేలపైన శయనించుటవంటి నియమాలను పాటిస్తూ, మార్గమధ్యంలో కలిగే ప్రయాణపు బడలికచేత, ఆకలిదప్పులచేత బాధలను అనుభవిస్తూకూడా, సుఖదుఃఖాలను సమదృష్టితో చూసే యోగుల వలే, మార్గాయాసాన్ని, తొలగించుకుంటూ దీక్షగా తమ ప్రయాణం కొనసాగించారు. ఇలా చాలా అరణ్యాలను దాటుకుంటూ వెళ్ళి ఒక సుందరమైన ప్రదేశంలో తామరపుష్పాలతో నిండిన సరోవరాన్ని చూశారు. అనేక జలపక్షులతోనూ, జలకాలాడే ఏనుగుల సమూహాలతోనూ, తామర పుష్పాలతోనూ నిండిన ఆ సరస్సు ఎంతో అందంగా కనిపించింది. అనేక వృక్షాలతో, దట్టమైన తీగలతో చుట్టుకొని ఉండి చూడటానికి ఆహ్లాదం కలిగించేదిగా ఉన్నాయి! అక్కడి చల్లని సుగంధ వాయువులు ఆ సరస్సుమీదనుంచి వీచి ఆ ప్రశాంత పరిసరాలు మనస్సుకు ఒక అనిర్వచనీయమైన ప్రశాంతతను కలిగిస్తూన్నాయి. ఆ సరస్సులోనుండే తమ స్నానపానాలకు అనుష్టానాలకు అవసరమైన నీటిని అక్కడి మునులు, తమ పూజలకై ఫలపుష్పాలనూ కూడా తీసుకెడుతూంటారు. అక్కడ రకరకాల పక్షులు తమ కిలకిలారావాలతో అదొ దివ్యలోకమా లేక స్వర్గంలోని నందనోద్యానమా అనిపించేలా ఉన్నది. ఆ చల్లని గాలి సోకగానే శరీరానికి బడలిక తీరి 'వేరేలోకాల అంచుల్లోకి తీసుకెళుతున్నదా?' అన్నంత విశ్రాంతి కలిగించేలా వున్నది.

"ఓ ఋషివర్యులారా! అలాంటి సుందరమైన మనోజ్ఞమైన సరోవర సమీపంలోకి చేరిన రాజు తన మంత్రులతోనూ భార్యతోకూడా కలిసి విడిదిచేసి అక్కడ తన స్నానసంధ్యాదికములను నిర్వర్తించుకొని సమీపం

లో లభించిన కందమూలాలను భక్షించి ఆనాటికి విశ్రాంతి తీసుకొన సాగాడు. ప్రయాణపు బడలికతో రాజుకు అక్కడి ఇసుకతిన్నెపైననే కంటికి మంచినిద్ర పట్టింది! భార్య సుధర్మ భర్తయొక్క అలసట తీరేలా పాదములు వత్తసాగింది. మంత్రులిద్దరూ ఆమె ఆదేశంమేరకు కంద మూలాలు సేకరించడానికి అరణ్యంలోకి వెళ్ళారు. ఇంతలో అక్కడికి వచ్చిన అద్భుతమైన ముఖవర్చస్సుతో బ్రహ్మతేజస్సుతో కుమారస్వామియా అనిపించేలా వెలిగిపోతున్న ఒక ఋషికుమారుడిని సుధర్మ చూచింది. తనలోతాను ఇలా అనుకున్నది.

"ఆహా! ఈ మునికుమారునివలన నా మనస్సులోగల అభీష్ట ములు తప్పక నెరవేరగలవనిపిస్తున్నది!" నెమ్మదిగా అతన్ని సమీపించి యిలా ప్రశ్నించింది.

"ఓ ఋషికుమారా! నీవెవరవు? ఇక్కడికి ఎక్కడినుంచి వస్తున్నావు? నీ తలిదండ్రులెవరు?" దానికా ఋషికుమారుడిలా బదులిచ్చాడు.

## సుధర్మా ఋషికుమారుల సంవాదము :

"ఓతల్లీ! నేను భృగుపుత్రుడను. నాతల్లి పులోమ! నీటికోసం ఈ తటాకం వద్దకు వచ్చాను. నాపేరు చ్యవనుడు! ఓతల్లీ! నీవెవరవు? ఈ ఘోరమైన అరణ్యములోకి ఎక్కడినుంచి వచ్చారు మీరు? నీవు సేవిస్తున్న ఈతడెవరు? ఈతని శరీరం ఇలా వర్షాకాలపు మేఘంలా స్రవించటానికి కారణమేమిటి? ఏ పాపకర్మచేత ఇతని శరీరం యిలా దుర్గంధ భూయిష్టమైంది? ఇలా క్రిమికీటకాదులచే పీడింపబడే శరీరంతో వున్న ఇతడిని నీవు సేవించటానికి కారణమేమిటి? నీవా అతిసుకు

మారివి! అపురూపమైన సౌందర్యం నీ సొత్తులా కనిపిస్తున్నది! ఇటువంటి రోగిష్టివాడినెలా వరించావు? నీతల్లిదండ్రులూ, స్నేహితులూ ఇతడిలాంటి వాడని తెలియక మోసగించబడ్డారా?" అంటూ ప్రశ్నించాడు.

అప్పుడు రాణీ, మహాపతివ్రతాయైన సుధర్మ యిలా బదులిచ్చింది.

"ఓ ఋషికుమారా! సౌరాష్ట్రదేశంలో దేవనగరమనే పట్టణానికి రాజైన ఈతడు నాభర్త! సోమకాంతుడితనిపేరు. సకల సద్గుణశోభితుడై, పరాక్రమోపేతుడై ఐశ్వర్యవంతుడై, బలసౌందర్యోపేతుడైనవాడీతడు. నీతిశాస్త్రవిశారదుడు. ప్రజారంజకంగా చిరకాలం రాజ్యపాలన చేసినవాడు. అనేక రాజ్యభోగాలను నిరాటంకంగా అనుభవించాడు. పురాకృత కర్మ వశాన ఈతడికి భరింపరానంతటి ఈ దురవస్థ సంప్రాప్తమైంది. అందు వల్ల తన రాజ్యభారాన్ని కుమారుడైన హేమకంతుడి భుజస్కందాలపై ఉంచి, ఇద్దరు మంత్రులైన సుబల, జ్ఞానగమ్యులతో ఈ ఘోరారణ్యం లోకి నాతోపాటూ ప్రవేశించాడు! మంత్రులిరువురూ కందమూలాలను సేకరించటానికి వెళ్ళారు. నాయనా, ఈ అరణ్యం అనేక క్రూరజంతువు లతో కూడినదికదా! రాక్షసులు భూత ప్రేతపిశాచాలుకూడా సంచరించే ప్రాంతమిది. అయినా ఇక్కడ ఎవ్వరూ మాకెట్టి హానీ తలపెట్టటం లేదెందుకనో? మాకింకా దుఃఖానుభవము మిగిలివున్నందున ఊరకున్నా రేమో? మా ఈ దుఃఖానికి అంతే కనబడటంలేదే! షడ్రసోపేతమైన రాజోచిత భోజనాలెక్కడ? దొరికినంతటితో సరిపుచ్చుకోవాల్సిన ఈ కంద మూల భక్షణమెక్కడ? ఐనా ఈ కందమూలాలే ప్రస్తుతం అత్యంత రుచికరములుగా ఉన్నాయిమాకు! దరిద్రులూ, తాపసులూ తినే ఇటు వంటి ఆహారం శ్రీమంతులకు జీర్ణమవటం కష్టమేకదా! హంసతూలికా

తల్పంమీద పరిచారగణంయొక్క సేవలందుకుంటూ నిద్రించే ఈ ప్రభువు ఈనాడు ఇలా కటికనేలలపైన ఎగుడుదిగుళ్ళుగావుండే యిసుకతిన్నెలపైన సేదతీరుతున్నాడు. చందనం, పునుగు జవ్వాది మొదలైన సుగంధద్రవ్యాలచేత పరిమళించే ఈ మహారాజు శరీరం ఇప్పుడు దుర్గంధపూరితములైన చీము, రసి ఓడుతూ దుర్భరంగా ఉన్నది. ఎప్పుడూ పండితగోష్టితో కాలంగడిపే రాజు ఇప్పుడు దుఃఖసాగర నిమగ్నుడై ఉన్నాడు. ఓ భృగునందనా! ఈ దుర్భరమైన దుఃఖసాగరాన్ని ఎట్లా దాటగలము? అగాధమై అంతూ దరీ తెలీని ఈ దుఃఖసముద్రాన్ని దాటటానికి నీవు మాకు తెప్పలాగ సహకరించి మమ్మల్నీ ఈ స్థితినుంచి రక్షించు!" అంటూ రాణి చ్యవనుడితో గద్గదకంఠియై ప్రార్థించింది!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'సుధర్మా-చ్యవన సంవాదం' అనే ఐదవ అధ్యాయం.



## 6

# భృగురాశ్రమ ప్రవేశం

(మూలం)

### షష్ఠో అధ్యాయః

**సూత ఉవాచ :-**

ఇతి తద్వచనం శృత్వా చ్యవనో భ్రుగునందనః ।
త్వరయా సముపాదాయ కలశం జలసంభృతం ॥ 1

దుఃఖితః పరదుఃఖేన తూష్ణీమేవాగమద్గృహం ।
తంభృగుః పరిపప్రచ్ఛ విలంబకారిణం సుతం ॥ 2

**భృగురువాచ :-**

కిమపూర్వం త్వయా దృష్టం లక్ష్యసే చకితోయథా ।
విలంబశ్చ కథంజాతో వద పుత్ర మమాగ్రతః ॥ 3

**పుత్ర ఉవాచ :-**

సౌరాష్ట్రదేశే విఖ్యాతే దైవతే నగరే మునే ।
సోమకాంత ఇతి ఖ్యాతో రాజా రాజీవలోచనః ॥ 4

చక్రే రాజ్యం బహువిధం ధర్మేణ పాలయన్ప్రజాః ।
దుర్భగత్వం గతోదైవాత్పుత్రే రాజ్యం నివేశ్యసః ॥ 5

పత్న్యా సుధర్మయా యుక్తో భర్తృరాజ్ఞాభృతా పితః ।
సుబలజ్ఞానగమ్యాభ్యాం ప్రకృతిభ్యామిహాగతః ॥ 6

గలత్కుష్టీ కృమియుతో విభ్రమన్ దుర్గమంసరః ।
సహస్ర భగతాంప్రాప్తో యథేంద్రోగౌతమాన్మునేః ॥ 7

క్వసా సుధర్మా చార్వంగీ క్వ గలత్కుష్టవాన్ పతిః ।
ఇతి మే పృచ్ఛతో వృత్తం తదీయం గతవాన్ క్షణః ॥ 8

తదీయైః కరుణావాక్యైః మనో మే కలిలం త్వభూత్ ।
తతోహం కలశం పూర్ణంకృత్వా శీఘ్రముపాగతః ॥ 9

**సూత ఉవాచ :-**

సర్వం చాకథయత్తస్మై తయా యత్కథితం వచః ।
శృత్వా తచ్చ పునఃపుత్రం చ్యవనం భ్రుగురబ్రవీత్ ॥ 10

**భృగు ఉవాచ :-**

సర్వానానయ తాన్ శీఘ్రం గచ్ఛ పుత్ర మమాజ్ఞయా ।
ద్రక్ష్యామి కౌతుకం తేషాం స్వీయంవా దర్శయామి తాన్ ॥ 11

**సూత ఉవాచ :-**

ఇత్థం సచోదితః పిత్రా చ్యవనః కరుణానిధిః ।
జగామ సరసోభూమిం సుధర్మాం ద్రష్టుముత్సుకః ॥ 12

తస్మిన్నేవ క్షణే అమాత్యౌ ఫలకంద భరాన్వితౌ ।
సుబల జ్ఞానగమ్యౌ తావాగతౌ రాజసన్నిధిం ॥ 13

తతాఊచుః సతుమునిః సుధర్మాం చారులోచనాం ।
పితా మే స్వాశ్రమం సర్వానాకారయతి సువ్రతే ॥ 14

ఇతి తద్వచనం శృత్వా సుధర్మా శోకవిహ్వలా ।
తదైవ సావధానాభూ త్తనుః ప్రాణ ఇవాగతే ॥ 15

సుశీలా రాజపత్నీసా పీత్వా తద్వచనామృతం ।
అగమత్ సా సుచార్వంగీ ప్రకృతిద్వయ సంయుతా ॥ 16

సోమకాంతేన పతినా మునిపుత్ర పురస్సరా ।
గణేశ స్కందసహితా శివేవ శివ సంయుతా ॥ 17

శుశుభే మార్గమధ్యే సా వాచస్పతి పురస్సరా ।
మంత్రఘోషయుతం ప్రాప భృగోరాశ్రమ మండలం ॥ 18

నానాపుష్ప లతాకీర్ణం నానాపక్షి వినాదితం ।
మార్జారా నకులా శ్యేనాః గజా గావో మయూరకాః ॥ 19

భుజంగాః పక్షిణ స్సింహా వ్యాఘ్రా క్రీడంతి యత్ర చ ।
న చ వాయుః భ్రుశం వాతి న సూర్యస్తపతే భ్రుశం ॥ 20

నవర్షతి భ్రుశంమేఘా వర్షతేచ తదిచ్ఛయా ।
వివిశుస్తే హర్షయుతాః మునిపుత్ర పురస్సరాః ॥ 21

తత్రాద్భుతం వ్యాఘ్రమృగాజినస్థం దదర్శ సూర్య మివ
జ్వలంతం ।
రాజాథ పత్నీ ప్రకృతిద్వయంచ ననామ
బద్ధాంజలి రబ్రవీచ్చ ॥ 22

**రాజోవాచ :-**

అద్యాశిషో మే సఫలాః ద్విజేంద్ర ద్విజేరితా ధర్మచయ స్యపోపి ।
ఆజన్మతో హం పరిపూతఏష పితుర్జనన్యాశ్చ సుజీవితం మే ॥ 23

భవదృశిఃసంప్రతి హంత్యథైనః పూర్వార్జితైః పుణ్యచయైః కృతాపి।
అగామికళ్యాణకరీ మునీంద్ర కాలత్రయే జన్మ కరోతి పూతం ॥ 24

సౌరాష్ట్రదేశే ఖలు దేతాఖ్యే పురే కృతం రాజ్యమమోఘ దృష్టే ।
భీతేన పాపాద్విజ దేవతాది పూజాకృతా నీతిమతా మునీంద్ర ॥ 25

ఆకస్మికం మే దురితం కిమేత త్ప్రాదుర్బభూవో
గ్రతరం దురంతం ।
యేనాహ మిదృక్దశాం ప్రణీతో
న జానే కించిత్ప్రతీకారమత్ర ॥ 26

అపాయతాం యాంతి కృతా ఉపాయాః
యుష్మత్కృతోపాయ ముపాయమీహే ।
నిర్వైరతాం యాంతి హి జాతవైరాః తవాశ్రమే
హం శరణం ప్రపన్నః ॥ 27

**సూతఉవాచ :-**

శ్రుత్వేతి వచనంతస్య భ్రుగుస్తు కరుణాయుతః ।
ఉవాచ సోమకాంతం తం ధ్యానేనాలోక్య సువ్రతః ॥ 28

**భ్రుగురువాచ :-**

ఉపాయం వచ్మి నృపతే మా చింతాం కర్తుమర్హసి ।
మమాశ్రమ గతా దుఃఖం నవిందంతి జన్మినః ॥ 29

జన్మాంతర కృతంచైవ దురితంతే నృపోత్తమ ।
యేనేమాం గమితో అవస్థాం కథయిష్యే తదప్యహం ॥ 30

కుర్వంతు భోజనం సర్వే చిరకాలం బుభుక్షితాః ।
వనాద్వనాంతరం యాతాః శ్రాంతాః క్లాంతాననా భృశం ॥ 31

**సూత ఉవాచ :-**

ఇత్యుక్త్వా స్నాపయామాస సుతైలాభ్యంన పూర్వకం ।
భోజయామాస చాన్నాని షడ్రసాని త్వనేకశః ॥ 32

బుభుజుస్తేపి విశ్రాంతాః భృగోరమిత తేజసః ।
అజ్ఞాయా మునివర్యస్య సుస్నాతాః సుష్ట్వలంకృతాః ॥ 33

సుషుపుర్మృదు శయ్యాయాం హిత్వా చింతాం దురత్యయాం ।
మునినా కల్పితాయాం తే స్వరాజ్యం గమితా ఇవ ॥ 34

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే, భ్రుగోరాశ్రమ ప్రవేశంనామ షష్ఠోధ్యాయ సమాప్తః**



# భృగురాశ్రమ ప్రవేశం
## 6-వ అధ్యాయము

### సోమకాంత మహారాజు భృగుమహర్షి ఆశ్రమమును ప్రవేశించుట.

తరువాతి వృత్తాంతాన్ని సూతమహర్షి యిలా కొనసాగించాడు :

"ఓ మహర్షులారా! ఇలా భృగుమహర్షి తనయుడైన చ్యవనుడు మహారాణి సుధర్మయొక్క దుఃఖపూరితములైన, వేదనాభరితములైన దీనవాక్కులను విని, వారి దుఃఖానికి కరుణాళువైన కారణంచేత, తాను కూడా దుఃఖితుడై చేతనున్న నీటికడవను శీఘ్రంగా నింపుకుని ఆశ్రమానికి వేగముగా వెళ్ళాడు! తండ్రియైన భృగుమహర్షి కుమారుని చెంతకు బిలిచి, అతనిని ఆలస్యమెందుకైందని కారణం అడిగాడు.

"నాయనా! చ్యవనకుమారా! మార్గమధ్యంలో ఏదైనా అపూర్వమైన వస్తువునుగాని చూచావా ఏమి? కడవతో నీరు ముంచి తీసుకు

రావటానికి యింత ఆలస్యం ఎందుకైంది?'' అని ప్రశ్నించాడు. అందుకు ఆ ఋషికుమారుడిలా బదులిచ్చాడు.

''ఓతండ్రీ! సౌరాష్ట్రదేశములో దేవనగరమనే నగరాన్ని సోమకాంతు డనే పేరుగల మహారాజు పాలించేవాడు. చిరకాలము రాజ్యభోగాల ననుభవిస్తూ, వైభవంగా ధర్మబద్ధమైన, ప్రజారంజకమైన పాలనను నిర్వ హించాడు. ఇలాఉండగా, ఆకస్మికంగా ఆతనికి దారుణమైన కుష్ఠువ్యాధి సంప్రాప్తమైనదట! అంతటి అనారోగ్యంతోఉన్న ఆతడు రాజ్యపాలనను చేయలేక తన కుమారునికి రాజ్యభారాన్ని అప్పగించి, తన భార్య, మంత్రుల సహితుడై మన సరోవరతీరానికి వచ్చిఉన్నాడు. ఆతనిభార్య యైన సుధర్మ అతిలోక సౌందర్యవతి! అత్యంత కుసుమకోమలి! ఇటు వంటి రాజుతో దాంపత్యమెలా సంభవించిందని ప్రశ్నించుచుండటంవల్ల ఆమె ప్రత్యుత్తరం వింటుండగా క్షణకాలం ఆలస్యమైంది. జాలిని గొలిపే ఆమెయొక్క దీనాలాపములకు నా హృదయం వికలమైంది. ఇక అక్కడ ఉండలేక వెంటనే కడవతో నీరు నింపుకొని తిరిగివచ్చాను!'' అంటూ జరిగిన వృత్తాంతాన్ని, చ్యవనుడు తండ్రికి వివరించాడు!

ఆ తరువాత కధాగమనాన్ని సూతుడు యిలా వివరించసాగారు : ఓ మహర్షులారా! ఈ రీతిగా తన కుమారునివద్దనుంచి సోమకాంత మహారాజుయొక్క వృత్తాంతాన్ని, విన్న భృగుమహర్షి యిలాఅన్నాడు.

''కుమారా! నీవు నా ఆజ్ఞానుసారం వెంటనే వెళ్ళి వాళ్ళను ఇక్కడకు తీసుకొని రావలసింది! వారిని చూడాలని నాకూ కుతూ హలంగా వున్నది. అలా రావటానికి వారికి వీలుకాకపోతే నేనే వారికి దర్శనమిస్తాను!''

తండ్రి ఆజ్ఞననుసరించి సుధర్మను, రాజపరివారాన్నీ, వెంట తీసుకు రావడానికై చ్యవనకుమారుడు ఆ సరోవరతీరాన్ని చేరుకున్నాడు. అప్పటికి సుబల, జ్ఞానగమ్యులనే మంత్రులుకూడా కందమూలములను సేక రించుకొని వచ్చారు. ఆ ఋషికుమారుడు రాజపత్నియైన సుధర్మవద్దకు వెళ్ళి యిలా అన్నాడు.

"ఓసాధ్వీ! మా త్రండిగారైన భృగుమహర్షి మిమ్మల్నందర్నీ తమ ఆశ్రమానికి రావలసినదిగా ఆహ్వానించారు!" ఆ వాక్యం చెవినపడగానే సుధర్మకు అమృతపానంచేత పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లైంది! అమితమైన సంతోషంతో భర్తతోనూ, ఇరువురు మంత్రులతోనూ, ఋషి కుమారుని అనుసరించి వెంట నడచివెళ్ళింది.

ఆ భృగుమహర్షి ఆశ్రమమంతా వేదఘోషలతో ప్రతిధ్వనిస్తోంది! అనేక వృక్షాలతోనూ లతలతోనూ, పక్షుల కిలకిలారావాలతోకూడి సుందర మనోజ్ఞ దృశ్యంగా కనబడింది. అపూర్వమైన ఆ ఆశ్రమ వాతావరణంలో పరస్పరం శత్రుత్వం వహించే జంతువులు కూడా తమ స్వాభావికమైన శత్రుత్వాలను వీడి సంచరిస్తున్నాయి. మలయపవనాలు మందమందం గా ఆహ్లాదం గొలిపేవిగా వీస్తున్నాయి! అటువంటి ప్రశాంతమైన, సుందర మైన పవిత్ర వాతావరణంలోకి ప్రవేశించి, మధ్యందిన మార్తాండుడిలా వెలిగిపోతూన్న ఆ భృగుమహర్షి సన్నిధానం చేరుకుని ఆ రాజదంపతులు అమాత్యసహితంగా వారికి సాష్టాంగ దండప్రణామాలు ఆచరించారు. అప్పుడు రాజైన సోమకాంతుడు వినయంగా యిలా అన్నాడు.

"ఓ ఋషివర్యా! మీ దర్శనభ్యాగంచేత నేడు నా తపస్సు ధన్య మైంది. బ్రాహ్మణాశీస్సులూ నిజమైనాయి. నేచేసిన దానధర్మములు

కూడా సఫలమైనాయి. ఈనాటివరకూ నాజన్మ పునీతమైంది! ఇంతటి మహద్భాగ్యాన్ని అందుకునేందుకు కారకులైన జన్మనిచ్చిన నా తలి తండ్రులు అత్యంత పవిత్రులైనారు. ఎన్నో జన్మలలో సముపార్జించిన పూర్వపుణ్యం వలనగాని మీవంటి మహాత్ముల దర్శనం లభించదు. మీవంటి మహాత్ముల సందర్శనమాత్రంచేతనే సకల పాపములూ నశి స్తాయి. ఎంతో ఉన్నతీ, మంచి అభ్యుదయమూ, శ్రేయస్సూ ఒనగూరు తాయి! ఓ మునీంద్రా! భూతభవిష్యద్వర్తమాన కాలములలో మూడింటా మీ సందర్శనం జీవులను పరమ పునీతుల్ని చేస్తుంది. ఇక నా వృత్తాం తము మీకు చెబుతాను.

## రాజు తన గోడును ఋషికి విన్నవించుట :

"ఓ ద్విజేంద్రా! సౌరాష్ట్రదేశంలోని దేవనగరానికి రాజునై చిరకాలం ధర్మపరిపాలనం చేశాను. దేవబ్రాహ్మణ పూజలతోనూ సాధువులను సత్పురుషులను ఉచితరీతిన సత్కరిస్తూనూ పరిపాలిస్తూండగా — ఏ జన్మములో చేసిన పాపంవల్లనో నాకు అతి హేయమైన ఈ కుష్టువ్యాధి సోకింది. దీనికి ప్రతిగా ఏమిచేసినా నివారణ కావడంలేదు! మార్గాంత రంలేక రాజ్యాన్ని విడిచి కడు దీనులమై ఆశ్రిత కల్పతరువులైన తమను శరణువేడడానికి వచ్చియున్నాము. తమ ఆశ్రమంలో జంతువులు పర స్పరం తమతమ సహజవైరాన్ని వీడి అన్యోన్యమైత్రితో మెలుగుతూండటం చూచి ఆశ్చర్యంతో, మహిమాన్వితులైన మిమ్ములను శరణువేడి, రక్షణ కోరి ప్రార్థింపవచ్చాము!"

సూతులవారిలా కొనసాగించారు :

'ఓ మహర్షులారా! సోమకాంత మహారాజుయొక్క మాటలువిన్న భృగుమహర్షి హృదయం దయతో ఆర్ద్రమైంది. ఒక్కక్షణం అర్ధనిమీలిత నేత్రాలతో ధ్యానస్థుడై, ఆ రాజుతో యిలా అన్నాడు. "ఓ మహారాజా! విచారించకు! నీ దురవస్థకు చేయవలసిన దోషనివారణ గురించి చెబుతాను! నన్ను ఆశ్రయించిన ఏప్రాణీ దుఃఖాన్ని పొందదు! నీవు జన్మాంతరంలో చేసిన ఏపాపంవల్ల ఇట్టి దురవస్థపాలైనావో చెబుతాను! మీరు చిరకాలపు ప్రయాణం చేయటంచేత ఆకలిదప్పులకు లోనైఉన్నారు. కాబట్టి ముందు తృప్తిగా మీరు భోజనం కావించండి. మీ బడలిక తీరినాక భోజనానంతరం యావద్వృత్తాంతమునూ చెబుతాను!"

సూతులవారికి చెప్పసాగారు :

"ఓ మహాత్ములారా! అప్పుడు ఆ భృగుమహర్షి ఆ రాజుచేత తైలాభ్యంగన స్నానం చేయించి, రాజోచితమైన షడ్రసోపేతమైన భోజనమును భుజింపచేసాడు. అప్పుడు రాణియైన సుధర్మ, మంత్రులిద్దరూ కూడా స్నానమాచరించి, చక్కటి అలంకారాలను ధరించి మునియొక్క ఆతిథ్యంలో సేదతీరి సమకూర్చబడిన మెత్తని ప్రక్కలపై ఒడలు మరచి నిదురించారు.

ఇది శ్రీగణేశపురం ఉపాసనాఖండంలోని
"భృగురాశ్రమ ప్రవేశం" అనే ఆరవ అధ్యాయం.



7

# సోమకాంత పూర్వజన్మ కథనం

(మూలం)

## సప్తమో అధ్యాయః

**ఋషయః ఊచు :-**

తత్ర గత్వాకిమకరోత్ సోమకాంతో నృపస్తదా ।
ఉపాయః కథితః కోవాభృగుణా సర్వవేదినా ॥ 1

కథయస్వ కథామేతాం శృణ్వతాం నోద్విజోత్తమ ।
సతృప్తి మధిగచ్ఛామః పీత్వా త్వద్వచనామృతం ॥ 2

**సూతఉవాచ :-**

సాధుపృష్టం మహాభాగాః యూయం తు జ్ఞానసాగరాః ।
యఃకథాంతం నప్రయాతి శ్రోతావక్తా అథవా ద్విజాః ॥ 3

లిఖ్యమానం వాచయతి పుస్తకం హరతేపి వా ।
నపృచ్ఛతిచ యశ్శిష్యోగురుః పృష్టో నవక్తిచేత్ ॥ 4

ఉభౌ తౌ మూక బధిరౌ లోకే దృష్ట్వా ద్విజోత్తమాః ।
శృణ్వంతు కథయిష్యామి సోమకాంత కథామిమాం ॥ 5

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం దిననాథే తథోదితే ।
స్నానం సంధ్యా జపం హోమంకృత్వా సభృగుసత్తమః ॥ 6

స్నాతాయ కృతజప్యాయ పత్నీ ప్రకృతి సంయుజే ।
పూర్వజన్మ కథాం తస్మై రాజ్ఞై కధితుమారభత్ ॥ 7

భృగురువాచ :-

కోల్హార నగరే రమ్యే వింద్యాచల సమీపతః ।
చిద్రూపఇతి విఖ్యాతో వైశ్యో బహుధనో అభవత్ ॥ 8

తస్య భార్యాతు సుభగానామ్నా ఖ్యాతా సులోచనా ।
సుశీలా దాన శీలాచ పతివాక్యపరా సతీ ॥ 9

తస్యాస్త్వం పుత్రతాం చాతో భవే పూర్వే నృపోత్తమ ।
కామంద ఇతి తే నామ చక్రతుస్తౌ ద్విజేరితౌ ॥ 10

అతి స్నేహం దివారాత్రౌ వతిలాలన మేకకే ।
వార్ధక్యకాలజే తౌతు పితరౌ త్వయి చక్రతుః ॥ 11

వివాహం చక్రతుస్తౌ రు దన కౌతుక మంగళైః ।
మృగాక్షీ సుకుమారాంగీ నామ్నా ఖ్యాతా కుటుంబినీ ॥ 12

అనురక్తా త్వయిసదా ద్విజదేవాతిథి ప్రియా ।
బభూవ యోషి ద్యోషిత్సు రత్న భూతాతిసుందరీ ॥ 16

కుటుంబినీతి స్వంనామ విదధే సార్థకంతు సా ।
సప్తపుత్రా పంచకన్యా పంచబాణప్రియానుకిం ॥ 17

తతో బహుతిధే కాలే పంచత్వమగమత్ పితా ।
మాతా తవ సతీ తేన సహ దగ్ధా దివంగతా ॥ 18

తతస్త్వం సఖివర్గైస్తం ద్రవ్యం నాశితవానస్ బహు ।
నీతం నష్టం భక్షితంచ వినాశ మగమద్ధనం ॥ 19

చింతయా ధర్మపత్నీ త్వాం నిరాకృతవతీ భృశం ।
న గృహీతంతు తద్వాక్యం తతో విక్రీతవాన్ గృహం ॥ 20

గతాసా బాలకైః సార్థ మనుజ్ఞాతా పితుర్గృహం ।
అపత్య పోషణకృతే ఋతే త్వాం వంశ కంటకం ॥ 21

తత ఉద్వృత్తతాం యాతః ఉన్మత్త ఇవ మధ్యపః ।
అన్యాయకారీ నగరే జాతో మత్త ఇవ ద్విపః ॥ 22

పరస్వహారో వనితాసు జారో గ్రామేషు చోరో జనతాపకారః ।
ద్యూతేషు వీరో వృజినౌఘసారో హింసావిహారో బలహీనశూరః ॥ 23

యే యే జనాస్తే సుఖ సంగతృప్తా
స్తేభ్యో గృహీత్వా బహువిత్త మాదః ।
నిక్షేపతః పితృకృతాత్ సుహృద్భ్యో మిషాత్కుతశ్చిత్ నగరస్థితేభ్యః ॥ 24

శపథాన్ అనృతాంశ్చ కర్ధనూన మనృతాణాం
ప్రమదా జనేషు సాక్ష్యం ।
ఇతి సర్వజనాః సుభీతిమాపుః ఉరగాత్పద్మగతాత్ ఇదివోగ్రవీర్యాత్ ॥ 25

అసహ్యతాం తేన జనస్య యాతో గోక్షూరకః పాదైయసగో యదైవ ।
రాజ్ఞో గృహీత్వా నుమతిం జనాస్తే
నిర్వాపయామాను రతోపురాత్త్వాం ॥ 26

వనే స్థితస్త్వం బహుజంతుఘాతీ స్త్రీబాలవృద్ధాన్ వినిహంసి నిత్యం ।
మహాజనం వీక్ష్య పలాయసేచ సింహం నిరీక్ష్యేవ
వృకో మృగోవా ॥ 27

మత్స్యాన్ బకాన్ సారస కుక్కుటాంశ్చ వృకాన్ మృగా
వాన్ నర కోకిలాంశ్చ ।
హత్వా త్విఖడ్గాన్ శశకాంశ్చ గోధాముధా
స్వదేహం వృజినాదపోషః ॥ 28

సింహాన్ వ్యాఘ్రాంశ్చ జంబూకాన్ నిస్సార్య గిరిగహ్వరాత్ ।
నానాస్థాన గతాంశ్చోరాన్ మేలయిత్వా సుదుర్ధరాన్ ॥ 29

కాష్టైర్లోష్టైశ్య పాషాణైశ్చకర్ధ గృహముత్తమం ।
విశాలం క్రోశవిస్తారం నానాకౌతుక మండితం ॥ 30

పిత్రా భీతేన పత్న్నీ సా ప్రాపితా బాలకైర్న్సహ ।
గృహాగతం తే సదనం రాజతో జనతో పిచ ॥ 31

నానాలంకార వసనా బాలకా అపితేజసా ।
దేవాంగనేన శుశుభేత్వంచ చోరసమన్వితః ॥ 32

త్వంచ మార్గే జనాన్ దీనాన్ హత్వా హత్వా గృహంగతః ।
చోరైః సబాల యోషిద్భిర్భాసిరాజేవ తద్గతః ॥ 33

కదాచిత్ బ్రాహ్మణో విద్వాన్ విఖ్యాతో గుణవర్ధనః ।
మధ్యాహ్నే మార్గమధ్యేతు త్వయా దృష్టః సఏకకః ॥ 34

గృహీత్వా దక్షిణం పాణిం తం విప్రం ధృతవానసి ।
స వేపమాన స్త్వద్బుద్ధిం జానన్ధర్షణయా తయా ॥ 35

ఊచే త్వాం స్వాంతకం మత్వా మూర్చితో జీవితేచ్ఛయా ।
అత్యంతం కరుణావాక్యై ర్బోధయంస్త్వాం సహేతుకైః ॥ 36

**గుణవర్ధన ఉవాచ :-**

ధనవాన్ సుభగో భూత్వా కథం మాం హంతు మిచ్ఛసి ।
ద్విజం నవోఢా భర్తారం శాంతం చానపరాధినం ॥ 37

దుర్బుద్ధివాసనాం త్యక్త్వా సద్ధర్మేషు మతిం కురు ।
ప్రథమా మే గతాకాంతా ప్రాప్తా కాంతేత్పరా పరా ॥ 38

స్వాచారా పరమోదారా సాధ్వీ సర్వగుణాకరా ।
పిత్రూణామనృణార్థాయ ధర్మసంతాన వృద్ధయే ॥ 39

కృతా సా అతిప్రయత్నేన గార్హస్థం ధర్మమిచ్ఛతా ।
మద్వినా తద్వినా వాంహి జన్మనీ భవతో వృధా ॥ 40

పితామేహి భవత్వంచ మాతాపుత్రోప్య హం తవ ।
జీవదాతా భయత్రాతా పితా శాస్త్రే నిగద్యతే ॥ 41

దస్యవోపి హి రక్షంతి ద్విజం వా శరణాగతం ।
ద్విజం యోగ్యం శరణ్యం మా మతస్త్వం మోక్తుమర్హసి ॥ 42

నోచేత్ కాల్ప సహస్రం త్వం నిరయాన్ ప్రతిపద్యసే ।
భోక్తారః సర్వఏవైతే స్త్రీపుత్రాః సుహృదో జనాః ॥ 43

న పాపభాగినస్త్వేతే సుఖిన స్త్వత్ర్పతారకాః ।
కియద్భి ర్జన్మభిః పాపం భోక్ష్యసే నవితర్కయే ॥ 44

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే సోమకాంత**
**పూర్వజన్మ కథనం నామ సప్తమోధ్యాయః**



# సోమకాంత పూర్వజన్మ కథనం

## 7-వ అధ్యాయము

అప్పుడు శౌనకాది మహర్షులు సూతమహర్షిని ఇలా ప్రశ్నించారు :

"ఓ సూతమహర్షీ! భృగుమహర్షి ఆశ్రమాన్ని చేరుకున్న సోమకాంత మహారాజు ఏంచేసాడు? సర్వం తెలిసి త్రికాలజ్ఞుడైన భృగువు ఆరాజు యొక్క బాధానివృత్తికై ఏఉపాయాన్ని చెప్పాడు? ఈ వివరాలన్నీ తెలుసుకొన కుతూహలంగా ఉన్నమాకు ఆ తరువాత జరిగిన కథాభాగమును వినిపించి తృప్తిని కలిగించు!"

ఆ మాటలకు మందస్మితవదనుడైన సూతుడిలా చెప్పసాగాడు.

"ఓ మహర్షులారా! జ్ఞానంతో పండి, సాగర గంభీరులైన మీరు ఆసక్తితో అడిగిన ప్రశ్న నాకు కథాగమనంలో ముందుకు సాగడానికి మంచి ప్రేరణనిస్తోంది! శ్రోతలకుగాని, వక్తకుగాని కథపట్ల ఆసక్తివల్లనే

ఆకథ ముందుకు వడివడిగా సాగుతుంది! అలాగే గ్రంధరచన చేసే వారికి అంతరాయాన్ని కలుగచేయడమూ, పుస్తకాన్ని అపహరించడమూ కూడా దోషభూయిష్టములైన కర్మలే! తెలియని విషయాన్ని గురించి తరచి ప్రశ్నించని శిష్యుడూ, జిజ్ఞాసుడై శిష్యుడు అడిగిన ప్రశ్నకు బదులివ్వని గురువూ, వీరిరువురికీ కూడా దోషం సంప్రాప్తమౌతుంది! వీరే ఈ లోకంలోగల గ్రుడ్డివారూ, చెవిటివారూనని చెప్పవచ్చు.

ఓ బ్రాహ్మణోత్తములారా! మీ అభీష్టంమేరకు తరువాతి కథా సంవిధానాన్ని తెలియజేస్తాను. శ్రద్ధాళువులై అవధరించండి! ఆరాత్రి ఋష్యాశ్రమంలో విశ్రాంతిగా గడిపి మరునాడు ప్రాతఃకాలాన్నే లేచిన రాజు తన పరివారంతోసహా స్నానసంధ్యాదులు అనుష్ఠించుకొని, సంధ్యా జపహోమాది నిత్యక్రియలను యధావిధిగా నిర్వర్తించి, సుఖమైన ఆసనం పైన కూర్చుండి ప్రాణములకు స్వస్థత చిక్కినాక, భృగుమహర్షి ఆరాజుతో యిలా అతని పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పనారంభించాడు.

## పూర్వజన్మ కథా వృత్తాంతము

"ఓరాజా! నీవు పూర్వజన్మములో వైశ్యకులములో వింధ్యపర్వత సమీపానగల కొల్హారనగరమనే పట్టణంలో జన్మించావు.

సిరిసంపదలతో తులతూగే అత్యంత ఐశ్వర్యవంతుడు నీ తండ్రి! సుగుణాలరాశి, దానశీలముగల 'సులోచన' అనే పతివ్రతామతల్లి నీకు జనని! నీవు పుట్టాక బ్రాహ్మణుల ఆదేశంమేరకు కామందుడని నీకు వారు నామకరణం చేశారు. ముదిమివయస్సున కలిగిన ఏకైక సంతానానివి కావటంవల్ల నిన్ను అతిగారాబంతోనూ, అమితమైన ప్రేమతోనూ

పెంచారు. కొంతకాలానికి కుటుంబిని అనే కన్యతో అతివైభవంగా నీకు వివాహంకూడా జరిపించారు. మంచి గుణవంతురాలై, నీపట్ల అనురాగం కలిగి, దేవతాతిథి పూజలపట్ల అంతులేని ఆసక్తి కలిగిఉండేదా సుగుణ వతి! పతివ్రతాశిరోమణియైన ఆమెయందు నీకు ఏడుగురుపుత్రులూ, ఐదుగురు కుమార్తెలూ కలిగారు! తండ్రి మరణించటంతో నీతల్లికూడా సహగమనం చేయడమూ జరిగింది.

ఆపైన నీకు దుష్టసాంగత్యము అలవాటై, పిత్రార్జితాన్ని విచ్చల విడిగా ఖర్చుచేసేశావు! పశుప్రాయుడవై భార్య అనేక పర్యాయములు అడ్డగించినా లక్ష్యపెట్టక, స్వేచ్ఛావిహారంతో స్త్రీలోలుడవైనావు. నీవు నివాసముండే ఇంటిని సైతం నీ వ్యసనాలకై అమ్మేశావు! భార్యాబిడ్డల పోషణయేచేయని నీవద్ద బ్రతుకు గడపటం దుర్భరంకాగా, పిల్లలతో నీభార్య తన పుట్టినింటికి వెళ్ళిపోయింది.

ఇక నీ ఆగడాలకు అద్దూఅపూ లేకపోయింది. అతిగా మద్య పానంచేసి ఒళ్ళుమరచి, మదించిన ఏనుగులా సంచరించావు! పర ద్రవ్యాన్నీ, పరదారాపహరణాన్నీ జంకూగొంకూ లేకుండాచేస్తూ, జారత్వాన్నీ, దొంగతనమూ, జూదమూ మొదలైన వ్యసనాలకు బానిసవై మహా పాపివిగా, జనకంటకుడివిగా తయారైనావు. నిన్ను జూడగానే ప్రజలంతా నట్టింట్లో పామును చూచినట్లు భయవిహ్వాలులై అసహ్యించుకునేవారు. ఆ ప్రజలగోడువిన్న రాజు నిన్ను గ్రామాన్నుంచి బహిష్కరించాడు. అక్కడ అరణ్యంలోకూడా, ఆటవికుడిలా సంచరిస్తూ, జంతువులనూ, స్త్రీ బాల వృద్ధులన్న విచక్షణయే లేకుండా దారినపోయే బాటసారులనందరనూ సంహరించేవాడివి! సింహాన్ని చూసిన మృగాలలాగా, నిన్ను చూడగానే

బాటసారులు భయంతో పారిపోయేవారు. అలా పరమ కిరాతకుడిలాగా అరణ్యంలో నీవు స్వైరవిహారంచేస్తూ, లేళ్ళను, చేపలను, అనేకరకాల పక్షులనూ, కుందేళ్ళనూ వేటాడి వాటియొక్క మాంసభక్షణంతో పొట్ట పోసుకునేవాడివి! బహు దుర్మార్గులైన బందిపోట్లతోకూడా స్నేహంచేసి ఎంతో ధనాన్ని అక్రమంగా బాటసారులను కొల్లగొట్టి సంపాదించావు. నీవుండేందుకై ఒకగొప్ప భవననిర్మాణం చేశావు.

నీ క్రూరత్వానికి ఝడిసి నీమామ నీభార్యాపుత్రాదులను నీవద్దకు పంపివేసాడు. ఆ సకలవైభవోపేతమైన భవనంలో అనేక విలువైన ఆభరణాదికాలు ధరించి నీ సంతానం శ్రీమంతులమాదిరిగా సుఖించారు.

నీవుమాత్రం పాపభీతిఅన్నది లేకుండా దొంగలనుకూడి అమాయక బాటసారులను హత్యలుచేస్తూ, అక్రమ ధనార్జనకు పాల్పడుతూ, ఒక దొరలా నిరంకుశంగా ఉండేవాడివి. ఇలావుండగా ఒకనాటి మధ్యాహ్నం గుణవర్ధనుడనే నామధేయంకల ఒక బ్రాహ్మణయువకుడు ఆమార్గం వెంట వెడుతూండగా, వాని వెంటపడి వాడి కుడిచేతిని గట్టిగా దొరకపుచ్చుకున్నావు. క్రౌర్యం ఉట్టిపడుతున్న నీమొహంచూచి, భయంతో ఆ బ్రాహ్మణ యువకుడు మూర్ఛిల్లాడు. కొంత తడవుకు తేరుకొని బ్రతుకు పైగల తీపికొద్దీ అత్యంత దీనుడై నీకు నీతిబోధ చేయసాగాడు.

"ఓ దొరా! సకలైశ్వర్యాలతో తులతూగుతూ వుండికూడా నన్ను చంపాలని ఎందుకు ప్రయత్నిస్తావు? నేనా ఉత్తమమైన బ్రాహ్మణకులంలో జన్మించిన శ్రోత్రియుడను. ఈ మధ్యనే నాకు వివాహం జరిగింది! నిరపరాధిని! నీవు యిటువంటి ఘాతుకకృత్యాలను మాని యికనైనా ధర్మబుద్ధి

కలవాడవుకా! ఇంతకు కొంచెంసేపటి క్రితమే నాభార్య తన పుట్టినింటికి వెళ్ళింది. ఆమె పరమ సాధ్వీమణి! సదాచారపరురాలూ కూడా! నా పితృఋణాన్ని తీర్చుకునేందుకుగాను సత్సంతతికై ఎంతోకాలానికి అతి ప్రయత్నంమీద ఈమధ్యనే ఆమెను వివాహమాడాను! భర్తలేని స్త్రీజన్మ, స్త్రీరహితమైన పురుషజన్మా ఈరెండూ వ్యర్థములేకదా! ఓ చోరశిఖామణీ! నేను వయసులో నీ కుమారుడి వంటివాడిని! ఇక నీవే నాకు తల్లివీ, తండ్రివీను! ప్రాణదాత, ఆపదనుంచి రక్షించినవాడూ 'తండ్రి' అంతటి వాడని శాస్త్రాలుసైతం ఘోషిస్తున్నాయి. ఎంతటి క్రూరులైన దొంగలైనా శరణువేడి నటువంటి బ్రాహ్మణుని రక్షిస్తారుకదా! నేను బ్రాహ్మణుడను, శాంతుడను, శరణాగతుడనూ కూడాను! కనుక నన్ను హింసించుట నీకు ఏమాత్రమూ ఉచితంకాదు! అలాకాక నామాటను చెవినిపెట్టక పోతే నీవు వేయికల్పాల పర్యంతం ఘోరనరకాలను అనుభవిస్తావు! నీ సహచరులూ, భార్యాబిడ్డలూకూడా నీ సంపాదన అనుభవించేవారేగానీ నీ పాపఫలంలో ఏమాత్రం పాలుపంచుకొనరు! ఈ పాపాలనుభవించ టానికి నీవెన్ని జన్మలో ఎత్తాల్సివుంటుంది!" అంటూ వేడుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'సోమకాంత పూర్వజన్మ కథనం' అనే ఏడవ అధ్యాయం.



8

# నానాపక్షి నివారణం

(మూలం)

## అష్టమో అధ్యాయః

**భృగురువాచ :-**

ఇతి తేనోదితం వాక్యం ముహుర్గానిం ప్రకుర్వతః ।
కరుణాయుత మాకర్ణ్య నోద్భిన్నం హృదయం తవ ॥ 1

వజ్రాత్కారతరం, కిన్ను బ్రహ్మణా త్వయి నిర్మితం ।
హింసనాద్బహూ జంతూనాం మనుష్యాణాం సహస్రశః ॥ 2

అతి నిష్ఠురతాం ప్రాప్తం కృతఘ్న స్త్యైవమానసం ।
అవోచస్త్వం తతస్తంతు కృతాంత ఇవ నిష్ఠురః ॥ 3

**చోర ఉవాచ :-**

కింతే, వాక్యచయై ర్విప్ర వృథామయి నియోజితైః ।
అశ్రోతరి చ పాండిత్యం న్యుబ్జే కుంభే యథాజలం ॥ 4

క్వేయం మమ మతిర్మూఢ క్వోపదేశ స్త్రవాప్యయం ।
తత్వచింతేవ మధుపే సాంప్రతం మే నరోచతే ॥ 5

అర్ధాసక్తస్య నక్వాపి, పితృబంధు విచారణా ।
యధా కామాతురస్యాపి నభీతిర్ హ్రీశ్చ విద్యతే ॥ 6

శుద్ధిః కాకే ద్యూతకారే సత్యం ధైర్యం నపుంసకే ।
కామశాంతిస్త్రియాంసర్వే క్షమా దృష్టా త్వయానుకిం ॥ 7

అంతికేత్వం నిస్పృష్టోసి, వ్యాపార రహితస్యమే ।
విధాత్రా దైవయోగేవ నత్వాం ముంచామి కర్హిచిత్ ॥ 8

భృగురువాచ :-

ఇత్యుక్త్వా నిశితం ఖడ్గం హస్త ఆదాయ దక్షిణే ।
చకర్తాథ శిరస్తస్య బిడాల ఇవ మూషికం ॥ 9

ఏవం తే బ్రహ్మహత్యానాం సంఖ్యాకర్తుం నశక్యతే ।
స్త్రీబాలవృద్ధ జంతూనాం హత్యానాంచ విశేషతః ॥ 10

సంఖ్యాతా పరపాపానాం విభాగే జాయతే యతః ।
తతో బహుతిథే కాలే గతే కామందతే జరా ॥ 11

ఆగతాథ కఫోగ్లానిః స్వేదోహిక్కాథ వేపథుః ।
అభూత్తంద్రీ చోపవిష్టే ప్రసుప్తేన చ సాభవత్ ॥ 12

అనాదరంచ చక్రుస్తే పుత్రా దాస్యోథ సేవకాః ।
సుహృదశ్చ సుతాశ్చాపి నష్టారో అధాపి మిత్రకాః ॥ 13

ఏక ఏవాభవత్తత్ర దృష్ట ఆప్తో రహస్యకృత్ ।
అనివార్యగతి ర్విప్రః సచాపి ప్రేషిత స్త్వయా ॥ 14

ఆకారయితుం సర్వాంస్తాన్ మునీన్కానన వాసినః ।
తేచాపి త్వద్భయాదేవ ద్విజవాక్యాత్సమాగతాః ॥ 15

అబ్రవీస్తాన్ నమస్కృత్య మత్తో దానాని గృహ్యతాం ।
తేబ్రువ న్నచ గృహ్ణీమో దానాని పతితన్య తే ॥ 16

యాజనా ధ్యాపనాద్యైనా త్సంబంధాద్భాషణాదపి ।
పరం సంచరతే పాపం సహయానా సనాశనాత్ ॥ 17

ఇతి తే భాషమాణాస్త్వాం గత్వాచ నిజమాశ్రమం ।
సస్నుః సచైలం సర్వేపి పావమానీస్తతో జపన్ ॥ 18

తతో అను తాపో మనసిజాతః కామంద తేభ్రుశం ।
అమయా త్వ్యజనైస్త్యాగా ద్బ్రాహ్మణైః పరివర్జనాత్ ॥ 19

జీర్ణ దేవాలయోద్ధారే భవత్తే మతిరూర్జితా ।
ధనం స్వం విపులం వీక్ష్య కుప్య రత్నాదిసంయుతం ॥ 20

తతోఽనాదిః పరామూర్తిః గణేశస్య వనే శుభా ।
జీర్ణదేవాలయే క్షుద్రే స్థితాతే కథితాద్విజైః ॥ 21

తతో అతి విస్తృతం దీర్ఘం చతుస్తోరణ సంయుతం ।
చతుర్ద్వారం సురుచిరం చతుశ్శిఖరశోభితం ॥ 22

నానాస్తంభ రచితం నానా వేదిభిః రావృతం ।
ముక్తాప్రవాళ రత్నాద్యైః ఖచితం రుచిరాంగణం ॥ 23

నానాపుష్ప ద్రుమ యుతం నానాఫల ద్రుమైశ్శితం ।
చతుర్దిక్షు చారు వారిమయవాపీ విరాజితం ॥ 24

ప్రాసాదం నిర్మితవతః తద్రవ్యంతే వ్యయం గతం ।
కించిత్ స్త్రియాచ పుత్రైశ్చ సుహృద్భి ర్భంధు భిర్వృతం ॥ 25

తతో నాతిచిరేకాలే పంచత్వం చాగతోభవాన్ ।
యామ్యదూతైః కశాఘాతై ర్బద్ధస్సంతాడిశోభ్రుశం ॥ 26

కంటకై ర్విద్ధ సర్వాంగః శిలాయాం పోధితోపి చ ।
మజ్జితో నరకే ఘోరే పూయ శోణితకర్దమే ॥ 27

ఏవం నీతస్తు తైర్దూతై శ్చిత్రగుప్త యమాంతికే ।
యమేనపృష్టః కింపుణ్యం ఉత భోక్ష్యసి పాతకం ॥ 28

తతః సౌరాష్ట్రదేశే త్వం రాజత్వేన వినిర్మితః ।
ఇతి తే కథితం పూర్వజన్మ పాపకరం మయా ॥ 29

శరణాగత కారుణ్యా త్తపోబల సమాశ్రయాత్ ।
కాంత ప్రాసాద కరణాత్ సోమకాంతోఽభవేన్నృపః ॥ 30

కాంతయా కాంతతరయా భాసికాంత్యా శశీయథా ॥ 31

**సూత ఉవాచ :**

భృగుణాభిహితం శృత్వా సోమకాంతో నృపాధమః ।
తద్వాక్యే సంశయాపన్నః అసీదశ్మేవ నిష్క్రియః ॥ 32

వేదశాస్త్రార్థ విదుషో భూతభావి భవద్విదః ।
తపస్వినో భ్రుగోర్వాక్యే యతః స సంశయం దధౌ ॥ 33

నిరగన్ క్షణమాత్రేణ తస్యాంగాత్ పక్షిణోభ్రుశం ।
నానా వర్ణాకృతిధరాః బభక్షుర్ నృపతింతదా ॥ 34

ఉడ్డీయోడ్డీయ చంచ్వాగ్రై ర్దదంశు ర్నృపశుందృఢైః ।
ఉత్కృత్యో త్కృత్య మాంసాని చక్షుస్తే మునిసన్నిధౌ ॥ 35

తతో అతి దుఃఖిత తనుః శరణం పునరాగతః ।
అవద దీనయా వాచా భ్రుగుం జ్ఞాన తపోనిధిం ॥ 36

**రాజోవాచ :-**

త్వద్వనే జాతివైరాణాం పరస్పర భయం నహి ।
త్వత్సమక్షం కథమిమే, మృతం మాం మారయంతి చ ॥ 37

త్వత్పాదప్రవణం దీనం సకుష్టం శరణాగతం ।
ఇదానీం మోచయ మునే సర్వసత్వ భయంకర ॥ 38

**సూతఉవాచ :-**

ఇత్యుక్తః పునరప్యాహ భృగుస్తం దీనవత్సలః ।
మద్వాక్య సంశయా దిద్ధం అనుభూతం నృపస్త్వయా ॥ 39

ప్రతీకారం వదిష్యామి స్వస్థోభవ క్షణంన్నప ।
మమ హుంకారమాత్రేణ గమిష్యంతి ద్విజా ఇమే ॥ 40

**సూతఉవాచ :-**

ద్విజస్య హుంకృతిం శృత్వా ద్విజాశ్చాంతర్హితాస్తదా ।
తుతోష నృపతిశ్చాపి పత్న్యామాత్య సమన్వితః ॥ 41

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే నానాపక్షినివారణం నామ అష్టమో అధ్యాయః**



# నానాపక్షి నివారణం

## 8-వ అధ్యాయము

ఇట్లా గుణవర్ధనుడనే ఆ బ్రాహ్మణుడు ఎన్నోవిధాల వేడుకున్నా వజ్రమంతటి కఠినమైన నీ హృదయమేమాత్రం కరుగలేదు! చాలా కాలంగా ఘోరకృత్యాలను జంకుగొంకులులేకుండా చేస్తూండటంవల్ల కరడుగట్టిన కాఠిన్యంతో, జాలి అన్నమాట మందుకిగూడ లేకుండా నిర్దయగా ఆ బ్రాహ్మణుడితో నీవిలాగన్నావు.

"ఓ బ్రాహ్మణోత్తమా! నీవిలా ఎంత వేడుకుంటే మాత్రం ప్రయోజనమేముంది? చెవిటివాడి చెవిన శంఖం ఊదినట్లు నాదగ్గర నీ ఉపదేశాలేం పనికివస్తాయి? త్రాగినవాడికి తత్త్వోపదేశం చెవికెక్కుతుందా? ధనార్జనే ప్రధానమైన వాడికి తల్లిదండ్రీ బంధువులూఅన్న విచారం ఉండనట్లు, కామాతరునకు సిగ్గూలజ్జా మచ్చుకైనాలేనట్లు నావద్ద కూడా

నీవు ఊహించే జాలీ, దయా వంటి సుగుణములేమీ లేవు! ఐనా చాలాకాలంగా పనిలేని నాచేతికి చిక్కావు! నిన్ను ఊరికే వదుల్తానా? అని పల్కుతూ, "ఓ రాజా! దయాశూన్యుడవై కుడిచేత్తో ఖడ్గంతీసి వాని శిరస్సును ఖండించావు! ఇట్లాగ లెక్కలేనన్ని బ్రహ్మహత్యలను నిస్సంకోచంగా చేశావు! ఇలా ఎంతోకాలం గడిచాక నీకు ముసలితనం కూడా వచ్చింది. శరీరంలో కఫము, శ్లేష్మము, వాతములు ఉద్రేకించి అటూఇటూ కదలలేని పరిస్థితి ఏర్పడింది. అప్పుడు నీభార్య, పుత్రులు, సేవకులూ అందరూ నిన్ను నిరాదరణతో త్రోసివైచారు.

ఎవరూలేని ఏకాకివై, ఒక రహస్య స్నేహితుడిని చేరబిలిచి అక్రమంగా సంపాదించిన నీ ధనాన్నంతటినీ దానధర్మములు చేసేయవలెనని సంకల్పించి ఆ అరణ్యంలో బ్రాహ్మణులందరినీ పిలిచి వారికి దానములివ్వబోగా

"పతితుడ" వైన నీవద్ద దానంపట్టి తమ పుణ్యాన్ని నశింపచేసుకోలేమని నిరాకరించారు. అంతేకాదు మహాపాపివైన నీవంటివాడితో సంభాషించటం కూడా ఎంతో దోషమని, దానినివారణకై సచేలస్నానం చేసి, అఘమర్షణ మంత్రాలను, పవమాన సూక్తమునూ జపించి వెడలిపోయారు ఈ సంఘటనతో నీకు పశ్చాత్తాపము కల్గింది. నీదగ్గర అన్యాయంగా ఆర్జించిన ధనాన్నంతటినీ ఖర్చుచేసేసే మార్గం తెలియక దిక్కుతోచని స్థితిలో ఉన్నావు. అప్పుడు ఆ అరణ్యంలోఉన్న ఒక జీర్ణదేవాలయాన్ని బాగుచేయాలన్న ఆలోచనకల్గింది. అప్పుడు కొందరు విప్రులు నీకిలా సలహాయిచ్చారు.

"ఓయీ! అతి ప్రాచీనమైన ఈ ఆలయంలో ఒక గణేశుని మూర్తి ఉన్నది. నీవు సకలాంగ సుందరంగా ఈ ఆలయాన్ని పునర్నిర్మించి ప్రాయశ్చిత్తం చేసుకోవటమే నీకు తగిన పని!''

అప్పుడు నీవు వారి మాటవిని నాలుగు తోరణాలతోనూ, నాలుగు ద్వారాలతోనూ అనేక స్థంభాలతో, వేదికలతో విలసిల్లే దివ్యమైన గణేశ మందిరాన్ని, ముత్యాలు పగడాలతో తాపబడిన వాకిళ్ళతోనూ, నానారకాల ఫలవృక్షాలతో నిండివున్న దానిని నిర్మించి, అందులో నాలుగు దిక్కుల లోనూ నీటివసతికని దిగుడు బావులనూ సదుపాయంగా త్రవ్వించి ఒక బ్రహ్మాండమైన గణేశ దేవాలయాన్ని కట్టించి నీవు ఆర్జించిన ధనా న్నంతటినీ ఖర్చుచేశావు!

నీవార్జించిన దానిలో కొంత ధనాన్ని నీ భార్యాపుత్రులూ, సేవ కులూ మోసంతో హరించినారు. అనంతరం కొద్దికాలానికి నీవు మర ణించావు! అప్పుడు యమదూతలు నిన్ను తమ పాశాలతో బంధించి, కొరడాలతో కొడుతూ, ముళ్ళతో గుచ్చుతూ సూదులవంటి రాళ్ళపై పడదోస్తూ ఘోరమైన మహానరకాలలో పడద్రోశారు! ఇలా యమదూత లతో హింసించబడుతూ యముడి సన్నిధికి వెళ్ళగా యముడిలా నిన్ను ప్రశ్నించాడు.

"ఓరీ! నీవు ముందుగా చేసిన పాపాన్ని అనుభవిస్తావా? లేక పుణ్యాన్ననుభవిస్తావో చెప్పు" అనగా నీవు ముందుగా పుణ్యాన్నే అనుభ విస్తానన్నావు! అప్పుడు నీవు జీర్ణమైన గణేశ దేవాలయాన్ని ఉద్ధరించిన నీపుణ్య విశేషంచేత చంద్రుడివంటి శరీరకాంతితో భయంకర సోమకాంత

మహారాజుగా పుట్టావు. అలా నీ పుణ్యఫలంఅంతా ఖర్చు అయిపోయి నాక, పాపఫలంవల్ల నీకీ కుష్ఠువ్యాధి సంభవించింది!"

అని భృగుమహర్షి సోమకాంతమహారాజుతో అతని పూర్వజన్మ వృత్తాంతం చెబుతూండగా —

"ఓ మహర్షులారా! ఆ మహారాజుకు హృదయంలో 'ఇదంతా నిజమా?' అన్న సంశయం కలిగింది. వేదశాస్త్రాలలో నిధివంటివాడూ, త్రికాలవేదీయైనటువంటి ఆ మహనీయుని వాక్కులను సంశయించిన దోషానికి వెంటనే ఆ ఋషి శరీరంలోంచి ఒక పక్షులగుంపు వెలువడి ఆ సోమకాంతరాజుయొక్క శరీరాన్ని ఖండఖండాలుగా పొడుచుకు తినసాగాయి!" అంటూ సూతమహర్షి అక్కడి మహర్షులతో కథాగమనాన్ని యిలా కొనసాగించాడు.

"ఆ బాధకు తట్టుకొనలేని సోమకాంతమహారాజు భరించరాని బాధతో వలవలా ఏడుస్తూ తనను రక్షించమంటూ ఆ భృగుమహర్షిని శరణువేడి, దీనంగా యిలా ప్రార్థించాడు.

"ఓ మహాత్మా! ఎంతో క్రూరస్వభావంగల మృగాలుసైతం తమ దుష్టత్వాన్ని వీడి, మీ ఆశ్రమంలో ఎంతోస్నేహంగా వెలుగుతున్నాయి కదా? అటువంటి పావనమైన ఈ ఆశ్రమంలోనే, మీ సమక్షంలోనే ఈ పక్షులగుంపులిలా నన్ను బాధిస్తున్నాయెందుకనో? ఇవి నన్ను పొడిచి పొడిచి మరీ చంపుతున్నాయి! నీ పావన చరణాలను ఆశ్రయించి శరణు వేడినవాడిని! పైగా దీనుడను! కనుక నీవు నాపై దయతో అభయాన్ని ప్రసాదించి కాచి, రక్షించు!" అంటూ వేడుకున్నాడు.

అప్పుడు ఆతరువాత జరిగిన కధావృత్తాంతాన్ని సూతులవారిలా తెలియ జేసారు.

"ఇలా ఆ సోమకాంతమహారాజు దీనుడై ప్రార్ధించగా భృగుమహర్షి ఇలా బదులిచ్చాడు.

"ఓ రాజా! నీవు నావాక్యములను సంశయించటం వలన ఇటు వంటి ఆపదకలిగింది! దీనికి ప్రతిక్రియ చేస్తాను నీవొక క్షణకాలం ఊరుకో!"

అని ఆ మహర్షి ఒక 'హుం'కారం చేయగానే ఆ పక్షులగుంపులన్నీ అంతర్ధానమై పోయినాయి!" అంటూ సూతుడు చెప్పాడు. 'ఆ కరుణా భరితమైన మహర్షి చర్యకు సోమకాంత మహారాజూ ఆయన భార్యయైన సుధర్మా ఎంతో సంతోషించారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'నానాపక్షి నివారణం'** అనే 8-వ అధ్యాయం.



# 9

# రాజోపదేశ కథనం

(మూలం)

## నవమో అధ్యాయః

**సూతఉవాచ :-**

తతోభృగుః క్షణం ధ్యాత్వా పునస్తంప్రాహ భూపతిం ।
అత్యంత విహ్వాలో దుఃఖం వీనీక్ష్యతత్పూర్వకర్మజం ॥ 1

క్వ పాపనికరాంతేతు క్వోపాయాః కథితా మయా ।
తథాప్యేకం బ్రవీమి త్వాం ఉపాయమఘ నాశనం ॥ 2

గణేశస్య పురాణం త్వం శ్రోష్యసే యది సత్వరం ।
తదైవ మోక్ష్యసే దుఃఖసాగరా న్నాస్త్యత్ర సంశయః ॥ 3

ఇత్యుక్త్వా తం గణేశస్య నామాష్టశత ముత్తమం । 4

జప్త్వా జలం మంత్రయిత్వా సిషేచ నృపతిం తదా ।
సిక్తమాత్రే జలే తేన తన్నాసా రంధ్రతో అలఘుః ॥ 5

కృష్ణాస్యః ప్రాపతద్భూమౌ వవృధే తత్ క్షణాదసౌ ।
సప్తతాళప్రమాణో భూత్ వ్యాదితాస్యో భయంకరః ॥ 6

కరాళజిహ్వో రక్తాస్యో దీర్ఘబాహుర్ఘటాదరః । 7

ముఖాదురు వమన్నగ్నిం క్షణాచ్ఛ పూయశోణితే ।
నేత్రాణామంధతాకుర్వన్ అంధకార ఇవాపరః ॥ 8

ఆలోక్య దుద్రువుస్సర్వే తదాశ్రమ నివాసినః ।
దంష్ట్రారావైః దశదిశః పూరయంతం తమద్భుతం ॥ 9

అపృచ్ఛ త్తం ద్విజవరః తత్సమం క్షంతు పూరుషం ।
విద్యానపీతి కోసిత్వం నామతే కిం వదస్వ మే ॥ 10

ప్రత్యువాచ మునిం తంతు పరిపృష్టో ద్విజేనసః ।
ప్రాణిమాత్రశరీరస్థో నామ్నాహం పాపపూరుషః ॥ 11

త్వన్మంత్ర జలపాతేన నిస్సృతో రాజదేహతః ।
క్షుధాతురో భక్ష్యమీహే దేహి మహ్యం నచేత్తదా ॥ 12

భక్షయిష్యే మునే లోకాన్ సోమకాంతం తవాగ్రతః ।
వదమే వసతా రమ్యామితో నిస్సారితస్యచ ॥ 13

తతస్తు బహిరభ్యేత్య తమువాచ మునిః పునః ।
అస్మిన్ రసాలే సరలే విరసే వనకోటరే ॥ 14

గళితానిచ పత్రాణి భక్షయస్వ మమాజ్ఞయా ।
నో చేత్వాం భస్మసాత్కుర్యాం నానృతంమే వచో అధమ ॥ 15

**సూతఉవాచ :-**

ఇతి తన్మునివాక్యః తేశుష్కం సవృక్షమస్పృశత్ ।
భస్మసాదభవత్ వృక్షో ద్విజాస్తత్ స్పర్శమాత్రతః ॥ 16

మునేః సందర్శనాద్భీతః తస్మిన్భస్మన్యలీయత ।
తస్మిన్ విలీనే స మునిః సోమకాంతం పునర్జగౌ ॥ 17

**భృగురువాచ :-**

పురాణ శ్ర ణాద్యత్రేజాతం పుణ్యం నృపోత్తమ ।
అయం యావచ్ఛ్యాతతరు రత్రచోత్తిష్ఠతే పునః ॥ 18

తావ త్సంపాదయాస్మిన్ తద్భస్మన్యేవ దినే దినే ।
వివృద్ధే స్మింస్తరౌ రాజన్నిష్పాపః అస్త్వం భవిష్యసి ॥ 19

**రాజోవాచ :-**

గణేశస్య పురాణం యన్నదృష్టం నచవై శ్రుతం ।
కుత్ర తల్లభ్యతే బ్రహ్మన్ వ్యాకర్తా కస్యవా మునే ॥ 20

**మునిరువాచ :-**

బ్రహ్మణాకథితం పూర్వం వేదవ్యాసాయ ధీమతే ।
వ్యాసాచ్చానుగృహీమహం పురాణం పాపనాశనం ॥ 21

అహం తే అద్య ప్రవక్ష్యామి తీర్థే స్నానం సమాచర ।
శ్రోష్యే పురాణమితి సంకల్ప్య సువ్రత ॥ 22

**సూతఉవాచ :-**

భృగుణా నోదిత్యస్నాత్వా భృగు తీర్థేతి విశ్రుతే ।
సోమకాంతో ముదాయుక్తః తత్సంకల్పమాచరత్ ॥ 23

గణేశస్య పురాణం యత్తత్ శ్రోష్యే అద్య ప్రభృతి అహం ।
సంకల్పమాత్రే తు కృతే బభౌ రాజా నిరామయః ॥ 24

భృగు ప్రసాదా న్నీరక్తః కృమిక్షత వివర్జితః ।
గృహిత్వా తం భృగు రగాద్విస్మితం హర్షితం నృపం ॥ 25

ఉపవిశ్య అసనే స్వీయే దాపయత్తస్య చాసనం ।
ఉపవిష్టో బభాషే తం దివ్యకాంతిం నృపోత్తమం ॥ 26

**రాజోవాచ :-**

భవత్ప్రసాదాత్ సకలా గరిష్ఠా సంకల్పమాత్రేణ గతావ్యధా మే ।
ఆశ్చర్యభూతం సకలం వదస్య పురాణమేతత్ ద్విరదాననస్య ॥ 27

**భృగురువాచ :-**

శ్రుణుష్వావహితో భూత్వా యత్పురాణం వదామ్యహం ।
అనంత పుణ్యనిచయైర్యస్య శ్రవణ గోచరా ॥ 28

మతిరుత్పద్యతే పుంసాం నాన్యథా పాపకారిణామ్ ।
యస్యాకర్ణన మాత్రేణ సప్త జన్మార్జితాన్యపి ॥ 29

లఘు శుష్కార్ద్రస్థూలాని పాపా నిచ మహాంత్యపి ।
తత్ క్షణాద్విలయం యాంతి గణేశస్య ప్రసాదతః ॥ 30

అవ్యయస్యా ప్రమేయస్య నిరుణస్య నిరాకృతేః ।
మనోవాగనిరూప్యస్య కేవలానంద రూపిణః ॥ 31

యస్య స్వరూపం నవిదు ర్బ్రహ్మేశానాదయః సురాః ।
సహస్రవదనో యస్య మహిమానం నచ క్షమః ॥ 32

యావద్విశేషవిదపి ప్రవక్తుం రాజసత్తమ ।
మయా యథాశ్రుతం పూర్వం తత్పురాణం సుపుణ్యదం ॥ 33

అతీంద్రియ జ్ఞానవతో వ్యాసాత్‌చామిత తేజసః ।
యజ్ఞవిధ్వంస శోకార్తో దక్షః శుశ్రావ ముద్గలాత్ ॥ 34

యస్య భక్తిర్దృఢా రాజన్ గణేశే సర్వసిద్ధిదే ।
స ఏతత్ శృణుయాన్నిత్యం నవాచ్యతాదృతే ఇతరే ॥ 35

యది సర్వేపి కుర్వీరన్ విఘ్నరాజస్య సేవనం ।
కృతదావిఘ్న నిచయా విహరేయుర్యథా సుఖం ॥ 36

దుఃఖాన్యనుభవేయుః కే నానా విరహజా న్యుత ।
చకారేదం పురా వ్యాసో భూతభవ్య భవిష్యవిత్ ॥ 37

వేదార్థజ్ఞాన రహితాన్ వేదాధ్యయన వర్జితాన్ ।
వర్ణాశ్రమాచార శూన్యాన్ జాతి సంకరకారిణః ॥ 38

కలౌ విలోక్యతు జనాన్ కుటిలాన్ పాపకారిణః ।
అష్టాదశపురాణాని కృతవాన్ ధర్మగుప్తయే ॥ 39

తావంత్యుప పురాణాని తతో అర్థాన్ బుబుధుర్జనాః ।
అతఏవ గణేశస్య రూపంజానంతి ఇమేజనాః ॥ 40

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే రాజోపదేశ కథనం నామ**
**నవమో అధ్యాయః**



# రాజోపదేశ కథనం
## 9-వ అధ్యాయము

ఆ తరువాత కథను సూతమహర్షి యిలా చెబుతున్నారు :

'ఓ ఋషివర్యులారా! అప్పుడు భృగుమహర్షి క్షణకాలం ధ్యాన స్థితుడై ఆ సోమకాంతమహరాజుయొక్క పూర్వజన్మ కర్మయొక్క తీవ్రతను గ్రహించి విహ్వాలుడై ఆరాజుతో ఇలా అన్నాడు :

"ఓ రాజా! నీ పాపంయొక్క బరువు ఎంతటిదంటే అది — నేనే పరిహారోపాయం చెప్పబూనినా దాన్ని మించిపోయేలా వుంది! ఐనా అనుగ్రహంవల్ల నీయొక్క సమస్త పాపములనూ నశింపచేసేటటువంటి ఒక ఉపాయం చెబుతాను. నీవు వీలైనంత వెంటనే పరమ పావనమైన 'గణేశపురాణము'ను విన్నట్లైతే — తక్షణమే నీవీ దుఃఖసముద్రము నుంచి విముక్తుడివవుతావు! దీనికేమాత్రం సందేహంలేదు" అంటూ

శ్రీగణేశుని అష్టోత్తరశతనామాలతో తన కమండలువులోని జలాన్ని అభి మంత్రించి సోమకాంతమహారాజుపై చల్లాడు! అలా ఆ పుణ్యజలాలు అతనిమీద పడీపడగానే ఆరాజు ముక్కురంధ్రాలనుంచి ఒక నల్లటి కాలమేఘంవంటి శరీరంగల పాపపురుషుడు భూమ్మీదపడి వెంటనే పెరుగసాగాడు!

## పాప పురుష చరిత్ర :

ఓ ఋషులారా! ఆ పాప పురుషుడు ఏడుతాడిచెట్లంత ఎత్తు గలిగి నల్లటి దేహకాంతితో, భయంకరమైన కోరలుగల తన నోటిని వికృతంగా తెరచి ఎఱ్ఱని ముఖంతో పెద్ద చేతులతో, జడలు ధరించి భయంకర రూపుడై నోటిలోనుంచి అగ్నిజ్వాలలను వెడలగ్రక్కుతూ, ఒక్కో క్షణంలో చీము, రక్తములను గ్రక్కుచూ, చూసేవాళ్ళకు కళ్ళు మిరు మిట్లుగొలిపేలా గాఢాంధకారమావహించిందా అన్నంత నల్లగావున్న ఆ పాపపురుషుని రూపం చూసిన ఆశ్రమం పరిసరవాసులంతా భయ భ్రాంతులై పారిపోయారు! దిక్కులు మారుమ్రోగేటట్లుగా గర్జిస్తున్న ఆ వికృతుడైన రాక్షసుడిని చూసి భృగుమహర్షి ఆ సోమకాంతుని సమక్షం లోనే 'ఓరీ నీవెవడవు? నీపేరేమి?' అంటూ ప్రశ్నించాడు.

అప్పుడు ఆ పాపపురుషుడిలా బదులు పలికాడు :

## 'భృగు పాపపురుష సంవాదం'

'ఓ ఋషివర్యా! ఈరాజుయొక్క సూక్ష్మశరీరంలో నివసిస్తూన్న పాపపురుషుణ్ణి నేను! నీవు మంత్రోదకం చల్లటంవల్ల ఈరాజుయొక్క శరీరంలో ఉండలేక బయటకు వచ్చాను! బాగా ఆకలిగొని వున్నాను!

నాకు తగిన ఆహారం వెంటనే చూపించు! లేకపోతే లోకాలనన్నింటినీ మ్రింగివేస్తాను. వీని శరీరం విడిచిన నాకు తగిన నివాసం కూడా చూపించు!'

అప్పుడు ఆభృగుమహర్షి తన ఆశ్రమంనుండి వెలుపలికి వచ్చి, ఎదుటగా జీర్ణమై శుష్కించివున్న ఒక మామిడిచెట్టును చూపించి 'ఓరీ! నీవీ చెట్టుతొఱ్ఱలో ఉండు! రాలిన ఎండుటాకులనే ఆహారంగా తీసుకో! అలాచేయని పక్షంలో నిన్నీక్షణాన్నే భస్మంచేస్తాను! ఇదినిజం!' అని ఆజ్ఞాపించాడు.

సూతులవారిలా చెప్పసాగారు :

'ఓ ఋషులారా! అప్పుడు ఋషి ఆజ్ఞమేరకు ఆ పాపపురుషుడు ఆ శుష్కించిన మామిడిచెట్టును సమీపించి దాన్ని తాకగానే అతని స్పర్శమాత్రంచేతనే అది కాలి బూడిదైంది. ఋషియొక్క ఆగ్రహానికి వెఱచి అతడా భస్మంలోనే లీనమై దాగిఉన్నాడు. అప్పుడా భృగుమహర్షి ఆ సోమకాంతమహారాజుతో యిలా అన్నాడు.

"ఓ రాజా! పురాణశ్రవణం వలన నీకు కలిగే పుణ్యాన్ని అనుస రించి ఈ మాడిమసైన మామిడివృక్షం తిరిగి ఎంతలో చిగురుస్తుందో అలాంటి పుణ్యాన్ని సంపాదించు. ఈ భస్మంలోనే నీ పుణ్యంతో ఈ వృక్షం పెరిగి దినదినాభివృద్ధి చెందుతుంది. తిరిగి ఈ చెట్టు మొలకెత్తగానే నీవు పాపరహితుడవు అవుతావు!' అని ఋషి చెప్పగావిని ఆ రాజిలా ప్రశ్నించాడు!

'ఓ మహాత్మా! భృగుమహర్షీ! ఈ **గణేశపురాణ**మనే గ్రంధాన్ని గురించి ఎన్నడూ కనీవినీ కూడా వుండలేదు! అటువంటి మహా మహిమోపేతమైన

ఈ పురాణం నాకెక్కడ లభిస్తుంది? దాన్ని నాకెవరు వ్యాఖ్యానించి చెబుతారు? దయతో సెలవివ్వండి!' అంటూ శ్రద్ధాళువై ప్రార్థించాడు. అప్పుడు ఆ భృగుమహర్షి యిలా బదులిచ్చాడు!

'ఓరాజా! ఈ పరమ పవిత్రమైన పురాణాన్ని పూర్వం చతురానను డైన బ్రహ్మ వ్యాసమునీంద్రునికి చెప్పాడు! వ్యాసులవారు నాకు చెప్పారు. దాన్ని నీకు నేను చెబుతాను. గనుక నీవీ పుణ్యతీర్థములో స్నానంచేసి ఈరోజునుంచి పరిసమాప్తివరకూ ఆ గణేశపురాణాన్ని శ్రద్ధగా వింటానని సంకల్పంచేసుకో!' అని నియమించాడు.

అప్పుడు తరువాతి కథను సూతులవారిలా చెప్పసాగారు :

'ఓ మహర్షులారా! అలా భృగుమహర్షిచేత ప్రేరేపించబడిన సోమ కాంతమహారాజు పరమ పవిత్రమైన ఆ భృగుతీర్థంలో స్నానంచేసి పరిపూర్ణ శ్రద్ధాభక్తులతో 'గణేశపురాణం శ్రోష్యే' (ఈరోజు మొదలు గణేశపురాణ మును వినగలను) అంటూ సంకల్పమాచరించాడు. అలా సంకల్పం చేసీచేయగానే రాజు రోగరహితుడై తన పూర్వపు దివ్యమైన శరీరకాంతితో ప్రకాశించాడు. అలా భృగుమహర్షియొక్క అనుగ్రహ విశేషంచేత రోగ భూయిష్టమైన తన శరీరంనుండి రక్తస్రావము, క్రిములతో కూడిన గాయాలు, పుండ్లు అన్నీపోయి దివ్యదేహం గలవాడైనాడు. అప్పుడు ఆ మహర్షి సంతోషంతో మందహాసంచేస్తూన్న సోమకాంతుడిని తన చెంతనే ఒక ఆసనంపై కూర్చుండపెట్టుకున్నాడు.

అప్పుడు ఆరాజు స్వస్థచిత్తుడై యిలా అన్నాడు. "ఓ ఋషిసత్తమా! తమయొక్క దివ్యమైన అనుగ్రహప్రభావంచేత నా శరీరంలోని బాధలన్నీ

కూడా "శ్రోష్యే" అని సంకల్పంచేసిన వెంటనే నశించినాయి. కనుక తాము దయతో ఇక ఆ గణేశపురాణమును నాకు వినిపించి ధన్యుణ్ణి చేయండి!"

ఆ మాటలకు భృగుమహర్షి యిలా బదులుచెప్పాడు : "ఓరాజా! అత్యంత పావనమైన, పవిత్రమైన, అట్టి గణేశ పురాణమును నీకు వినిపిస్తాను. శ్రద్ధాళువువై ఏకాగ్రచిత్తంతో విని తరించు! దీనిని వినటం అన్నది అంతతేలికగా సంభవించే విషయంకాదు! అనేక జన్మలలో సముపార్జించుకున్న పుణ్యరాశి వల్లనే జరుగుతుంది! ఈ మహోత్తరమైన పురాణాన్ని వినటంచేత మానవుడికి తాను గత ఏడుజన్మలుగా ఆర్జించు కున్న మహాపాపములన్నీ కూడా ఆ గజాననుని అనుగ్రహవిశేషంచేత సమూలంగా నశిస్తాయి. సూర్యోదయమవగానే రాత్రి తాలూకు చీకటి తెరలు తొలగిపోయినట్లుగా ఆ గజాననుని అనుగ్రహకిరణాలు ప్రసరించ గానే జీవుల పాపాలచీకట్లు ఇట్టే తొలగుతాయి.

ఇక ఈ గజాననుడెట్టివాడంటే — నాశనం లేనటువంటివాడూ, విభజించబడనివాడూ (అపరిచ్ఛిన్నుడు), గుణములకు అతీతుడు, నిరా కారుడూ, వాక్కులచేత మనస్సుచేత అందుకోలేనటువంటివాడూ, ఇటు వంటివాడని నిర్దేశించటానికి శక్యంకానివాడూ, ఆనందమే స్వరూప మైనటువంటివాడూ అయినటువంటి ఈతని స్వరూపాన్ని బ్రహ్మ ఈశ్వ రుడు మొదలైన దేవతలు సైతం తెలుసుకొనలేరు! అంతెందుకు? వేయినాల్కలుగల ఆదిశేషునికే ఈ మహామహిమోపేతుని మహిమలు వర్ణించటం అసాధ్యమంటే ఇక మామూలువారి సంగతి వేరే చెప్పే దేముంది?

అటువంటి ఈ గణేశుని పుణ్యచరిత్రను పూర్వం వ్యాసభగవానుని ముఖకమలంనుంచి మధువుగా నేను గ్రోలాను! తన యజ్ఞం రుద్రుని అనుచరుడైన వీరభద్రునిచేత విధ్వంసమైనప్పుడు వికల మనస్కుడైన దక్షప్రజాపతి ముద్గలమహర్షివద్ద విన్నాడు! అటువంటి మహామహిమాన్విత మైన గణేశపురాణమునంతటినీ నీకు వినిపిస్తాను! అయితే ఇది విన టానికి శ్రోతలకు ఒక అర్హత వుండాలి! అదేమిటంటే సర్వసిద్ధులనూ ప్రసాదించి విఘ్నాంధకారాన్ని పారద్రోలే ఆ గజాననుడియందు దృఢ మైన భక్తిభావం ఉండాలి!

ఈ పురాణాన్ని తన అష్టాదశ ఉపపురాణాలలో ప్రధానమైనదిగా, చెప్పవచ్చు! కలియుగంలోని ఆచారరహితులు, అధ్యయన శూన్యులు అయిన, వర్ణాశ్రమ ధర్మాలను సరిగ్గా అనుష్టించని వారికై — ధర్మ రక్షణకై అష్టాదశ పురాణాలు, 18-ఉపపురాణాలను కృష్ణద్వైపాయను డైన వ్యాసమహర్షి విరచించారు. ఈయొక్క ఉపపురాణము గణేశుని యొక్క స్వరూపాన్నీ, ఆయన అనుగ్రహ విశేషాన్నీ, లీలలనూ తెలిపేది. కనుక నీవు దీన్ని అచంచలమైన మనస్సుతో విని నీ మనోభీష్టాన్నీ, ఆయురారోగ్యాలను ఆ గజాననుని కరుణావిశేషంతో పొందు!" అన్నాడు భృగుమహర్షి!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'రాజోపదేశ కథనం'** అనే 9-వ అధ్యాయం.



10

# వ్యాసప్రశ్న వర్ణనం

(మూలం)

## దశమో అధ్యాయః

**భృగురువాచ :-**

నారాయణాంశ సంభూతః పారాశర్యో మహామునిః ।
అతీతానాగత జ్ఞానే వేదశాస్త్రార్థ తత్వవిత్ ॥ 1

కృత్వా వేదం చతుర్భాగం తదర్థ జ్ఞాన సిద్ధయే ।
స విద్యామదగర్వేణ పురాణం కర్తుమారభత్ ॥ 2

సమాప్తి సాధనంనైవ కృతవాన్ మంగళం పురా ।
గణేశస్య నతింవాపి స్తుతింవా తస్యవా క్వచిత్ ॥ 3

తతో విఘ్నాభిభూతస్సన్నర్థం కంచన నాస్మరత్ ।
భ్రాంతిరేవాభవత్తస్య లౌకికేఽలౌకికే పథి ॥ 4

నిత్యే నైమిత్తికే కామ్యే శ్రౌతే స్మార్తేచ కర్మణి ।
వ్యాఖ్యాతుర్వేద శాస్త్రాణాం సర్వజ్ఞస్య సతోఅపి హి ॥ 5

ఓషధీభిశ్చ మంత్రైశ్చ భగ్నవీర్య ఇవాహిరాట్ ।
తస్తంభేస్వాత్మనిభృశం తత్ హేద్దేతుం నాధ్యగచ్ఛత ॥ 7

తతోఽగచ్ఛత్సత్యలోకం ధాతారం ప్రష్టుమాదరాత్ ।
విస్మయాక్రాంత హృదయో ప్రీణః పారాశరో మునిః ॥ 8

నమస్కృత్వా దేవగణాన్ దెవర్షీన్ కమాలాసనం ।
పూజితో బ్రహ్మణా దత్తే నిషసాఽదాసనే శుభే ॥ 9

పాణినా చాస్పృశత్పాదౌ పారాశర్యో మహామునిః ।
ప్రణయావనతో భూత్వా బ్రహ్మణం ప్రష్టుమారభత్ ॥ 10

**వ్యాస ఉవాచ :-**

బ్రహ్మన్ అద్భుతమేతద్ధి కింమే దైవాదుపస్థితం ।
వేదార్థాని పురాణాని కర్తుం మే బుద్ధిరావృతా ॥ 11

ఆవీక్షతో ఖిలాన్ లోకాన్ జ్ఞానాచార వివర్జితాన్ ।
కలౌ కర్మజడాన్ స్తబ్ధాన్నాస్తికాన్ వెదనిందకాన్ ॥ 12

విధించైవ నిషేధంచ జ్ఞాస్యంతి మమవాక్యతః ।
మమైవతు గతం జ్ఞానం భృతః క్షీణ ఇవాభవత్ ॥ 13

న హేతుం తత్ర పశ్యామి స్ఫూర్తిః కాపి నజాయతే ।
తద్ధేతుం స్ఫూర్తి హేతుంచ ద్రష్టుంత్వామహ మాగతః ॥ 14

అన్యం కం శరణం యామి వినా త్వాం చతురానన ।
సర్వజ్ఞః సర్వకర్తా త్వం మమభ్రాంతిం నివారయ ॥ 15

వద హేతుం మమ భ్రాంతేః నారాయణ స్వరూపిణః ।
నిత్యాచారవతో బ్రహ్మన్సర్వజ్ఞ స్య సతోపిచ ॥ 16

**సూతఉవాచ :-**

ఏవమాకర్ణ్య తద్వాక్యం విచార్య కమలాసనః ।
ప్రణతం మునిమప్యాహ ప్రహసన్ విస్మయన్నివ ॥ 17

**బ్రహ్మోవాచ :-**

హంత తే కథయిష్యామి గతిం సూక్ష్మాం హి కర్మణాం ।
విచార్య సమ్యక్కర్తవ్యం కర్మసాధు ఇతరచ్చయత్ ॥ 18

అన్యథా కుర్వతః పుంసః కృతం భవతి చాన్యథా ।
బుద్ధ్యా యుక్త్యార్జనేనాపి గురూణిచ లఘూనిచ ॥ 19

కార్యాణి సాధయేద్ధీమాన్ న గర్వాన్నచ మత్సరాత్ ।
వాహనత్వం సమాపన్నో గర్వేణతు ఖగేశ్వరః ॥ 20

మత్సరాన్నాశితం సర్వం ఆంబికేయ సుతేన చ
మత్సరాదేవ రామేణ క్షత్రముత్సాదితం పురా ॥ 21

యో అనాదినిధనో దేవో జగత్కర్తా జగన్మయః ।
జగద్ధాతా జగద్ధర్తా సదసద్వ్యక్తమవ్యయం ॥ 22

యోకర్తు మన్యథాకర్తుం శక్తః కర్తుంచ సర్వదా ।
యస్యాజ్ఞవశగా నిత్యం దేవా ఇంద్ర పురోగమాః ॥ 23

అహం విష్ణుశ్చ రుద్రశ్చ సూర్యాగ్ని వరుణాదయః ।
యో విఘ్నహర్తా భక్తానాం విఘ్నకర్తేతరస్య చ ॥ 24





తస్మిం స్త్వర కృతవాన్ గర్వం స్వవిద్యాబల సంశ్రయాత్ ।
సర్వజ్ఞతా భిమానేన నకృతం పూజనం త్వయా ॥ 25

స్మరణం వా గణేశస్య ప్రారంభే అన్యస్యవా తథా ।
నకృతం చ త్వయా వ్యాస తేన భ్రాంతిస్తవానఘ ॥ 26

ఆరంభే సర్వకార్యాణాం ప్రవేశే వాపి నిర్గమే ।
శ్రౌతే స్మార్తే లౌకికే యోఽస్మృతో విఘ్నం కరోతి చ ॥ 27

యమాహుః పరమానందం యమాహుః పరమా గతిం । 28

యమాహుః పరమం బ్రహ్మ వేదశాస్త్రార్థ దర్శినః ।
తం గచ్ఛ శరణం వత్స ద్విరదానన మాదరాత్ ॥ 29

స చేత్ప్రసన్నో భగవాన్ వాంఛితం తే కరిష్యతి ।
నో చే ద్వర్ష సహస్రేణ న స్వవాంఛాం అవాప్స్యసి ॥ 30

**వ్యాస ఉవాచ :-**

కోసౌ గణేశః కిం చాస్య రూపం వేద్యం కథం చ తత్ ।
కస్యవా యం ప్రసన్నో భూత్పూర్వం హి చతురానన ॥ 31

కతివా హ్యవతారాశ్చ కింకిం కార్యంచ వై కృతం ।
పూర్వంచ పూజితః కేన కస్మిన్కాలే స్మృతోఽపిచ ॥ 32

మమ విక్షిప్త చిత్తస్య పృచ్ఛతః ప్రపితామహ ।
ఏతత్సర్వం సువిస్తార్య బ్రూహి మే కరుణానిధే ॥ 33

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే వ్యాసప్రశ్న వర్ణనంనామ దశమో అధ్యాయః**



# వ్యాసప్రశ్న వర్ణనం

## 10-వ అధ్యాయము

భృగుమహర్షి యిలా చెప్పనారంభించాడు : "ఓరాజా! పరాశర మహర్షి తనయుడూ, సాక్షాత్ నారాయణుని అంశతో జన్మించినవాడూ అయిన కృష్ణద్వైపాయనుడని పిలువబడే వ్యాసమహర్షికి ఒకసారి తాను విభాగించిన వేదములయొక్క అర్థం స్ఫురించటం మానేసింది. స్తబ్దత తనను ఆవరించింది. త్రికాలవేదీ, పంచమవేదమైన మహాభారతాన్ని రచించినవాడూ, అష్టాదశ పురాణకర్తా ఐన వ్యాసభగవానుడు ఇందుకు చకితుడైనాడు. తాను రచించిన పురాణాలకు మంగళాచరణం ఎలా చేయాలో భావము ఏమాత్రం స్ఫురించలేదు. నిత్యనైమిత్తిక కర్మాచరణం ఎంత ఆచరించినా, మణిమంత్ర ఔషధాలచేత నిర్వీర్యమైన సర్పంలా అతని ప్రతిభ స్థాణువైంది. ఎంత ప్రయత్నించినా అలా ఎందుకు జరిగిందన్న విషయం ఆయనకేమీ అంతుబట్టలేదు!

ఈ విషయమై వివరం, కారణం తెలుసుకొనగోరి ఆయన సత్య లోకానికి వెళ్ళాడు. అక్కడ దేవగురువైన బృహస్పతికీ, బ్రహ్మర్షులకూ, దేవగణాలకూ నమస్కరించి, బ్రహ్మకుకూడా ప్రణమిల్లాడు. బ్రహ్మ ఆయ నను సాదరంగా తోడ్కొనివెళ్ళి ఉచితాసనంపైన కూర్చుండచేసి, అతని రాకకు కారణం అడిగాడు. ఆ చతురాస్యుని పాదపద్మాలకు భక్తితో నమస్కరించి వినమ్రుడై బ్రహ్మనిలా ప్రశ్నించాడు.

"ఓ కమలాసనా! వేదాలకు అర్థం గ్రహించలేని కలియుగ జీవులు జ్ఞానశూన్యులై, ఆచారవిహీనులైవున్న దుస్థితిచూసి ఎంతో దిగులుచెంది నేను వేదాలకు వ్యాఖ్యానంగా పురాణాలు విరచించి, ప్రతీ ఆశ్రమం లోనూ పాటించవలసిన విధినిషేధాలను సులభ బోధకంగా ఉండేలా చేయాలని పూనుకున్నాను. కాని ఆశ్చర్యకరమైన విషయమేమంటే నాకు భావస్ఫూర్తి, వ్యక్తీకరణల విషయంలో స్థబ్దత ఏర్పడింది! దీనికి కారణ మేమిటో నాకేమాత్రం అంతుపట్టడంలేదు! సర్వజ్ఞుడవైన ఓ పరమేష్టీ! నీవు దయతో నాకు కలిగిన ఈ స్థబ్దతపోయి తిరిగి కార్యసాఫల్యం కలిగే మార్గం ఉపదేశించవలసింది."

అంటూ ప్రార్థించాడు. ఆతరువాత జరిగిన సంభాషణను సూత మహర్షి ఇలా చెప్పసాగాడు! "ఓ ఋషులారా! ఇలా బ్రహ్మను వ్యాస మునీంద్రుడు ప్రార్థించగా ఆ చతుర్ముఖుడు వినమ్రుడైఉన్న వ్యాసునివంక చూస్తూ, చిరునవ్వుతో ఆశీఃపూర్వకంగా యిలా అన్నాడు.

"ఓ కృష్ణద్వైపాయన మహర్షీ! ఏదైనా కర్మని నిర్వహించటానికి పూనుకునే ముందుగానే దానిలోని సాధకబాధకాలనూ, మంచిచెడులనూ

విచారించే మొదలుపెట్టాలి! అలా యోచించక, చేసే పనులు విపరీత ఫలితాన్నిస్తాయి. ఏ కర్మనైనా ఆచరించేటప్పుడు ఋజుబుద్ధితోనూ, యుక్తి తోనూ, కార్యసాధనకు కృషిచేయాలి! నేను చేస్తున్నానన్న గర్వంకాని, యితరులతో పోటీపడాలన్న మత్సరబుద్ధితోకాని చేయడానికే గనుక ప్రయత్నిస్తే అందుకు ప్రతికూల పరిస్థితులు ఏర్పడతాయి! ఇందుకు పక్షీంద్రుడైన గరుత్మంతుడే ఒక ఉదాహరణ! బలగర్వంవల్లనే చెడి, చివరకు భగవానుని దయచేత విష్ణువాహనత్వం పొందాడు.

ఇక పినతండ్రి పిల్లలైన పాండవులపైగల మత్సరంతో దుర్యోధనుడు కురువంశ నాశనానికే కారణమైనాడు! మత్సరమువల్లనే జమదగ్ని సుతుడైన పరశురాముడు రాజులపై దండెత్తి క్షాత్రవ తేజమునంతటినీ నశింపచేశాడు. కనుక ఇప్పుడైనా నీవు గర్వాన్ని, మత్సరాన్నీ, ఈరెంటినీ కార్యవినాశ హేతువులు అని గుర్తించు!

## బ్రహ్మ వ్యాసునికి విఘ్నకారణం చెప్పుట

"ఓ వ్యాసమునీంద్రా! నీవు నీ వేదవిభాగ కార్యారంభంలో, సకలసృష్టికీ ఆద్యుడు, సర్వకార్యములకూ కర్తయైనవాడు, సృష్టిస్థితి లయాలకు భాద్యుడూ, త్రిమూర్తులమైన నాచే, శివునిచే, విష్ణువుచేతనూ ప్రణవస్వరూపంగా ధ్యానించబడేవాడూ, ఇంద్రాది దేవతలచేత అష్టదిక్పాలకులూ ఎవని ఆజ్ఞకు వశులై వర్తిస్తున్నారో, అట్టివానిని, భక్తులకు కార్యసాఫల్యతను ఒనగూర్చేవాడూ, అభక్తులకు విఘ్నాలనే చీకట్లతో కన్నుకనబడనీయని విఘ్నకరుడూ ఐన ఆ గజాననుని నీవు స్వవిద్యామద గర్వంచేత పూజించుట, స్మరించుట చేయలేదు. అందువల్లనే నీకీ పరిస్థితి సంభవించింది.

ఓ మునీంద్రా! పరమాత్మ స్వరూపుడైన ఆ విఘ్నపతిని సర్వకార్యారంభములయందూ, శ్రౌత, స్మార్తాదికర్మలయందూ, లౌకిక వైదికకర్మలయందూ స్మరించుటచేతా, భక్తితో పూజించుటచేతనూ సకల విఘ్నములూ దూరమౌతాయి. ఈ విఘ్నపతినే వేదశాస్త్రార్థతత్వజ్ఞులు పరమాత్ముడైన ఆనందస్వరూపునిగా, పరబ్రహ్మ స్వరూపునిగానూ పేర్కొంటున్నారు! కనుక అట్టి దేవదేవుడైన గజాననుని శరణుపొందు! ఆ మహానుభావుడు గనుక ప్రసన్నుడైతే నీ వాంఛాపరిపూర్తి జేస్తాడు. అలా కానిదే నూరు జన్మలెత్తినా కార్యసాఫల్యత అన్నది సిద్ధించదు!" అంటూ ఉపదేశించాడు.

అప్పుడు వ్యాసమునీంద్రుడు బ్రహ్మతో "ఓ చతురాననా! విఘ్నపతి, విఘ్నహరుడు అని పిలువబడే ఆతడెవరు? ఆయన ఎలావుంటాడు? ఆయనను తెలుసుకోవడం ఎలాగ? ఇంతకుపూర్వమెవరెవరిని అనుగ్రహించాడు? ఈయన ఏయే అవతారాలెత్తాడు? అప్పుడు ఆయనచేసిన మహత్తర కర్మలెలాంటివి? పూర్వం అతడెవరెవరిచేత పూజించబడ్డాడు? ఏకార్యములలో స్మరించబడ్డాడు? ఈ వృత్తాంతాన్నంతటినీ అశాంతితో వ్యాకుల చిత్తుడనైన నాకు దయతో విస్తరించి చెప్పుము" అంటూ ప్రార్థించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'వ్యాసప్రశ్న వర్ణనం' అనే 10వ అధ్యాయం.



11

# మంత్రకథనం

(మూలం)

## ఏకాదశో అధ్యాయః

బ్రహ్మ వ్యాసమహర్షికి గణేశమంత్రమునుపదేశించుట :

**భృగురువాచ :-**

జగాద భూయశ్చతురానన స్తమేవం కృతప్రశ్న ।
వివక్షయాథ క్రమేణ సర్వం కథయామి తే హం ॥ 1

గణేశ మంత్రాన్ బహుధా విచార్య । 2

అనంతాహి మునే మంత్రా గణేశస్య మహాత్మనః ।
ఉపాసనం వదిష్యామి శీఘ్రం సిద్ధికరస్య తే ॥ 3

సప్తకోటి మహామంత్రాః గణేశస్యాగమే స్థితాః ।
తద్రహస్యం శివోవేద కించి త్కించిదహం మునే ॥ 4

షడక్షర ఏకాక్షరయోః శ్రేష్ఠత్వం తేషు విద్యతే ।
తయోః స్మరణమాత్రేణ సర్వసిద్ధిః కరే భవేత్ ॥ 5

జీవన్ముక్తా భవంత్యేవ యదుపాసనయా మునే ।
తఏవ ధన్యాస్తే పూజ్యాస్తే నమస్యాః సురైరపి ॥ 6

యదుపాసనయా దాస్యం యేషాం కుర్వంతి సిద్ధయః ।
ఇచ్ఛా విహారా సర్వజ్ఞాః నానారూపా భవంతి తే॥ 7

యే కుర్వంతి గణేశస్య భక్తిం భావసమన్వితాః ।
న యేషాం భక్తితేలేశోపి తేషాం జన్మ నిరర్థకం ॥ 8

నాలోకయేన్ముఖం తేషాం విముఖా యే గజాననే।
తేషాం దర్శనమాత్రేణ విఘ్నానిస్యుః పదే పదే ॥ 9

విఘ్నాన్యుపశమం యాంతి తదుపాసక దర్శనాత్ ।
సమస్యంతి చ భూతాని స్థావరాణి చరాణిచ ॥ 10

అతస్తేహం ప్రవక్ష్యామి మంత్ర మేకాక్షరం శుభం ।
తదనుష్ఠాన మాత్రేణ వాంఛితం సమవాప్స్యసి ॥ 11

అనుష్ఠానం ప్రవక్ష్యామి యథోక్తం శంభునా మమ ।
స్నానం కృత్వా ధౌతవస్త్రే పరిధాయ శుచిర్నరః ॥ 12

చేలాజినం కుశైః కృత్వా స్వాసనం సాధక స్సుధీః ।
తస్మిన్ స్థిత్వా భూతశుద్ధిం ప్రాణానాం స్థాపనం తథా ॥ 13

అంతర్బహి ర్మాతృకాణాం న్యాసం కృత్వాత అంద్రితః ।
ప్రాణాయామం తతః కృత్వా మూలమంత్రం జపన్ హృది ॥ 14

మంత్ర సంధ్యాముపాసీత ఆగమోక్తాం యథావిధి ।
ఆపాదమస్తకం దేవం ధ్యాత్వా నిశ్చల తేజసా ॥ 15

మానసై రుపచారైః తం పూజయేత్ సుసమాహితః ।
తతో జపేద్యథాశక్తి పురశ్చరణ మార్గతః ॥ 16

అనుకూలో భవేద్యావ ద్వరం దాతుం గజాననః ।
స్వం రూపం దర్శయే ద్యావత్ తావజ్జపపరో భవేత్ ॥ 17

**భృగురువాచ :-**

ఏవముక్త్వా మునిం బ్రహ్మా విలోక్య శుభవాసరం ।
ఏకాక్షరం మంత్రరాజ మేకార్ణం గణపస్యచ ॥ 18

అశిక్షయత్ తదా సర్వం సంభ్రాంతం మునిసత్తమం ॥ 19

**బ్రహ్మోవాచ :-**

సూర్యకోటి ప్రతీకాంశం వరం దాతుం సమాగతం ॥ 20

యదా ద్రక్ష్యసి తం దేవం తదాచిత్తం స్థిరీకురు ।
మమైవ హృదయే నిత్యం స్థిరోభవ గజానన ॥ 21

వృణీష్వేతి వరం తస్మాత్ స తే దాస్యతి అసంశయం ।
హృదిస్థితే తత్ర దేవే దివ్యంజ్ఞాన మవాప్స్యసి ॥ 22

భూతం భావి భవచ్చైవ జ్ఞాస్యసి త్వం అశేషతః ।
హిత్వా భ్రాంతిం దృఢాం వత్స నానాగ్రంధాన్ కరిష్యసి ॥ 23

వ్యాస ఉవాచ :-

గతా భ్రాంతిర్మమ పితరుపదేశే కృతే త్వయా ।
అనుష్ఠానం కరిష్యామి పితామహ తవాజ్ఞయా ॥ 24

బ్రహ్మోవాచ :-

ఏకాంతే నిర్జనే దేశే వ్యగ్రతా హేతువర్జితే ।
అనుష్ఠానం కురు విభోః గజాననం అనుస్మరన్ ॥ 25

నాస్తికే నిందకే క్రూరే నాచారే చ ఖలే శఠే ।
న వక్తవ్యే మంత్రరాజ సాదృశే శరణాగతే ॥ 26

దృఢ భక్తౌ శ్రద్ధధానే వినీత వేదవాదిని ।
సాకాంక్షే నిరనుక్రోశే శాస్త్రజ్ఞేచ ప్రకాశయ ॥ 27

ప్రాపయత్యేవ నరకాన్ దశపూర్వాన్ దశాపరాన్ ।
మంత్రరాజస్తు వక్తారం అమప్రకాశ్యేప్రకాశితః ॥ 28

యో జపేద్భక్తిపూర్వంతు సలభేత్ ఈప్సితం ఫలం ।
పుత్రపౌత్ర సమాయుక్తో ధనధాన్య సమన్వితః ॥ 29

ఏకదంత ప్రభావేన లబ్ధ్వా జ్ఞానం సునిర్మలం ।
ఇహ భుక్త్వాఽఖిలాన్భోగాన్ అంతే మోక్షమవాప్నుయాత్ ॥ 30

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే మంత్రకథనం నామ ఏకాదశో అధ్యాయః**



# మంత్రకథనం

## 11-వ అధ్యాయము

### బ్రహ్మ వ్యాసునకు గణేశమంత్రమును చెప్పుట

అనంతరం భృగుమహర్షి సోమకాంతుడికి యిలా చెప్పసాగాడు.

"ఓరాజా! ఇట్లా వ్యాసమహర్షి ప్రశ్నించగా బ్రహ్మ సమాధానం చెప్పటం ప్రారంభించాడు. 'ఓ వ్యాసమునీంద్రా! గణేశమంత్రములే గణేశునియొక్క శబ్దస్వరూపం! ఆగమాలలో ఏడుకోట్ల గణేశమంత్రాలు చెప్పబడివున్నాయి! వాటి రహస్యం పూర్తిగా తెలిసింది శివునికి మాత్రమే! నాకు కొద్దిగా మాత్రమే తెలుసును! ఇక గణేశమంత్రాలన్నింటిలోనూ 'షడక్షర గణపతి మంత్రమూ', 'ఏకాక్షర గణపతి మంత్రములు' శ్రేష్ఠ మైనవి! ఆ మంత్రాలను కేవలం స్మరించినంత మాత్రానే సకల కార్య ములూ సిద్ధిస్తాయి! లోకములో గజాననమంత్ర ఉపాసకులు పూజ

నీయులు! వారు సర్వదా నమస్కరించతగినవారు. వారు జీవన్ముక్తులు అవుతున్నారు. ఆ గజాననుని భక్తితో ఉపాసించటంవల్ల సకలసిద్ధులూ దాస్యం చేస్తాయి. ఈ గణేశమంత్రోపాసన చేసేవారు ఇచ్ఛావిహారులు! వారికి సర్వజ్ఞత్వమూ, కోరిన రూపం ధరించగల కామరూపసిద్ధీ కలుగుతాయి! సకలాభీష్టములను ప్రసాదించే ఆ వరగణేశుని భక్తిగా కొలిచే వారు ధన్యులు. ఆ గజాననునియందు భక్తిలేనివారి జన్మ నిరర్థకము! అట్టివారి ముఖం చూడటంవల్ల అన్ని పనులూ చెడతాయి! పైగా అట్టివారికి పదేపదే సకల కార్యవిఘ్నములూ కలుగుతుంటాయి.

అలాగే గణేశుని భక్తుల ముఖ సందర్శనమాత్రం చేతనే సకల విఘ్నములూ ఉపశమిస్తాయి! అట్టి గణేశ ఉపాసకులకు సకల చరాచర భూతములన్నీ స్వాధీనమై నమస్కరిస్తాయి! అందుకని ఓ వ్యాస మునీంద్రా! అటువంటి సకల కార్యసిద్ధిప్రదమూ మహామహిమోపేతమూ, సర్వమంగళకరమూ, పరమ శుభకరమూ అయిన ఏకాక్షర గణపతి మంత్రాన్ని నీకు ఉపదేశిస్తాను!" అంటూ బ్రహ్మదేవుడు శుచియై, ఆచమించి, వ్యాసునకు ఉపదేశించాడు!

## మంత్రానుష్ఠాన క్రమము చెప్పుట :

ఓ వ్యాసమునీంద్రా! ఇక నీకు ఉపదేశించిన గణేశ మంత్రాన్ని ఎలా అనుష్ఠించాలోకూడా చెబుతానువిను!

ఈ అనుష్ఠానక్రమాన్ని పూర్వం శివుడు నాకుపదేశించాడు. దాన్ని నీకు సంగ్రహంగా వివరిస్తాను! ప్రాతఃకాలాన్నే స్నానంచేసి తెల్లటి పట్టు వస్త్రాన్ని ధరించి శుచిర్భూతుడై దర్భాసనాన్ని ఆపైన లేడిచర్మాన్ని, దాని

పైన తెల్లటి వస్త్రాన్ని వైచి, మృదువైన ఆసనం తయారుచేసుకోవాలి! దానిమీద కూర్చుండి భూతశుద్ధిని, ప్రాణస్థాపన, అంతర్మాతృక, బహి ర్మాతృకా వ్యాసములుచేసి, మూలమంత్రంతో ప్రాణాయామం చేయాలి! ఆ తరువాత గాయత్రీఉపాసన చేయాలి! తదనంతరం నిశ్చల మనస్సుతో గజాననుణ్ణి ఆపాదమస్తకమూ ధ్యానించాలి! ఏకాగ్రచిత్తంతో మానసిక ఉపచారములతో యధావిధిగా గణపతిని పూజించి యధాశక్తి గణపతి మంత్రమును పురశ్చరణగా గణేశుడు ప్రత్యక్షమై వరాలను ప్రసాదించే దాకా జపపరాయణుడై ఉండాలి!

ఓ సోమకాంతమహారాజా! ఈవిధంగా బ్రహ్మ భ్రాంతచిత్తుడైన వ్యాసమునీంద్రునికి గణేశుని ఉపాసనా నియమాలను, శుభముహూర్తం లో ఏకాక్షర గణపతీమంత్రాన్నీ ఉపదేశించాడు! అంతేకాదు "ఆ గజా ననుని 'ఓ గజాననా! నా హృదంబుజమున నిత్యమూ స్థిరంగా వుండ మని ఆ వాహనచేసుకుని ప్రార్థించి, అతడు ప్రత్యక్షమైనాక వరాన్ని కోరుకో! అలాంటి సమయంలో నీ హృదయంలోనే ఉన్న ఆ గజా ననుడు తప్పక నీకుగల సకల కామ్యములనూ ప్రసాదించగలడు! అట్టి గణేశానుగ్రహం పొందినవెంటనే ఎటువంటి భ్రాంతీ లేనటువంటి దివ్యజ్ఞానమూ, త్రికాలజ్ఞానమునూ, నానా గ్రంధ రచనాశక్తీ నీకు కలుగు తాయి!" అంటూ వ్యాసమహర్షిని ఆశీర్వదించాడు వాణీపతియైన ఆ చతురాననుడు.

అప్పుడు వ్యాసమునికి యింకా ఆ మంత్రవిశేషాన్ని గురించి విరించి యిలా వివరించాడు : "ఓ వ్యాసమునీంద్రా! నీ మనస్సుకు ఏకాగ్రత కలిగేందుకు అనుకూలమైన నిర్జన ప్రదేశంలో ఏకాంతంగా

కూర్చుని ఆ భక్తవరదుడైన గజాననుణ్ణి నీ హృదయంలో నిరంతరం స్మరిస్తూ, ఈ మంత్రాన్ని అనుష్ఠించు! పరమపవిత్రమూ, అనంతమహిమో పేతమూ అయిన ఈ మంత్రాన్నిమాత్రం నాస్తికులకు, వేదనిందచేసే వారికీ, అకృత్యాలుచేసే క్రూరులకూ, శఠులకూ, దురాచారపరులకూ ఎన్నడూ చెప్పరాదు.

'దైవం'యందు ధృఢమైన భక్తివిశ్వాసములు కలవానికీ విన యమూ, శ్రద్ధా ఉన్నవానికి మాత్రమే ఈ మంత్రాన్ని ఉపదేశించాలి! అలాకాక నాస్తికులకు ఉపదేశిస్తే వారి ముందూ, వెనుకా పదితరాల వారిని మహానరకాలను పొందించినవాడవౌతావు!

ఎవరైనా భక్తిశ్రద్ధలతో ఈ గణేశోపాసననుచేస్తే అట్టివారి సకల మనోభీష్టములూ తప్పక నెరవేరతాయి! ఆ ఏకదంతుడైన గణపతి యొక్క దివ్యానుగ్రహంచేత పుత్రపౌత్రాభివృద్ధినీ కలిగి, పాడిపంటలతో, సమస్త సంపదలనూ అనుభవించి అంత్యములో నిర్మలమైన దివ్య జ్ఞానాన్ని పొంది ఇలలో సకల భోగాలనూ అనుభవించటమేకాక, చివరకు దివ్యమైన మోక్షాన్ని కూడా నిస్సందేహంగా పొందుతాడు!" అంటూ బ్రహ్మ తన ఉపదేశాన్ని ముగించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'మంత్ర కథనం' అనే 11-వ అధ్యాయం.



# 12

# గజానన దర్శనం

## (మూలం)

## ద్వాదశో అధ్యాయః

**సూత ఉవాచ :-**

ఇతి శ్రుత్వా తు వచనం నిర్గతం బ్రహ్మణో ముఖాత్ ।
హర్షేణ మహతాయుక్తో మునిః పప్రచ్ఛ తం పునః ॥ 1

**వ్యాస ఉవాచ :-**

అవధానం మయా ప్రాప్తం పీత్వా వాగమృతం తవ ।
ఇదానీం శ్రోతుమిచ్ఛామి మంత్రరాజ మిమం పితః ॥ 2

కో జజాప కథం సిద్ధిం అవాపచ గజాననాత్ ।
ఏన్మేమే సంశయం ఛింది త్వత్తోన్యో నాస్తి మే గురుః ॥ 3

**భృగురువాచ :-**

ఇత్యేవం మునినా పృష్టో జగాద వదతాం వరః ।
కృపయా అవనతం బ్రహ్మ తం వ్యాసం రాజసత్తమ ॥ 4

బ్రహ్మోవాచ :-

సాధు సాధు త్వయా పృష్టం పుణ్యావానసి సాంప్రతం ।
నహ్యాపుణ్యవతాం బ్రహ్మాన్ కథాయాః శ్రవణే రతిః ॥ 5

ఉపాసనామార్గం ఇమం సమ్యక్ త్వాలబోధయామ్యహం ।
స్నిగ్ధే ప్రజ్ఞాధికే శిష్యే యతో గోప్యం న కించన ॥ 6

ఓంకార రూపీ భగవాన్గ్లాంబీజంచ గణనాయకస్య ।
యథా సర్వేషు కార్యేషు పూజ్యతే అసౌ వినాయకః ॥ 7

నిర్విఘ్న కామనావద్భి ర్నోచేద్విఘ్నం కరోతి నః ।
తథోంకార బీజ యుక్తా ఓంకార పల్లవా న్వితాః ॥ 8

మంత్రాః సర్వాగమే ప్రోక్తా అన్యే యే నిష్ఫలాశ్చ తే ।
సదస ద్వ్యక్త మవ్యక్తం సర్వం హి గణనాయకః ॥ 9

ఏవం సర్వే దేవసిద్ధ ముని రాక్షస కిన్నరాః గంధర్వా ।
శ్చారణా నాగా యక్ష గుహ్యక మానవాః ॥ 10

ఉపాసకాః గణేశస్య సర్వే లోకాశ్చరాచరాః ।
అతఏవ గణేశాద్ధి పరం కించిన్నవిద్యతే ॥ 11

ఇదానీం కథయిష్యామి కథామేకాం పురాతనీం ।
మంత్రరాజ జపేనాయం యథా తుష్టో గజాననః ॥ 12

కదాచిత్ దైవ యోగేన ప్రళయే సముపస్థితే ।
వాయుభిః పర్వతా భిన్నాః పతితాః సరితో దిశం ॥ 13

తపంతి ద్వాదశాదిత్యాః శోషయిత్వా జలం మహత్ ॥ 14

జ్వాలామాలీ మహావహ్ని రఖిలం జ్వలయత్యపి ॥ 15

సంవర్తకా మహామేఘాః వర్షంతి సరితో జలం ॥ 16

హస్తి హస్తోపమాభిస్తు ధారాభి ర్ద్విజసత్తమ ।
ఉల్లంఘయంతి మర్యాదాం సాగరాః సరితోఽపిచ ॥ 17

ఏవం సర్వే వినశ్యంతి ఆబ్రహ్మ స్థావరాదయః ।
ఏవం మాయామయే నష్టే అవికారో అసౌ గజాననః ॥ 18

అణుభ్యో ణుతరం రూపం కృత్వా క్వాపి వ్యవస్థితః ।
తతఃకాలే, బహుతరే గతే అంధ తమసావృతే ॥ 19

ఏకాక్షరం పునర్బ్రహ్మ, నాదయుక్తం అజాయత ।
వైకారికం వినారూపం యదా నందమయం స్థితం ॥ 20

మాయావికార మాసాద్య తదే వాభూద్గజాననః ।
అత ఏవచ సంభూతాః గుణాః సత్వం రజస్తమాః ॥ 21

తతస్త్రయ స్సముత్పన్నా విష్ణుర్బ్రహ్మా హరోపి చ ।
మాయయా రచితం సర్వం త్రైలోక్యం సచరాచరం ॥ 22

తతస్తన్మాయయా భ్రాంతాః బభ్రముస్తే సురాస్త్రయః ।
తమేక జనకం స్వస్య ద్రష్టుం ప్రష్టుం సముత్సుకాః ॥ 23

కి మస్మాభిః కర్మ కార్యమితి జిజ్ఞాసయా మునే ।
ఏకవింశతి స్వర్గాణి పూర్వమూర్ధ్వం విలోక్యతే ॥ 24

అంతరిక్షం తథా తిర్య క్పశ్చాత్ పాతాలమాయయుః ।
అదృష్ట్వా పరమాత్మానం తపశ్చేరు స్తతోఽభ్రుశం ॥ 25

నిరాహారా జపపరా దివ్యవర్ష సహస్రకం శ్రాంతాః ।
ఖేద మనుప్రాప్తాః తతస్తే పృథివీం పునః ॥ 26

విచిన్వంతో యయు ర్ద్రష్టుం వనాని ఉపవనానిచ ।
సరితః సాగరాన్ శైలాన్ శిఖరాణి గుహాఽపిచ ॥ 27

తతో జలాశయం తే తు మహాంతం దదృశుః పురః ।
నానా జలచరైః వృక్షైః పక్షిభిర్వివిధైర్యుతం ॥ 28

బలాకాభి శ్చక్రవాకై ర్హంసైః కారండకైరపి ।
నాదితం నళినీజాలం బిసఖండాశనే రతైః ॥ 29

స్నాత్వా విశ్రమ్య తత్తీరే సముత్తీర్య పురో యయుః ।
నానా వీచి సమాయుక్తం మహాంతం తం జలాశయం ॥ 30

సుదుస్తర తరం పుంసాం జష నక్ర సమాకులం ।
ఈక్షాంచక్రుః సుదుర్దర్శం ప్రళయానల సన్నిభం ॥ 31

కోటిసూర్య ప్రతీకాశం తేజోరాశిం పురోమునే ।
చింతామాపుః పరాం తేతు తేజసా హృతదృష్టయః ॥ 32

తతో గగన మార్గేణ తేజోమధ్యా ద్వినిర్గతాః ।
క్షుధా తృషా పరిశ్రాంతాః నిశ్వసంతో ముహుర్ముహుః ॥ 33

నిందంతశ్చ శపంతశ్చ, స్వాత్మానం జాత సాధ్వసాః ।
తతోఽతి కరుణావిష్టే లోకాధ్యక్ష్యో అఖిలార్థవిత్ ॥ 34

దర్శయామాస తాన్ రూపం మనో నయన నందనం ।
పాదాంగుళీ నఖశ్రీభిర్జిత రక్తాబ్జ కేసరం ॥ 35

రక్తాంబర ప్రభావాత్తు జితః సంధ్యార్కమండలం ।
కటిసూత్ర ప్రభాజాతైః జిత హేమాద్రి శేఖరం ॥ 36

ఖడ్గ ఖేట ధను శ్శక్తిశోభి చారు చతుర్భుజం ।
సునాసం పూర్ణిమా చంద్రజితకాంతి ముఖాంబుజం ॥ 37

అహర్నిశం ప్రభాయుక్తం పద్మచారు సులోచనం ।
అనేక సూర్య శోభాజిన్ముకుట భ్రాజిమస్తకం ॥ 38

నానా తారాంకిత వ్యోమ కాంతిజిదుత్తరీయకం ।
వరాహ దంష్ట్రా శోభాజి దేవదంత విరాజితం ॥ 39

ఐరావతాది దిక్పాల భయకారి సుపుష్కరం ।
దృష్ట్వైవ సహసా దేవం ప్రణేముః తే ముదా మునేః ॥ 40

పాదాంబుజ ముపస్పృశ్య తతస్తోతుం ప్రచక్రముః ॥ 41

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే గజాననదర్శన నామ ద్వాదశో అధ్యాయః**



# గజానన దర్శనం

## 12-వ అధ్యాయము

సూతమహర్షి ఋషులతో ఇలాఅన్నాడు : ఓ ఋషీశ్వరులారా! బ్రహ్మ చెప్పిన పై వాక్యాలను విన్న వ్యాసమునీంద్రుడు తన అంతరంగం ప్రశాంతమవగా ప్రసన్నచిత్తంతో చతుర్ముఖుడిని తిరిగి యిలా ప్రశ్నించాడు.

"ఓ చతురాననా! నీ అర్థవంతమైన ప్రశాంతమైన వాక్యాలను విని నా మనస్సుకు ఎంతో స్వాంతన కలిగింది! ఈ గజానన మంత్రాన్ని గతంలో ఎవరు అనుష్టించారు? వారు గజాననుడినుండి ఎట్టి అనుగ్రహాన్ని పొందారు? నీ అమృతవచనాలను వింటున్నకొద్దీ గజాననుడి లీలలయందు రుచి పెరుగుతున్నదేకాని తరగటంలేదు! ఈ గణేశుని గురించిన ఉపాసనాది విశేషాలను దయతో వినిపించి నన్ను కృతార్థుణ్ణి

చెయ్యి! ఈ విషయంలో నీకన్నా సమర్థుడైన గురువు దొరకటం దుర్లభం!"

అప్పుడు భృగువిలా అన్నాడు: "ఓ సోమకాంతమహారాజా! వినమ్రుడై వ్యాసమునీంద్రుడు అడిగిన ప్రశ్నకు బ్రహ్మ యిలా బదులిచ్చాడు.

"ఓ వ్యాసమునీంద్రా! నీయొక్క శ్రద్ధాసక్తులకు నాకెంతో సంతోషమైంది. అనంతమైన పుణ్యవిశేషంవల్లనే నీకీ ఆసక్తి కలిగింది! నీయొక్క వినయమూ, సౌశీల్యతా నన్నెంతగానో అలరించాయి! యోగ్యుడూ, వినయగుణ సంపన్నుడూ అయిన శిష్యుడు కోరితే గురువైనవాడు తీర్చని సందేహమే ఉండదు!

నాయనా! ఈ గజాననుడు సకల కార్యారంభములయందూ అవశ్యం పూజించతగినవాడు. అతని దయచేతనే సకల విఘ్నాలూ తొలగి, దుష్కరమైన కార్యాలు కూడా అలవోకగా సిద్ధిస్తాయి. అలా గజాననుని అనుగ్రహం పొందనివారికి అడుగడుగునా కార్యసిద్ధికి ఆటంకాలు సంభవిస్తాయి!

ఎందుకంటే సమస్త వేదమంత్రాలకూ ప్రణవమే ఆది! ప్రణవ రహితమైన మంత్రం నిరర్థకం. ఇక విఘ్నహరుడైన గణపతి సాక్షాత్తూ ప్రణవ స్వరూపుడే! పరతత్త్వ స్వరూపుడూ, పరబ్రహ్మరూపీ అయిన గజాననుడే సకల సృష్టీ అయివున్నాడు. వ్యక్త, అవ్యక్త రూపాలలోఉన్న జగత్తంతా ఆయన రూపమే! సమస్త దేవతలూ, సిద్ధ, సాధ్య, గంధర్వ, రాక్షస, యక్ష, కిన్నర, కింపురుష గణాలు, మానవులూ వీరందరూకూడా

గణేశుని స్వరూపమే అయివున్నారు.

ఇక గణేశ ఉపాసననూ, దాని విశిష్టతను తెలియచేసే పురాతన గాథనొకదానిని చెబుతాను విను!

పూర్వం ఒకానొకప్పుడు ప్రళయం సంభవించింది. భీకరంగా వీస్తున్న ఆ ప్రళయకాల ఝంఝూమారుతాలకు పర్వతాలు సైతం ఎగురకొట్టబడి ముక్కలు ముక్కలైపోయాయి! అప్పుడు ఉదయించిన ద్వాదశాదిత్యుల వలన ఆ జలం యావత్తూ ఎండిపోయింది. అప్పుడు ఆ ప్రళయాగ్ని చేత సర్వమూ భస్మీపటలమైంది. ఆ సమయంలో 'సంవర్తకము' మొదలైన మేఘాలు ఏనుగులు తొండములతో వర్షించినట్లు కుండపోతగా వర్షం కురిపించాయి. దీనివల్ల సృష్టియావత్తూ జలమయమైంది.

అప్పుడు సకలజగత్తూ నశించిపోయింది. అతిసూక్ష్మరూపం ధరించిన గజాననుడు మాత్రం అణువుకన్న అతిసూక్ష్ముడై అజ్ఞాతంగా ఉన్నాడు. చిరకాలం లోకాలన్నీ అంధకార బంధురంలో మునిగిపోయాయి! ఇలా చాలాకాలం గడిచాక ప్రణవనాదమూ, దానినుంచి పరబ్రహ్మ శబ్దబ్రహ్మగా ఉద్భవమైనారు! ఆ నాదమే క్రమముగా మాయావికారం పొంది, గజాననుడి రూపుసంతరించుకుంది! ఆ మాయావికారం పొందిన గజాననుని నుండి సత్వ, రజ, స్తమోగుణాలూ వాటినుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ త్రిమూర్తులుగా ఉద్భవించారు. ఆ తరువాత త్రైలోక్య సహితమైన చరాచర జగత్తు యావత్తూ పుట్టింది!

అప్పుడు త్రిమూర్తులు మాయయొక్క ప్రభావంవల్ల చిత్తభ్రాంతి కలవారై — 'తామెందుకు పుట్టిందీ, తమ కర్తవ్యం ఏమిటీ?' అన్న

విషయాలు తెలుసుకోవాలనీ, తమ పుట్టుకకు కారణుడైన ఆ గజాననుణ్ణి దర్శించాలనీ ఉత్సుకులైనారు.

అప్పుడు సృజింపబడ్డ 21 స్వర్గాలనూ, అంతరిక్ష పాతాళ లోకాలనూ చూసి ఎక్కడా నిర్గుణస్వరూపుడైన ఆ పరమాత్ముని జాడ కనుగొనలేక త్రిమూర్తులు తపస్సుచేయటం మొదలుపెట్టారు. ఆహారం వర్జించి, అలా వేయి దివ్య వత్సరాల సుదీర్ఘకాలం తపస్సును ఆచరించారు. అయినా పరమాత్మయొక్క సాక్షాత్కారం అవకపోవటంవల్ల, అలసి విరక్తితో విచారగ్రస్తులై భూలోకానికివచ్చి అరణ్యాలు, నదులూ, పర్వతాలూ, గుహలలో వెతుకుతూ చివరికి ఒక సరోవర తీరాన్ని చేరుకున్నారు.

నానావిధ జలచరాలతోనూ, పద్మములతోనూ జలపక్షులతోనూ నిండివున్నదా దివ్యసరస్సు. త్రిమూర్తులు ముగ్గురూ ఆ సరస్సులో స్నానం చేసి కొంతతడవు విశ్రాంతి తీసుకొని తిరిగి బైలుదేరారు! ఇలా ఆ సరస్సునూ, అందులోని అలలనూ చూస్తూ ఆ ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులై వెడుతున్న వారికి కళ్ళు మిరుమిట్లుగొలిపే దివ్యకాంతి కనిపించింది. కోటిసూర్యుల కాంతితో సమానమై ప్రకాశమానమై ప్రళయాగ్నిలా వెలుగుతూవున్న ఆ తేజస్సును కన్నులతో చూడలేక భ్రాంతి చెందిన మనస్సుతో 'ఇది ఏమి విపరీతమో?' అని వ్యాకుల పడుతూండగా కరుణామయుడై, సకల లోకాలకూ వంద్యుడైన గజాననుడు ఆ తేజోమధ్యంలో వారికి సాక్షాత్కరించాడు.

అప్పుడు వారి హృదయాలు అమితమైన సంతోషంతో ఉప్పొంగినాయి. ఆ దివ్యమంగళ రూపం ఎలావున్నదంటే — ఆ రూపం పాదాం

గుష్ఠంయొక్క నఖం (గోరు) నుంచి వెదజల్లబడుతూన్న కాంతితో, ఎఱ్ఱని రోమాలూ, ఎఱ్ఱటి వస్త్రమూ ధరించినందువల్ల, సంధ్యాకాలంలో ఎఱ్ఱనై ప్రకాశించే సూర్యమండలాన్ని తలదన్నేలాఉంది. తన నాల్గు దివ్యబాహు వులలోనూ ఒక్కోదాన్లో ఖడ్గమూ, ఖేటమూ, ధనుస్సూ, శక్తీ, వీటిని ధరించిఉన్నాడు. చక్కటి నాసికతో పున్నమచంద్రుని వెక్కిరిస్తున్నట్లున్న దివ్యమైన ముఖకాంతి కలిగి, పద్మములవంటి నేత్రాలతో, ధగధగా కోటిసూర్యుల ప్రకాశంతో వెలిగిపోయే కిరీటందాల్చి, నక్షత్రాలతో నిండిన ఆకాశంలాంటి దివ్యసుందర ఉత్తరీయాన్ని ధరించి ఏకదంతముతో ఐరావతం మొదలైన ఏనుగులకే భీతి కలిగేలాంటి పెద్దతుండంతో, దివ్యకాంతితో ప్రకాశిస్తూన్న ఆ గజాననుని దివ్యమంగళ విగ్రహాన్ని చూసిన త్రిమూర్తులాయన పాదాలనంటి నమస్కరించి స్తోత్రం చేయ సాగారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'గజానన దర్శనం' అనే పన్నెండవ అధ్యాయము సమాప్తం!





శ్రీమహా గణపతి

13

# బ్రహ్మాస్తుతి వర్ణనం

(మూలం)

## త్రయోదశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

పంచాస్యశ్చతురాస్యశ్చ సహస్రమస్తకోఽపిచ ।
గజాస్యం వరదం దేవం కథమేతే ప్రతుష్టవుః ॥ 1

**బ్రహ్మోవాచ :-**

ప్రసాదోన్ముఖ విఘ్నేశ కృపాపాంగ నిరీక్షణాత్ ।
ప్రాప్త బుద్ధి ప్రసాదాస్తే కే శాస్త్రం నునుపుస్తదా ॥ 2

**బ్రహ్మ విష్ణు మహేశా ఊచుః**

అజం, నిర్వికల్పం నిరాకారమేకం నిరానందమద్వైత మానంద పూర్ణం।
పరం నిర్గుణం నిర్విశేషం నిరీహం
పరబ్రహ్మ రూపం గణేశం భజేమ ॥ 3

గుణాతీత మాద్యం చిదానంద రూపం ।
చిదాభాసకం సర్వగం జ్ఞానగమ్యం ॥ 4

మునిధ్యేయ మాకాశ రూపం పరేశం ।
పరబ్రహ్మ రూపం గణేశం భజేమ ॥ 5

జగత్కారణం కారణ జ్ఞానరూపం ।
సురాదిం సుఖాదిం యుగాదిం గణేశం ॥ 6

జగద్వ్యాపినం విశ్వవంద్యం సురేశం ।
పరబ్రహ్మరూపం గణేశం భజేమ ॥ 7

రజో యోగతో బ్రహ్మరూపం శ్రుతిజ్ఞం సదా కార్యసక్తం । 8

హృదాఽచింత్యరూపం జగత్కారణం సర్వ విద్యానిధానం ।
పరబ్రహ్మరూపం గణేశం నతాస్మః ॥ 9

సదా సత్వయోగం ముదా క్రీడమానం సురారీన్ హరంతం । 10

జగత్పాలయంతం అనేకావతారం నిజాజ్ఞాన హారం ।
సదా విష్ణురూపం గణేశం నమామః ॥ 11

తమో యోగినం రుద్రరూపం త్రినేత్రం జగద్ధారకం । 12

తారకం జ్ఞానహేతుం అనేకాగమైః స్వం జనం ।
బోధయంతం సదాసర్వరూపం గణేశం నమామః ॥ 13

తమ స్తోమహారం జనాజ్ఞాన హారం త్రయీవేద సారం । 14

పరబ్రహ్మసారం మునిజ్ఞానకారం విదూరే వికారం ।
సదాబ్రహ్మరూపం గణేశం నమామః ॥ 15

నిజైరరోషధీస్తర్పయంతం కరౌఘైః ।
సురౌఘాన్ కలాభిః సుధాస్రావిణీ భిః ॥ 16

దినేశాంశు సంతాప హారం ద్విజేశం ।
శశాంక స్వరూపం గణేశం నమామః ॥ 17

ప్రకాశ స్వరూపం నభో వాయురూపం । 18

వికారాదిహేతుం కలాకాల భూతం
అనేక క్రియాఽనేక శక్తి స్వరూపం ।
సదా శక్తిరూపం గణేశం నమామః ॥ 19

ప్రధాన స్వరూపం మహత్తత్వరూపం ధరావారిరూపం । 20

దిగీశాది రూపం అత్ సత్స్వరూపం జగద్ధేతు భూతం ।
సదా విశ్వరూపం గణేశం నతాస్మః ॥ 21

త్వదీయే మనఃస్థాపయే దంఘ్రిపద్మే జనో విఘ్న సంఘా । 22

న్నపీడాం లభేత లసత్ సూర్యబింబే విశాలే స్థితోయం ।
జనో ధ్వాంత బాధాం కథంవా లభేత ॥ 23

వయం భ్రామితాః సర్వదా జ్ఞానయోగా దలబ్ధాస్తవాంఘ్రిం । 24

బహూన్వర్షపూగాన్ ఇదానీమవాప్తాః స్తవైవ ప్రసాదాత్ ।
ప్రపన్నాన్ సదా పాహి విశ్వంభరాద్య ॥ 25

**బ్రహ్మోవాచ :-**

ఏవం స్తుతో గణేశస్తు సంతుష్టో భూన్మహామునే ।
కృపయా పరయోపేతోఽభిధాతుం తాన్ ప్రచక్రమే ॥ 26

**గణేశ ఉవాచ :-**

యదర్థం క్లిశితా యూయం యదర్థ మిహచాగతాః ।
ప్రీతోహ మనయా స్తుత్యా వరం మత్తో వృణీత తం ॥ 27

కృతంచ మమ యత్ స్తోత్రం భవద్భిః భావితాత్మభిః ।
స్తోత్రరాజమితి ఖ్యాతం భవిష్యతి మమాజ్ఞయా ॥ 28

ఇదం యఃపఠే త్ప్రాతరుద్ధాయ ధీమాన్ త్రిసంధ్యం । 29

సదా భక్తియుక్తో విశుద్ధః సపుత్రాన్ శ్రియం సర్వకామాన్
లభేత పరబ్రహ్మరూపో భవేదంతర్లకాలే ॥ 30

బ్రహ్మోవాచ :-

ఇతి తద్వచనం శృత్వా సంతుష్టాస్తే తమబ్రువన్ ।
తదీక్షయా రజస్సత్వ తమోగుణ సముద్భవాః ॥ 31

ఋషయఊచు :-

యదితుష్టోసి దేవేశ సృష్టిసంహార కారకే తవాంఘ్రి ।
కమలే నోస్తు భక్తి రవ్యభిచారిణీ ॥ 32

కించాస్మాభిః ప్రకర్తవ్యం అజ్ఞాపయతు నోభవాన్ ।
అయమేవ వరోస్మాకం వాంఛితో ద్విరదానన ॥ 33

ఇతి శ్రుత్వా వచస్తేషాం పునః ప్రాహ గజాననః ।
భవిష్యతి మహాభాగాః మయి భక్తిర్దృఢాహి వః ॥ 34

సంకష్టాని యధా యూయం తరిష్యథ మహాంత్యపి ।
భవత్యాత్యై ప్రవక్ష్యామి కార్యాణి చ పృథక్ పృథక్ ॥ 35

సృష్టికర్తా భవబ్రహ్మన్ రజోగుణ సముద్భవః ।
పాలనం కురు విష్ణోత్త్వం వ్యాపకః సత్వ సంశ్రయః ॥ 36

హర సంహర సర్వం త్వం తమోగుణ సముద్భవః । 37

బ్రహ్మోవాచ :-

వేదశాస్త్ర పురాణాని సృష్టిసామర్థ్య మేవచ ॥ 38

దదౌ గణేశో అన్యాంవిద్యాం బ్రహ్మణే మహ్యమాదరాత్ ।
విష్టవే భగవాన్ ప్రాదాత్ యాగాత్ స్వ చ్ఛంద రూపతాం ॥ 39

ఏకాక్షరం షడర్ణంచ మంత్రం సర్వాగమాంస్తథా ।
హరాయ భగవాన్ ప్రాదాచ్ఛక్తిం సంహరణేపి చ ॥ 40

తతశ్చాహం దీనమనా స్త్రైలోక్యేశం జగద్గురుం
ఉవాచ ప్రాంజలిర్ధ్యాత్వా వరదం తమిభాననం ॥ 41

**బ్రహ్మోవాచ :-**

యథా గృహిత శక్తిస్తు వాచ్యావాచ్యం వివక్తిన ।
తథానేక విధాం సృష్టిం అదృష్ట్వాక్వాపి కించన ॥ 42

కర్తుంవాపి విభోరాజ్ఞా విభేదం కథముత్సహే ।
ఇతః కూపమితో వాపీ త్యేవం ప్రాప్తం మయా కథం ॥ 43

తతో గజాననః ప్రాహ దివ్యం చక్షుః ప్రదాయ తం ।
బ్రహ్మాణం వేదశాస్త్రజ్ఞం తథా వ్యాకులితం ప్రభుః ॥ 44

**గజానన ఉవాచ :-**

బహిరంత శ్శరీరే మే సంఖ్యాతీతాని పద్మజ ।
బ్రహ్మాండాని త్వమద్యైవ విభ్రమంతి విలోకయ ॥ 45

**బ్రహ్మోవాచ :-**

తతో గజాననేనాహం స్వోదరే శ్వాస వాయునా ।
నీతో దదర్శ ధాతాపి బ్రహ్మాండావి త్వనేకశః ॥ 46

ఔందుంబరాణీవ తరౌ తేషు వా మశకా ఇవ । 47

భేదయామాస తత్రైకం పరమేణ స్వతేజసా ।
తదంతస్సకలాం సృష్టిం దదర్శాథ పునః పునః ॥ 48

బ్రహ్మాండంచాపరం తత్ర విష్ణు మింద్రం ప్రజాపతిం ।
శంకరం భాస్కరం వాయుం వనాని సరితోంబుదం ॥ 49

సాగరాన్ యక్షగంధర్వాన్ అప్సరః కిన్నరోరగాన్ ।
ఋషీన్ పు న్పుణ్యజనా న్సాధ్యాన్ మనుష్యాన్ పర్వతాన్ ద్రుమాన్।
ఉద్భిజ్జాన్ జరజాన్ జంతూన్ స్వేదజానండజా నపి । 50

పృథ్వీం చ సప్తపాతాలా న్యన్యయా నేకవింశతిం ।
దదర్శ విశ్వం చాహంవై భావాభావం చరాచరం ॥ 51

యదృచ్ఛాహం భేదయామాస చాండం తస్మిం స్తస్మిన్ । 52

సర్వయేవం దదర్శ దృష్ట్వా భ్రాంతిం పూర్వవ త్సంప్ర పేదే
తేషామంతం సర్వథా నాధ్యగచ్ఛత్ ॥ 53

నస్థాతుం నైవవా గంతుం శశా క కమాలాసనే ।
ఉపవిశ్య తతో బ్రహ్మ తుష్టావ ద్విరదాననం ॥ 54

బ్రహ్మోవాచ :-
వందే దేవం దేవ దేవం గణేశం బ్రహ్మాండానాం । 55

నైవ సంఖ్యా యదంగే అభ్రోడూనాం సాగరే వా ఝుషాణాం ।
కస్సంఖ్యాతా శర్కరాణాంచ తీరే ॥ 56

లజ్జా నమే అత్రాప్తి సురేంద్రవంద్య పాదారవిందం । 57

తవ యద్విలోక్య భ్రాంతోభవం జ్ఞాననిధౌ ప్రసన్నే ।
మోక్షోపి తుచ్ఛః కిముతాన వార్తా ॥ 58

దృష్టంచ నానార్థయుతం సురేశ
బ్రహ్మాండకూటం జఠరే త్వదయే । 59

స్థాతుం బహిర్గంతుమపీహ నేశస్త్వదన్య దేవం శరణం గ తోస్మి ॥ 60

తతః ప్రసన్నో భగవాననంతో వై గజాననః ।
బహిర్నిష్కాసయామాస తదా మాం ఖిన్నమానసం ॥ 61

నాసికా రంధ్ర మార్గేణ హరిం మదనుయాయినం ।
తామసంచ హరం దేవో విష్ణునా సహి సంగతం ॥ 62

నిస్సారయామాస విభుః శృతి రంధ్రాత్ గజాననః
శయాతేస్మ తదంగే తావుభౌ హరిహరౌ సుఖం ॥

ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే బ్రహ్మాస్తుతివర్ణనం నామ
త్రయోదశో అధ్యాయః



# బ్రహ్మస్తుతి వర్ణనం
# 13-వ అధ్యాయము

## త్రిమూర్తులిలా స్తుతించారు :

జన్మ మృత్యువులకతీతుడు, నిరాకారమూ, శుద్ధాద్వైతమూ, అనంతమూ, శాశ్వతుడవు అగు పూర్ణబ్రహ్మరూపమే నీవు! పరమనిర్గుణుడవు, గుణరహితుడవు, నిర్విశేషుడవూ సంకల్పరహితమైన పరబ్రహ్మతత్త్వమే నీవు!

త్రిగుణాతీతుడవూ, సృష్టికి ఆదిభూతుడవూ ఐన ఓ పరమానంద రూపా! జ్ఞానానందరూపమైన గణేశరూపా నీకు నమస్కారము!

గుణాతీతుడవు, పంచభూతాలకునూ పరమైన ఆదిపురుషుడవు పరమానందరూపియగు, సర్వవ్యాపియగు జ్ఞానేశ్వరునకు నమస్కారము!

యోగీంద్రులచేత, మునులచేతనూ హృదయాకాశమున ధ్యానించబడే పరమాకాశరూపుడగు, పరబ్రహ్మయగు గణేశునకు నమస్కారము!

జగత్కారణుడవు సృష్టికి కారణుడై, జ్ఞానస్వరూపియయూ, కాలాది చతుర్యుగ స్వరూపునకు, దేవగణములకు ఆదిపురుషుడు అగు గణేశునకు నమస్కారము.

సమస్త విశ్వమూ వ్యాపించిన పరమపురుషునకూ, దేవతలచే నమస్కరించ తగినవాడవైన నీకు నమస్కారము. పరతత్త్వరూపివియగు గణేశునకు నమస్కారము!

త్రిగుణ స్వరూపియగు పరమాత్ముడా! రజోగుణములో బ్రహ్మ స్వరూపం ధరించి సృష్టికార్యమును నిర్వహించు సమస్త వేదాత్మకుడవు, సంకల్ప స్వరూపివి!

సత్త్వగుణరూపం ధరించి సదాక్రీడలాగా అసురులను సంహరించే జగత్పరిపాలకుడు, అనేకావతారుడగు శ్రీమహావిష్ణు స్వరూపుడా నమస్కారము!

తమోగుణ ప్రధానుడు యోగిరూపివైన త్రినేత్రుడవగు ఓ రుద్రరూపీ! నీకు నమస్కారము!

త్రిగుణములకూ అతీతమైన పరమాకాశరూపి యగు తారకపరబ్రహ్మమగు ఓ సచ్చిదానంద జ్ఞానస్వరూపుడా! మా హృదయగత అజ్ఞానపు చీకట్లను పారద్రోలు సమస్త దేవస్వరూపుడా! ఓ నిర్వికారుడా! పరబ్రహ్మరూపా! నమస్కారము.

సమస్త సృష్టికినీ పుష్టినిచ్చే అమృతవర్షముతో ఓషధులనుపెంచి పోషించే సోమాత్మకుడా! నీకు నమస్కారము.

సంవత్సరస్వరూపమగు కాలచక్రమునకు ఇరుసుగాఉండి యుగాది

మాస పర్యంతమూ కాలచక్రమును తిప్పే సూర్యనారాయణ స్వరూపుడా! నమస్కారము.

ప్రకాశ స్వరూపియూ, జ్యోతిస్వరూపియూ గ్రహతారకానక్షత్రరూపి వియూనైన ఓ దేవా! నమస్కారము.

సదా విశ్వరూపీ! అనేకానేక శక్తిస్వరూపం ధరించి సృష్టిగా ఏర్పడి జగద్రూపియగు పరమాత్ముడా నమస్కారము.

తాను సృష్టించిన జగత్తుకు అతీతుడైవుండిన ప్రణవస్వరూపము, పంచభూతములకూ అతీతమైన మహత్తత్త్వరూపీ! సమస్త దిక్కులూ, దేవతలూ, కాలమూ, కర్మమూ మొదలైన జగత్తునకు కారణభూతుడా నమస్కారము.

సదా విశ్వరూపం ధరించి సృష్టిరూపంలో ప్రత్యక్షమై, ప్రళయంలో సమస్తాన్నీ లీనంచేసుకునే ఓ పరమాత్మరూపీ! గణేశా! నీకు నమస్కారము!

నీయొక్క పాదపద్మములయందు ధృఢమైన చిత్తాన్ని కలిగినవారికి వారి పుణ్యబలంచేత ఎవరికా అదృష్టం కలుగుతుందో అట్టివారి సమస్త విఘ్నములనూ నివారించువాడా! సమస్త పీడలనుండీ రక్షించే సూర్య మండల స్థితుడవైన తేజస్వరూపీ! నమస్కారము.

నీ అనుగ్రహము లేనినాడు అజ్ఞాన భ్రమప్రమలకు లోనుగానై వేలసంవత్సరములు నీకై వెతికినా కనిపించని మాయాస్వరూపుడా! శరణాగతుడైన భక్తుని హృదయములో నీ దయతో ప్రత్యక్షమయ్యే అనుగ్రహ స్వరూపుడా! ఓ ఆదిపురుషా! సృష్టికర్తా! విశ్వంభరా! నమో నమస్తే! నమస్తే నమః! పునః పునః సాష్టాంగ నమస్కారములు నీకివే! మా స్తోత్రరూపమగు పూజను గ్రహించి మమ్మనుగ్రహించు!!"

అంటూ సమస్త దేవతాగణములతో కూడి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అట్లు సాక్షాత్కరించిన పరమ సుందరమైన ఆ గణేశరూపాన్ని ప్రార్థించారు!

ఆ వృత్తాంతాన్ని బ్రహ్మ యిలావివరించాడు. "ఓ వ్యాసమునీంద్రా! గజాననుడు పై స్తుతికి సంతుష్టుడై కృపావీక్షణాలతో వారిని చూస్తూ యిలా అన్నాడు.

"ఓ త్రిమూర్తులారా! మీకు వచ్చిన కష్టం ఎలాంటిది? మీరిక్కడకు రావటానికిగల కారణమేమిటి? ఏమి కారణమైనప్పటికీ మీ ఈ స్తుతికి ఎంతో సంతసించాను. మీకు కావలసిన వరాలను కోరుకోండి! మీచేత చేయబడిన ఈ భక్తిపూర్వకమైన స్తుతి — స్తోత్రాలలోకెల్లా తలమానికమై లోకంలో అంతులేని ఖ్యాతి వహించగలదు. ప్రాతకాలమున లేచి, త్రిసంధ్యలలోనూ ఎవరైతే దీనిని శ్రద్ధాళువులై పఠిస్తారో వారిహలోక సౌఖ్యాలను, సర్వాభీష్టములనూ పొందుతారు. అంత్యకాలములో పరబ్రహ్మ స్వరూపులు అవుతారు" అన్న గజాననుని వాక్యములు విని త్రిమూర్తులు సంతుష్టాంతరంగులై యిలాప్రార్థించారు.

"ఓ దేవదేవా! నీవు మా స్తోత్రమునకు సంతుష్టుడవైతే మాకు నీ చరణాలయెడ విస్మృతిలేని, అనన్యభక్తిని ప్రసాదించు! అంతేగాక మేము చేయవలసిన కర్తవ్యాన్ని అజ్ఞాపించు! ఇదియే మా కోరిక!"

త్రిమూర్తుల మాటలను విన్న గణేశ్వరుడు ప్రసన్నుడై

"ఓ త్రిమూర్తులారా! మీ కోరిక ప్రకారమే నాయందు మీకు ధృఢభక్తిని ప్రసాదిస్తున్నాను. మహత్తరమైన విఘ్నాలనన్నింటినీ మీరు

దాటగలరు! మీకు ఘనమైన కీర్తి కలిగేందుకు మీకు వేరువేరు బాధ్యతలను అప్పగిస్తాను!" అంటూ వారికి ఇలా వరాలను అనుగ్రహించి రజోగుణసముద్భవుడైన బ్రహ్మకు సృష్టిబాధ్యతనూ, సత్త్వగుణాశ్రయుడైన విష్ణువును పాలకుడుగానూ, తమోగుణంలో ఉత్పన్నుడైన రుద్రుడిని సర్వసంహారకుడిగానూ నియమించాడు.

ఓ వ్యాసమునీంద్రా! నాకు సకలలోకాలనూ సృష్టిచేయగల శక్తి సామర్థ్యాలనూ వేదశాస్త్రపురాణాది సకల విద్యలనూ ఆదరంతో ఆ గణేశుడే నేర్పాడు.

అలాగే విష్ణువుకు యోగంవలన స్వేచ్ఛారూపములను దాల్చగలగటం రుద్రునికి ఏకాక్షర, షడక్షర గణపతి మంత్రాలనూ, సర్వాగమాలనూ, సంహారశక్తినీ ప్రసాదించాడు.

అప్పుడు నేను దీనమనస్కుడనై త్రిలోకాధిపతీ, జగత్తుకే గురుత్వం వహించినవాడూ, వరప్రదాతయైన ఆ గజాననుని ఎదుటే దోసిలియొగ్గి 'నాకు సృష్టిచేయగల శక్తితోపాటూ, సామర్థ్యాన్నీ ఏయే రూపాలను ఎక్కడెక్కడ ఎలా సృజించాలో నిర్ణయించుకోగల వివేకాన్నీ, విచక్షణనూ ప్రసాదించమని' అర్థించాను.

అప్పుడు వ్యాకుల చిత్తంతో మథనపడుతున్న నాకు దివ్యదృష్టిని అనుగ్రహించి గజాననుడు నన్ను తన ఉచ్ఛ్వాసంద్వారా ఉదరంలోకి లాక్కున్నాడు. అక్కడ సీతాఫలంలోని గింజలలాగాఉన్న అనేక కోట్ల బ్రహ్మాండ గోళాలను దర్శించాను. ఒక గోళాన్ని భేదించగా అందులోనూ త్రిమూర్తిత్రయం (బ్రహ్మవిష్ణుమహేశ్వరులు) విడిగా కనిపించారు. అలాగే సూర్యచంద్రాదులూ, పంచభూతాలూ, సముద్రాలూ, కిన్నర కింపురుష

గణాలూ, ఋషులు, పుణ్యజనులూ, చతుర్విధ జీవరాసులూ, పృథివీ మొదలుగాగల ఏడు పాతాళాలనూ ఇలా మరోబ్రహ్మాండాన్ని కళ్ళు తిరిగేలా చూశాను. వాటి ఆది అంతమూ తెలుసుకోవడం నాకూ వీలుకాలేదు. దిక్కుతెలీని స్థితిలో వరదుడైన గజాననున్ని దారిచూపమని ప్రార్థించాను.

"ఓ దేవా! నీ కుక్షిలో బ్రహ్మాండ కోటుల నెన్నింటినో కనుగొన్నాను. ఆకాశంలోని నక్షత్రాలనూ, సముద్రంలోగల చేపలనూ, ఇసుకలోని రేణువులనూ లెక్కించటం ఎలాగైతే ఎవరితరమూ కాదో, అలానే వీటి ఆది అంతాలను కనుగొనటమన్నది నాశక్తికి మించినపని! ఇక్కడ ఉండటానికిగానీ, బైటకు రావటానికిగాని నాకిక శక్యం కావటంలేదు! కనుక దిక్కుతోచని స్థితిలో నీ దివ్యచరణారవిందాలపై శరణాగతుడనై శిరము వొన్చు తున్నాను. నాపై దయతలచు!" — అంటూ ప్రార్థించిన నా ప్రార్థనవిని దయతో నన్ను తన ముక్కుయొక్క రంధ్రములోంచి బైటకు విసరివైచాడు. అలాగే శివవిష్ణువులనూ కూడా తన కర్ణరంధ్రముగుండా బైటకు విసరివైచాడు. ఆ హరిహరులిద్దరూ బైటికి వెలువడి అలా సుఖంగా గణేశుడి శరీరంపైనే నిద్రించినారు అంటూ బ్రహ్మ వ్యాస మునీంద్రుడికి గణేశుడి దివ్యవిజృంభణను వివరించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'బ్రహ్మస్తుతి వర్ణనం' అనే 13-వ అధ్యాయం.



14

# బ్రహ్మా చింతావర్ణనం

(మూలం)

## చతుర్థశో అధ్యాయః

**రాజోవాచ :-**

తతః కిమకరోద్బ్రహ్మా వీక్ష్యాండాని సహస్రశః
కథం చ సృష్టిమకరో దాజ్ఞాంప్రాప్య గజాననాత్ ॥ 1

**భృగురువాచ :-**

అభవద్గర్వసంపన్నః స్వాత్మన్యేవం విచారయన్ ।
వేద్మి శాస్త్రాణి వేదాంశ్చ పురాణాని ఆగమానపి ॥ 2

జ్ఞాన విజ్ఞాన సంపన్నః శాపానుగ్రహ శక్తిమాన్ ।
బ్రహ్మాండానిచ దృష్టాని సృష్టినాం రచనస్తథా ॥ 3

ఇదానీం సృష్టికరణేఽశక్యం మే నైవ కించన ।
ఇత్యేవం గర్వసంపన్నే సృష్ట్యర్థం కమలోద్భవే ॥ 4

విఘ్నాః నానావిధాః భూప ప్రాదురాసన్ సహస్రశః ।
తం వేష్టయిత్వా బ్రహ్మాణం స్థితిః పరమ దారుణా ॥ 5

యథా మత్తాః పుష్పరసై స్సరఘాః మధుజాలకం త్రినేత్రాః ।
పంచహస్తాశ్చ కుపాస్యాః సప్తపాణయః ॥ 6

త్ర్యంఘ్రయః పంచ తుండాశ్చ సప్తతుండా షడంఘ్రయః ।
దశాస్యాః పంచపాదాశ్చ తాలదంతా వృకోదరాః ॥ 7

నానారూపాః మహాసత్వాః సంఖ్యాతుం నచ తే క్షమాః ।
చకంపే ద్రుహిణస్తేషాం నా నా రావాన్నిశమ్య తాన్ ॥ 8

కేచిత్తం ముష్టిభిర్జఘ్నుః నేముశ్చ నునువుః పరే ।
చతుశ్శిఖాసు సంగృహ్య డోలయామాసు రాదరాత్ ॥ 9

చత్వార్యపి ముఖాన్యస్య జహనునం తదాపరే ।
వినందుశ్చ ప్రశంసాంచ చక్రుః కేచి త్ప్రేషవిరే ॥ 10

మోచయామాసు రపరే బబంధురపరే పునః ।
మోచితం పునరప్యన్యే విచకర్షు రితస్తతః ॥ 11

ఆలిలింగుశ్చ తం కేచి చ్చుచుంబుః శిశువత్పరే ।
అష్ట శ్మశ్రుషు తం ధృత్వా ననర్తైకో ష్టహస్తవాన్ ॥ 12

ఏవం స పరవాన్ బ్రహ్మ చింతాశోక సమన్వితః ।
అఖర్వం సృష్టి గర్వం తం తత్యాజ హృది సంగతం ॥ 13

జగామ మహతీం మూర్ఛాం నిరాశః స్వస్య జీవనే ॥ 14

ముహూర్తమాత్రే తు గతే సస్మార మనసా విభుం । 15

ప్రార్థయామాస కారుణ్యాద్రుదన్నివ గజాననం । 16

బ్రహ్మోవాచ :-
నచాయుష్యం స్వల్పం వివిధజననే సక్తమనసో ॥ 17

నమే తత్వజ్ఞానం భవజలధి తారం సువిమలం
జనుర్భూమౌ లబ్ధ్వా తవ భజనతో యామి పరమాం
కదా భుక్తిం ముక్తిం ।
నిరుపమ సుఖాం వా ఖిలగురో
త్వత్కటాక్షామృతే నాక్తో భక్తః సీదతి తేవిభో ఇయం లజ్జా
తవైవాసాం నమే మృత్యుశ్చిరాయుషః ॥ 18

భృగురువాచ :-
ఇత్యసౌ ప్రార్థయన్నేవ శుశ్రావ గగనేరితం ।
గిరం తపస్వేతి తతః ప్రార్థయామాస తాంపునః ॥ 19

అంతర్హితాశ్చ తేవిఘ్నాః శృతాయా నభసో గిరి ।
నానారూపా మహావీర్యా ముక్త్వా తం కమలాసనం ॥ 20

సముక్త శ్చింతయామాస పద్మయోని ర్మహాయశాః ।
వినామంత్రం వినాస్థానం కథం తప్స్యే తపో మహత్ ॥ 21

ఇతి వ్యాకులచిత్తోసౌ బభ్రామ జలమధ్యతః ।
అనన్యమనసా ధ్యాయన్ గజానన మనామయం ॥ 22

ముకుటేన విరాజంతం ముక్తారత్నయుజా శుభం ।
రక్తచందన లిప్తాంగం సిందూరారుణ మస్తకం ॥ 23

ముక్తాదామ లసత్కంఠం సర్ప యజ్ఞోపవీతినం ।
అనర్ఘ్యరత్న ఘటిత బాహూ భూషణ భూషితం ॥ 24

స్ఫురన్మరకత భ్రాజదంగుళీయక శోభితం ।
మహాహి వేష్టిత బృహన్నాభి శోభిత మహోదరం । 25

విచిత్ర రత్నఖచిత కటిసూత్ర విరాజితం ।
సువర్ణసూత్ర విలసత్ రక్తవస్త్ర సమావృతం ॥ 26

బాలచంద్రం లసద్దంతశోభా రాజత్కరం పరం ।
ఏవం ధ్యాయతి తస్మింస్తు పునరేవ నభోవచః ॥ 27

ఉదియాయ వటం పశ్య వటంపశ్యేతి సుందరం ।
శృత్వేతివచనం బ్రహ్మ పునశ్చింతా మవాపసః ॥ 28

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**బ్రహ్మచింతావర్ణనం నామ చతుర్దశో అధ్యాయః**



# బ్రహ్మా చింతావర్ణనం
# 14-వ అధ్యాయము

అప్పుడు సోమకాంతమహారాజు భృగుమహర్షిని అలా గజాననుని ఉదరంలో అనేక బ్రహ్మాండాలను చూసి, ఆ తరువాత గణేశుని అనుజ్ఞ మేరకు బ్రహ్మ ఎలా సృష్టిని చేసినదీ వివరింపమని ప్రార్థించగా ఆ భృగుమహర్షి యిలా బదులిచ్చాడు :

"ఓరాజా! అలా గజాననుని గర్భంలోంచి బైటకువచ్చిన చతుర్ముఖుడు తనలోతాను గర్వితుడై 'సకలవేదశాస్త్ర పురాణములను, ఆగమాలనన్నింటినీ ఎరిగినవాడను! జ్ఞాన విజ్ఞాన సంపనున్నడినీ, శాపానుగ్రహ సమర్థుడినీ అవటంవల్లనే — నాయొక్క సృష్టిరచనాపద్ధతిలోగల ప్రావీణ్యతవల్లనే నాకీ సృష్టిబాధ్యత సిద్ధించింది. ఇక సృష్టివిషయంలో

నాకు వీలుకాని పనంటూలేదు!' అంటూ గర్విష్ఠియై సృష్టికి పూను కున్నాడు. కానీ ఆ ప్రయత్నంలో ఆయనకు అనేక విఘ్నాలు తేనెతుట్టెను చుట్టుముట్టే తేనెటీగల్లా ముసురుకున్నాయి.

ఆ విఘ్నదేవతల స్వరూపం ఎంతో వికృతంగానూ, భయాన్ని గొలిపేవిగానూ ఉండటంతో బ్రహ్మ వారి ఘోరమైన రూపాలూ, వారు చేసే వికృతధ్వనులూ చూసి గడగడా వణికిపోయాడు.

అప్పుడు కొందరు విఘ్నదేవతలు బ్రహ్మను కొట్టారు! మరికొందరు స్తుతిం చారు. యింకొందరు నమస్కరించారు. కొందరు నిందిస్తే, మరికొందరు ప్రశంసించారు. కొందరు సేవిస్తే మరికొందరు బంధించారు. వారిలోనే కొందరు అతడిని విడిపించారు. అలా విడిపించినవాణ్ణి కొందరటూ యిటూ ఈడ్చారు. కొందరాతని నాలుగు ముఖాలనూ చూసి పరిహసిస్తే మరికొందరా శిఖలను పట్టి అటూఇటూ ఊపారు. కొందరు ఆలింగనం చేసుకునీ, మరికొందరు చిన్ని శిశువునువలే ముద్దాడీ, కొందరాతని గడ్డాన్నీ మీసాలనూ పట్టుకొనీ, ఆటపట్టిస్తూ నృత్యం చేశారు.

ఇలాంటి వికృతచేష్టలపట్ల బ్రహ్మమనః స్వాధీనం కోల్పోయి హృదయం అంతా చింతతోనూ, శోకంతోనూ బరువెక్కినవాడై, తన మనోగర్వాన్నివీడి జీవితంపట్ల నిరాశకల్గి వివశుడై మూర్ఛిల్లాడు.

అలా ఒక ముహూర్తకాలం గడిచాక, తెలివితెచ్చుకుని తన హృద యంలో దేవదేవుడైన ఆ విఘ్నేశ్వరుణ్ణి స్మరిస్తూ, దుఃఖితుడై, గజానను డిని యిలా స్తుతించసాగాడు.

## బ్రహ్మ గజాననుడిని స్తుతిచేయటం

ఓ దేవదేవా! నాకా ఆయుఃప్రమాణం ఎంతోవున్నది! చేయబూనిన కార్యమా ఎంతో ఉత్కృష్టమైనది! నాకా నిష్కళంకమైన బ్రహ్మజ్ఞానం కలుగలేదు. ఈ భూమండలంపైన జన్మనెత్తి నీకు భక్తుడనై, ముక్తిని ఎప్పుడు ఎలా పొందగలనోకదా! ఓదేవా! అందుచేత నీయొక్క కరుణా వృష్టి నాపై కురిపించి నన్నీ బాధలనుండి, పీడలనుండి విముక్తుడిని గావించు! కనుక నాజన్మ సార్థకమయ్యేలా, నా కర్తవ్యాన్ని సమర్థ వంతంగా నెరవేర్చేలా అనుగ్రహించు!" అంటూ దీనంగా వేడుకుంటూన్న సమయంలో ఆకాశంనుంచి అశరీరవాణి "తప! తప!" (తపస్సుచెయ్యి! తపస్సుచెయ్యి!) అన్న ఆదేశం వినపడింది.

ఆ వాక్కు చెవినపడిన వెంటనే బ్రహ్మను వేధిస్తూన్న విఘ్నదేవతలు ఆయనను విడిచి అంతర్ధానమైనారు. అప్పుడు బ్రహ్మ తన మనస్సులో 'తపస్సు చేయడానికి తగిన స్థానం, మంత్రమూ ఉంటేనేకదా! తప మాచరించగలిగేది!' అనుకొని తన తపస్సుకు అనువైన స్థానానికై అన్వే షిస్తూ వరప్రదుడైన గజాననుడిని హృదయపద్మంలో ఏకాగ్రచిత్తంతో యిలా ధ్యానించసాగాడు.

### గజాననుని ధ్యానమూర్తి :

ఆ ధ్యానమూర్తి ఎలా ఉన్నడంటే — ఎఱ్ఱటి చందనంతో అద్ద బడిన దేహంతో ప్రకాశిస్తూ, సిందూరారుణ వర్ణంతో శోభించే శిరస్సుపైన, ముత్యాలచేతా, రత్నాలచేతా, అలంకరించబడిన దివ్యమైన కిరీటాన్ని ధరించి, మెడలో ముత్యాలహారాన్నీ నాగయజ్ఞోపవీతాన్నీ ధరించిఉన్నాడు.

ఆ దివ్యమంగళమూర్తి చేతివ్రేళ్ళకు మరకత మాణిక్యాలతో పొదగబడిన ఉంగరములను ధరించి, చిత్రవిచిత్రమైన రత్నాలతో తాపించబడిన 'మొలత్రాటి'తో నాభి ప్రదేశంవద్ద శేషునితో చుట్టబడి ఎఱ్ఱటి దివ్యమైన పట్టువస్త్రాన్ని ధరించిఉన్నాడు.

అతని ఏకదంతం చంద్రకళలాగా తెల్లగా ప్రకాశిస్తోంది! అటువంటి పరమ సుందరమైన, దివ్యమైన, అనుగ్రహరూపుడైన గజాననమూర్తిని బ్రహ్మ హృదయంలో ధ్యానిస్తూండగా, ఆకాశంలోనుండి అశరీరవాణి మరలా యిలాపలికింది "వటం పశ్య! వటం పశ్య!" అనగా ఆ మఱ్ఱి చెట్టును చూడమన్న ఆదేశం విన్న బ్రహ్మ వటవృక్షానికై అన్వేషించ సాగాడు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'బ్రహ్మ చింతావర్ణనం' అనే 14-వ అధ్యాయం.



15

# పూజా నిరూపణం

(మూలం)

## పంచదశో అధ్యాయః

**భృగురువాచ :-**

వ్యాసాయా కథయ చ్చాగ్రే బ్రహ్మ లోకపితామహాః ।
సోమకాంత కథాం తాంతు ప్రవక్ష్యామి శృణు సాదరం ॥ 1

**బ్రహ్మోవాచ :-**

తతోహం సు మహత్ స్వప్నం దదర్శ మునిసత్తమ ।
భ్రమతాం భ్రమతా వ్యోమజలే వృష్టో వటో మహాన్ ॥ 2

మహా వాతాతపాద్యస్తు నష్టే స్థావర జంగమే ।
అవశిష్టః కథమపి ఏకఏవ వటోమహాన్ ॥ 3

ఏవం సంశయమాపన్న స్తత్రత్రే బాలకం లఘుం ।
చతుర్బాహుం సుమకుటం కుండలాభ్యాం విరాజితం ॥ 4

మణిముక్తామయం దామ బిభ్రత్కంఠే సుశోభితం ।
అర్ధచంద్రం రక్తవస్త్రం కటిసూత్రం తథైవచ ॥ 5

ఏకదంతం నరవపుర్గజాస్యం తేజసా జ్వలన్ ।
దృష్ట్వైవం తర్కయామాస బాలకం కథమత్ర వై ॥ 6

పుష్కరేణ చ తద్బాలం జలం మన్మస్తకే క్షిపత్ ।
తతోహ మాజహాసోచ్చై శ్చింతానంద సమన్వితః ॥ 7

మయ్యా హసతి బాలః స ఉత్తతార వటాత్తతః ।
స మమాంకం సమాగత్య మంజువాక్యం జగాద హ ॥ 8

**బాల ఉవాచ :-**

లఘోర్లఘుతరోసి త్వం వృథా వృద్ధోపి మూఢధీః ।
విఘ్నై రభిహతోసి త్వం సృష్టిచింతా సమావృతః ॥ 9

తపశ్చింతాపరో నిత్యం విభ్రమ జ్జల మధ్యగః ।
సర్వచింతా హరం తే అహముపాయం చతురానన ॥ 10

ఉపాదిశామి తే మంత్రం ఏకాక్షర మిమం మమ ।
పునశ్చరణ మార్గేణ దశ లక్షం జపస్వ తం ॥ 11

తతః ప్రత్యక్షతాం యాస్యే దాస్యే సామర్థ్యముత్తమం ।
దృష్ట్వైవం స్వప్నమాశ్చర్యం ప్రతిబుద్ధో భవం హ్యాహం ॥ 12

శుశోచ చ కదా మేస్యా ద్దర్శనం పరమేశితుః ।
దృష్ట స్వప్నో భవం మగ్నః  అనందమయ సాగరే ॥ 13

తతస్నాత్వా పరం మంత్రం జజాప బహు వాసరం ।
ఏకపాదేన కమలే తిష్ఠన్ ధ్యాయన్ గజాననం ॥ 14

జితేంద్రియో జితాహారః కాష్ఠ పాషాణవత్ స్థిరః ।
దివ్యవర్ష సహస్రం స తపస్తే పురంమహత్ ॥ 15

తతోమే ముఖతో జ్వాలాః ప్రాదురాసన్ దురాసదాః ।
తాభిస్సర్వాణి భూతాని పీడామాపుః సుదారుణాం ॥ 16

తతో గజాననో దృష్ట్వా తాం నిష్టాం మమ సుద్ధృఢాం ।
తుతోష పరయా భక్త్యా ప్రాదురాసీత్తతః పురః ॥ 17

కోటిసూర్య సమానశ్రీ ర్జ్వాలామాలీవ హవ్యభుక్ ।
దహన్నివ త్రిలోకీం సః సంహరన్నివ రోదసీ ॥ 18

పరశు కమల ధారీ దివ్యమాలా విభూషః
సకల దురిత హారీ సర్వ సౌందర్య కోశః ।
కరివర ముఖశోభీ భక్తవాంఛా ప్రపోషః
సుర మనుజ మునీనాం సర్వవిఘ్నైక నాశః ॥ 19

తేజోరాశి మహం దృష్ట్వాచ కంటే వ్యాససన్మనే । 20

చింతామవాప పరమాం వ్యగ్రచిత్తో జపాచ్చ్యుతః । 21

**గణేశ ఉవాచ :-**

న భయం కురు లోకేశ సవివాహం సమాగతః ।
యేన తే మంత్ర ఆదేష్టఃశి స్వప్నే ఏకాక్షర శ్శుభః ॥ 23

తేన సిద్ధిరనుప్రాప్తా వరం దాతుం సమాగతః ।
సౌమ్యభావే వ ప్రసన్నోస్మి పరం వరయ సువ్రత ॥ 24

దాస్యామి తే ప్రసన్నోహిం యద్యత్తే హృది వర్తతే ।
మయి ప్రసన్నే సర్వం తద్భవితా నాత్రసంశయః ॥ 25

**మునిరువాచ :-**

ఇత్థం నిశమ్య గణనాథ వచో విశుద్ధం ।
బ్రహ్మ జహర్ష పరమం ప్రసమీక్ష్యమాణః ॥ 26

నత్వా చరాచరగురుం సకలై శ్శిరోభిః ।
ప్రాహ ప్రసన్న హృదయః సఫలం జనుర్మే ॥ 27

**బ్రహ్మోవాచ :-**

యో వేదానాం సశాస్త్రాణాం జ్ఞానినాం యోగినామపి ।
సర్వోపనిషదాంచైవ గోచరోనచ దాచన ॥ 28

స పుణ్యనిచయై ర్మే అద్య యాతః ప్రత్యక్షతాం విభుః ।
అనాది నిధనో అనంతోఽ అప్రమేయో నిర్గుణోపిచ ॥ 29

యది ప్రసన్నో దేవేశ విఘ్నేశ కరుణాకర ।
తవ భక్తిం దృఢాం దేహి యయా దుఃఖం న సంస్పృశేత్ ॥ 30

ఇదానీం దేహి సామర్థ్యం నానా నిర్మాణమే మమ ।
విఘ్నానిచ శమం యాంతు యది తుష్టోసి మే ప్రభో ॥ 31

స్మృతమాత్రః సదా మే త్వం సర్వం కార్యం సమాపయ ।
అంతే ముక్తిం స్థిరాం దేహి జ్ఞానంచ విమలం మమ ॥ 32

**గజాననఉవాచ :-**

ఏవమస్తు కురుష్వ త్వం సృష్టిం నానావిధాం బహు ।
మాం స్మృత్వా సర్వవిఘ్నాని నాశం యాస్యంతి సర్వతః ॥ 33

దృఢా భక్తిః శుభం జ్ఞానం మత్ప్రసాదా ద్భవిష్యతి ।
నిశ్శంకం కురు కార్యాణి సర్వాణి చతురానన ॥ 34

**మునిరువాచ :-**

ఏవం లబ్ధవరో బహ్మా పూజయామాస తం విభుం ।
యద్యచ్చిత్తే చింతయత్ తైస్తై తత్తదేవోవ ఉపతిష్టతే ॥ 35

పూజార్థం దేవదేవస్య గణేశస్య ప్రసాదతః ।
దక్షిణానపరే ద్వేతు కన్యకే సముపస్థితే ॥ 36

చారు ప్రసన్ననయన వదనైః సువిరాజతే ।
అనేక రత్నఖచిత నానాలంకార శోభితే ॥ 37

దివ్య గంధయుతే, దివ్య వస్త్రమాలా విభూషితే ।
తే తస్మై దక్షిణార్థం సం కల్పయామాస పద్మభూః ॥ 38

రంభా గర్భేణ నీరాజ్యం దివ్య పుష్పాంజలిం దదౌ ।
సహస్ర నామభి స్తుత్వా ప్రదక్షిణ మథాకరోత్ ॥ 39

నమస్యః ప్రార్థయామాస దీనానాం శంకరోభవ ।
ఏవం సం పూజిత స్తేన బ్రహ్మణా పరమేష్ఠినా ॥ 40

తతః ప్రసన్నో భగవాన్ విఘ్నహర్తా గజాననః ।
సిద్ధి బుద్ధీన్ గృహిత్వా తే అంతర్థాన మగాద్విభుః ॥ 41

క స్తతః కారయామాస సృష్టిం పూర్వవదాయతాం ।
ఆజ్ఞయా పరమేశస్య ప్రసాదాచ్చ ప్రసన్నధీః ॥ 42

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే గజానన**
**పూజానిరూపణం నామ పంచదశో అధ్యాయః ॥**



# పూజానిరూపణం

# 15-వ అధ్యాయము

ఆతరువాత జరిగిన కథావృత్తాంతాన్ని భృగువు సోమకాంత మహా రాజుకిలా చెప్పసాగాడు.

అలా ధ్యాననిమగ్నుడైవున్న చతుర్ముఖుడికి ఒక మహత్తరమైన దివ్యానుభూతి స్వప్నం రూపంలో కలిగింది. తాను ఆ జలాలపైనున్న ఆకాశంలో పరిభ్రమిస్తూ ఒక పెద్ద వటవృక్షాన్ని చూశానని ఆ వివరాలను వ్యాసునితో యిలా వర్ణించి చెప్పసాగాడు.

## బ్రహ్మ స్వప్న వృత్తాంతం

నాయనా! అప్పుడు సమస్త సృష్టి ప్రళయజలాలలో నశించిపోగా, ఈ వటవృక్షమొక్కటిమాత్రం ఎలా మిగిలివున్నదా? అన్న ఆశ్చర్యంతో పరికించి చూడగా ఆ వటవృక్షపు పత్రంమీద ఒక చిన్న బాలుణ్ణిచూశాను! నాలుగు చేతులు కలిగి చెవులకు చక్కని కుండలాలను ధరించి

ఎఱ్ఱని వస్త్రాలనూ, కటిసూత్రాలతోనూ ఉండి ఏనుగుముఖమూ, మానవ శరీరముగల ఆ బాలకుడి శిరస్సున అమిత తేజస్సుతో ప్రకాశి స్తూన్న దివ్యకిరీటమూ, నుదుట చంద్రకళను ధరించిన ఆ బాలకుని మెడలో దివ్యమైన మణిహారాలు విరాజిల్లుతున్నాయి. ఈ బాలకుడిప్పుడీ వట పత్రంపైన ఎలావచ్చాడా? అని ఆశ్చర్యచకితుణ్ణైన నా శిరస్సుపైన ఆ బాలగజాననుడు తన తొండంతో నీటిని సంప్రోక్షించాడు. అప్పుడు నేను పకాలున నవ్వాను. ఆ బాలుడా మఱ్ఱాకుపైనుండి లేచి నావడిలో కూర్చుని మృదుమధురమైన గొంతుతో యిలా అన్నాడు.

"ఓ నాల్గుముఖాలు కల్గిన బ్రహ్మా! నీవు వయస్సులో ఎంతో పెద్దవాడవైవుండి కూడా చిన్నవారికన్నా కూడా చిన్నవాడిలా ప్రవర్తించి, అహంకారబుద్ధితో విఱ్ఱవీగినందుకే నీకు అనేక విఘ్నములు దాప రించాయి! చింతావ్యాకులుడవై ఉన్న నీ సకల చింతలూ తొలిగేందుకు చింతావినాశకరమైన నా 'ఏకాక్షరీ గణపతి మహామంత్రాన్ని' నీకు ఉపదే శిస్తాను. దాన్ని పురశ్చరణవిధానంలో పదిలక్షలు జపించు! అప్పుడు నీకు దర్శనాన్ననుగ్రహించి అద్భుతమైన సృష్టిరచనా సామర్థ్యాన్ని ప్రసా దిస్తాను!"

అంటూ స్వప్నంలోనే ఉపదేశమిచ్చి అంతర్ధానం చెందాడు. ఆ తరువాత స్వప్నంలోంచి మేల్కొని, గజాననుని అనుగ్రహానికి కృతజ్ఞతతో ఆనందాంబుధిలో ఓలలాడాను! ఆ తరువాత ఆ దేవదేవుని ఆజ్ఞాను సారం ఒక్క కాలిపైన పద్మంలో నిలచి నిశ్చలబుద్ధితో జపంచేశాను. ఇంద్రియాలను నిగ్రహించి, ఆహారమును వర్జించి నిశ్చలంగా వేయి

సంవత్సరాలు ఘోరమైన తపస్సును ఆచరించాను. ఆ తపోతీవ్రతకు నా నాల్గు ముఖాలనుండి మహాజ్వాలలు ఉత్పన్నమై సకలలోకాలనూ తల్లడిల్లచేశాయి! నా ధృడనిష్టకూ, భక్తికీ సంతుష్టుడైన గజాననుడు నా ఎదుట అనుగ్రహమూర్తియై సాక్షాత్కరించాడు. ఆ దివ్యసుందర ప్రకాశమైన రూపం వర్ణించటం మాటల్లో అలవికానిది.

## గజాననుడి సాక్షాత్కారం

కోటిసూర్యలకు సమానమైన తేజస్సుతో విరాజమానుడై, అగ్నిహోత్రు నిలా, ప్రజ్వరిల్లే కాంతితో ఒక తేజఃపుంజములోనుండి ఆ దేవదేవుడు ఆవిర్భవించాడు. ఒకచేత పరశువునూ, మరోచేత ఎఱ్ఱటి కమలాన్నీ ధరించి, దివ్య పుష్పమాలలను మెడలోదాల్చి, సౌందర్యానికి ఆటపట్టువా అన్నరూపంలో, గజవదనంతో భక్తుల మనోభీష్టాలనన్నిటినీ నెరవేర్చే వరద మూర్తియై, సకల మానవుల, దేవ, యక్ష, గంధర్వ, సిద్ధసాధ్యులయొక్క విఘ్నాలను నివారించే ఆ దివ్యమూర్తి కళ్ళు మిరమిట్లుగొలిపే కాంతితో దర్శనమిచ్చాడు. అంతటి కాంతిని తట్టుకోలేక భయభ్రాంతుణ్ణైయ్యాను. మూర్ఛిల్లిన నన్ను ఉపశమింపచేసి నాకు అభయాన్నిస్తూ గజవదనుడు యిలా అన్నాడు.

"ఓ చతురాననా! భయాన్ని వీడు! నీకు స్వప్నంలో మంత్రోప దేశం చేసినదీ, నీవు నిరతమూ నీ హృదయకమలంలో ధ్యానిస్తున్నదీ నన్నే! ఇక ఇప్పుడు నీకు నా సౌమ్యరూపాన్ని అనుగ్రహంగా దర్శనం యిస్తున్నాను! నీ మనోభీష్టమును కోరుకో! నీ సకల వాంఛితాలనూ అనుగ్రహిస్తాను!"

అప్పుడు జరిగిన వృత్తాంతమంతటినీ సోమకాంతునితో వివరిస్తూ భృగువిలా కొనసాగించాడు.

ఓ రాజా! అవిధంగా కృపాళువైన గజాననుని పరమానుగ్రహాన్ని పొందిన చతురాస్యుడు తన నాలుగు శిరస్సులనూ ఆ దివ్యచరణాలకు తాకిస్తూ, హృదయం నిర్మలమనగా, గజాననుని అనుగ్రహవాక్యాలకు పరమానందభరితుడై ఇలా వరం కోరుకున్నాడు.

"ఆదీ, అంతమూ లేనటువంటివాడివీ, నిర్గుణుడవూ, విభజించ బడనివాడవూ అయిన ఓ కరుణాసింధో! నీకు నాయందు అనుగ్రహం కల్గితే ఎన్నడూ నీ పాదపద్మాలయెడ విస్మృతి కలుగని అచంచలమైన భక్తిని ప్రసాదించు. నానాసృష్టి రచనాశక్తినీ, నిర్మాణ సామర్థ్యాన్నీ కూడా ప్రసాదించు! నాకు దయతో సకల విఘ్నబాధలనుంచీ విముక్తి కలిగించు!

ఇది మొదలు ఎప్పుడైనా నీ స్మరణతో ఆరంభించే నాయొక్క సకల కార్యములూ సానుకూలమయ్యేటట్లూ, నిర్మలమైన బ్రహ్మజ్ఞానాన్నీ పొందేలా కర్తవ్యనిష్టనూ, అంత్యములో మోక్షాన్నీ అనుగ్రహించు!"

ఈ వాక్యాలను విన్న గజాననుడు "తథాస్తు!" అంటూ అనుగ్ర హించి అంతర్ధానం చెందాడు! మంత్రానుష్టానం సంపూర్తియైన సందర్భం గా ఆ దేవదేవుడైన గజాననునికి సకల శుభలక్షణముతో అలరారేవారూ, అనేకవిధాలైన రత్నాభరణములతో ప్రకాశిస్తున్నవారూ, ఐన ఇద్దరు దివ్య కన్యకలనూ దక్షిణగా సమర్పించుకున్నాడు.

ఆ తరువాత కర్పూరమంగళ నీరాజనాన్నిచ్చి, గణేశుని సహస్ర నామాలతోనూ అర్చించి, ప్రదక్షిణాదికాలను, నమస్కారమును సమ

ర్పించి, అపరాధ క్షమాపణకై వేడుకున్నాడు.

అలా బ్రహ్మచే సమర్పించబడిన దక్షిణగా సిద్ధి, బుద్ధి అనే కన్యకలను స్వీకరించి గజాననుడు అంతర్హితుడైనాడు. ఆ దేవదేవుని అనుగ్రహ విశేషంచేత బ్రహ్మ తిరిగి యధావిధిగా సృష్టిని కొనసాగించాడు!

ఇది శ్రీగణేశపురణాం ఉపాసనాఖండంలోని

**'పూజానిరూపణం'** అనే 15-వ అధ్యాయం.



# 16

# దేవీప్రార్థనం

## (మూలం)

### షష్ఠదశో అధ్యాయః

**రాజోవాచ :-**

శృత్వా కథాం గణేశస్య హర్షశ్చేతసి జాయతే ।
పునశ్చ వద విప్రర్షే నతృప్యామి కథామృతాత్ ॥ 1

అంతర్హితే భగవతి గణేశే పరమాత్మని ।
కథం వినిర్మమే సృష్టిం బ్రహ్మా తద్వర్ణయ ప్రభో ॥ 2

యచ్చాగ్రే కథయామాస వ్యాసాయాఖ్యానకం విధిః ।
తదంగ హిం తం విస్తరేణైవ శ్రోతుమిచ్ఛామి సన్మునే ॥ 3

**భృగురువాచ :-**

సిద్ధక్షేత్రస్య మహత్వ్యం వ్యాసాయాకథయత్ ప్రభుః ।
అనుపూర్వ్యేణ తత్రేహం కథయిష్యే సృజచ్ఛ యత్ ॥ 4

న బ్రహ్మా నిర్మమే పూర్వం మనసా సప్త పుత్రకాన్ ।
ఆహ తాన్ సృష్టిసాహాయ్యం సృజద్వం స్వ స్వ బుద్ధితః ॥ 5

తేతు తద్వచనం శృత్వా తపసే కృత నిశ్చయాః ।
తపస్తప్త్వా సువిపులం పరం బ్రహ్మాసమాగతాః ॥ 6

తతో అన్యాన్ కల్పయామాస సప్తపుత్రాన్ ప్రజాపతిః ।
తేఽత్యంత జ్ఞాన సంపన్నాః న చక్రు స్సృష్టిముత్తమాం ॥ 7

తతః స్వయం సమారేభే సనకాదీన్ విలోక్యతాన్ । 8

ముఖతో బ్రాహ్మణానగ్నిం మసృజత్కమలాసనః । 9

బాహూరు పాదతో అన్యాంస్త్రీన్ వర్ణా శ్చంద్రమసం హృదః ।
చక్షుర్భ్యాంచ రవిం శ్రోత్రాన్మారుతం ప్రాణమేవచ ॥ 10

అంతరిక్షం తథా నాభేః శిరసో దివమేవ చ ।
భూమిం పద్భ్యాం దిశః శ్రోత్రా దన్యాం ల్లోకా నకల్పయత్ ॥ 11

అన్యదుచ్చావచం విశ్వం స్థావరం జంగమం చ యత్ ।
సముద్రాన్ సరిత శ్శైలాం స్తృణ గుల్మ మహీరుహాన్ ॥ 12

తతః కతిపయాహస్సు గతేషు మునిసత్తమాః ।
నిద్రితస్య మహావిష్ణోః శ్రోత్రాజ్జాతౌ మహాసురౌ ॥ 13

మధుకైటభ నామానౌ విఖ్యాతౌ భువనత్రయే ।
దంష్ట్రాంకరాళ వదనౌ పింగాక్షౌ దీర్ఘ నాసికౌ ॥ 14

మహాకాయౌ మహాసారా వత్యుచ్చౌ పర్వతావివ ।
వర్షాముదిర శబ్దౌతౌ గర్జంతౌ భ్రుశగర్వితౌ ॥ 15

వచోభి ర్బృహంభిర్దుష్టౌ ధిక్కారం తస్యచక్రతుః ।
విప్రాన్ దేవాన్ ఋషీన్ సాధూన్ శాస్త్రాణి చ నినిందతుః ॥ 16

తయోశ్శబ్దేన ధరణీచ కంపే శేషసహితా చ ।
ఉద్విగ్న మాసత్సకలం బ్రహ్మాండం స్వనత స్తయోః॥ 17

తతస్తౌ క్రోధరక్తాక్షౌ కంతం ఖాదితుముద్యతే ।
తతోసౌ వరదాం దేవీం విష్ణుమోహన కారిణీం ॥ 18

విష్ణు నేత్రగతాం నిద్రాం తుష్టావ కమలాసనః ।
మధుకైటభ నాశాయ ప్రబోధాయ హరేరపి ॥ 19

గజానన ప్రసాదేన విష్ణుహస్తాత్తయోర్వధం ।
జ్ఞాత్వా సమ్యగ్విచార్యై చింతా హర్ష సమన్వితః ॥ 20

బ్రహ్మోవాచ :-

స్వాహా స్వధా రూపధరా సుధా త్వం మాత్రార్ధ మాత్రా స్వరరూపిణీచ। 21

కర్త్రీచ హర్త్రీ జననీ జనస్య సతోఽసత శ్శక్తిరసి త్వమేవ । 22

శ్రుతి స్స్వరా కాళరాత్రిః అనాది నిధనా క్షపా ।
జగద్ధాత్రీ సృష్టి స్థిత్యంత కారిణీ ॥ 23

సావిత్రీచ తథా సంధ్యా మహామాయా క్షుధా తృషా ।
సర్వేషాం వస్తుజాతానాం శక్తి స్త్వమసి పార్వతి ॥ 24

త్రైలోక్యరకర్తా త్వన్నాథో త్త్వదానవ సూదనః ।
నిద్రయా వ్యాప్తచిత్తోసౌ జ్ఞాన విజ్ఞానవాన్ హరిః ॥ 25

జగదుత్పద్యతే యేన పాల్యతే హ్రియతేఽపిచ ।
సోఽపి త్వయా అవతారాణాం సంకటే వినియోజ్యతే ॥ 26

దుష్టాత్మానౌ మోహయైతౌ త్వం దేత్యౌ మధుకైటభౌ ।
హంతుమేతౌ దురాథర్షౌ జ్ఞానమస్య ప్రథీయతాం ॥ 27

అహమారాధితశ్చాభ్యాం పూర్వజన్మని అతంద్రితః ।
వరాన్ బహువిధాన్ ప్రాదామవధ్యౌ మమ తావుభౌ ॥ 28

తయో రుచ్చావచాన్ శబ్దానతోహం అసహం ఇహ ।
మాయేవ హంతు కామౌత్తౌ స్తుతానానా విధైస్తవై ॥ 29

తథాపి మద్వధాత్తౌ ననివృత్తౌ దుష్టభావతః ॥ 30

అతస్త్వాం ప్రార్థయే దేవి విష్ణుబోధన హేతవే ॥ 31

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**దేవీప్రార్థనంనామ షోడశో అధ్యాయః**



# 'దేవీప్రార్థనం'

## 16-వ అధ్యాయము

పై కథాక్రమాన్ని భృగుమహర్షి చెప్పగా అత్యంత శ్రద్ధాభక్తులతో వింటూన్న సోమకాంతమహారాజు ఇలా అన్నాడు "ఓ ఋషీశ్వరా! గణేశుని దివ్యావిర్భావమూ, అనుగ్రహమూ గాధవింటూంటే నాకెంతో సంతోషం కలిగింది. నాకు ఈ మధురమైన దివ్యకధామృతాన్ని ఎంత విన్నా యింకా యింకా వినాలనే అనిపిస్తోంది కాని తనివి తీరటంలేదు. ఆ రకంగా గణేశుని దివ్యవరాలను పొందిన బ్రహ్మ సృష్టిని ఎలా చేశాడు? అలాగే తనని ప్రశ్నించిన వ్యాసమహర్షికి యింకా ఏమేమి విశేషాలు తెలియచేశాడో ఆవివరం తెలియజేయి!" ఆ మాటలకు భృగు మహర్షి యిలా బదులిచ్చాడు.

"ఓ సోమకాంత మహారాజా! బ్రహ్మ 'సిద్ధక్షేత్రం' యొక్క మహాత్మ్య మును వ్యాసునికి తెలియజేసాడు. అలాగే నీవడిగిన బ్రహ్మ చేసిన సృష్టిక్రమాన్ని కూడా తెలియజేస్తాను! ఆ వివరాలు విను!"

మొదట బ్రహ్మ తనయొక్క మన స్సంకల్పశక్తితో ఏడుగురు మానసపుత్రులను సృష్టించి వారందరినీ కూడా తనతో సృష్టికార్యక్రమంలో సహకరించమని ఆదేశించాడు. ఆ మాటలు విన్న ఆ బ్రహ్మమానస పుత్రులు తపస్సు చేయాలని నిశ్చయించుకుని అఖండ తపోదీక్షలో మగ్నులై బ్రాహ్మీభూతులైయ్యారు.

వాళ్ళు అలా తపోమగ్నులు అవటం చూసి తన కార్యనిర్వహణకై బ్రహ్మ మరో ఏడుగురు పుత్రుల్ని సృష్టించాడు. వాళ్ళుకూడా అత్యంత జ్ఞానసంపన్నులై ఈ సృష్టిలోకి రావటానికి నిరాకరించారు. ఇలా తన మానసపుత్రులంతా సృష్టికి విముఖులవటం చూసి, చివరకి తానే సృష్టి చేయాలని ప్రారంభించాడు. మొట్టమొదటగా బ్రాహ్మణులను, అగ్నినీ తన ముఖంనుంచి సృష్టించాడు. తన చేతులనుండి, ఊరువులనుండి, పాదములనుండి వరుసగా క్షత్రీయ వైశ్య శూద్రులనే ఇతర వర్ణాలవారిని — ఆ తరువాత సృష్టిచేశాడు.

చంద్రుణ్ణి హృదయంనుంచీ, నేత్రాల్లోంచి సూర్యుణ్ణీ, ముఖంలోంచి వాయువునూ, ప్రాణాన్నీ, నాభిలోంచి అంతరిక్షాన్నీ, తలలోంచి 'ద్యు' లోకాన్నీ, అలానే పాదాల్లోంచి భూమినీ, తన చెవులలోంచి దిక్కుల్నీ సృష్టించాడు. అలాగే సముద్రాలు, పర్వతాలు, నదీనదాలు, అరణ్యాలు సకల వృక్షలతా సమూహాలు వీటన్నిటినీ కూడా ఆ చతుర్ముఖుడు క్రమంగా సృష్టిచేశాడు.

ఈ సృష్టిరచనయంతా నిర్వహించాక బ్రహ్మదేవునికి ఒక గొప్ప విపత్తు కలిగింది. అదేమిటంటే సమస్త జగత్పాలకుడైన విష్ణువు యోగ నిద్రావశుడై ఉండగా ఆయన చెవి గులిమిలోంచి ఇద్దరు మహారాక్షసులు ఉద్భవించారు. వారు భయంకరరూపులై భయంకొలిపేలా వికటాట్టహాసం చేస్తూ మహాబలపరాక్రమంతో, గర్వోన్మత్తులై సమస్త లోకాలకూ ఒక పీడ లాగ దాపరించి జీవులందరినీ బాధించసాగారు. భూసురులైన బ్రాహ్మణులను, సురులైన దేవతలనూ, సాధుసత్పురుషులనూ, తపోదీక్షలో ఉండి తపమాచరించుకుంటున్న ఋషులనూ, హింసిస్తూ, వేదశాస్త్రాలనూ వేళాకోళంచేసి దూషిస్తూ, పరిహసించసాగారు! వారి భీకర గర్జనలకి ముల్లోకాలూ భయంతో గడగడా వణికాయి. ఆ మధు కైటభులిద్దరూ కూడా బ్రహ్మను అమాంతం మ్రింగివేయాలని ప్రయత్నించారు.

## బ్రహ్మ నిద్రాదేవిని స్తుతించటం

ఆ క్రూర రాక్షసుల వికటాట్టహాసాలకు బ్రహ్మ భీతిచెంది, దిక్కుగానక ఇక తనను రక్షించగలవాడు లోకపాలకుడైన విష్ణువేనని, పారిపోయి వైకుంఠాన్ని చేరుకున్నాడు. అక్కడచూస్తే ఆయన యోగనిద్రలో మగ్నుడై వున్నాడు. అప్పుడు తనకు గజాననుడిచ్చిన వరం స్మరించుకుని, ఆ గజాననుని ప్రేరణచేత — శ్రీమహావిష్ణువు నేత్రాలపై నాట్యంచేసే యోగమాయను ఆ రాక్షసులను సంహరింపచేయమని ఇలా స్తుతించసాగాడు.

"ఓ పరమపావనీ! 'స్వాహా' 'స్వధా' రూపాలను ధరించి యజ్ఞాలు చేసేవారిని అనుగ్రహిస్తున్న కరుణామయివి నీవే! సృష్టి, స్థితి, లయా

లను లీలగానూ విలాసంగా చేస్తూఉండేదీ నీవే! వేదములు, కాలము, సప్తస్వరాలూ ఇవన్నీ నీరూపమే! సమస్త ప్రాణికోటియందూ ప్రజ్ఞారూపిణి విగా, త్రిసంధ్యలలోనూ గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ, రూపిణివిగా ప్రాణు లలో 'ప్రాణశక్తి' స్వరూపంగా ఉన్నదీ నీవే!

కరుణామయివైన ఓ మాతా! నీయొక్క ప్రేరణవల్లనే మహావిష్ణువు అవతారాలనెత్తి దుష్టరాక్షసులను సంహరించి, లోకపాలనను నిర్వహిస్తు న్నాడు. అట్టివాడు ప్రస్తుతం నీ ప్రభావానికి వశుడై యోగనిద్రలో మునిగి వున్నాడు. అమ్మా! దురాత్ములైన ఈ రాక్షసులను సమ్మోహనపరచి వారి వధకు మార్గాన్ని సుగమంచేయి! వీరిరువురూ కూడా పూర్వం ఘోరమైన తపస్సును ఆచరించి నావల్ల అమోఘమైన వరాలను పొందివున్నారు. కనుక వీళ్ళు నాచేత అవధ్యులు (చంపబడనివారు). నీవే ఆ శ్రీమహా విష్ణువుకు తగిన ప్రేరణనిచ్చి ఉద్యుక్తుణ్ణిచేసి అతడి చేతిలో వీరు అంతమయ్యేలా అనుగ్రహించు! లోకకంటకులైన ఈ దురాత్ముల బారి నుండి నన్ను కాపాడు!'' అంటూ దీనంగా ప్రార్థించసాగాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'దేవీప్రార్థనం' అనే 16-వ అధ్యాయం.



17

# మంత్రోపదేశం

(మూలం)

## సప్తదశో అధ్యాయః

యావదుత్తిష్ఠతే విష్ణుస్తావత్తాభ్యాం త్రివిష్టపం । 1
ఆక్రాంత మింద్రసదనం యామ్యం కౌభేర మేవచ ॥

తౌ దృష్ట్వా సర్వతో దేవాః పలాయనపరా బభుః । 2
నిపేతుర్భుముః కేచిత్ ముమూర్ఛుశ్చ స్థలుః పరే ॥

తతో దేవ్యా వినిర్ముక్తో నిద్రయా హరిరీశ్వరః । 3
ఆశ్వాస్య సర్వదేవాంన్ తాస్త్రాభ్యాం యుద్ధం చకార హ ॥

అక్రమం సర్వదేవానాం కృతం తాభ్యాం నివారితుం । 4
శేషాదిసర్వనాగానాం మునీనాం యక్ష రక్షసాం ॥

శుశుభే సహరిస్తత్ర శంఖచక్ర గదాధరః । 5
కిరీట కుండల ధరో నీలమేఘ ఘనచ్ఛవిః ॥

తతస్స భగవాన్ శంఖం ప్రదధ్మౌ భృశ వేగవాన్ ।
తేన శబ్దేన మహతా క్షోభయామాస రోదసీ ॥ 6

పాంచజన్య స్వనం శృత్వా బిభిదే హృదయం తయోః ।
తతస్తౌ భయ సంవిగ్నౌ పరస్పర మథోచతుః ॥ 7

భూమండలం చ పాతాళం స్వర్గాణా మేక వింశతిః ॥ 8

ఆక్రాంతాః సమ్యక్ అవాభ్యాం తదాయం నశృతస్స్వనః । 9

వజ్రసార మయం యేన చకంపే హృదయం ద్వయోః ।
తస్మాదనేన యోద్ధవ్యం పురుషేణ బలీయసా ॥ 10

రణ కండూతి శాంత్యర్థం విజయాయ ఇతరాయ వా ।
రిపుమేనం హనిష్యామో గచ్ఛామోవా పునర్భవం ॥ 11

ఏవం తౌ నిశ్చయంకృత్వా యుయుత్సుం హరిమూచతుః ।
రణకండూతిశాంత్యర్థం దృష్టోసి పురుషోత్తమ ॥ 12

కథం ఉత్తమతాం యాసి ఆవయోః దృష్టిగోచరః । 13

**మునిరువాచ :-**

ఇతివాక్యం తయోః శ్రుత్వా జగాద విష్టరశ్రవాః ॥ 14

**హరిరువాచ :-**

సమ్యగుక్తం మహాదైత్యౌ యథేష్టం యుధ్యతాం మయా ।
నహి కామయతే కశ్చి న్మరణం స్వయమాత్మనః ॥ 15

**దైత్యా ఊచతుం:-**

చతుర్భుజోసి దేవేశ బాహుయుద్ధం దదస్వ నౌ । 16

**మునిరువాచ :-**

ఏవముక్తో హరిస్తాభ్యాం తథేత్యాహ ముదాన్వితః ।
త్యక్త్వా ఆయుధాని యుయుధే ద్వాభ్యా మేకః చశ్చతుర్భుజః ॥ 17

జఘ్నతుస్తౌ శిరోమూర్ధ్నా జంఘాభి రథ జంఘయోః ।
కూర్పరౌ కూర్పరై స్స్వయై ర్బాహూ బాహుభిరేవ చ ॥ 18

గుల్ఫౌ గుల్ఫైః కటిం తాభ్యాం నాసికాభ్యాం చ నాసికాం । 19

ముష్టిభ్యాం ముష్టి దేశంచ పృష్టాభ్యాం పృష్టమేవ చ ।
ఆస్ఫోటన వికర్షాభ్యాం బహుభిర్మండలై రపి ॥ 20

ఏవం పరస్పరం యుద్ధం ప్రావర్తత చిరం తథా ।
సహస్రం పంచగుణితం అతిక్రాంతం మహామునే ॥ 21

వర్షాణాం నతు తౌ జేతుం శశాక హరిరీశ్వరః ।
తతో దధార రూపం స గాంధర్వం గీతకోవిదం ॥ 22

గత్వా వనాంతరం చారు వీణాగానం చకార సః ।
హరిణా శ్వాపదాలోకా దేవగంధర్వరాక్షసాః ॥ 23

స్వస్వ వ్యాపార రహితాః సర్వే తత్పరతాం యయుః ।
ఆలాపం తస్య గిరిశః కైలాసే శృతవాన్ ముహుః ॥ 24

నికుంభం పుష్పదంతంచ జగాద భగనేత్రహా ।
ఏతమానయ తం శీఘ్రం యోసౌ గాయతి కాననే ॥ 25

తౌ గత్వా దర్శనం తస్య గృహీత్వా వై తమూచతుః ।
తవ గీతస్వనం శృత్వా శంకరో హర్షనిర్భరః ॥ 26

త్వాం సమాహ్వయతే దేవో గానం శ్రోతుం తవానఘ ।
ఆవాభ్యాం సహ యాహిత్వం శీఘ్రం యామ తదంతికం ॥ 27

తయోర్వాక్య మతిశ్రుత్వా గంధర్వో హరిభక్తిమాన్ ।
తాభ్యాంసహ యయౌ తత్ర యత్ర దేవో మహేశ్వరః ॥ 28

దదర్శ పార్వతీకాంతం చంద్రార్ధకృత శేఖరం ।
గజచర్మ పరీధానం రుండమాలా విభూషితం ॥ 29

రాజత్ పింగ జటాభారం సర్ప యజ్ఞోపవీతినం ।
ననామ భువి విశ్వేశం ప్రణతార్తి వినాశనం ॥ 30

ఉద్థాప్య గిరిశః స్వేన పాణినా తమధోక్షజం ।
ఆసనంచ దదౌ తస్మై పూజయామాస శంకరః ॥ 31

తతో జగాద స హరిరద్య మే సఫలం జనుః ।
యతో అద్య దర్శనంతే అభూ త్ ధర్మకామార్థ మోక్షదం ॥ 32

తోషయామాస తం దేవం గంధర్వో గాన తత్పరం ।
వీణావాద్యైః కలరవైః ఆలాపై ర్వివిధైరపి ॥ 33

స్కందం గణేశ్వరం దేవీం పార్వతీంచ సురాన్ ఋషీన్ ।
తతో మహేశ్వరః ప్రీత్యా విలింగ ప్రకటం హరిం ॥ 34

శంఖచక్ర గదాపద్మ పీతాంబరధరం శుభం ।
ఉవాచ చ హరే మత్తో వృణు కామానశేషతః ॥ 35

దాస్యామి తవ గానేన పరాంముద ముపాగతః ॥ 36

**భృగురువాచ :-**

తతఊచే స్వభూస్తం తు వృత్తాంతం దైత్యయోః పరం । 37

**హరిరువాచ :-**

మయి క్షీరాబ్ధిశయనే నిద్రితే మధుకైటభౌ ।
ఉత్పన్నౌ కర్ణమలతో బ్రహ్మాండం భక్షితుం గతౌ ॥ 38

తేన నిద్రాస్తుతా భర్గ తయాహం ప్రతిబోధితః ।
యుద్ధం చ కృతవాన్ స్తాభ్యాం మల్లలీలా ముపాగతః ॥ 39

నాస్మి శక్తో విజేతుం తౌ తత ఏతత్ కృతం మయా ।
ఇదానీం తద్వధో పాయం వదమే కరుణానిధే ॥ 40

**భర్గఉవాచ :-**

వినాయక మనర్చ్యైవ గతోసి రణభూమికాం ।
శక్తిహీనశ్చ తేనాసి సుభృశం క్లేశవానపి ॥ 41

గణేశం పూజయిత్వైవ వ్రజ యుద్ధాయ మారిష ।
నచ తౌ మాయయా మోహ్యా వశతాం ప్రాపయిష్యతి ॥ 42

మత్ప్రసాదేన దుష్టౌ తౌ వధిష్యసి న సంశయః । 43

**హరిరువాచ :-**

కథం వినాయకం దేవం ఉపాసే భర్గతద్వద । 44

**ఈశ్వరువాచ :-**

ఉక్తా గణేశ్వరస్యైవ మంత్రాణాం సప్తకోటయః ।
తత్రాపిచ మహామంత్రా స్తేష్వపి ఏకాక్షరోమహాన్ ॥ 45

షడక్షరశ్చ భగవన్ తయోరేకం వదామి తే ।
తదేకాక్షరం త్యక్త్వా సిద్ధారి చక్రయోగతః ॥ 46

ఋణం ధనం శోధయిత్వా తం జగాద షడక్షరం ।
మహా మంత్రం గణేశస్య సర్వసిద్ధిప్రదం శుభం ॥ 47

అస్యానుష్ఠాన మాత్రేణ కార్యం తే సిద్ధిమేష్యతి ।
తతో జగామ హరి రనుష్ఠానాయ సత్వరః ॥ 48

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**మంత్రోపదేశో నామసప్తదశో అధ్యాయః**



# మంత్రోపదేశం
## 17-వ అధ్యాయము

అవిధంగా బ్రహ్మదేవునిచే స్తోత్రం చేయబడిన యోగనిద్ర శ్రీమహా విష్ణువుయొక్క కనురెప్పలపైనుండి వైదొలగి అతడిని మేల్కొలిపింది. ఈలోగా దుష్టులైన ఆ మధుకైటభులిరువురూ కలిసి స్వర్గాదిలోకాల నన్నింటినీ ఆక్రమించారు. వారి ధాటికి తట్టుకోలేక దేవతలు తలో దిక్కుకూ చెల్లాచెదరైనారు. వారిలో కొందరు ఆ భయానికి మూర్ఛిల్లారు. యోగనిద్రనుండి మేలుకొన్న శ్రీమహావిష్ణువు అలా ప్రేరేపించబడి ఆ మధుకైటభులిద్దరితోనూ యుద్ధానికి తలపడ్డాడు.

దివ్యమైన తన శంఖచక్రాది ఆయుధాలను చేత ధరించి ఎదపై వైజయంతీమాల శోభిల్లగా నీలమేఘంవంటి శరీరకాంతి కలవాడై, తన చేతితో శంఖాన్ని తీసుకొని భూనభోంతరాళాలు దద్దరిల్లేలా పూరించాడు. ఆ భయంకర పాంచజన్య ధ్వనికి దిక్కులు పిక్కటిల్లాయి; రాక్షసుల

గుండెలూ భయంతో గుబగుబలాడాయి! 'ఇలాటి ధ్వని ఇంతకు ముందెక్కడా వినియుండలేదే? ఇదేదో రాబోయే ఘోర సంగ్రామానికి సూచనగా కనిపిస్తోంది! అందుకని విజయమో వీరస్వర్గమో తేల్చుకోనిదే వెను దిరగరాదు!' ఇలా అనుకుని ధైర్యం తెచ్చుకుని మధుకైటభులిద్దరూ శ్రీ మహావిష్ణువును తమతో ఆయుధాలతోకాక ద్వంద్వయుద్ధానికి దమ్ముంటే రమ్మని సవాలు చేశారు. ఆ తరువాత చాలా భీకరమైన పోరు జరిగింది. అలా దాదాపు ఐదువేలఏళ్ళు ఘోరంగా యుద్ధం చేసినా శ్రీహరి వాళ్ళని ఏమాత్రం వధించలేకపోయాడు. అప్పుడు విష్ణువు గానకళలో కోవిదుడైన గంధర్వుడి రూపందాల్చి అడవిలోకి వెళ్ళి ఎంతో శ్రావ్యంగా వీణాగానం చేయసాగాడు.

ఎంతో మధురమైన ఆ గానమాధుర్యానికి అరణ్యంలోని సకల జంతుజాలమూ, దేవతాగణాలూ తన్మయత్వంతో ఒళ్ళుమరచిపోయారు. కర్ణపేయంగాఉన్న ఈ గానం కైలాసంలో కొలువున్న శంకరుడి చెవులకు కూడా సోకింది! ఆ మాధుర్యానికి చకితుడైన పినాకి,

నికుంభుడు, పుష్పదంతుడూ అన్నపేర్లుగల తన అనుచరులిద్దరినీ ఆ మధురగానం ఆలపిస్తున్న వారిని 'నావద్దకు వెంటనే తీసుకురమ్మని పంపించాడు.

ఆ ఇద్దరు దూతలూ గానాలాపం చేస్తున్న విష్ణుమూర్తి సన్నిధికి ఆగమేఘాలమీద చేరుకొని ఆయనకు శివునియొక్క ఆహ్వానాన్నీ, ఆదేశాన్నీ తెలియజేశారు. వాళ్ళతో కలిసి కైలాసవాసుని సన్నిధికి చేరుకున్నాడు శ్రీమహావిష్ణువు.

అప్పుడు కైలాసశిఖరంపైన భక్తజన సులభుడు, భక్తవశంకరుడు భోలాశంకరుడైన శివుని శ్రీమహావిష్ణువు దర్శించాడు. అక్కడి ప్రమథ గణాల కన్నులకు వెలుగై, దీనజనమందారుడైన పరమశివుడు తన శిరస్సున చంద్రుని ధరించి చంద్రమౌళీశ్వరుడిగా, జడలుగట్టిన దట్టమైన శిరోజాలపైన గంగతో గంగాధరుడిగానూ గజచర్మాన్ని, నాగయజ్ఞోప వీతాన్ని ధరించి పరమశోభాయమానంగా వెలుగొందుతున్నాడు. ఆ సదాశివుడిని చూసి సాష్టాంగంగా నమస్కరించాడు. అప్పుడు భక్తవత్సలు డైన ఆ పరమేశ్వరుడు ఎంతో ఆదరంగా ఆయనను లేవనెత్తి తగు ఆసనమును చూపి కూర్చుండచేసాడు. అప్పుడు ఆ హరి తన మంజుల గానంతో శివుడినికూడా సంతృప్తిపరచాడు.

ఆగానంతో సుబ్రహ్మణ్యుడు, గణేశుడు, పార్వతీమాతకూడా అమిత సంతృప్తులయ్యారు. అపరిమితమైన ఆనందంతో విష్ణువును ఆలింగనం చేసుకొని 'ఓ శ్రీమహావిష్ణూ! నీగానం నన్ను ఎంతగానో అలరించి సమ్మోహనపరిచింది! నీ అభీష్టమేమిటో కోరుకుంటే తప్పక నెరవేర్చ గలను' అన్నాడు

## విష్ణువు మధుకైటభుల గాధను వివరించటం

ఆ తరువాతి కథావృత్తాంతాన్ని భృగుమహర్షి సోమకాంతుడితో ఇలా కొనసాగించాడు.

"ఓరాజా! విష్ణువు శంకరుడి అభయాన్ని విని తన అభీష్టాన్ని ఇలా చెప్పసాగాడు. "ఓ శంకరా! క్షీరసాగరంలో ఆదిశేషునిపై శేషశాయినై నే పవళించి ఉండగా నా చెవిలోని గులిమినుంచి మధుకైటభులనే

దానవులు ఉద్భవించారు. ఆ ఇరువురూ లోకకంటకులుగా మారి సృష్టి కర్తయైన బ్రహ్మనే భక్షించటానికి సన్నద్ధులైనారు. అప్పుడు భీతావహుడైన బ్రహ్మ నా నేత్రములను ఆవహించిన యోగనిద్రను ప్రార్థించాడు. ఆమె చేసిన ప్రబోధంవల్ల మేల్కొన్న నేను వారిద్దరితో చిరకాలం యుద్ధంచేసినా ఏమీ ప్రయోజనమేమీ లేకపోయింది. ఇక నాకు వేరే మార్గాంతరం కనిపించక నీ అనుగ్రహాన్ని కోరి ఈ రకంగా గంధర్వుడిగా గానంచేశాను. కనుక నీవు నాయందు దయతో ఆ దుష్టరాక్షసుల సంహారానికితగ్గ ఉపాయం ఉపదేశించు!"

ఆ మాటలకు ప్రసన్నతతో కూడిన దరహాసం ముఖంపై కాంతు లీనగా భక్తవత్సలుడైన శంకరుడిలా చెప్పాడు

"ఓ హరీ! నీవు యుద్ధానికి సన్నద్ధుడవై వెళ్ళేటప్పుడు ప్రారంభం లో విఘ్నహరుడైన ఆ గజాననుని అనుగ్రహానికై ప్రార్థించటం మరిచావు! అందు వల్లనే నీకు యిన్ని ఇక్కట్లు విఘ్నాలు సంభవించాయి. కనుక యిప్పటికైనా సకలాభీష్టప్రదుడూ, సకల విఘ్ననివారకుడైన ఆ గజాననుని పూజించి ఆతడి అనుగ్రహాన్ని పొంది యుద్ధసన్నద్ధుడివికా! అప్పుడు ఆ గజాననుడే వారిని సమ్మోహితుల్ని చేస్తాడు. నా అండదండలూ ఎటూ నీవెంటనే ఉంటాయి. అందువల్ల ఇక ఆ దుష్టరాక్షసుల వధ సులభ తరం కాగలదు! అభీష్టసిద్ధిరస్తు!" అన్న ఆ అనుగ్రహవచనాలను విని రాక్షసాంతకుడైన శ్రీమహావిష్ణువు ఇలా ప్రశ్నించాడు.

"ఓ దయాళూ! భక్తవరదుడైన ఆ గణేశుని ఎలాగ పూజించాలి? నీవు నాయందు కృపవహించి విధివత్తుగా ఆ విధానం యావత్తూ ఉపదేశించ గోర్తాను!"

ఆ మాటలకు అనుగ్రహదృష్టిని ప్రసగిస్తూ మదనాంతకుడైన శంకరుడిలా బదులిచ్చాడు. "ఓ శ్రీహరీ! భక్తానుగ్రహప్రదములైన గణేశ మంత్రాలు అనేకానేకములున్నాయి. వాటన్నిటిలోకి **ఏకాక్షర గణపతి మంత్రము** అత్యంత ప్రభావయుతమైనది! అలాంటిదే **షడక్షర గణపతి మంత్రము** కూడా! నీకు తగిన మంత్రాన్ని యిప్పుడే ఉపదేశిస్తాను. దానిని అనుష్టించి, గణపతిని ఉపాసించి ఆతని అనుగ్రహాన్ని పొంది కార్యసిద్ధిని చేకూర్చుకొమ్మని ఉపదేశం చేసాడు.

అలా శివుడు ఉపదేశించిన గణేశమంత్రాన్ని స్వీకరించి అనుష్టానానికై శ్రీమహావిష్ణువు కైలాసాన్ని వీడి తగు ప్రదేశాన్ని చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'మంత్రోపదేశ కథనం'** అనే 17వ అధ్యాయం సంపూర్ణం!



18

# సిద్ధక్షేత్ర మహాత్మ్యం

(మూలం)

## అష్టదశో అధ్యాయః

మంత్రానుష్ఠాన క్రమం - సిద్ధక్షేత్రమహాత్మ్యం

**సోమకాంత ఉవాచ :-**

కథం జజాప సహరిం కుత్రావా మంత్రముత్తమం ।
సిద్ధించావాప స కథం వదమేతత్సవిస్తరం ॥ 1

**భృగురువాచ :-**

సిద్ధిక్షేత్ర మితిఖ్యాతం భువి సిద్ధికరం పరం ।
తత్ర గత్వా మహావిష్ణుః తతాప పరమం తపః ॥ 2

ధ్యాయన్ వినాయకం దేవం షడక్షర విధానతః ।
ఆరాధయామాస తదా జిత్వా ఖాని ప్రయత్నతః ॥ 3

బాణాస్త్రేణతు కృత్త్వైవ పూర్వదిగ్బంధమాదృతః ।
భూతశుద్ధి విధాయైవ ప్రాణానాం స్థాపనం తథా ॥ 4

కృత్వా అంతర్మాతృకా న్యాసం ఆధారాది క్రమేణ తు ।
బహిశ్చ మాతృకా న్యాసం మష్టకాది క్రమేణ తు ॥ 5

ప్రాణానాయమ్య మూలేన ధ్యాత్వా దేవం గజాననం ।
ఆవాహనాది ముద్రాభిః పూజయిత్వా మనోమయైః ॥ 6

ద్రవ్యై ర్నానావిధై శ్చైవ శోషశైశ్చోపచారకైః ।
జజాప పరమం మంత్రం విష్ణుర్యోగేశ్వరేశ్వరః ॥ 7

గతే వర్షశతే కాలే పరమాత్మా గణాధిపః ।
ప్రత్యక్షతాం యయా తస్య కోటిసూర్యాగ్ని సన్నిభః ॥ 8

అతి ప్రసన్నహృదయో బభాషే గరుడధ్వజః ।
యా చస్వత్వం వరాన్మత్తో యాం స్త్వం కామయసే హరే ॥ 9

దదామి తానహం సర్వాం స్తపసా తేన తోషితః ।
పూర్వమేవార్పితః స్యాంచే ద్విజయస్తే ధ్రువం భవేత్ ॥ 10

హరిరువాచ :-

బ్రహ్మేశానా వింద్ర ముఖ్యాశ్చ దేవా యంత్వాం ద్రష్టుం । 11

నైవ శక్తాస్తపోభిః తం త్వాం నానారూప మేకస్వరూపం ।
వక్ష్యే వ్యక్తావ్యక్త రూపం గణేశం ॥ 12

త్వం యోఽణుభ్యోఽణుస్వరూపో మమాద్యోవ్యోమాదిభ్య ।
స్త్వం మహాన్ సత్వరూపః సృష్టించాంతం పాలనం ।
త్వంకరోషి వారం వారం ప్రాణినాం దైవయోగాత్ ॥ 13

సర్వస్యాత్మా సర్వగః సర్వశక్తిః సర్వవ్యాపీ సర్వకర్తా పరేశః ।
సర్వద్రష్టా సర్వసంహారకర్తా పాతా ధాతా విశ్వనేతా పితాపి ॥ 14

ఏతాదృశస్య తే దేవ దర్శనాన్మమ సిద్ధయః ।
సంభవిష్యంతి సర్వత్ర తథాప్యేకం వదామి తే ॥ 15

మమైవ యోగనిద్రాంతే శృతేర్మల సముద్భవౌ ।
మధుకైటభౌ మహాసత్వౌ కం తం ఖాదితు ముద్యతౌ ॥ 16

తాభ్యామహం తతో యుద్ధం కృతవాన్ బహువత్సరం ।
తతః క్షీణబలస్త్వాహం శరణం సముపాగతః ॥ 17

అతో యథా తయోర్మత్తో వధః స్యాత్త ద్విచార్యతాం ।
అన్యేషామపి దైత్యానాం జయేన యశముత్తమం ॥ 18

యయా మే కీర్తిరతులా త్రైలోక్యం పావయిష్యతి । 19

**గణేశ ఉవాచ :-**

యద్యత్తే ప్రార్థితం విష్ణో తత్తత్తే భవితా ధ్రువం ।
యశోబలం పరా కీర్తి రవిఘ్నశ్చ భవిష్యతి ॥ 20

**మునిరువాచ :-**

ఏవముక్త్వా మహావిష్ణుం తత్రైవాంతర్దధే విభుః । 21

తత ఆనంద పూర్ణేసౌ మేనే తా వసురౌ జితౌ ।
ప్రాసాదం నిర్మమే తత్ర స్ఫాటికం భూరి రత్నకం ॥ 22

లసత్కాంచన శిఖరం చతుర్ద్వారం సుశోభనం ।
ప్రతిమాం స్థాపయామాస గండకీయోపలైః కృతాం ॥ 23

దేవాశ్చ మునయః సిద్ధి వినాయక ఇతి ప్రథాం ।
చక్రురత్ర యతః సిద్ధిః ప్రాప్తేయం హరిణా శుభా ॥ 24

సిద్ధక్షేత్రం తతస్తత్తు ప్రపథే భువి సర్వశః ।
తతో జగామ సహరిర్యత్ర తౌ మధుకైటభౌ ॥ 25

దృష్ట్వా తా హరి మాయాంతం జహసతు ర్నినిందతుః । 26

మేఘశ్యామం ముఖం తే అద్య దర్శితం నౌ కుతః పునః । 27

ఆవాంతు తే మహాముక్తిం దాస్యావోతః పునః కిల?
లఘుతాంచ ప్రయాతోసి కిమర్థం రణమాగతః ॥ 28

**హరిరువాచ :-**

సహసా దహతే సర్వం లఘురేవ హుతాశనః ।
లఘుదీపో మహద్రాత్రౌ యథా సంహరతే తమః ॥ 29

తథావా మహ మద్యైవ శక్త్రౌ నాశాశయ దుర్మదౌ । 30

**మునిరువాచ :-**

ఇతి తస్య వచశ్ఛృత్వా అతిక్రుద్ధౌ మధుకైటభౌ । 31

సహసా జఘ్నుతు ర్విష్ణుం ముష్టిభ్యాం హృదయే భృశం ।
తతః పునర్మల్ల యుద్ధం తయోస్తస్య వ్యవర్థత ॥ 32

యుద్ధే బహుదినం తాభ్యాం వరం దాతుం సముత్సుకః । 33

ఉవాచ శ్లక్ష్ణయా వాచా హరిస్తౌ మధుకైటభౌ ।
మమ ప్రహారాన్ని యునాం సహోథే బహులా న్సమాః ॥ 34

యువయోః పురుషార్థేన ప్రీతోహం దైత్యపుంగవౌ ।
యువయోః సద్రుశౌనైవ సంభూతౌ నభవిష్యతః ॥ 35

**మధు కైటభౌ ఊచతుః :**

అస్మత్త స్త్వంవరాన్ భూహి దాస్యావస్తాన్ హరే బహూన్ ।
ఆవాంహి తవ యుద్ధేన సంతుష్టౌ చ భ్రుశంత్వయి ॥ 36

**మునిరువాచ :-**

తయోర్వచన మాకర్ణ్య మాయా మోహిత యోర్హరిః ।
శృత్వా బభాణష దైత్యౌః మే వరాన్ దాతూ సముద్యతౌ ॥ 37

తదా మే అవధ్యతాం యాతం వరఏష వృతోమయా ।
తదా సర్వం జలమయం దృష్ట్వాతౌ మధుకైటభౌ ॥ 38

ఊచతుః పరమప్రీతౌ తవ హస్తాన్మృతిశ్శుభా ।
అంతే త్వచ్చింతనా త్వద్యో ముక్తిం యాంతి సనాతనీం ॥ 39

యత్ర నోర్వీ జలమయీ తత్ర నౌ జహి మాధవ ।
సర్వం త్యజావో నోసత్యం సత్యే సర్వం ప్రతిష్ఠితం ॥ 40

మునిరువాచ :-

తయోరిత్థం వచశ్శ్రుత్వా జఘనే తౌ దధార హ ।
చక్రేణ క్షురధారేణ చిఛేద శిరసీ తయోః ॥ 41

తతో దేవా ముముదిరే వవర్షుః కుసుమాని చ । 42

గంధర్వాః ననృతుస్సర్వే జగురప్సరసాం గణాః ।
తతస్తు విష్ణురభ్యేత్య బ్రహ్మాణం పరమేష్ఠినం ॥ 43

కథయామాస వృత్తాంతం సర్వం హర్ష వినిర్భరః । 44

హరిరువాచ :-

యథాఽశక్తో విజేతుం తౌ తదా అహం గిరిశం గతః ॥ 45

శంకరేణోపదిష్టోహం షడ్వర్ణం మంత్రముత్తమం ।
ఆరాధయ మహంతేన దేవం విఘ్నేశ్వరం విభుం ॥ 46

తేన దత్తాఃవరా మహ్యం నానా కామఫలప్రదాః ।
తత్ప్రభావాన్మయా దుష్టౌ నిహతౌ మధుకైటభౌ ॥ 47

స్తుతః సంపూజితః సోథ తత్రైవ అంతర్దధే విభుః ।
విజ్ఞాతో మహిమా తస్య గణేశస్య మహాత్మనః ॥ 48

శంకరస్య ప్రసాదేన హనిష్యే దైత్యదానవాన్ ।
దేవాశ్చ మునయ స్సర్వే స్తుత్వా దేవం గజాననం ॥ 49

బ్రహ్మాణం శంకరం మాంచ యయుః స్వం స్వం నికేతనం ।
య ఇదం శృణుయాన్నిత్యం మహాత్మ్యం పాపనాశనం ॥ 50

కస్మాదపి భయం నస్యా ల్లభతే సార్వకామదం । 51

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**సిద్ధక్షేత్రోత్పత్తి కథనం నామఅష్టాదశో అధ్యాయః**



# సిద్ధక్షేత్ర మహాత్మ్యం
## 18-వ అధ్యాయము

ఎంతో ఆసక్తిగా పై కధను వింటున్న సోమకాంతమహారాజు ఆ కధను రసవత్తరంగా, అనుగ్రహపూర్వకంగా వినిపిస్తున్న భృగుమహర్షితో ఇలా ప్రార్థించాడు.

"ఓ మహర్షిసత్తమా! కైలాసంలో గణేశుని మంత్రోపదేశాన్ని శంకరుడివద్ద అనుగ్రహంగా సంప్రాప్తించుకున్న శ్రీమహావిష్ణువు తన మంత్ర అనుష్టానానికై ఏ ప్రదేశానికి వెళ్ళాడు? ఆమంత్రాన్ని ఎక్కడ అనుష్ఠించి సిద్ధినిపొందాడు? ఏప్రకారంగా ఆ మంత్రసిద్ధి కలిగింది? ఆ విశేషాలన్నీ తమరు నాకు దయతో తెలియజేసి అనుగ్రహిం ండి!"

ఈ ప్రార్థనకు భృగువిలా జవాబిచ్చాడు.

"ఓరాజా! భూమండలంపైన 'సిద్ధక్షేత్ర'మనే పుణ్యభూమి ఉన్నది. ఆ క్షేత్రంయొక్క విశేషమేమిటంటే — అక్కడ ఆచరించిన తపస్సు వల్ల సకలాభీష్టములూ సిద్ధిస్తాయి! అటువంటి మహా మహిమాన్విత సిద్ధక్షేత్రాన్ని చేరుకుని శ్రీమహావిష్ణువు ఎంతోకాలం ఉన్నతమైన సుదీర్ఘ తపస్సును ఆచరించాడు. శివుడిచేత ఉపదేశించబడిన ఆ షడక్షర గణేశ మంత్రాన్ని గణేశమూర్తినీ తన యావత్ శరీరంలోని అంగాలపైనా న్యాసంతో ఆవాహన చేసుకుని, అంతర్మాతృకా, బహిర్మాతృకా న్యాసము లతో, మూలమంత్ర పురస్సరమైన ప్రాణాయామంతో గజాననున్ని తన హృదయంలో ధ్యానిస్తూ, మానసికోపచారపూజను అర్పిస్తూ — ఆ గజాన నుని పరమమంత్రాన్ని నూరుసంవత్సరాలకాలం జపించాడు.

అలా చిరకాలమాచరించిన తపస్సుకు, అతని భక్తిశ్రద్ధలచేత సంతుష్టుడైన గజాననుడు ఒక్కసారిగా కోటిసూర్యులకు సమానమైన వెలుగుతో ఎదుట సాక్షాత్కరించి 'నీ మనోభీష్టములన్నీ అనుగ్రహించ గలను! వలయు వరాన్ని కోరుకొ'మ్మని అనుగ్రహించాడు.

అప్పుడు కార్యార్థియై తపస్సు ఆచరించిన విష్ణువు అంజలి ఘటించి గణేశుని ఇలా స్తుతించాడు.

"సకల దేవతాగణములచే వంద్యనీయుడవైన ఓదేవదేవా! బ్రహ్మ రుద్రేంద్రాదులకుసైతం తమ తపశ్శక్తితో నిన్ను దర్శించుట అసాధ్యం కాగా ఇక సామాన్యులకు — తరమా? నీవు అనేకరూపాలలో భక్తుల పాలిట కల్పతరువువై వారిని అనుగ్రహించి అభిష్టసిద్ధులను ప్రసాదించే ఓ దయామూర్తీ! నీవు వ్యక్తావ్యక్తరూపుడవు. అణువుకన్నా అత్యంత

సూక్ష్మడవు, మహత్తుకన్నా గొప్ప మహిమోపేతుడవు. త్రిమూర్త్యాత్మకుడవై మాద్వారా సృష్టిస్థితిలయములను ఆచరించేది నీవే! అంతర్యామిగా జీవకోటిలో వారి ఆత్మవై వెలుగొందేదీ నీవే! స్థావరజంగమాత్మకమైన జగత్తంతా వ్యాపించినవాడవు! సర్వశక్తిమంతుడవు! ఈ జగత్తంతా నీలోనుంచే ఉద్భవించిన కారణాన జగత్పితవూ, రక్షకుడవూ, పోషకుడవూ కూడా నీవే!

ఓ దేవా! చతురాస్యుడైన ఆ బ్రహ్మ ప్రార్థనమేరకు దుష్టాత్ములైన మధుకైటభులను సంహరించబూని అనేక వేలసంవత్సరాలు ఘోర యుద్ధం చేసినా వారిని ఏమీచేయలేక దిక్కుతోచని స్థితిలో మిమ్ము శరణువేడాను! నాయందు దయతో ఆ రాక్షసవధకు తగిన శక్తియుక్తులను ప్రసాదించు! జయమును, కీర్తిని, నీయందు ఏకాంత భక్తినీ అనుగ్రహించు!"

అంటూ స్తుతించిన శ్రీహరితో

"ఓ వాసుదేవా! నీ అభీష్టం మేరకు సకలమూ సిద్ధించగలదు! ఆ దుష్టదానవ సంహారం నీవల్లనే నిరాటంకంగా జరుగగలదు! నీకు యశస్సూ, బలమూ, ధైర్యమూ, తేజస్సూ కలుగుతాయి! శుభమగు గాక!" అని ఆశీర్వచనపూర్వంగా అనుగ్రహించి ఆ భక్తజనపాలకుడైన గజాననుడు అంతర్ధానం చెందాడు.

గజాననుని అనుగ్రహానికి ఎంతగానో సంతోషంపొందిన ఆ మహా విష్ణువు యిక గెలుపు నిశ్చయమన్న దృఢవిశ్వాసంతో గణేశుడు వరాన్నిచ్చిన ఆ ప్రదేశంలో స్ఫటికమయమైన దేవాలయాన్నొకదాన్ని నిర్మించాడు.

బంగారు గోపురంతో ప్రకాశిస్తున్న ఆ మందిరములో గండకీసంబంధమైన సాలగ్రామంతో గణేశునిమూర్తిని చెక్కించి, అక్కడ సమంత్రకంగా ప్రతిష్టించాడు. ఈ ప్రదేశంలో శ్రీమహావిష్ణువుయొక్క సకల అభీష్టాలూ సిద్ధించటం వల్ల దీనికి సిద్ధక్షేత్రమన్న పేరువచ్చింది.

ఆ తరువాత శ్రీమహావిష్ణువు దుష్టులైన ఆ మధుకైటభులను యుద్ధానికి పిలిచి కవ్వించి, వారితో ఘోరమైన యుద్ధం చేయసాగాడు. ఇలా చాలాకాలం యుద్ధం చేసాక వాళ్ళకు 'మీరు కోరిన వరాల్నిస్తాను కోరుకో'మ్మని అన్నాడు.

అప్పుడు వాళ్ళు పరిహాసంగా ఇలాఅన్నారు.

"ఓహరీ! నీవే మానుంచి ఏదైనా వరాన్నికోరుకో! మేమే నీకు ఓ వరాన్ని అనుగ్రహిస్తాము!"

వారు భగవతీమాయకు లోనైనారని లోలోపలే సంతసించి పైకి మాత్రం వినయంగా అట్లైతే నాచేతిలో మీరిరువురూ వధింపబడే వరాన్ని ప్రసాదించండి!" అన్నాడు. అప్పుడు వారిద్దరూ నిశ్చేష్టులై క్షణకాలం యోచించి

"అట్లైన మమ్మల్ని జలంలేని ప్రదేశంలో వధించు! మేము ఆడిన మాట తప్పనివారం! కనుక అలాంటి ప్రదేశమేదైనా వుంటే అక్కడ నీ అభీష్టం నెరవేర్చుకో!" అన్నారు.

"ఓ సోమకాంత మహారాజా! ఆవిధంగా యోగమాయకు వశ్యులైన ఆ మధుకైటభులను దానవాంతకుడైన ఆ హరి గణేశానుగ్రహం చేత తన తొడపై ఉంచుకొని, చక్రాయుధంతో వారి కుత్తుకలుత్తరిం

చాడు!" ఈ ప్రకారం గణేశానుగ్రహం — ఆతనికి అభీష్టకార్యసిద్ధిని ప్రసాదించింది!

"ఈ రాక్షసుల సంహారానికి దేవదుందుభులు మ్రోగాయి. పుష్ప వృష్టి కురిసింది!" ఈ యావద్వృత్తాంతాన్నీ విష్ణువు అప్పుడు తన కుమారుడైన బ్రహ్మదేవునికి వివరించాడు! తమకు చేసిన ఆ మహోప కారానికై సకల దేవతలూ గజాననుని స్తుతించారు. మహాప్రభావయుత మైన ఈ సిద్ధక్షేత్ర మహాత్మ్యమును ఎవరైతే వింటారో, వాళ్ళు తమ సకల పాపములనుంచీ దుష్కర్మనుంచీ విముక్తులై, భయాన్ని పోగొట్టు కున్నవారై అన్ని మనోభీష్టాలనూ నిస్సందేహంగా పొందగలరు" అంటూ సోమకాంతునికి భృగుమహర్షి వివరించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'సిద్ధక్షేత్ర మహాత్మ్యం' అనే 18-వ అధ్యాయం.



19

# కమలాపుత్ర వర్ణనం

(మూలం)

## ఏకోనవింశో అధ్యాయః

భృగురువాచ :-

శృత్వా ఆఖ్యానమిదం వ్యాసః షడర్ణవిధి మవ్యధ ।
పునరూచే విధాతారం నాతి పూర్ణాశయో యథా ॥ 1

వ్యాస ఉవాచ :-

సిద్ధక్షేత్రస్య మహాత్మ్యం గణనాధస్య చైవహి ।
శృతం పాపహరం సర్వం కామదం పుణ్యవర్ధనం ॥ 2

పునశ్చ వదమే బ్రహ్మన్ వినాయక కధామిమాం ।
తృప్తిం నయాతి పరమాం పిబన్నపి కధామృతం ॥ 3

బ్రహ్మోవాచ :-

పారాశర్యం మహాఖ్యానం కధయామి తవాగ్రతః ।
సర్వదేవాధి దేవస్య గణేశస్య విభోః శుభం ॥ 4

విదర్భదేశే రాజా అభూద్దానశూరో మహాబలీ । 5

నామ్నా భీమ ఇతి ఖ్యాతో దాతా భీమపరాక్రమీ ।
కౌండిన్యనగరే తస్య నివాసో అభూన్మహామతే ॥ 6

సామంతాః కరదాయస్య కరదా ఇతరే నృపాః ।
వాజినాం వారణానాం చ పత్తీనాం కోటయో దశ ॥ 7

రథానామగ్రతో యాంతి యాంతి తత్రుంష్టతోపిచ ।
బ్రాహ్మణానాం సహస్రాణి యమాశ్రిత్య ముదం యయుః ॥ 8

తస్య భార్యా మహాభాగా నామ్నా అభూచ్చారుహాసినీ ।
వికసత్పద్మ వదనా మృగశాబాక్షి లోచనా ॥ 9

బ్రహ్మణ్యా దైవత పరా నిత్యం ధర్మపరాయణా ।
పతివ్రతా పతిప్రాణా పతివాక్యరతా సదా ॥ 10

అపుత్రా దైవయోగేన జాతా సా వరవర్ణినీ ।
తాం నిరీక్ష్య తదా భీమశ్చారు సర్వాంగశోభినీం ॥ 11

అవద ద్దుఃఖితో వాక్యం పుత్రహీనో నృపోత్తమః ।
సర్వం రాజ్యం పరిత్యజ్య గంతవ్యం వనముత్తమం ॥ 12

అపుత్రస్య గతిర్నైవ స్వర్గోవా సుఖమేవ చ । 13

వృథా మేజననీ జన్మ పితాగేహం ధనం కులం ।
విఫలం సకలంకర్మ వినాపుత్రేణ నిశ్చితం ॥ 14

స ఏవం నిశ్చయంకృత్వా ద్వావమాత్యా సమాహ్వాయత్ ।
మనోరంజన నామైకః సుమంతుర్నామకో అపరః ॥ 15

**అన్వీక్షకీం త్రయీవార్తం జానంతౌ షోడశీః కలాః ।**
**అగత్య తత్క్షణాదేవ** నృపం తం నేమతుర్మునే ॥ 16

**తా వువాచ తతో భీమో** రాజ్యంమే పరిపాల్యతాం । 17

మమ వా మమపత్న్యావా దురితం పూర్వజన్మజం । 18

తేన నౌ నాస్తి సంతాన ముభయత్ర సుఖావహం ।
యద్యహం పునరాగంతా తదా తన్మమ దీయతాం ॥ 19

నో చేత్ ఉభాభ్యాం రాజ్యం మే విభజ్య పరిగృహ్యతాం ।
ఏవం నిశ్చత్య సప్నృపః స్వస్తివాచన పూర్వకం ॥ 20

దత్వా దానాని బహుశో బ్రాహ్మణేభ్యో యయౌ పురాత్ ॥ 21

సహభార్యో నృపవరో అమాత్యాభ్యాసహ నాగరైః । 22

గవ్యూతిమాత్రం గత్వాతు విససర్జా ఖిలాంస్తదా ।
అమాత్యో ఊచతూ రాజన్నావాం యావః సహైవతే ॥ 23

సుహృదో నాగరాశ్చైవ రురుదుః భ్రుశ దుఃఖితాః ।
తానువాచ నభీః కార్యాఅమాత్యౌ వే ధిపతీకృతౌ ॥ 24

యథాహం వస్తదైవౌతౌ పాలనం సంకరిష్యతః ।
ఇతి తాన్ సమనుశ్వాస్య తానువాచ పునర్నృపః ॥ 25

దత్తం రాజ్యం భవద్భ్యాం మే రక్ష తం సర్వధాపురం ।
ఇతి సర్వాన్ విసృజ్యైవ సపత్నీకో యయౌ పురాత్ ॥ 26

భ్రమమాణో దదర్శైకం కాసారం కమలైర్యుతం ।
పుష్పితద్రుమ సంశోభి నానా జలచరాన్వితం ॥ 27

తతో అస్య నికటే రమ్యమాశ్రమం పశ్యతశ్శుభం ।
రాజా చ రాజపత్నీ చ సర్వానంద వివర్ధనం ॥ 28

యత్ర వైరం నచక్రుస్తే జాతివైరా గజాదయః ।
సింహాశ్చ నకులా సర్పా బిడాలారః మూషికాదయః ॥ 29

దదర్శతు స్తత్ర మునిం విశ్వామిత్రం కుశాసనే । 30

శిష్యైః పరివృతం శాంతం వేదాధ్యయన తత్పరైః । 31

ప్రణిపత్య మహాత్మానం కృతాంజలిపుటా వుభౌ ।
పునః పునః నమస్కారాన్ పాదౌధృత్వా ప్రచక్రతుః ॥ 32

ఉద్ధాప్య మునిశార్దూలో విశ్వామిత్ర స్తపోనిధిః
ఉవాచ శ్లక్ష్ణయా వాచా విజ్ఞాతార్థో నృపం తథా ॥ 33

విశ్వామిత్ర ఉవాచ :-

భవితా తే సుతో రాజన్ గుణయుక్తో మహాయశాః । 34

కుతస్త్వమాగతః కిం తేనగరం నామ తద్వద ।
తతస్తే పాప నాశార్థం యతిష్యే నృపసత్తమ ॥ 35

భీమ ఉవాచ :-

విదర్భవిషయే స్వామిన్ కౌండిన్యం నగరం మమ । 36

భీమ ఇత్యేవ మేనామ పత్నీయం చారుహాసినీ ।
పుత్రార్థం చ కృతో యత్నస్తపోదాన వ్రతాదిభిః ॥ 37

నాగతా కరుణా దేవే పూర్వజన్మ కృతాదఘాత్ ।
త్యక్త్వా రాజ్యం వనే యాతౌ దృష్ట్వా త్వచ్చరణౌ మునే ॥ 38

భ్రమన్వనాని బహుశో దైవే నేహోపపా దితః ।
సాధూనాం సంగతి స్సద్యో దదాతి ఫలముత్తమం ॥ 39

అతో మే భవదాశీర్భిర్జాతః పుత్రో న సంశయః ।
విద్యావ్రత తపోదాన యజ్ఞస్వాధ్యాయ కారిణః ॥ 40

దయా దమవతస్తేద్య నాశీర్వ్యర్థా భవేన్మునే ।
పరం తు కలుషం మే కిం పూర్వజన్మ కృతం మునే ॥ 41

వద తత్ర ప్రతీకారం సర్వజ్ఞోసి మతోమమ । 42

బ్రహ్మోవాచ :-

ఇతి తస్య వచః శ్రుత్వా విశ్వామిత్రో మహామునిః ।
తస్మైరాజ్ఞె పూర్వకథాం కథయామాస సాదరం ॥ 43

విశ్వామిత్ర ఉవాచ :-

కులధర్మా స్త్వయా త్యక్తాః శ్రీమదాంధేన దుర్మతే ।
వేదే శాస్త్రే పురాణే చ లౌకికే చ ప్రతిష్ఠితా ॥ 44

తే సర్వే పూర్వజా నిత్యం పుపుజుర్గణ నాయకం ।
తస్య క్రోధవశాన్నైవ సంతతి స్తవ జాయతే ॥ 45

యేన తే కులదేవత్వం సంప్రాప్తో అసౌ గజాననః ।
భణే తత్తే మహావీర శృణుసాదర మాదితః ॥ 46

సప్తమః పురుష స్త్వత్తః పూర్వం భీమోనృపో అభవత్ । 47

రూపవాన్ ధనరసంపన్నో వల్లభో నామసత్తమః ।
తస్యాపి బహుకాలేన శిశురేకో అభవన్నృప ॥ 48

అథ తస్య భవద్దేహో మూకో బధిర ఏవచ ।
అతిదుర్గంధవత్ పూయ స్రావవాన్ కుబ్జ ఏవచ ॥ 49

తం దృష్ట్వా జననీ తస్య కమలా దుఃఖితా భ్రుశం । 50

అచింతయ త్స్వాంత మధ్యే లోకే సమ్యగపుత్రతా । 51

నైతాదృశం పుత్రవత్యం శ్లాఘ్యం దుఃఖకరం భృశం ।
మరణం మే విధాత్రా కిం నాస్యవా క్రియతే అధునా ॥ 52

కథంవా ముఖ మద్యాహం దర్శయిష్యే సుహృజ్జనాన్ ।
ఏవం విలపతీ దుఃఖాత్ రురోద భ్రుశదారుణం ॥ 53

శృత్వా తద్రుదితం భర్తా సూతికాగార మాగమత్ ।
దృష్ట్వా తథావిధం బాలం పత్నించ భ్రుశ దుఃఖితాం ॥ 54

బభాష మృదువాక్యేన సాంత్వయన్ కర్మమార్గవిత్ ।
మా దుఃఖం కురు కల్యాణి కర్మాణాం గతి రీదృశీ ॥ 55

పూర్వజన్మ కృతాత్పాపా జ్జాయతే దుఃఖ భాక్ నరః । 56

దుఃఖవాన్ సుఖమాప్నోతి సుఖవానపి తత్పునః । 57

నహి శోచ్యోహి బాలోయం సమీచీనో భవిష్యతి ।
యథాస్య పూర్వవృత్తంస్యా త్తథైవాస్య భవిష్యతి ॥ 58

వయం చ ప్రయతిష్యామో మణిమంత్ర మహోషధైః ।
తపోభిశ్చ జపై ర్దేవపూజా యాత్రావిధానతః ॥ 59

సమ్యక్కర్తుం శిశుం సుభ్రూః ప్రస్తుతం యత్నమాచర ।
ఏవంప్రబోధితా సాధ్వీ త్యక్త్వా శోకం శిశుం తతః ॥ 60

క్షాళయిత్వా జలైఃస్తంతు జహర్ష సఖిభిస్సహ ।
సర్వమాభ్యుదయం చక్రే పుత్రస జననోచితం ॥ 61

పూజయామాస విప్రాన్ స సా తత్పుత్రీ రనేకశః । 62

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే కమలాపుత్ర
వర్ణనం నామ ఏకో నవింశో అధ్యాయః**



# కమలాపుత్ర వర్ణనం
# 19-వ అధ్యాయము

అప్పుడు భృగుమహర్షి ఆ తరువాతి కధాక్రమాన్ని సోమకాంతుడితో యిలా కొనసాగించాడు.

"ఓరాజా! బ్రహ్మవద్దనుంచి పై కధావృత్తాంతాన్ని అంతావిన్న వ్యాసుడు ఇంకాయిలా పరిప్రశ్నచేశాడు.

"ఓసృష్టికర్తా! పరమ శుభదాయకములూ, మంగళప్రదములూ ఐన గణేశభగవానుని లీలలను, మాహాత్మ్యమునూ ఎంతవిన్నా తనివి తీరటం లేదు! పాపహరమూ, సకలాభీష్టప్రదమూ ఐన గణేశుని గాధను యింకా వినగోరుతున్నాను" అన్న కృష్ణద్వైపాయనుడైన వ్యాసమునీంద్రునితో బ్రహ్మ యిలా అన్నాడు.

"ఓ వ్యాసమునీంద్రా! దేవతలందరి పూజలను ప్రధముడిగా అందుకునే పరమ శుభకరములైన వరద వినాయకుడి లీలావిశేషాలను నీ అభీష్టం మేరకు వివరంగా తెలియజేస్తాను శ్రద్ధతో ఆలకించు!

పూర్వం విదర్భదేశాన్ని భీముడు అనేరాజు పరిపాలిస్తూండేవాడు. అతడు మహాబల పరాక్రమసంపన్నుడు. అనేకమంది రాజులను తన శౌర్యపరాక్రమములచేత వశంచేసుకుని వారిని సామంతులుగా చేసి వారు చెల్లించే కప్పం స్వీకరిస్తూ 'కౌండిన్య' మనే పేరుగల నగరాన్ని రాజధానిగా చేసుకుని పాలించేవాడు. ఆ రాజుకు బ్రహ్మాండమైన సైన్యం సర్వసన్నద్ధమై ఉండేది. దానధర్మములయందు వితరణకలిగి అడిగిన వారికి లేదనకుండా యిచ్చే ఆయనను ఆశ్రయించి అనేకమంది వేద పండితులైన బ్రాహ్మణులు జీవించేవారు.

ఆరాజుకు చారుహాసిని అన్న పేరుగల సకల సౌందర్యసద్గుణ శోభితురాలూ, మహాపతివ్రతాయైన భార్యఉండేది. ఏలోటూ లేకుండా సకల సంపదలూ అనుభవిస్తూన్న ఆ రాజదంపతులకు రాజ్యభోగాలు ఎన్ని అనుభవిస్తూన్నా సంతానయోగం మాత్రం కలుగలేదు. ఆరాజు పుత్రసంతానాన్ని కోరి అనేక పూజలూ, వ్రతాలూ, దానధర్మాలూ ఆచరించినా ఏమాత్రం ఫలితం లేకపోయింది. ఎంతకాలం నిరీక్షించినా తమకు సంతానం కలిగే సూచనలేమీ కనిపించక, దిగులుతో కృశించసాగాడు. చివరికి తన మంత్రులైన మనోరంజనుడు, సుమంతులను పిలిచి వారిని రాజ్యభారాన్ని అప్పగించి, బ్రాహ్మణులయొక్క ఆశీస్సులను తీసుకొని స్వస్తిపుణ్యావచన పూర్వకంగా అనేక దానధర్మాలు నిర్వర్తించి అరణ్యాలకు బైలుదేరాడు. ఒక క్రోసుదూరం వరకూ సకల పరి

వారమూనూ తన వెంటరానిచ్చి, ఆతర్వాత వారిని వీడ్కొని పత్నీసహితుడై అరణ్యంలోకి వెళ్ళిపోయాడు. అలా చాలాదూరం నడిచాక అక్కడ ఒకచోట పెద్ద సరోవరాన్ని చూశాడు. రమణీయంగాఉన్న ఆ ప్రకృతి సోయగం ఎంతో నయనానందకరంగా ఆహ్లాదజనకంగా ఉండటమూ, ఆ సరస్సుకు సమీపంలోనే ఒక ఋషియొక్క అశ్రమం ఉండటాన్ని చూచాడు. రాజు ఆ అశ్రమంలోనికి ప్రవేశించి దర్భాసనంపై ఆసీనుడై శిష్యగణములు వేదాధ్యయనం చేస్తుండగా దివ్యతేజస్సుతో వెలుగొందు తూన్న విశ్వామిత్రమహర్షిని దర్శించాడు. భయవినయాలతో ఆ మహర్షి పాదాలకు సాష్టాంగ నమస్కారము ఆచరించి ఆ దంపతులు ఎదుట నిలిచారు. ఆ మహర్షి భూతభవిష్యత్ వర్తమానములు అన్నీ తెలిసిన త్రికాలజ్ఞుడూ సర్వజ్ఞుడై ఉన్నప్పటికీ ఏమీ తెలియనివానిలాగా ఆ రాజునిలా ఆశీర్వదించాడు! "శుభమస్తు! సద్గుణసంపన్నుడైన సత్పుత్రుడు నీకు చిరకాలంలో కలుగగలడు! నీవెవరవో నీయొక్క వివరాలను నాకు తెలియజేయి! నీవెక్కడినుండి వస్తున్నావు? నీనివాసమెక్కడ? ఎందుకని ఇలా అరణ్యంలో సంచరిస్తున్నావు? ఈ వివరాలు ముందు నాకు చెప్పు. నీ బాధానివారణకు పాప నాశనమునకు మార్గం తెలుపుతాను!" అంటూ మందహాసం చేశాడు.

అప్పుడు భీముడనే ఆరాజు తన యావద్వృత్తాంతాన్నీ యిలా తెలియచేశాడు.

"ఓ మునివర్యా! విదర్భదేశంలోని కౌండిన్య నగరానికి ప్రభువునై పరిపాలిస్తున్న నాపేరు భీముడు! ఈమె నాభార్య చారుహాసిని! పుత్ర సంతానం నిమిత్తం ఎన్నిపూజలు వ్రతాలు చేసినా ఆమె కడుపు పండ

లేదు! పూర్వజన్మలో ఏమిపాపం చేసినందువల్లనో మాయింట పాపాయి పారాడలేదు! ఆచింత మమ్మల్ని ఎంతగానో క్రుంగదీసింది. అందుకని విరక్తులమై రాజ్యాన్ని వీడి అరణ్యాలలో తిరుగుతూ, మీ ఆశ్రమానికి రావటం జరిగింది. మహామహిమాన్వితమైన మహాత్ముల దర్శనం అనంత ఫలప్రదమూ, సద్యఃఫలాన్నిచ్చేదీను! తమ అమోఘ ఆశీస్సులు తప్పక ఫలిస్తాయి! ఐనా, నాపూర్వజన్మ దుష్కర్మ ఎలాంటిది? దానికి పరిహార మేమిటి? కృపాసింధువైన తమరు సర్వజ్ఞులేకాదు — త్రికాలదర్శికూడా! నాయందు దయవుంచి ఆ వివరాలు, ప్రాయశ్చిత్త విధానమూ తెలియ జేసి నన్ను కృతార్థుడిని చేయండి!" అంటూ ప్రాధేయపడ్డాడు.

"ఓవ్యాసమునీంద్రా! ఆ మాటలకు విశ్వామిత్రుడిచ్చిన ప్రతివచనం ఏమిటో శ్రద్ధగా ఆలకించు! అంటూ చతుర్ముఖుడు భీముడనే రాజు యొక్క పూర్వజన్మ వృత్తాంతాన్ని విశ్వామిత్రుడు చెప్పినది యావత్తూ వ్యాసమునీంద్రునికి యిలా వివరించసాగాడు.

## భీముడనే రాజుయొక్క పూర్వజన్మ వృత్తాంతాన్ని విశ్వామిత్రుడు వివరించటం

విశ్వామిత్రుడిలా చెప్పసాగాడు : "ఓరాజా! నీవు పూర్వజన్మలో ధనగర్వం, ఐశ్వర్యమదంచేత, తరతరాలుగా మీ వంశంలో కులదేవతగా అర్చించబడుతున్న ఆ గజాననుడి పూజను గర్జించి, నీ కులధర్మమును విడిచివేశావు. మీ పెద్దలుమాత్రం సదాచారులై, వేద శాస్త్రపురాణాలలో చెప్పబడిన ధర్మములన్నీ చక్కగా తెలుసుకొని అనుష్ఠించినవారే! వారు శ్రద్ధాభక్తులతో ఆ గజాననుణ్ణి నిత్యం ఆరాధించేవారు. అటువంటి

వంశపారంపర్యమైన సత్సాంప్రదాయాన్ని వీడటంవల్లనే నీవు ఈజన్మలో సంతాన హీనుడవైనావు.

ఇంకో ముఖ్యవిషయంకూడా చెబుతాను విను! నీకు ఏడుతరాలకు ముందు మీవంశంలో వలభుడనే పేరుగలవాడు రాజుగా ఉండేవాడు. ఆతడు సౌందర్యోపేతుడు, సద్గుణవంతుడు! ధనవంతుడైన ఆతనికి చాలాకాలానికి ఒక శిశువు జన్మించాడు. ఆ పిల్లవాడికి పుట్టుగ్రుడ్డి, మూగ, చెవిటిఅయి శరీరమంతా వ్రణాలతోనూ దుర్గంధభూయిష్టమై ఉండేది. మరుగుజ్జులా ఉన్న ఆ వికృత శిశువునుచూసి ఆతని తల్లియైన కమలయొక్క దుఃఖానికి అంతే లేకపోయింది!

'ఇటువంటి సకల దోషయుతుడైన తనయుడు ఉండటంకన్నా నిస్సంతుగా వుండటమే శ్రేష్టం! ఈ వికృతుడైనట్టి పిల్లవానివల్ల సంతాపమే కానీ సంతోషమెక్కడిది? ఇక ఇటువంటి వికృతరూపుడైన శిశువును లోకులకెలా చూపించగలను? దైవమా! నాకు, ఈతడికి చావైనా రావటం లేదే!' అంటూ గుండెలవిసిపోయేలా ఏడవసాగింది!

ఆ రోదనను విని సూతికాగృహంవద్దకు పరుగెత్తివచ్చిన ఆమె భర్తయైన మహారాజు ఆమెను యిలా ఓదార్చసాగాడు.

'ఓదేవీ! నీవు యిలా దుఃఖింపవద్దు! కష్టములైనా, సుఖాలైనా 'కర్మ ననుసరించే సంప్రాప్తిస్తాయి! మనిషియొక్క భవిష్యత్తంతా వాడు గతంలో సముపార్జించుకున్న సుకృత, దుష్కృతాలను అనుసరించే వుంటుంది! కనుక ఓప్రియా! నీవు ఈపిల్లవాడి గురించి దుఃఖించవద్దు. వీడి దుష్కర్మ అనుభవించటం పూర్తవగానే, వీడు సంపూర్ణ ఆరోగ్య

వంతుడు కాగలడు! దుష్కర్మనివారణకై చేయవలసిన దేవతాపూజలు, తీర్థయాత్రలు, చేయవలసిన మంత్రానుష్ఠానమూ, వాడవలసిన ఔషధాలనూ వాడి మన ప్రయత్నం మనం శక్తివంచనలేకుండా — చేద్దాం! కనుక ఓదేవీ! ఈ శిశువుకి ప్రస్తుతం చేయవలసిన పరిచర్యలన్నీ చేయి!" ఇలా భర్తచేత సముదాయించబడిన ఆరాణి దుఃఖాన్ని అణుచుకుని, ఇష్టసఖులతోకూడి ఆ బాలుడికి స్నానాదికాలు చేయించి శుభ్రపరచింది. ఆ రాజుకూడా శిశువు పుట్టినప్పుడు చేయవలసిన జాతకర్మను నిర్వర్తించి, బ్రాహ్మణులందరికీ భూరి దానధర్మాలనిచ్చి పూజించి ఆ భూసు రుల ఆశీస్సులను పొందాడు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'కమలాపుత్ర వర్ణనం' అనే 19-వ అధ్యాయం.



20

# దక్షస్తుతి

(మూలం)

## వి-శో అధ్యాయః

బ్రహ్మోవాచ :-

తతస్స బ్రహ్మణాన్ సాధూన్ దైవాజ్ఞాన్ వేదనిష్ఠితాన్ ।
ఆ కార్య ప్రతిపూజ్యాదౌ రత్నవాసో ధనాదిభిః ॥ 1

పృష్ట్వా తాన్ దక్ష ఇత్యేవ నామచక్రే సుతం స్యసః ।
జపమంత్ర ప్రయోగాంశ్చ చకార ఔషధ సంచయాన్ ॥ 2

స్వయంచ ద్వాదశాబ్దాని చకార పరమం తపః ।
పుత్ర రోగ విముక్త్యర్థం సంతానస్య ప్రవృద్ధయే ॥ 3

నాపశ్య ద్రోగనిర్ముక్తం పుత్రం తం స యధాన్నృపః ।
తదా నిర్వేదమాపన్నో జగాద క్రోధమూర్ఛితః ॥ 4

గచ్ఛః మే భవనాద్రాజ్ఞీ కమలే పుత్రసంయుతా ।
నేమం పుత్రం నచ త్వాహం ద్రష్టుం శక్త ఇతః పరం ॥ 5

ఇతి నిర్భర్త్సితా త్వితేన వల్లభేన తదాసుతం ।
అదాయ కమలా తస్మా న్నగరా త్ప్రస్థితా వనం ॥ 6

రుదతీ శోకసంవిగ్నా దుఃఖితా అశ్రుప్రమార్జతే । 7
వహంతీ పృష్ఠభాగే తం క్షుత్ తృష్ణ శ్రమవికర్శితా ।

గ్రామాత్ గ్రామాంతరం యాతా భిక్షాచారా భృశాతురా ।
తస్కరైర్లుంఠితం తస్యా వసనం భూషణాదికం ॥ 8

తతో గ్రామాంతం గత్వా న్యస్య పుత్రం శివాలయే ।
భిక్షాయై పురమధ్యే సా భ్రామన్నృప వల్లభా ॥ 9

కదాచిత్ సహ పుత్రేణ భిక్షితుం సా పురంయయౌ ।
కస్యచి ద్ద్విజముఖ్యస్య వాయుస్పర్శేన సోర్భకః ॥ 10

భక్తే రతిసయాత్స్పాక్షాత్ కృతోలంబోదరేణ సః ।
చక్షుష్మాన్ శ్రుతిసంపన్నో దివ్యదేహో భవత్తదా ॥ 11

జహర్ష కమలా త్యక్త్వా సర్వం దుఃఖం నిరీక్ష్యతం ।
మంజులాం సుఖదాం వాచ ముచ్చరంతం ముహూర్ముహుః ॥ 12

తర్కయామాస కమలా మణిమంత్ర మహౌషధైః ।
అనుష్ఠానై ర్మహాహోమై ర్న సమ్యగ్యో బభూవహ ॥ 13

స కథం మారుత స్పర్శాత్ సమీచీనో భవకృుతః ।
అథ తం పురుషం క్వాహం ద్రక్ష్యే దుష్కర్మ నాశనం ॥ 14

ఇత్యుక్త్వా సుతమాలింగ్య సా తస్థౌ విగతజ్వరా ।
తమాదాయ గతా భిక్షాంకర్తుం తన్నగరే పునః ॥ 15

నాగరా భోజయామాసు రుభావామంత్ర్య సాదరం ।
నానాపక్వాన్న శాకాద్యైః శర్కరా ఘృత పాయసైః ॥ 16

ఏవం ప్రతిదినం తౌతు భుక్త్వాను దివసం ముదా ।
లేభే తుర్ధన వస్త్రాణి నూతనాని వరాణిచ ॥ 17

తతో అపృచ్ఛన్నాగరికః పితుస్తే నామ మేవద ।
కోదేశః కింపురం జ్ఞాతః కాచ తే వృత్తమేవ చ ॥ 18

ఇతి తద్గిరమాకర్ణ్య దక్షో నామ తమబ్రవీత్ ।
తతో మాతరమాగమ్య పితరం నగరం కులం ॥ 19

వృత్తంచ పరిపప్రచ్ఛ తతస్తం పునరబ్రవీత్ ।
కర్నాటే భానునగరే వల్లభో మే పితా మహాన్ ॥ 20

క్షత్రియోబలసంపన్నః ఖ్యాతో రిపుబలార్దనః ।
ఉత్పన్నోహం యదా బ్రహ్మ న్నంధో బధిర ఏవచ ॥ 21

అనేక క్షత సంపన్నో మాతా త్యక్తుం తదోద్యతా । 22

పిత్రా నిషేధితా సాచయత్నం బహు తథాకరోత్ ।
ద్వాదశాబ్దం తపస్తప్త్వా పితా పుణ్యం న్యవేదయత్ ॥ 23

నచ మే పాటవం దేహే పశ్యతి స్మ పితా యదా ।
తదా విసర్జయామాస మాతరం మాం చ నాగర ॥ 24

ఇతి సర్వం జగౌ తస్మై దక్షో మాతృముఖోద్గతం ।
అత్రాహం సుభగో జాతో వాయుస్పర్శేన కస్యచిత్ ॥ 25

శ్రుత్వైవం తు గతే తస్మిన్ పురుషే పురవాసిని ।
దక్షో జగామ త్వరితో మాతరం ప్రతినందయన్ ॥ 26

తతస్తన్నగరే తౌద్వౌ ఉపదిష్టౌ ద్విజన్మనా ।
గణేశారాధన విధౌ కరుణాయుత చేతసా ॥ 27

తతః సా కమలా దక్షో నిర్వాణం పరమాస్థితౌ ।
ఏకాంగుష్ఠేన తపసా గణేశారాధనే రతౌ ॥ 28

దేవ నామ చతుర్థ్యంతం ఓంకారం పల్లవాన్వితం ।
అష్టాక్షరం పరం మంత్రం జపంతౌ భక్తి తత్పరౌ ॥ 29

వాయుభక్షౌ శుష్కతనూ నిరీక్ష్య భగవాంన్ తదా ।
ఆవిరాసీ త్త్రయోరగ్రే కరుణాబ్ధిః వినాయకః ॥ 30

చతుర్భుజో మహాకాయో వారణాస్యో అతి సుందరః ।
అనేక సూర్యసంకాశో నిశిసూర్య ఇవోదిత ॥ 31

రత్నకాంచన ముక్తావన్ముకుట భ్రాజి మస్తకః ।
పీత కౌశేయ వసనో హాటకాంగద భూషణః ॥ 32

ఏకజానుని పాతేన సంనివిష్టో మహాసనే ।
కటిసూత్రం కాంచనీయం ముద్రికాం రత్నసంయుతాం ॥ 33

మాహా హిం జఠరే బిభ్రదేకదంతం గజార్ధకం ।
ఏవం రూపం దదృశతుః పునశ్చ ద్విజరూపిణం ॥ 34

జగాద సద్విజఃతౌతు భవన్నిర్వాణ తోషితః ।
ఆగతో అహం వరందాతుం వృణుతం మనసీప్సితం ॥ 35

**విశ్వామిత్ర ఉవాచ :-**

ఏవం ప్రసన్నే విఘ్నేశే ప్రత్యక్షే ద్విజరూపతః ।
ననామ వరయా భక్త్యా భణద్బద్ధాంజలిశ్చ తం ॥ 36

**దక్ష ఉవాచ :-**

పూర్వజన్మ కృతం పుణ్యం ఫలితం మే ద్విజోత్తమ ।
యన్మయా దర్శి రూపం తే ద్వివిధం పరమం మహత్ ॥ 37

నైనాయకంచ వైప్రంచ జన్మమే జనిసార్ధకం ।
కారణానాం పరం త్వం చ కారణం ఛందసామపి ॥ 38

పరం జ్ఞేయం పరం బ్రహ్మ శృతిగమ్యం సనాతనం ।
త్వమేవ సాక్షీ సర్వస్య సర్వస్యాంతర్బహిస్తథా ॥ 39

త్వమేవ కర్తా కార్యాణాం లఘుస్థూల శరీరిణాం ।
నానారూప ఏక రూపీ త్వం విరూపశ్చ నిరాకృతిః ॥ 40

త్వమేవ శంకరో విష్ణుః త్వమేవేంద్రో నలోర్యమా ।
భూవాయు ఖస్వరూపోపి జలసోమర రూపవాన్ ॥ 41

విశ్వకర్తా విశ్వపాతా విశ్వసంహార కారకః ।
చరాచర గురో ర్గప్తా జ్ఞానవిజ్ఞాన వానపి ॥ 42

భూతం భావి భవచ్చైవ త్వమేవేంద్రియ దేవతాః ।
కలా కాష్ఠా ముహూర్తాశ్చ శ్రీ ధ్రుతిః కాంతి రేవచ ॥ 43

త్వమేవ సాంఖ్యం యోగశ్చ శాస్త్రాణి శృతిరేవచ ।
పురాణాని చతుష్షష్టి కళా ఉపనిషత్తథా ॥ 44

త్వమేవ బ్రాహ్మణో వైశ్యః క్షత్రియః శూద్ర ఏవచ ।
దిశోవిదిశ స్త్వంక్షేత్రం పుణ్యక్షేత్రాణి యాన్యు త ॥ 45

త్వం ప్రమేయో అప్రమేయశ్చ యోగినాం జ్ఞానగోచరః ।
త్వమేవ స్వర్గః పాతాళం వనాన్యుపవనానిచ ॥ 46

ఓషధ్యోథ లతా వృక్ష్యా కందమూల ఫలాని చ ।
అండజా జారజా జీవాః స్వేదజా ఉద్భిజా అపి ॥ 47

కామః క్రోధః క్షుధా లోభః దంభో దర్పో దయా క్షమా ।
నిద్రా తంద్రీ విలాసశ్చ హర్షః శోక స్త్వమేవచ ॥ 48

**విశ్వామిత్ర ఉవాచ :-**

ఇతి దక్షవచశ్రుత్వా సుప్రసన్నో వినాయకః ।
మేఘగంభీరయా వాచా స్మయన్నివ జగాద తం ॥ 49

**గజానన ఉవాచ :-**

ప్రీతో అహం తే మహాభాగ్య స్తుత్యా గంభీరయా నయా ।
వరం దాతుం సముత్కంఠ స్తథాపి సదదామితే ॥ 50

యద్యహం వరదః స్యాంతే కృధ్యేద్భక్తో మమోపరి ।
సేవ దాస్యతి వరం యదంగస్య ప్రభంజనాత్ ॥ 51

దివ్యదేహమను ప్రాప్త శ్చక్షుశ్శ్రోత్ర సమన్వితః ।
జాతస్త్వం తస్య నామాపి వదామి ముద్గలేతి చ ॥ 52

స ధ్యాతమాత్రో విప్రేశః స్వరూపం దర్శయిష్యతి ।
యాన్ యాన్ కామయసే కామాన్ సతే సర్వాన్ ప్రదాస్యతి ॥ 53

ఇత్యుక్త్వా పరమాత్మాసౌ తత్రైవాంతరధీయత । 54

తస్మిన్నంతర్హితే దక్షో రురోద భృశ దుఃఖితః । 55

దరిద్రేణ నిధౌ లబ్ధే గతే తస్మిన్యథైవసః ।
గతాయాం గవి వత్సోవా రోరవీతి యథా భృశం ॥ 56

ముంచన్ అశ్రూణి నేత్రాభ్యాం పపాత ధరణీతలే ।
క్వగతః క్వగత ఇతి ముహుర్జల్పన్ వినాయకః ॥ 57

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**దక్షస్తుతిర్నామ వింశతి తమో అధ్యాయః**



# దక్షస్తుతి
## 20-వ అధ్యాయము

బ్రహ్మ యిలా చెప్పసాగాడు : "ఓవ్యాసమునీంద్రా!

అలా సకల వైకల్యాలతోనూ జన్మించిన కుమారుడికి జాతకర్మను నిర్వర్తించి, జ్యోతిషవేత్తలనూ, వేదవేదాంగ పారంగతులైన సద్బ్రాహ్మణులను రావించి, వారిని యధావిధిగా పూజించి, తగు విధములైన అమూల్య రత్నరాసులతోనూ ధనధాన్యాదికములతోనూ సత్కరించాడు భీముడనే ఆ మహారాజు! వేదవిదులైన వారి అనుమతితో తన కుమారుడికి 'దక్షుడు' అన్న నామకరణం వైభవోపేతంగా చేశాడు.

ఆ తరువాత తన కుమారుడియొక్క రోగనివృత్తి నిమిత్తమై జప, మంత్ర ప్రయోగాలనూ, ఓషధీహోమాలనూ, ఔషధసేవనూ చేయించి, బాధానివారణకై తానే స్వయంగా పన్నెండు సంవత్సరాలు దీక్ష వహించి కఠినమైన తపస్సు ఆచరించాడు. ఐనా ఏమాత్రం ప్రయోజనం లేక

పోవటంతో విరక్తిచెందాడు. చివరికి అతనికి భార్యాపుత్రులపైన యెనలేని క్రోధం కలిగింది. భార్యాబిడ్డలను తన భవనంనుంచి 'మీముఖం నాకు చూపించకండి!' అంటూ వెళ్ళగొట్టాడు. అలా భర్తచేత తిరస్కరించబడిన కమల అన్న ఆ రాజపత్ని వేరే గత్యంతరంలేక తన కుమారునితో కలసి అరణ్యాలకు వెళ్ళిపోవటానికి ప్రయాణమైంది.

తన కుమారుణ్ణి వీపుకు కట్టుకొని ఎంతో దుఃఖపడుతూ వెంట తీసుకొని వెళ్ళసాగింది. ఆకలిదప్పులకు కృశించి, ఒక గ్రామాన్నుంచి మరో గ్రామానికి భిక్షిస్తూ పోసాగింది. మార్గమధ్యంలో ఆమెవద్దనున్న విలువైన ఆభరణాలనూ, చీనిచీనాంబరాలనుకూడా దొంగలపహరించారు. ప్రతి గ్రామంలోనూ తన కుమారుణ్ణి ఒక ఆలయంలో ఉంచి, తాను మటుకూ భిక్షచేసి తీసుకువచ్చేది. ఒక్కోసారి కుమారుణ్ణికూడా తనవెంటే భిక్షకు తీసుకెళ్ళేది. ఇలా తన కుమారుడితో భిక్షాటనంకోసం తిరుగు తూండగా ఒకనాడు ఒకానొకగ్రామంలో ఒక గజానన భక్తుడైన శ్రోత్రీయ బ్రాహ్మణుడు తటస్థపడతాడు. అతి పవిత్రుడు, భగవదనుగ్రహాన్ని పూర్తిగా సిద్ధించుకున్న ఆ బ్రాహ్మణోత్తముని మీదనుంచి వీచినగాలి సోకగానే ఆ రాజపత్ని వెంటనున్న దక్షుడికి కన్నులకు దృష్టీ, చెవులకు శబ్ద గ్రాహకత్వమూ కలిగి, మాటకూడా — వచ్చింది. అతని శరీరానికి సైతం స్వస్థతకలిగి దివ్యసుందరమైన దేహం కలవాడైనాడు.

అలా స్వస్థుడైన తన కుమారుడు మృదుమధురంగా మాట్లాడ నారంభించటం చూసిన ఆమె సంతోషానికి మేరలేకపోయింది. ఎంత గానో ఎదురుచూచిన శుభఘడియ అలా ఎదురవటం ఆమెకు ఊహిం చని వరమే అయింది. "మణి మంత్రౌషధాలవల్ల, జపహోమాదికాల

వల్ల, సిద్ధించని ఆరోగ్యం, కేవలం ఈ బ్రాహ్మణుని శరీరంపైనుండి వీచిన గాలి స్పృశించటంవల్లనే — సిద్ధించిందికదా! ఇట్టి తీవ్రదుష్కర్మను నశింపచేసిన ఈ మహనీయుని మహత్తును నేనేమని పొగడగలను?" అనుకుంటూ తన తనయుడిని అక్కున చేర్చుకుని తనివితీర ముద్దాడి ఎంతో ఆనందభరితురాలైంది.

ఆ మర్నాడు రోజూలాగానే బిక్షాటనకని వెళ్ళిన కమల అన్న ఆ రాజపత్నికి ఎంతో సాదరమైన ఆహ్వానంతోపాటూ షడ్రసోపేతమైన విందు భోజనంకూడా ఒకరింట లభించింది. అది మొదలు, ప్రతీరోజూ అలాగే నానారకములైన పిండివంటలతో ఆ తల్లీకొడుకులకు ఆ ఊరిలోవారు ఆదరణ పూర్వకంగా ఆహారమునిచ్చేవారు. ఇలా కొన్నాళ్ళు గడిచాక ఒక పురజనుడు దక్షుడి యొక్క పుట్టుపూర్వోత్తరాలగురించి ప్రశ్నించాడు. ఆ బాలకుడు ఇంటికివచ్చి తన తల్లినడిగి తనతండ్రి, నగరము మొదలైన వివరాలన్నీ తెలుసుకొని వెళ్ళి తిరిగి పురజనులతో ఇలా అన్నాడు.

"కర్ణాటకదేశంలోని భానునగరానికి రాజైన వల్లభుడనేవాడు నాకు తండ్రి! క్షత్రీయులము మేము! మహాబలపరాక్రమోపేతుడు, కీర్తిమంతుడూకూడా! కమల అన్నపేరుగల ఈమె నను కన్నతల్లి! ఇక నాపేరు దక్షుడు. నేను పుట్టుకతోనే మూగ, చెవిటి, అంధత్వం మొదలైన వికారాలతో జన్మించాను. ఇక నాఈ శరీరం యావత్తూ వ్రణాలతాలూకు రసిఓడుతూ, చీమునెత్తుర్లు కారుతూ, దుర్గంధపూరితంగా ఉండేది. నా తల్లి నన్ను పుట్టగానే ఏవగించుకున్నా — తండ్రి ఆమెకు నచ్చచెప్పి తాను పన్నెండు సంవత్సరాలకాలం నా ఆరోగ్యంనిమిత్తం శతవిధాల ప్రయత్నించి, విఫలుడై, చివరికి అగ్రహోదగ్రుడై మమ్మల్ని ఇద్దరినీ 'ముఖము చూపించవద్దంటూ' పురంనుంచి వెళ్ళగొట్టాడు. అరణ్యాల

లోనూ, గ్రామాలలోనూ అలమటిస్తూ మాకున్న సంపదయావత్తూ పోగొట్టుకొని, ఈ ఊరు చేరుకున్నాము. ఇక్కడికి రాగానే ఒకానొక మహా పురుషుని శరీరంపైనుండి వీచినగాలి సోకటంవల్ల నేను పరిపూర్ణ ఆరోగ్య వంతుడినైనాను! ఇలా ఈ దివ్యదేహం పొంది విరాజిల్లసాగాను." ఈ విధంగా దక్షునినోట ఆశ్చర్యకరమైన అతని యావద్వృత్తాంతమూ విని తమ యిళ్ళకు వెళ్ళిపోయారు.

ఆ తరువాత ఆ తల్లీకొడుకులిద్దరూ ఆ మహిమోపేతుడైన బ్రాహ్మ ణోత్తముని, ఆశ్రయించి శ్రీ గణేశ ఆరాధనా విధానమును **ఉపదేశంగా పొందారు**. అత్యంత శ్రద్ధాభక్తులతో వారిద్దరూ నిరాహారులై గణేశ **అష్టాక్షరీ మంత్రాన్ని** తదేక దీక్షతో అనుష్టించారు. శరీరం శల్యావశిష్టమైనా ఏమాత్రం సంశయం లేకుండా పాదనఖాంగుష్టమై జపించినవారి భక్తికి సంతుష్టుడైన గజా ననుడు అనుగ్రహించి వారికి సాక్షాత్కరించాడు.

## కమలా, దక్షులకు గజాననుడు సాక్షాత్కరించుట

ఆ గజాననుని మూర్తి దివ్యమంగళ స్వరూపుడై, పెద్ద శరీరము తోనూ ఏనుగుముఖాన్నీ ధరించి కోటిసూర్యులతో సమానమైన తేజస్సుతో ప్రకాశిస్తూ, ఎఱ్ఱటి వస్త్రమునుదాల్చి ఉన్నాడు. బంగారు భుజకీర్తులనూ, బాహుపురులూ ధరించి, శిరస్సుపై రత్నమణిఖచితమైన కిరీటం ధగ ధగాయమానంగా, అలంకరించగా, తన ఒకపాదం సింహాసనం క్రింద ఉన్న పాదపీఠంపై జాపి మరోపాదాన్ని మోకాలుకు తాకించి ఏకదంతము తో బంగారు మొలత్రాటితోనూ, శేషుని తన ఉదరమునకు చుట్టుకొని, వ్రేళ్ళకు ఉంగరాలతో కరుణావృష్టిని కురిపించే నేత్రాలతో ప్రసన్నుడై దర్శనమిచ్చాడు.

మళ్ళీ అంతలోనే తిరిగి బ్రాహ్మణరూపంలోనూ కనబడ్డాడు. అప్పుడు ఆ బ్రాహ్మణశ్రేష్టుడు ఆ తల్లీ కొడుకులను ఉద్దేశించి ఇలా పలికాడు.

"మీ తపోనిష్ఠకు సంతసించాను! మీ మనోభీష్టం నెరవేర్చ దలచాను! మీకు కావలసిన వరాలను నిస్సంకోచంగా కోరుకోండి!"

అప్పుడు విశ్వామిత్రుడు తిరిగి యిలా చెప్పసాగాడు. "ఓ భీమ రాజా! అలా ప్రత్యక్షమైన గజాననుని చరణాలకు సాష్టాంగనమస్కారంచేసి తల్లీ తనయులిద్దరూ ఇలా స్తుతించారు!"

దక్షుడిలా అన్నాడు : "ఓ బ్రాహ్మణోత్తమా! మాపూర్వ పుణ్యము ఈనాటికి ఫలించింది! రెండురకాలుగాగల నీ మహత్తర స్వరూపాన్ని (వైనాయకమును, బ్రాహ్మణరూపాన్నీ) చూడటంచేత నా జన్మ సఫల మయింది!

ఓదేవా! నీవు కారణములకే కారణమైనవాడివి! వేదాలకు సైతం కారణభూతుడైనవాడివి! సర్వయోగిశ్రేష్టులకు జ్ఞానంతో చేరవల్సిన గమ్యమే నీవు! అంతర్ బహిర్విశ్వం యావత్తుకూ సాక్షీభూతుడవు! సాకారమూ నిరాకారమూ నీరెండు రూపాలే! త్రిమూర్త్యాత్మకుడవు! సృష్టికర్తవైన బ్రహ్మవు, పాలనచేసే విష్ణుస్వరూపుడవూ, ప్రళయసంహారకుడవైన రుద్ర మూర్తివీ నీవే!

పంచభూతాలైన **భూమి, జలము, అగ్ని, వాయువూ, ఆకాశమూ** ఈ ఐదూ నీలోనివే! సూర్యచంద్రులూ, నీ స్వరూపమే! జ్ఞానవిజ్ఞాన సంపన్నుడవు, కాలస్వరూపుడవూ! ఇంద్రియాధిష్టాన దేవతలంతా నీ అంశలే! సకల శాస్త్రములు, వేదములు, పురాణముల సారమూ నీవే!

చతుషష్టి కళలూ నీరూపమే! సకల లోకాలోనూ నీవుకానిదేదీలేదు! అన్ని పుణ్యక్షేత్రాలలో తీర్థయాత్రా ఫలమెంతటిదో, నీ పాదములయందు భక్తిచేయటం అటువంటి దివ్యఫలాన్నిస్తుంది. అనాదివీ, విభజించబడని వాడివీ ప్రమాణాలన్నిటికీ అతీతుడవూ కేవలం జ్ఞానంవల్లనే గోచరమయ్యే వాడివీ నీవే! చతుర్విధ జీవరాసులుగానూ ఉన్నది నీవే! జీవులలో అరిషడ్వర్గాలద్వారా బద్ధులను చేసేదీ నీవే! నీ అనుగ్రహానికి ప్రాప్యులైన వారికి ఇక అసాధ్య మేదీలేదు!" అంటూ తనను స్తుతించిన ఆ దక్షుడితో వినాయకుడిలా అన్నాడు.

"ఓ బాలకా! నీ ఈ స్తుతికి ఎంతో ప్రసన్నుడనైనాను! నీ కోరిక ఎట్టిదైనాసరే తీర్చగలను! ఐనా నీకిప్పుడు వరం మాత్రం నేను యివ్వను! నీకు అలా వరాన్నిస్తే నాభక్తుని (నీకు ఈ రూపం ఎవరి స్పర్శవల్ల లభించిందో) చిన్నబుచ్చినట్లవుతంది! ఆ నా ప్రియభక్తునిపేరు ముద్గలుడు. నీవు అతన్ని స్మరించిన వెంటనే నీ ఎదుట నిలచి నీకోరిక లన్నీ నెరవేర్చగలడు! నీకు శుభమౌగాక!" అంటూ అంతర్ధానం చెందాడు.

పేదకు దొరికిన పెన్నిధిలా క్షణంలో సాక్షాత్కరించి, మరుక్షణమే అంతర్ధానమైన తన తపఃఫలం కన్నులకు దూరమౌటంతో నిర్ఘాంత పోయిన ఆ దక్షుడు మూర్ఛిల్లాడు. ఆతరువాత కొంతసేపటికి తేరుకొని, 'వినాయకుడెటుపోయాడా?' అంటూ పరిపరివిధాల చింతించసాగాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'దక్షస్తుతి'** అనే 20-వ అధ్యాయం.



21

# మంత్రోపదేశ వర్ణనం

(మూలం)

## ఏకవింశో అధ్యాయః

**విశ్వామిత్ర ఉవాచ :-**

ఇతస్తతో భ్రమన్ ధావన్ వల్లభస్య అజస్తదా ।
నవివేద గతం వస్త్రం భూషణంచాతి విహ్వలః ॥ 1

పప్రచ్ఛ బ్రాహ్మణాన్ మార్గే వృక్షాంశ్చైవ వినాయకం ।
వినాయకో గతః కుత్ర క్వచిత్ దృష్టో గదంతు మే ॥ 2

ఏవం స భ్రాంతహృదయో భ్రమచ్చక్షు ర్ద్విజోత్తమ ।
నిపపాత ధరాపృష్ఠే క్షణం విగత చేతనః ॥ 3

ఏతస్మిన్నంతరే స్వప్నే పశ్యద్బ్రాహ్మణ మగ్రతః ।
దత్తం తవేప్సితం బాల ముద్గలేన మయాహి తత్ ॥ 4

యత్ త్వయా యాచితంపూర్వం విఘ్నేశాత్‌దృష్టిగోచరాత్ ।
ఇత్యుక్త్వా ప్రస్థితే తస్మిన్ బ్రాహ్మణే నృపసత్తమ ॥ 5

సుప్తోత్థిత ఇవ ప్రాయో దక్షో హృష్టమనా భవత్ ।
కస్మైచి త్పరిపప్రచ్ఛ త్వరితాయ ద్విజాతయే ॥ 6

అంతికం దర్శితం తేన బహుశిష్యోప శోభితం । 7

ముద్గలస్యాతి భక్తస్య గజానన రతస్యచ ।
ఆశ్రమం పరమం దివ్యం సర్వసత్వా అభయప్రదం ॥ 8

ముద్గలం మనసా ధ్యాయన్ భ్రమన్ యాతస్తదాశ్రమం ।
నానాశ్చర్య యుతం రమ్యం అలకా నందనాతిగం ॥ 9

దదర్శ ముద్గలం తత్ర పరార్ధ్యాసన గం ద్విజం ।
వేదవేదాంగ తత్వజ్ఞం సర్వశాస్త్ర విశారదం ॥ 10

యోగాభ్యాస బలైర్నానారూపిణం సూర్యతేజసం ।
వైనాయకీం మహామూర్తిం రత్నకాంచన నిర్మితాం ॥ 11

చతుర్భుజాం త్రినయనాం నానాలంకారశోభినీం ।
ఉపచారై ష్షోడశభిః పూజయంతం విధానతః ॥ 12

ననామ దక్షస్తం దృష్ట్వా దండవత్ పృథివీతలే ।
ముంచన్నశ్రూణి నేత్రాభ్యాం నిశ్వసంశ్చ ముహుర్ముహుః ॥ 13

విశ్వామిత్ర ఉవాచ :-

పప్రచ్ఛ ముద్గలః తంతు కస్త్వం కస్మాదిహాగతః ।
నుదామి దుఃఖం కింతేస్తి వద సర్వమశేషతః ॥ 14

ఏవం విప్రవచశ్శ్రుత్వా కమలా నందనస్తదా ।
సావధాన మనాభూత్వా జగాద ద్విజ పుంగవం ॥ 15

దక్ష ఉవాచ :-

సత్యమేవ వదే బ్రహ్మన్ అభిప్రాయం తవాంతికే ।
కర్ణాటదేశే రాజా అభూ న్నగరే భానుసంజ్ఞకే ॥ 16

వల్లభో నామ నీతిజ్ఞో జ్ఞానీ దాతా దయాన్వితః ।
తస్య పత్నీతు కమలా జనయామాస మాంయదా ॥ 17

తదా దుర్గంధి క్షతయుక్ శోణిత స్రావి నాసికః ।
అంధః కుబ్జః కర్ణహీనః శబ్దహీనః శ్వసన్ బహు ॥ 18

అభవన్నాగరా దృష్ట్వా త్యజైనం ఇతి చాబ్రువన్ ।
పితా మే ద్వాదశాబ్దాని నానాయత్నమథా కరోత్ ॥ 19

శరీర పాటవార్థం మే నాలభత్త న్మహేశ్వరాత్ ।
ఉపాయం స తతోమాచ మాతరం కమలాంచ మే ॥ 20

బహి ర్నిష్కాస యామాస నిర్దయేనాంతరాత్మనా ।
తతో మే జననీ ఖేదాదటమానా పురం పురం ॥ 21

ఆగత్య కౌండిన్య పురం మయా సహ క్షుధార్దితా ।
భిక్షాటనే క్రియమాణే పూర్వపుణ్యప్రభావతః ॥ 22

అభవద్దర్శనం తేవా మంధస్యేవ యథా శశీ ।
తవగాత్ర భవాద్వాయోః స్పర్శా ద్దోషాగతా మమ ॥ 23

రఘునాథం అఘ్రిసంస్పరాత్ దహల్యా యా యథాపురా ।
దివ్యదేహం సమాపన్నః ప్రసాదాత్తవ సువ్రత ॥ 24

న మయా విదితం కించిజ్జనన్యా మే నివేదితం ।
అహంచ విస్మితో భూత్వా నిశ్చయం కృతవాన్ హృది ॥ 25

యదంగ వాయుస్పర్శేన దివ్యదేహమహం గతః ।
తద్దర్శనం యదాస్యాన్మే తదా దేహం ధరామ్యహం ॥ 26

ఏవం భ్రమన్ బహుదినం తతో సౌ అకరుణానిధిః ।
ఆవిరాసీ న్మత్పురతః కోటిసూర్య సమప్రభః ॥ 27

ఉభయోస్తపసా తుష్టో దేవదేవో గజాననః ।
తం దృష్ట్వా కమలా కామాన్సంప్రాప్తా మనసీప్సితాన్ ॥ 28

తతో మామబ్రవీ ద్దేవః ప్రసన్నో మంజులాం గిరం ।
యదర్థం నియమం కృత్వా భ్రమన్ ఖేదముపాగతః ॥ 29

సోహం తే దర్శనం యాతో ముద్గలో బ్రాహ్మణోత్తమః ।
శృత్వా తద్వచనం హృష్ట మభవత్ నసంమామ ॥ 30

తతో గజాననమహం స్తుతవాన్ వివిధైః మస్త్రైః ।
ఉవాచ సుప్రసన్నాత్మా వరం వృణు మహామతే ॥ 31

అహం చాకథయం తస్మై యద్యన్మే మనసీప్సితం ।
తతో బ్రాహ్మణరూపం తత్ త్యక్త్వా అన్యద్రూపమాదధే ॥ 32

చతుర్భుజం మహాకాయం మకుటాటోప మస్తకం ।
పరశుం కమలం మాలాం మోదకానావహాత్కరైః ॥ 33

దివ్యాంబర ధరం భ్రాజద్విషాణకర పుష్కరం ।
కుండలే ప్రావహద్భ్రుత్యోః సూర్యబింబే ఇవాపరే ॥ 34

దివ్యాలంకార సంయుక్తం భుజంగ వలయోదరం ।
దేవర్షి గంధర్వ గణైః కిన్నరై రుపశోభితం ॥ 35

తత ఆనందపూర్ణో అహం దృష్ట్వా రూపం తథాభవం ।
పూర్ణచంద్రం యథా దృష్ట్వా పూర్ణో భవతి వారిధిః ॥ 36

తేనోక్తం ముద్గలః సర్వాన్ కామాంస్తే పరిపూర్యతి ।
తదైవాంతర్హితం రూపం దృష్టం యావన్నసాదరం ॥ 37

యథా స్వప్నగతం సర్వం జాగరే నైవదృశ్యతే ।
తతో అహం ధితరాం ఖిన్నో న్యపతం భువి మూర్ఛితః । 38

ప్రతిలభ్య తతస్సంజ్ఞాం వరం వృణీష్వేతి సంస్మరన్ ।
యయాచే దేవదేవేశం సర్వవ్యాపిన మీశ్వరం ॥ 39

గృహేమే సుస్థిరా లక్ష్మీ ర్భక్తిర్మే తాదృశీ తవ ।
దృష్టశ్చే త్పూర్వపుణ్యేన ద్వయమేత త్ప్రదీయతాం ॥ 40

తతో అహం శ్రుతవాన్ దత్తమితి వాచం నభోగతాం ।
తతో హృష్టమనా విప్ర తవ సాన్నిధ్య మాగతః ॥ 41

ముద్గలస్త్వం ద్వీపాస్యో అసౌ .ద్వీపాస్యస్త్వం సముద్గలః ।
ఇతి మే మనసి స్పష్టం భాతి సర్వం గజానన ॥ 42

**భృగురువాచ :-**

ఇతి తద్వచనం శృత్వా ముద్గలో వాక్యమబ్రవీత్ ॥ 43

స భాగ్యః కృతకృత్యోసి భక్తిమాన్ కమలాసుత ।
మహిమా తవ భక్తేర్హి వక్తుం శక్యో నకేనచిత్ ॥ 44

తపామి సుదృఢం చాహం దశ వర్షశతం తపః ।
నయా ఏతాదృశో దేవో దృష్ట ఆసీత్ కదాచన ॥ 45

యస్సర్వ జగతాంనాథః చరాచర గురోర్గురుః ।
యో రజస్సత్వమసాం నేతా నిత్యం గుణాశ్రయః ॥ 46

యో బ్రహ్మ శివవిష్ణూనాం శరీరాణి కరోతి హి ।
భూతానాం చ విభూతీనాం మాత్రేంద్రియ ధియామపి ॥ 47

యం నదేవా విదుస్సమ్యక్ నవేదా నర్వయోపి చ ।
ఏవం గజాననం త్వం హి ప్రత్యక్షం దృష్టవాన్ స్ఫుటం ॥ 48

అహం త్వచ్చరణౌ వందే యతస్త్వం భక్తిమాన్ పరః ।
తతః పరస్పరం తౌ తు నేమతుశ్చాలి లింగతుః ॥ 49

గురు బంధూ చిరంకాలం ఏకచిత్తౌ సమాగతౌ ।
తత ఏకాక్షరం మంత్రం స జప ధ్యాన పూర్వకం ॥ 50

ముద్గలో రాజపుత్రాయ నమ్రాయ ఉప దిదేశహ ।
ఉవాచ చైనం భూయోపి మంత్రస్యాస్య దినే దినే ॥ 51

అనుష్ఠానం కురుష్వ త్వం ప్రసన్నస్తే భవిష్యతి ।
గజాననో ధదేత్కామాన్ మనసా వాంఛితాన్ త్వయా ॥ 52

ఏనం చేత్యజసే మంత్రం సర్వశో నాశమేష్యసి ।
యద్యస్య భక్తిం సుచరం లోకేస్మిన్ విచరిష్యసి ॥ 53

ఇంద్రాది లోకపాలానాం గణో వశ్యత్వమేష్యతి ।
ఐహి భుక్త్వా అఖిలాన్ భోగాన్ అంతే మోక్షమవాప్స్యసి ॥ 54

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే మంత్రోపదేశవర్ణనం నామ ఏకవింశతితమో అధ్యాయః**



# మంత్రోపదేశ వర్ణనం

## 21-వ అధ్యాయము

శ్రద్ధాళువై ఎంతో ఆసక్తితో కధను ఆలకిస్తున్న భీమునితో విశ్వామిత్ర మహర్షి యిలా కొనసాగించాడు. "ఓ రాజా! ఎప్పుడైతే వరదుడైన వినాయకుని మూర్తి హఠాత్తుగా అంతర్ధానమైపోయిందో, బాలకుడైన దక్షునికి ఇక దిక్కుతోచలేదు. ఎంతో బెంగతోనూ, బాధతోనూ విహ్వాలుడై దారినపోయే వారందరినీకూడా, చెట్లు చేమలతోసహా 'వినాయకుడు మీకెక్కడైనా కనిపించాడా? మీకేమైనా ఎదురైనాడా?' చెప్పమంటూ విలపించసాగాడు. ఆ అఘాతానికి తట్టుకొనలేక మూర్ఛిల్లినాడు. ఇంతలో అతనికి దైవవశాన ఒక అద్భుతమైన స్వప్నం కలిగింది. అందులో ప్రకాశమానమైన సుందరవదనంతో బ్రహ్మవర్చస్సుతో దేదీప్యమానంగా వెలుగొందే ఒక బ్రాహ్మణుడు ఎదుటనిలబడి 'అభీష్టవరమును నీకు

ప్రసాదించాను! నీవు నీకు ప్రత్యక్షమైన గజాననుని ఏయేవరములు అర్థించదలచినావో అవన్నీ నీకు యిచ్చాను!' అనిచెప్పి వెళ్ళిపోతూండగా ఒక్కఉదుటున మేల్కొంచి, తన ఎదుటగాఉన్న ఒక బ్రాహ్మణుడిని దర్శించి పరమానందభరితుడైనాడు. అతడిని ముద్గలుడు అనే బ్రాహ్మణోత్తముని ఆశ్రమానికి దారిని చూపగోరాడు.

## ముద్గలాశ్రమ వర్ణనం

ఆ బ్రాహ్మణుని అనుసరించి దక్షుడనే ఆ రాకుమారుడు వెళ్ళగా, ముద్గలుని ఆశ్రమం కనుచూపుమేర దూరంలో కనిపించింది. గజాననుని భక్తులలో శ్రేష్టుడైనవాడూ, అనేక శిష్యులచే ఆశ్రయించబడినవాడూ అన్ని జీవులపట్ల కరుణ ఉట్టిపడుతూ అభయాన్ని ప్రసాదించినవాడూ, వేదవేదాంగములలో దిట్టయై, సర్వశాస్త్రములలో పారీణుడైనవాడూ, యోగంలో అనేక సిద్ధులను తనకు ఆభరణాలుగా ధరించినవాడూ, ఐన ఆ ముద్గలమహర్షి ఆశ్రమం ఎలాఉన్నదంటే ఎంతో రమణీయమైన ప్రకృతితో శోభిల్లుతూ, అనేకరకాలైన ఫలపుష్ప వృక్షాలతోనూ, అనేక ఆశ్చర్యకర వస్తువులతోనూ నిండి అది యక్షుల ప్రభువైన కుబేరుని రాజధాని అలకాపురిని మరిపించేదిగానూ, దేవతలరాజైన ఇంద్రుని నందనోద్యానవనాన్ని తలదన్నేదిగానూ, అత్యంత శోభాయమానంగా వెలుగుతున్నది.

ఆ ఆశ్రమంలో రత్నాలతో పొదగబడిన స్వర్ణవినాయకుడిని అర్చిస్తున్న ముద్గలుణ్ణి దర్శించాడు. ఆ వినాయకమూర్తి నాలుగు హస్తాలనూ మూడు నేత్రాలతో అనేకములైన అలంకారములతో ప్రకాశిస్తున్నది. అటు

వంటి దివ్యమంగళమైన వినాయకుని మూర్తిని అత్యంత శ్రద్ధాభక్తులతో షోడశ ఉపచారములతోనూ ఆ ముద్గలమహర్షి అర్చించసాగాడు.

అలా దేవతార్చనలో మగ్నుడైన ముద్గలుడి సన్నిధికి వెళ్ళి భక్తి ప్రపత్తులతో సాష్టాంగనమస్కారంచేసి, అందువల్ల కలిగిన భావోద్వేగానికి ఆనందబాష్పాలను వర్షిస్తూ వినమ్రుడై నిలుచున్నాడు! అప్పుడు జరిగిన వృత్తాంతాన్ని విశ్వామిత్రుడిలా కొనసాగించాడు. అప్పుడు గణేశుని పరమ భక్తాగ్రగణ్యుడైన ముద్గలుడు ఆ దక్షుడిని ఆప్యాయంగా లేవనెత్తి,

"నాయనా! నీవెవరు? ఏకారణంచేత ఇక్కడికి వచ్చావు? నీ దుఃఖా నికిగల కారణం ఏమిటి? నీ దుఃఖాన్నీ, భయాన్నీ నివారిస్తాను ఆందోళ నను వీడి నీయొక్క యావద్వృత్తాంతాన్నీ నాకు వివరించు!" అన్నాడు.

అప్పుడు ఆ ముద్గలమహర్షి మాటలచేత ధైర్యం పొందినవాడై, ప్రశాంతచిత్తంతో కమలాసుతుడైన దక్షుడిలా బదులిచ్చాడు.

"ఓ మహాత్మా! కర్ణాటకదేశంలోని భానునగరానికి రాజైన వల్లభుడు నాకు తండ్రి! కమల అన్న పేరుగల ఈ మహారాణి నను కన్నతల్లి. దైవవశాన నాకు పుట్టుకతోనే అనేక వైకల్యాలూ, దుర్గంధభూయిష్టమై చీమూ నెత్తురూ స్రవించే శరీరమూ సంప్రాప్తించాయి. ఐనా నాకు తగిన స్వస్థత చేకూర్చాలన్న సంకల్పంతో నా తండ్రి ఒక పుష్కరకాలం (పన్నెండు సంవత్సరాలు) కఠిన నియమాలతో ఘోరమైన తపస్సు ఆచ రించినా ప్రయోజనం లేకపోయింది. దానితో నా తండ్రి ఆగ్రహోదగ్రుడై నన్ను, నా తల్లిని రాజాంతఃపురంనుండి వెడలగొట్టాడు!

తీరని దుఃఖముతో నాతల్లి నన్ను వెంటబెట్టుకొని గ్రామగ్రామా లలో భిక్షచేసి అలా సంపాదించుకున్న ఆహారం నా పోషణకై వినియో

గిస్తూ, ఎంతో దైన్యస్థితిలో కాలం వెళ్ళబుచ్చుతూ కౌండిన్యపురం చేరు కున్నది. ఆ ఊరిలో మేమిరువురమూ భిక్షాటనం చేస్తూండగా పూర్వ పుణ్యవశాన గ్రుడ్డివాడికి దృష్టి లభించినట్లు మాకు నీ దర్శనభాగ్యం కలిగింది! నీ శరీరం మీదనుంచి వీచిన గాలి నన్ను సోకగానే నాకుగల వైకల్యాలూ, శరీరబాధ మటుమాయమైపోయాయి!

శిలారూపిణియైన అహల్యామాతకు రఘురాముని చరణధూళి శాపవిముక్తిని ప్రసాదించినట్లు, మీ అనుగ్రహ విశేషంచేతనే — ఈ విధంగా దివ్యసుందరమైన దేహం నాకు సంప్రాప్తించింది! ఈ వృత్తాంతా న్నంతా నాకు నాతల్లి చెప్పటం వలననే తెలుసుకున్నాను.

ఏ మహనీయుని శరీరముపైనుండి వీచిన వాయుస్పర్శ మాత్రం చేత నా అనారోగ్యములన్నీ మటుమాయమైనాయో, అట్టి సత్పురుషుని దర్శించుకుని జీవితం సార్ధకం చేసుకోవాలన్న సంకల్పం కలిగి, తిరిగి మీకై అన్వేషిస్తూండగా హఠాత్తుగా గజాననుని సాక్షాత్కారం లభించింది. ఆ దివ్యమంగళమూర్తిని దర్శించుకున్న నాతల్లి కమల తన మనోభీష్టాల నన్నింటినీ పొందింది! ఆ గజాననుడు తానివ్వగల్గినా ఆ వరాలను తన అనుగ్రహ స్వరూపులై, నిజానుగ్రహాన్ని సంప్రాప్తించుకున్న మీనుంచి పొందమని ఆజ్ఞయిచ్చి అంతర్ధానం చెందాడు. దాంతో మిమ్మల్ని వెతు క్కుంటూ ఇలా మీ ఆశ్రమం చేరుకున్నాను!'' అంటూ తన కథను ముద్గలునితో వివరంగా తెలియచేశాడు.

ఇలా వివరించిన పై గజానన సాక్షాత్కారంతోపాటూ ద్విజరూపం లో ప్రత్యక్షమైనదీ, ఆ తరువాత మరలా గజవదనుడై సాక్షాత్కరించి

తానే ఆ రెండు రూపాలలో దర్శనమిచ్చినట్లు నిరూపించినదీ వివరించి ముద్గలునివల్లనే తన సకలాభీష్టములూ నెరవేరగలవని చేసిన గణేశుని దివ్య ఆదేశాన్నీ తెలిపాడు.

గజాననుని అంతర్ధానంతో ఎంతో వ్యథకులోనైనాననీ, ఆ వివశతలో స్పృహను కోల్పోయాననీ — వరం కోరుకోమన్న ఆ దివ్యాదేశాన్నే మననం చేసుకుంటూ ముద్గలుని ఆశ్రమానికి చేరుకున్నాననీ తెలియజేశాడు. ఇంకా ఆ దక్షుడు యిలాఅన్నాడు :

"ఓ మహాత్మా! ముద్గలమహర్షీ! పరిపూర్ణ గణేశానుగ్రహానికి పాత్రుడవైన నీవే సాక్షాత్తు గజాననుడవు. ఆ భగవానుని అనుగ్రహవిశేషంచేత నాకు సర్వమూ గణేశమయమై కనపిస్తున్నది."

ఈ వృత్తాంతాన్నంతటినీ సోమకాంత మహారాజుకు వినిపిస్తున్న భృగుమహర్షి ఇలా అన్నాడు. "భక్తిపూరితాలైన దక్షునియొక్క వచనాలను విని ముద్గలమహర్షి యిలాఅన్నాడు :

"నాయనా! నీవు ఎంతో అదృష్టశాలివి! నీకుగల అనన్యభక్తి వల్లనే — నీకు పైరీతిలో గజాననానుగ్రహం సంప్రాప్తించింది. ఆ దేవదేవుడు కేవలం నిర్మలమైన భక్తిచేతనే ప్రసన్నుడౌతాడు. అంతేగాని, డాంబికంగా, ప్రదర్శనాత్మకంగా ఎంతకాలం తపస్సుచేసినా నిష్ఫలమౌతుంది. భగవద్దర్శనానికై తీరని ఆర్తీ, తపనా కలిగినప్పుడూ, వీటికి భగవదనుగ్రహమూ తోడైనప్పుడే భగవద్దర్శనం సంప్రాప్తిస్తుంది. ఆ కరుణాలవాలుడు మూడులోకాలకూ భర్త! త్రిగుణాలకు అధిష్ఠాత! త్రిమూర్తులకు వారివారి ఉపాధులను తానే కల్పిస్తున్నాడు! పంచభూతములకు, పంచతన్మాత్రలకూ, ఇంద్రియ మనోబుద్ధులకన్నా, ఆతడు అతీతు

డైనవాడు. ఆయనను దేవతాగణములుకాని, గంధర్వాదులుకాని చిర కాలం తపస్సుచేసిన ఋషులుగాని వేదములుగాని కనుగొనలేవు! అటు వంటి దేవతలకే దేవుడైన గజాననుడిని సాక్షాత్కారం పొందిన నీవు చాలా ధన్యుడివి! నీవంటి భక్తుడు నాకు పరిచయమవటం నాకు ఎంతో సంతోషాన్నిస్తున్నది!" అంటూ ముద్గలుడు ఆ దక్షునికి నమస్కరించి ప్రేమపూర్వకంగా ఆలింగనం చేసుకున్నాడు. ఆతరువాత ముద్గలమహర్షి గజానుని ఏకాక్షర మహామంత్రాన్ని సాంగోపాంగంగా దక్షునికి ఉపదేశించి ఇలాఅన్నాడు.

'ఓ రాజకుమారా! ఈ మంత్రాన్ని ప్రతీదినమూ క్రమం తప్పక నియమంగా జపించు! నీ సకలాభీష్టాలూ ఆ గణేశానుగ్రహంచేత సిద్ధి స్తాయి! ఈ గణేశుని భక్తిచేత ఇంద్రాది దిక్పాలకులు సైతం వశ్యులై ఉంటారు! అనన్య మనస్సుతో ఆ పరాత్పరుని ధ్యానిస్తే — ఇహంలో సకల సంపదలూ చిరకాలం అనుభవించి, అంతములో మోక్షపదాన్ని పొందుతావు!" అంటూ దీవించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'మంత్రోపదేశ వర్ణనం' అనే 21-వ అధ్యాయం.



22

# భల్లాల వినాయక కథనం

(మూలం)

## ద్వావింశో అధ్యాయః

రాజోవాచ :-

అశ్చర్యభూతం కథితం దక్షపుత్రస్య చేష్టితం ।
విస్మయో మే మహాంన్ తత్ర సంజాతో మునిసత్తమ ॥ 1

అంధః కుబ్జః స్రవద్రక్తః పూతిగంధ సమన్వితః ।
వాచావిహీనో అమేధ్యశ్చ శ్వాసమాత్రా వశేషితః ॥ 2

కథం ముద్గల దేహోద్ధ వాయునా దివ్యదేహభాక్ ।
సంజాతః కేన పుణ్యేన ముక్తోవా పాతకాత్కుతః ॥ 3

దివ్యవర్ష సహస్రం యస్తతాప పరమం తపః ।
కథం తస్యాభవన్నైవ దర్శనం దేవకాంక్షితం ॥ 4

కథం వల్లభ పుత్రాయ దేవదేవ నిభాననః ।
ప్రత్యక్షో ఽభూద్వినా క్లేశైః సచ కః పూర్వజన్మని ॥ 5

ఏతత్ సంశయో జాతం మే నుంద సర్వజ్ఞ తే నమః ।
న తృప్యామి పిబన్నిత్యం గజానన కథామృతం ॥ 6

విశ్వామిత్ర ఉవాచ :-

సమ్యక్పృష్టం త్వయా రాజన్ సంశయచ్ఛేదనాయ తే ।
వదామి నిఖిలం సమ్యక్ శృణుష్వైకమనా నృప ॥ 7

సింధుదేశేతి అవిఖ్యాతా పల్లీ నామ్నా భవత్పురీ ।
తస్యాం ఆసీ ద్ధనీవైశ్యః శ్రేష్ఠః కళ్యాణసంజ్ఞకః ॥ 8

వదాన్యః కుశలో ధీమాన్ ద్విజ దేవ పరాయణః ।
ఇందుమతీ ఇతి విఖ్యాతా పత్నీతస్య శుభాననా ॥ 9

పతివ్రతా పతిప్రాణా పతివాక్య పరాయణా ।
తయోః కాలేన సంజాతో గుణవాన్ పుత్ర ఉత్తమః ॥ 10

కళ్యాణః ప్రదదౌ ధేనూర్వస్త్రాలంకరణానిచ ।
బ్రాహ్మణేభ్యో అథ రత్నాని కాంచనం భూరిదక్షిణాం ॥ 11

జోతిర్విద్భి ర్నిగదితం నామచక్రే సుతస్యసః ।
భల్లాల ఇతి విఖ్యాతం బలవత్వాత్ శుభం తదా ॥ 12

సచ కాలేన మహతా వయస్యైశ్చ సమన్వితః ।
దేవపూజారతో నిత్యం గ్రామాద్భహి రయాన్ముదా ॥ 13

ఏకదాతే వనం యాతా భల్లాల ప్రముఖాః స్సుతాః ।
నానా క్రీడరతాః స్నాతాః ఉపలం స్థాప్య సుందరం ॥ 14

గణేశ బుధ్యా సంపూజ్య దూర్వాంకుర సుపల్లవైః ।
కేచిత్ ధ్యానరతాస్తస్య నామ జాప్యం ప్రచక్రిరే ॥ 15

కేచిచ్చ నన్నృతుస్తత్ర యథేచ్ఛం దేవభక్తితః ।
కేచిచ్చ గానకుశలాః జగుర్దేవస్య తుష్టయే ॥ 16

కేచిత్కాష్టైః పల్లవైశ్చ మండపం చక్ర్యరోజసా ।
కేచి ద్భిత్తిపరీవేషం కేచిత్ ప్రసాద ముత్తమం ॥ 17

కేచి న్మానస పూజాభిః కేచిత్పుష్ప లతాదిభిః ।
ధూపం దీపం నైవేద్యం ఫల తాంబూలదక్షిణః ॥ 18

నివేద్య పుపుజు స్తస్మై ముదా పరమయా యుతాః ।
కేచిచ్చ పండితా భూత్వా పురాణా న్యబ్రువం స్తథా ॥ 19

వ్యాచక్రు ర్ధర్మశాస్త్రాణి గ్రంథానన్యాంశ్చ కేచన ।
ఏవం దేవరతా స్సర్వే నిన్యుర్సై దివసాన్ బహూన్ ॥ 20

న క్షుధాం న తృషాం కోపి జానన్ దేవస్య భక్తితః ।
ఏకదా జనకస్తేషాం కల్యాణ వైశ్యమన్వయుః ॥ 21

అబ్రువన్ రోషితాః సర్వే స్వభల్లాలం నివారయ ।
శిశూన్ సర్వాన్ సమాహూయ వనం యాతి దినేదినే ॥ 22

నాయాంతి ప్రాతరాశాయ న మధ్యాహ్నేన నిశాముఖే ।
కృశానో బాలకా జాతాః స్వసుతం శిక్షయాధునా ॥ 23

నోచేత్ వద్వయం నిబద్ధ్వైనం తాడయామ ఇతః పరం ।
పురాధిప మథాభ్యేత్య త్వాం బహిఃకరవా మహి॥ 24

ఇతి తేషాం వచశ్రుత్వా శృతపూర్వం కదాచన ।
సరోషా వేశా త్సకళ్యాణో జపాకుసుమలోచనః ॥ 25

మహాంతం దండమాదాయ తాడనార్థం సుతం యయౌ ।
దండాఘాతేన గత్వైవ మండపం ప్రబభంజ హ ॥ 26

బాలకాశ్చ తతస్సర్వే జగ్ము ర్దశదిశో నృప ।
ఏక ఏవ స, భల్లాలో దృఢభక్త్యా స్థిరోరభవత్ ॥ 27

దృఢముష్ట్యా సతం ధృత్వా దండేనా తాడయ ద్భృశం ।
యథా సర్వశరీరాత్తు ధారాః శోణితసంభవాః ॥ 28

ప్రాదురాసన్ వారిధారా వర్షకాలే యధా గిరేః ।
చిక్షేప దూరతః పశ్చా ద్దేవం సింధూర సుందరం ॥ 29

బబంధ తం సుతం వృక్షే వల్లీపాశ శతైర్దృఢం ।
పుత్రస్నేహం పరిత్యజ్య యమదూత ఇవాపరః ॥ 30

ముక్తో దంతై ర్నహస్తాభ్యాం పాదాభ్యాం సయధా భవేత్ ।
ఉవాచ పశ్చాత్తం పుత్రంకో దేవస్త్వాం మోచయిష్యతి ॥ 31

స దాతా భోజనం పానం గోపనం చ కరిష్యతి ।
యదిచేత్ గృహమాయసి తదా సత్యం మరిష్యసి ॥ 32

మునిరువాచ :-

విభజ్య దేవాలయ మాశుయాత
కల్యాణ వైశ్యో అతిరుషా నివిష్టః । 33

స్వమందిరం బధ్యవనే స్వపుత్రం
దైవస్యయోగా దభవత్ సుదుష్టః ।
తస్మిన్ప్రయాతే సచ వైశ్యపుత్రః శుశోచ దేవం మనసా విచింత్య ॥ 34

విఘ్నారి రిత్యేవ కథంను దేవ
నామా భవత్సర్వ జనేషు గీతం ॥ 35

దుష్టాంశ విఘ్నాని ననాశయేస్త్వం
దుష్టాంతకత్వేన కథం ప్రసిద్ధః ।
శేషోఽపనిందా సవితాథ దీప్తిం చంద్రో అమృతం వహ్ని రథోష్ణతాం చ॥ 36

త్యజే త్ స్వభక్తాన్నచ సంత్యజేథా వేదేషు శాస్త్రేషు కథం ప్రసిద్ధిః ।
ఏవం విలప్యాథ నిజం శశాప కళ్యాణసంజ్ఞం పితరం సుదుష్టం ॥ 37

యేనేదం మమ విధ్వస్తం దేవాలయ మనుత్తమం ।
గణేశమూర్తి విక్షేపం తాడనం చ మమాకరోత్ ॥ 38

సచాంధోబధిరః కుబ్జో మూకో భవతి నిశ్చితం ।
యది మే సుదృఢా భక్తిః ద్విరదానన ఉత్తమా ॥ 39

తదోక్తం మమ సత్యంస్యా త్తస్యసర్వం మయోదితం । 40

న బద్ధే భక్తి మనసే శక్తోసౌ దేహబంధనే । 41

అనన్యబుద్ధ్యా పరిచింత్య దేవం త్యజామి దేహం విజనే వనే అస్మిన్।
పలాయనం నైవకృతం యదైవ తథైవ దేహోర్పిత ఏష దేవే ॥ 42

తస్యైవం నిశ్చయం బుధ్వా ప్రాదురాసీ ద్గజాననః ।
బ్రాహ్మణస్య స్వరూపేణ భల్లాలస్య ప్రభావతః ॥ 43

యథా నిశా తమోపాయే శ్రీసూర్య ఉదయాచలే ।
తథైవ బంధనాని అస్య తేజసా శిథిలాని చ ॥ 44

జాతాని తతేనం నమశ్చక్రే థ దండవత్ ।
దేహస్య చారుతా జాతా నక్షతం నచశోణితం ॥ 45

జ్ఞానంచ నిర్మలం జాతం దేవదేవస్య దర్శనాత్ ।
తుష్టావ వివిధై ర్వాక్యై ర్యథామతి గజాననం ॥ 46

**భల్లాల ఉవాచ :-**

త్వమేవ మాతాసి పితాసి బంధుస్త్వమేవ కర్తాసి చరాచరస్య ।
నిర్మాసి దుష్టాంశ్చ ఖలాంశ్చ సాధూన్
యోనౌ వియోనౌ వినియుంక్ష్యథాపి ॥ 47

త్వమేవ దిక్చక్ర నభో ధరాబ్ధి గిరీంద్ర కాలానల వాయురూపః ।
రవీందు తారా గ్రహ లోకపాలవర్గః ఇంద్రియార్థః ఔషధి ధాతురూపః ॥ 48

**మునిరువాచ :-**

ఇతిస్తుతిం సమాకర్ణ్య సుప్రసన్నో గజాననః ।
ఆలింగ్య నిజభక్తం తమువాచ ఘన నిస్స్వనః ॥ 49

**గజానన ఉవాచ :-**

ప్రాసాదో యేన భగ్నో మే నరకే స పతిష్యతి ।
తవ శాపోపి తస్యైవం భవిష్యతి మమాజ్ఞయా ॥ 50

అంధోథ బధిరః కుబ్జో మూకో స్పృక్స్రావ సంయుతః ।
మమ శాపం సమాసాద్య భవిష్యతి నసంశయః ॥ 51

పితా సమాతృకం చైనం కరిష్యతి గృహాద్బహిః ।
అన్యత్తే వాంఛితం బ్రూహి దుష్ప్రాపమపి తే దదే ॥ 52

**మునిరువాచ :-**

భల్లాలో థాబ్రవీ ద్దేవం త్వయి భక్తిః దృఢాస్తు మే ।
అస్మిన్ క్షేత్రే స్థిరోభూత్వా లోకాన్ రక్షస్వ విఘ్నతః ॥ 53

**గణేశ ఉవాచ :-**

త్వన్నామ పూర్వం మన్నామ భవిష్యతి జనేశుభం ।
భల్లాల వినాయకేతి నగరే సుప్రతిష్ఠతం ॥ 54
మయి చిత్తం స్థిరం తేస్యాత్ భక్తి రవ్యభిచారిణీ ।
యాత్రాం మమ కరిష్యంతి నగరే వల్లిసంజ్ఞకే ।
భాద్రశుక్ల చతుర్థ్యాం యే తేషాంకామాన్ దదామ్యహం ॥ 55

**భృగురువాచ :-**

ఇతి దత్వా వరం దేవః తత్రైవాంతర ధీయత ।
తతో వినాయకం స్థాప్య భల్లాలో బ్రాహ్మణైస్సహ ॥ 56

ప్రాసాదం కారయామాస నానాశోభా సమన్వితం । 57

**విశ్వామిత్ర ఉవాచ :-**

భల్లాల వైనాయకేతి కథితం తే కథానకం ।
యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముక్తః కామాన వాప్నుయాత్ ॥ 58

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**భల్లాలవినాయక కథనం నామ ద్వావింశో అధ్యాయః**





యోగ గణపతి

# భల్లాల వినాయక కథనం

# 22-వ అధ్యాయము

తన పూర్వీకుడైన దక్షుని చరితనంతటినీ విశ్వామిత్రమహర్షి చెప్పగా విన్న భీమమహారాజు యిలాఅన్నాడు.

"ఓ మహర్షిసత్తమా! మీయొక్క అపారమైన కృపావిశేషంచేత మా పూర్వీకుడైన దక్షుని చరితాన్ని వినగలిగాను! ఐనా, నన్నొక సందేహం పట్టి పీడిస్తున్నది. పుట్టుకతోనే మూక, బధిర, అంధత్వాలను సంతరించు కొని శరీరమంతా రోగాలతో దోషభూయిష్టుడై జన్మించిన ఆ దక్షుడు ఏ పూర్వపుణ్యంవలన ఆరోగ్యవంతుడైనాడు? ఆ మహర్షి శరీరంపైనుండి వీచిన వాయుస్పర్శ ఏవిధంగా అతడిని ఆరోగ్యవంతుడినిగా చేసింది? ఎన్నో సంవత్సరాలు గాఢతపస్సు చేసినా ముద్గలునికి ఎందుకని సాక్షాత్క రించలేదు? ఎట్టి శ్రమాలేక సులభంగా వల్లభ పుత్రునికి ఎలా ఆ దివ్య

సాక్షాత్కారం లభించింది? ఇంతకీ పూర్వజన్మములో అతని పుట్టుపూర్వోత్త రాలేమిటి?

ఈ నా సంశయ సమూహాన్నంతనీ తాము విచ్ఛేదన సలుప వలసింది. తాము సర్వజ్ఞులు, మూర్తీభవించిన అనుగ్రహంలాఉన్న తమరే నాకీ గణేశ కథామృతాన్ని పానం చేయించవలసింది. ఈకథను ఎంత వింటున్నా నాకు తనివితీరటంలేదు!" వినయంగా ఆరాజు చేసిన ప్రశ్నకు విశ్వామిత్రుడు అమిత ప్రసన్నుడై యిలా బదులిచ్చాడు.

'ఓ రాజా! సంశయాల నివృత్తికై నీవడిన ప్రశ్న ఎంతైనా తగి యున్నది. ఆ వృత్తాంతాన్నంతా నీకు చెబుతాను సావధాన మనస్కుడవై ఆలకించు!'

## విశ్వామిత్రుడు రాజుకు ఇతిహాసమును వివరించుట

ఓ భీమరాజా! పూర్వం సింధుదేశంలో ప్రసిద్ధిచెందిన 'పల్లీ' అనే నగరం ఉండేది. ఆ పట్టణంలో 'కళ్యాణ సంజ్ఞికుడు' అనే పేరుగల ధనికుడైన వైశ్యుడుండేవాడు. వితరణతో అడిగినవారందరికీ లేదనకుండా దానధర్మాలు చేసేవాడు. దేవబ్రాహ్మణభక్తిలో సాటిలేనివాడు. అతనికి ఇందుమతి అన్న పేరుగల సౌందర్యవతియూ, మహాపతివ్రతయూయైన భార్య ఉండేది.

ఆ దంపతులకు గుణవంతుడూ, రూపవంతుడూ ఐన కుమారుడు జన్మించాడు. యథోచిత సంస్కారములు నిర్వర్తించి, పుత్రుని జనన కాలంలో బ్రాహ్మణుల సంప్రీతికై గోవులను, రత్నమాణిక్యాలనూ, అనేక దివ్యవస్త్రాలను దానమిచ్చాడు. జ్యోతిష్కులను సంప్రదించి ఆ పిల్లవానికి భల్లాలుడన్న నామకరణం చేసాడు.

ఆ పిల్లవాడుకూడా శుక్లపక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమానుడై ఎదగసాగాడు. బాల్యంనుంచే భగవద్భక్తి అతనికి సహజంగా అలవడింది. పూర్వపుణ్య విశేషంచేత గజాననునిపట్ల అతనికి గాఢఅనురక్తి ఉండేది. ఇలా ఉండగా ఆ భల్లాలుడు తన తోటి బాలకులతో కలసి ఒకనాడు అడవికెళ్ళాడు. అనేకరకాలైన ఆటలాడి, స్నానంచేసి ఒక నునుపైన రాతిని స్థాపించి దానికి ప్రాణప్రతిష్ఠచేసి శ్రద్ధగా దూర్వాంకురాలతోనూ, పువ్వులతోనూ ఆ గణేశుని మూర్తిని భక్తితో పూజించారు. అతని మిత్రులలో కొందరు ధ్యానమగ్నులై గణేశ నామాన్ని జపిస్తూంటే, మరికొందరు ఆనందంతో నాట్యంచేశారు. మరికొందరు మృదుమధురంగా గానం చేశారు. కొందరు కఱ్ఱలతోనూ, మామిడిచిగుళ్ళ తోరణాలతోనూ ఆ మూర్తికి ఒక చక్కని మంటపాన్ని ఏర్పాటుచేశారు. ఇలా ఆ బాలకులంతా చక్కని ప్రాకారాన్నీ, దేవునికి మంటపాన్నీ, ఆలయాన్నీకూడా అత్యంత శ్రద్ధాభక్తులతో నిర్మించారు. ఫలపుష్పాదులను నైవేద్యంగా సమర్పించి ధూపదీపాలతో ఆమూర్తిని ఆరాధించారు! కొందరు పండితుల వేషంలో వేదపురాణాలను ఉపదేశించి తన్మయులయ్యారు!

ఇలా భగవంతునిపైగల భక్తిలో ఆ పిల్లలు అన్నపానాలను సైతం మరిచారు. ఇలా కొన్నిరోజులు గడిచినాయి. ఇలాఉండగా, ఆ పిల్లల తలిదండ్రులు ఒకనాడు ఆ కళ్యాణవైశ్యునివద్దకు వచ్చి ఎంతో రోష పూరిత వచనాలతో

"మీ భల్లాలుని నివారించు! తనతోపాటు మా పిల్లల్నీ 'భక్తీ-రక్తీ' అంటూ పాడుచేస్తున్నాడు. అడవుల్లో తిరుగుతూ, వేళకు అన్నపానాదులు కూడా తీసుకోక మా పిల్లలు కృశించిపోయారు. సరిగ్గా వేళకు భోజనానికి

కూడా యిళ్ళకు రావటంలేదు! కనుక నీవే నీకుమారునికి బుద్ధిగరపి అలా తీసుకెళ్ళకుండా నివారించుము! అలాకాకుంటే మేమే వాణ్ణి కట్టివేసి చావమోదుతాం! లేదా రాజుగారికి ఫిర్యాదుచేసి మిమ్మల్ని ఈ గ్రామాన్నుంచే వెళ్ళ గొట్టిస్తాము!" అంటూ నిష్ఠూరమాడారు! ఇలా ఆ గ్రామస్థులాడిన తీవ్రమైన పరుషమైన వచనాలకు బాధతో, రోషావేశ పూరితుడైన కళ్యాణ సంజ్ఞికుడు వడివడిగా తన కుమారుడు అతని స్నేహితులు గణేశుని పూజిస్తున్న అడవిలోకి వెళ్ళాడు.

ఒకపెద్ద కఱ్ఱను పెరికి ఆకఱ్ఱతో బాలురు నిర్మించిన మందిరాన్ని ప్రాకారాన్ని భగ్నంచేశాడు. భయంతో ఆ బాలకులు నలుదిక్కులకీ పరుగుతీశారు. ఆ సమయంలో భల్లాలుడు మాత్రం చెక్కుచెదరక స్థిరంగా కూర్చున్నాడు. తోటి గ్రామస్థుల నిందాలాపనచే అప్పటికే క్రోధో న్మత్తుడైన ఆతని తండ్రియైన కళ్యాణవైశ్యుడు మాత్రం క్రోధంతో వివశుడై అతని చేతిని గట్టిగా పట్టుకుని నెత్తురుకారేలా కఱ్ఱతో చావమోదాడు. అతని క్రోధాగ్ని అంతటితో చల్లారక ఆ బాలునిచే పూజింపబడుతోన్న సింధూరవర్ణంలోఉన్న గజాననుని విగ్రహాన్నికూడా పెకలించి పారవైచాడు. పాలుగారే అతని లేతశరీరం ఆ రక్తపురంగులో మోదుగపువ్వు వర్ణంతో ఎఱ్ఱగా మారిపోగా తన కుమారుణ్ణి చెట్టుకి లతలతోనూ, తాళ్ళతోనూ నిర్దాక్షిణ్యంగా కట్టేసి "ఓరీ! నిన్నిప్పుడు నీ దేముడే రక్షించాలి! ఆతడే నీకన్నంపెట్టి నీ ఆకలి తీర్చాల్సింది! చూద్దాం ఏంచేస్తాడో? ఒకవేళ పొరబాటున ఇంటికి వచ్చావా... చచ్చావే అనుకో!" అంటూ రోషావేశంతో ఆలయాన్ని, విగ్రహాన్ని భగ్నంచేసి ఇంటికి పెద్దపెద్ద అంగలతో వెళ్ళి పోయాడు.

ఆ కథా విధానాన్ని భీమరాజుకు వినిపిస్తున్న విశ్వామిత్రుడు యిలా కొనసాగించాడు :

ఓరాజా! ఈవిధంగా ఆతనిలోని క్రోధమనే పెద్దపులి వివేకమనే కుందేటిని కబళించగా ఆ వైశ్యుడు వివశుడై, దుష్కృత్యాన్ని జంకు లేకుండా ఆచరించి, ఇంటికి మరలిపోయాక, ఆ చిన్ని బాలకుడైన భల్లాలుడుమాత్రం గణేశునే అనన్యభక్తితో స్మరిస్తూ మనస్సులో యిలా విచారించసాగాడు.

'స్వామీ! ఓ జగత్ప్రభూ! దుష్టశిక్షణ నీకు వెన్నతోపెట్టిన విద్యగదా! విఘ్నాలను, దుష్టులను నశింపచేయటంవల్లనే నీకు విఘ్నహరుడన్న కీర్తి జగత్తులో ప్రఖ్యాతమైంది! ఓదేవా! భూభారాన్ని వహించే శేషుడా పనిని వీడవచ్చు, సముద్రాలను శోషింపచేసే సూర్యుడు తన కిరణాల తీక్షణతను వదలవచ్చు, అలానే అగ్ని తన ఉష్ణతనూ, వేడిమినీ కోల్పో వచ్చు కానీ నీవు నీ నిజభక్తులను ఎన్నడూ వీడవని శ్రుతులు ఘోషిస్తు న్నాయే! నీకీ ఉదాసీనత తగునా?' అంటూ ఏడుస్తూ తన తండ్రినిలా శపించాడు.

'నేను ఎంతగానో శ్రద్ధాభక్తులతో శ్రమించి నిర్మించిన ఈ ఆల యాన్ని ఎవరైతే భగ్నంచేసి తీరని దైవద్రోహం చేశారో, బాలుణ్ణి అని కూడా చూడక నన్ను చావచితకమోదారో, నాకు అత్యంత ప్రేమాస్పదు డైన గణేశుని విగ్రహాన్ని విసరివేశారో అట్టి పరమ పాతకుడైన నాతండ్రి 'అంధుడు, కుబ్జుడు, బధిరుడు, శబ్దహీనుడు అవుగాక!' అని శపించి, 'నేను నిజమైన గణేశభక్తుడనైతే నా శాపము సత్యమౌగాక! నన్నైతే ఇలా ఆ పాపి బంధించగలిగాడే, కానీ నా మనస్సునూ, నా భక్తినీ ఆ

దుష్టుడు బంధించలేడుకదా! ఆ పరమ దయాళువైన గజాననుని పాదార విందాలనే ధ్యానిస్తూ, ఈ అరణ్యంలోనే శరీరాన్ని విడుస్తాను! నాతండ్రి కఱ్ఱతో మోదుతున్నప్పుడే నాదేహాన్ని ఆ దేవదేవునికి అర్పించాను!' అంటూ మనస్సులో ధృఢంగా నిశ్చయించుకున్న ఆ బాలకుడైన భల్లాలుని ఎదుట గజాననుడు బ్రాహ్మణరూపంలో ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు సూర్యోదయ మవటంతోనే ఆకాశాన్ని చీకట్లు వీడినట్లు, ఆ దివ్యదర్శనం అవడంతోనే అతని దేహాన్ని బంధించిన బంధాలన్నీ విడిపోయాయి! అప్పుడు ఆ భల్లాలుడు అత్యంత ఆదరంతో ఆ బ్రాహ్మణునకు సాష్టాంగ నమస్కారము చేశాడు. శరీరంపైని గాయాలు రక్తస్రావమూ ఆశ్చర్యంగా మటుమాయమయ్యాయి! శరీరం దివ్యదేహంగా మారింది! అప్పుడు అతడు తన శ్రద్ధాభక్తులనే వాక్కులుగాచేసి ఇలా కీర్తించాడు.

## భల్లాలుడు గజాననుని స్తుతించుట

చరాచర రూపమైన ఈ సకల జగత్తుకూ తల్లివీ, తండ్రివీ, కర్తవూ నీవేఐన ఓ విఘ్నేశ్వరా! నీ సంకల్పంవల్లనే క్రూరులు, సజ్జనులు తమ తమ స్వభావాలకు యుక్తమైన తలిదండ్రులకు జన్మిస్తున్నారు! అష్ట దిక్కులూ, ప్రాణాధారమైన గాలీ, సకల సముద్రాలూ, సూర్యచంద్రాగ్నులూ, సమస్త ఓషధులూ, ధాతువులూ నీ స్వరూపమేకదా ప్రభూ! అటువంటి నీ మహిమను బాలుడనైన నావాక్కులతో ఎలా ప్రస్తుతించ గలను? కేవలం నీ అనుగ్రహ విశేషంవల్లనే భక్తసులభుడవైన నీ దివ్య మంగళరూప దర్శనం నాకు కల్గింది!" అంటూ భక్తితో ప్రణమిల్లిన ఆ భల్లాలుణ్ణి ప్రేమతో లేవనెత్తి, అతనిని గజాననుడు ఆలింగనం చేసు

కున్నాడు. భక్తవత్సలుడైన ఆ గణేశుడు! ప్రసన్నతతో అనుగ్రహాన్ని వర్షించే సుందరవదనంతో యిలా అన్నాడు.

'ఓ భల్లాలా! నా ఈ మందిరాన్నీ, నీచే అర్చించబడ్డ మూర్తినీ భగ్నంచేసినవారు ఘోరమైన దైవాపచారం చేసినవాడయ్యాడు. అతడు తప్పక నరకంలో పడతాడు. నాఆజ్ఞచే నీవిచ్చిన శాపంకూడ తప్పక తగులుతుంది! అట్టివాడిని వాడి తండ్రికూడా ఆగ్రహంతో ఇల్లు వెడల గొడతాడు. ఓ బాలకా! నీభక్తికి ఎంతో ప్రసన్నుడనయ్యాను. కనుక ఎంతటి దుర్లభమైనదైనా వరాన్ని నీకు అనుగ్రహించదలిచాను!' అని దరహాసం చిందించాడు.

అప్పుడా బాలకుడిలా ప్రత్యుత్తరమిచ్చాడు!

"ఓ దీనబంధూ! నీ పదకమలాల యెడల అంతులేని దృఢభక్తిని నాకు సర్వదా ప్రసాదించు! నీవీ క్షేత్రంలో వెలసి సకల ప్రజలకూ విఘ్నములను పారద్రోలి అనుగ్రహించు!" అంటూ ప్రార్థించాడు.

ఆ ప్రార్ధనకు భక్తవత్సలుడైన గజాననుడిలా అన్నాడు.

'నీపేరు ముందుగానూ, నాపేరు తరువాత కలిగి లోకంలో భల్లాల వినాయకుడన్నపేర ఈక్షేత్రంలో స్థిరంగా వెలుస్తాను! నీకు సదా నా యందు దృఢభక్తినీ ప్రసాదించాను. ఈ వల్లి అనే పేరుగల క్షేత్రాన్ని భాద్రపద శుక్ల చతుర్థినాడు యాత్రచేసి దర్శించేవారికి సకలాభీష్టములు నెరవేరుస్తాను!' అంటూ వరాలను అనుగ్రహించి వరదుడైన గజాననుడు అంతర్ధానమైనాడు. ఆతరువాత ఆ భల్లాలుడు వేదవిదులైన బ్రాహ్మణోత్త ముల ఆధ్వర్యంలో వైనాయకమూర్తిని ప్రతిష్టించి, సర్వాంగ సుందర

మైన మందిరాన్నికూడా నిర్మించాడు!" అంటూ విశ్వామిత్రుడిలా అన్నాడు "ఓరాజా! నీ అభీష్టంమేరకు భల్లాలవినాయకుని చరిత్రను యావత్తూ వినిపించాను. ఎవరైతే పరమపావనమూ శుభకరమూ అయిన ఈ చరిత్రను శ్రద్ధాభక్తులతో ఆలకిస్తారో అట్టివారు తమ సర్వపాపములనుండీ విముక్తులై, తమతమ మనోభీష్టములను తప్పక పొందుతారు!" అంటూ చిరుదరహాసంతో శరశ్చంద్రునిలా అనుగ్రహచంద్రికలను ప్రసరించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'భల్లాలవినాయక కథనం' అనే 22-వ అధ్యాయం.



23

# కళ్యాణవైశ్య - 'భవిష్యకథనం'

(మూలం)

## త్రయో వింశో అధ్యాయః

**భృగురువాచ :-**

విశ్వామిత్ర వచశృత్వా భీమః పప్రచ్ఛ తం పునః ।
వైశ్యాచరిత వార్తాయాః శ్రవణే పరమోత్సుకః ॥ 1

సోమకాంత నృపశ్రేష్ఠ కథయామి శృణుష్వ తత్ । 2

**భీమ ఉవాచ :-**

శ్రుతం దక్షస్య చరితం విశ్రాంతం। మమ మానసం ।
కథం కల్యాణ వైశ్యస్య గతిరాసీద్వదస్వ తాం ॥ 3

**విశ్వామిత్ర ఉవాచ :-**

శృణుష్వైకమానా భీమ కథామేతాం వదామి తే । 4

భల్లాల శాపాత్కల్యాణ దేహాత్సుస్రావ శోణితం ।
అసంఖ్య క్షతసంయుక్తః స్రావో బాధిర్యం మఅంధతా ॥ 5

మూకతా పూతిగంధిత్వం జాతం తస్య దురాత్మనః ।
దదర్శేందుమతీ తస్య దశా మాకస్మికీం తతః ॥ 6

కిమిదం కిమిదం కస్మాజ్జాత, మేవం శుశోచ తం ।
జ్ఞానినోస్య వదాన్యస్య దేవ ద్విజ రతస్య చ ॥ 7

ధర్మశాస్త్రార్థ నిష్టస్య స్వదార పరితోషిణః ।
అవస్థేయం కథం జాతా మమభర్తు ర్నిరేనసః ॥ 8

**మునిరువాచ :-**

ఏవం విలప్య బహుధా నిశ్వసంతీ పునః పునః ॥ 9

తేన బద్ధం వనే పుత్రం నిశమ్య రుదతీ ముహుః ।
పౌరైః సహ యయౌ తత్ర యత్రబద్ధో వనేసుతః ॥ 10

తత్ర దేవాలయం దేవం దదర్శ గణనాయకం ॥ 11

చతుర్భుజం త్రినయనం సిందూరారుణ విగ్రహం । 12

భల్లాలంచ సుతం తత్ర పూజయంతం గజాననం ।
ముక్తం నిర్ వ్రణ మవ్యంగం నిరీక్ష్య పురవాసినః ॥ 13

ఉవాచ ఇందుమతీ కృద్ధా భర్త్సయంతీ పునః పునః ॥ 14

కథం ప్రతారితా తద్వ్యవాది భిర్భర్త్రు సన్నిధౌ ।
తాదృశం తం పరిత్యజ్య పుత్రస్నేహాదిహాగతా ॥ 15

పశ్యంతు దేవభక్తిం మేపుత్రం కుర్వంతమీ దృశీం । 16

**మునిరువాచ :-**

విస్మితాః సర్వ ఏవైతే నకించితే ప్రోచురణ్వసి ॥ 17

కేచిదూచు ర్మహాభక్తేర్మహిమా కేన గమ్యతే ।
వీక్ష్య సింధూర రక్తాంగం రక్తచందన చర్చితం ॥ 18

రక్తాంబరం రక్తపుష్పమాలాభి రుపశోభితం ।
నిర్మమం నిరహంకారం అఖండ మివ విఘ్నపం ॥ 19

నిరీక్ష్య తాదృశం పుత్రం త్యక్త్వాశోకం ననంద సా ।
ఆలిలింగ తదా తంతు స్నేహ స్నుత పయోధరా ॥ 20

ఆహ తం స్వగృహం యావః పితుస్తే వ్యసనం మహత్ ।
ఉద్భితం తత్రకించిత్రం కురూపాయం మహామతే ॥ 21

ఆవాం ధన్యతమౌ లోకే యయోః పుత్రస్త్వ మీదృశః ।
సర్వాంగ క్షతవాన్ రక్తస్రావవాన్ పూతిగంధవాన్ ॥ 22

శామాస్యః కృశతా యుక్తో బధిరో అథాంధ ఏవచ ।
ఏవం విధః పితాతే అస్తి తం నివేదితు మాగతా ॥ 23

పితృధర్మేణ తేన త్వం తాడితో నర్థకృద్వది ।
తత్రాపరాధో నైవాస్తి శృతి స్మృతి పురాణతః ॥ 24

పుత్రధర్మా న్నిరీక్షస్య కుర్వా రోగ్య విచారణాం ।
త్వయా శ్లాఘ్యతమో లోకే పితాతే పితృవత్సల ॥ 25

మాతాపితృ వచఃకార్యం సత్పుత్రేణ యశస్వినా ।
పూజనంచ తయోఃకార్యం పోషణం పాలనం తథా ॥ 26

ఔషధా న్మంత్ర తశ్చాపి దేవతాప్రార్థనాదపి ।
ఉపాయం కురు పుత్రత్వం మయిదృష్టిం నివేశయ ॥ 27

యశస్తే భవితా లోకే సౌభాగ్యం మమ బాలక ।
ఇతి తస్యాః వచఃశ్రుత్వా భల్లాలో వాక్య మబ్రవీత్ ॥ 28

**భల్లాల ఉవాచ :-**

కస్యమాతా పితా కస్య కస్య పుత్రో ధనా సుహృత్ ।
విఘ్నరాజకృతం సర్వ మానుషంగ్యఖిలం స్మృతం ॥ 29

తస్మాన్మమ పితా భద్రే మాతా దేవో వినాయకః ।
యో యయథా కురుతే కర్మ సతథా ఫలమశ్నుతే ॥ 30

మయా సమర్పితో జీవో దేవదేవ గజాననే ।
తేన జీవస్తథా జ్ఞానం మమదత్తం సుభక్తితః ॥ 31

ప్రాసాదభంజనా ద్దేవాక్షేపణా త్తాడనాన్మమ ।
వినాయకాతి భక్తస్య తథా ప్రాప్తం ఫలం శుభే ॥ 32

విచార్యమాణే నత్వం మే మాతా వా నపితాపి చ ।
సర్వస్యహి పితా దేవో మాతా దేవో గజాననః ॥ 33

స ఏవ జ్ఞానదస్త్రాతా సంహర్తా కాలరూపవాన్ ।
సర్వస్వరూపో దేవేంద్రో బ్రహ్మ విష్ణు శివాత్మకః ॥ 34

వృథా మే యేన దుష్టేన తాడనం నిర్ఘృణేన చ ।
కృతం దేవస్య విక్షేపః ప్రాసాదస్యాపి భంజనం ॥ 35

తస్యాస్య దర్శనే దోషః పతితస్య మహాన్ భవేత్ ।
స్నేహం త్యక్త్వా మదీయం త్వం పతిం స్వం పరిషేవయ ॥ 36

**విశ్వామిత్ర ఉవాచ :-**

ఇతి పుత్రవచః శ్రుత్వా సా తంపునరథా అబ్రవీత్ । 37

**మాతోవాచ :-**

కృపయా నుగ్రహా త్స్నేహాత్ ఉచ్ఛాపం పక్తుమర్హసి । 38

పుత్రఉవాచ :-

భవాంతరే స్య జననీ భవితాసి వరార్థినీ ।
అయమేతాద్రుశః పుత్రో భవితా తవ సువ్రతే ॥ 39

కల్యాణనామా భవితా వల్లభః క్షత్రియర్షభః ।
కమలేతిచ విఖ్యాతా నామ్నాత్వం చ భవిష్యసి ॥ 40

దక్ష ఇత్యేవ పుత్రస్య నామఖ్యాతం భవిష్యతి ।
తతో ద్వాధశ వర్షాణి వల్లభ స్తప్యతే తపః ॥ 41

అంధతాం బధిరత్వంచ క్షతాని మూకతాం తథా ।
వ్యసనేతుం తు దక్షస్య పరం నియమ మాస్థితః ॥ 42

అలబ్ధ్వా సఫలం తస్మాత్ నపుత్రాం త్వాం శుభాననే ।
నిరాకరిష్యతే గేహత్ విదేశస్థాభవిష్యసి ॥ 43

కస్యచి ద్విజవర్యస్య ద్విరదానన చేతనః ।
దైవాత్పుర్నేస భద్రే తే సమ్యక్పుత్రో భవిష్యతి ॥ 44

తత్రైవ గణనాథస్య దర్శనం చ భవిష్యతి ।
తదా స దివ్యదేహత్వం ప్రాప్స్యతే ద్విరదాననాత్ ॥ 45

ఇతి సర్వం సమాఖ్యాత ముచ్ఛాప కారణం శుభే! ।
భవిష్యం కథితం తేద్య యథేష్టం గమ్యతాం త్వయా ॥ 46

విశ్వామిత్ర ఉవాచ :-

ఏవం నిరాకృతా తేన జననీ నిరగాత్తతః ।
దుఃఖశోక సమాయుక్తా కించిద్ధర్ష యుతాపిచ ॥ 47

స చారురోహ తద్దివ్యం విమానం భక్తిభావితం ।
గజాననేన విహితం భల్లాలో అధాగమద్దివం ॥ 48

ఇతి తేసర్వమాఖ్యాతం యత్పృష్టోహ మిహత్వయా ।
యా గతిస్తేన వైశ్యేన సంప్రాప్తా జన్మనోర్ద్వయోః ॥ 51

యథా జగాద భల్లాలః సర్వం తదభవత్తదా ।
సజజ్ఞే కమలా భూత్వా సో అభవత్ క్షత్రియర్షభః ॥ 52

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**భవిష్యకథనంనామ త్రయోవింశో అధ్యాయః**



# కళ్యాణవైశ్య - 'భవిష్యకథనం'

# 23-వ అధ్యాయము

భృగుమహర్షి సోమకాంత మహారాజుకు ఆతరువాత జరిగిన వృత్తాంతాన్నిలా చెప్పసాగాడు.

'ఓ రాజా! కళ్యాణసంజ్ఞకుడిగా దక్షునియొక్క పూర్వజన్మ వృత్తాంతాన్ని విశ్వామిత్ర మహర్షియొక్క అమృతోపమమైన మృదుమధుర వాక్కులతో తెలుసుకున్న భీముడన్న ఆ రాజు — దక్షుని చరిత్రలో ఆ తరువాత జరిగిన కధను తెలుసుకొనగోరి విశ్వామిత్రుడిని యింకా సవినయంగా ఇలా ప్రార్థించాడు.

"ఓ మహర్షీ! నీవు చెప్పిన దక్షుని చరిత్రఅంతా విన్నాక నా మనస్సుకు ఒక అనిర్వచనీయమైన ప్రశాంతి కల్గింది! ఆ తరువాత

కళ్యాణసంజ్ఞకుని గతి ఏమైందో ఆ వివరం దయతో తెలియజేయి!"

అప్పుడు విశ్వామిత్రమహర్షి ఆతరువాత జరిగిన కళ్యాణసంజ్ఞికుని గాధను ఇలావివరించాడు. నీవుకూడా శ్రద్ధాళువై విను!" అంటూ సోమకాంతుడితో ఇలా చెప్పసాగాడు.

"ఓ భీమరాజా! ఇలా భల్లాలుని శాపంవల్ల కళ్యాణవైశ్యునికి శరీరమంతా రోగభూయిష్టమై, అనేక గాయాలతో రక్తం స్రవించసాగింది! భరించరాని దుర్వాసనతోపాటూ, ఆతడికి మూగత్వం, చెముడు కూడా కలిగాయి. అతని భార్యయైన ఇందుమతి తన భర్తకు సంప్రాప్తించిన ఈ దుస్థితికి ఎంతో దుఃఖించింది. 'ఏ పాపకర్మ ఫలంగా నా భర్త యింతటి దురవస్థ పాలైనాడోకదా! స్వాభావితంగా ధర్మపరుడు, దేవ బ్రాహ్మణ పూజలయందనురక్తికలవాడు, ధర్మశాస్త్రార్ధమునంతటినీ క్షుణ్ణంగా ఎరిగినవాడు, కేవలం స్వభార్యనైన నాయందే అనురక్తికల వాడు, అట్టి ఈతనికి ఈ దుస్థితి ఎట్లువచ్చిందో?' అని పలువిధాలుగా విచారిస్తూ, మాటిమాటికీ దుఃఖపుభారంతో నిట్టూరుస్తూ, ఆ ఊరి జనంవల్ల తన కుమారుడైన భల్లాలుడు అడవిలో అతడి తండ్రిచేత బంధించబడటం, హింసించబడ్డాడనీ తెలుసుకున్నది. ఇక ఉండబట్టలేక తన కుమారుణ్ణి వెతుక్కుంటూ, అతడు బంధింపబడ్డ చోటుకి అరణ్యా నికి వెళ్ళింది.

తీరా, ఆమె ఆ ఆలయానికి వెళ్ళిచూస్తే, అక్కడ బంగారువర్ణ దేహంతో పరిపూర్ణ ఆరోగ్యంతో నవయవ్వనవంతుడైన ఒక యువకుని చూసి తనకళ్ళను తానే నమ్మలేకపోయింది. ఆశ్చర్యంతో అది కలకాదు కదా అని కళ్ళు నులుముకుని మరీచూసింది!

అక్కడఉన్న దేవాలయంలో ఏకాగ్రచిత్తంతో గజాననుని చతుర్బాహువులు, మూడు నేత్రాలు గలవానిని, సిందూరవర్ణ దేహంతో ప్రకాశిస్తూన్న వక్రతుండముగల గణేశుని ఏకమనస్కుడై అర్చిస్తున్న కుమారుణ్ణి చూసి, 'ఈ ఊళ్ళోవాళ్ళు తిన్నమైన వాళ్ళుకాదు! లేకపోతే ఏ: బాధాలేకుండా ప్రశాంతచిత్తంతో గణేశుని అర్చించుకుంటూన్న నా ముద్దుకుమారుడి గురించి లేనిపోనివన్నీ కల్పించిచెప్పారు. వాళ్ళమాట పట్టుకుని యిక్కడికివచ్చాను! తీరా చూద్దును కదా — వాళ్ళు చెప్పిన దానికి ఇక్కడ ప్రత్యక్షమైన దానికీ పూర్తి వ్యతిరేకంగావున్నదే?' అనుకుంటూ ఆ ఆనందంతో తన మనస్సు ఉప్పొంగగా తన కుమారుని సమీపించి, ఆప్యాయంగా అతనిని తనకు అక్కునచేర్చుకుని, తలనిమిరి ప్రేమతో ముద్దాడింది.

"నాయనా! మనం యిక మనయింటికి వెడదాం! పద! నీతండ్రి గొప్ప అస్వస్థతకు లోనై, శరీరమంతా వ్రణాలతోనూ, గాయాలతోనూ, బాధపడుతూన్నాడు. మాట మారుపలుకలేడు, చెవులు ఏమాత్రం వినబడవుకూడా! అతని బాధానివారణకై ప్రయత్నించి కొడుకుగా నీధర్మము నెరవేర్చుదువుగాని! నీవంటి యోగ్యుడు, గుణవంతుడూ మాయింట్లో పుట్టడంవల్ల నా కడుపు పండింది! మన వంశం యావత్తూ చరితార్థమైంది! మీ తండ్రి ఆవేశంలో ఆచరించింది తండ్రిగా తన కర్తవ్యాన్నేగాని, నీకు ఏమాత్రం అపకారం తలపెట్టాలన్న ఉద్దేశ్యంతో ఎంతమాత్రంకాదు! కనుక నీవూ నాతో వచ్చి, నీ తండ్రియొక్క బాధానివారణకై కుమారుడిగా నీ కర్తవ్యం నెరవేర్చు!" అంటూ అనునయ వాక్యాలు పలికింది.

వికలమైన మనస్సుతో తీవ్రమైన నిర్లిప్తత చోటుచేసుకునగా

భల్లాలుడు యిలా బదులిచ్చాడు.

'తల్లి ఎవరు? తండ్రి ఎవరు? పుత్రుడెవరు? ఈ ప్రకృతీ, దాని స్వాభావిక లక్షణాలవల్ల కలిగే సకల సంకల్పవికల్పాలన్నీకూడా — భగవంతుడైన గజానుని సంకల్పానుసారమే జరుగుతాయి! జీవులమధ్య పరస్పరం కలిగే రాగద్వేషాలన్నీకూడా వారివారి కర్మానుసారమే సంభ విస్తాయి. అందుకనే ఎట్టివానికైనా వాడు చేసిన కర్మయొక్క ఫలం అనుభవించక తప్పదు; కనుక ఓ మంగళప్రదురాలా! యిక నాకు తల్లీ, తండ్రీ, గురువూ, దైవం సమస్తమూ వినాయకుడే! ఆతని దివ్య చరణాలవద్దే నాసర్వస్వమూ సమర్పించాను. ఆయనయొక్క అనుగ్రహ విశేషం చేతనే ఈనాడు నాశరీరానికి జవజీవాలూ, ఆత్మజ్ఞానమూ లభించి నాయి. పవిత్రమైన గణేశుని ఆలయాన్ని ధ్వంసం చేయటం, దైవాప చారం చేయటమే! అందలి మూర్తిని విసరివేయటం, దురహంకారంతో గజాననునికి భక్తిచేస్తున్న నన్ను చావమోదటం వంటి దుష్కార్యాల వల్లనే దేవతాగ్రహంతో అతనికి ఇట్టి దారుణమైన స్థితి సంప్రాప్తమైంది! జాగ్రత్తగా తత్త్వవిచారణ చేసినట్లయితే ఓ మంగళప్రదురాలా, నిజానికి నీవు తల్లివీ కావు! ఆతడు నాతండ్రీకాదు! సకల జగాలకూకూడా తల్లీతండ్రీ ఆ దేవదేవుడైన గజాననుడే! ఆయనే జన్మ మృత్యువుల కతీతమైన ఆత్మ జ్ఞానాన్ని ప్రసాదించేవాడు. సృష్టి, స్థితి, లయాలు మూడూ ఆతని లీలాకృత్యములే! ఆ ప్రభువే సకల దేవతాస్వరూపుడూ, త్రిమూర్తి స్వరూ పుడూకూడా! ఎట్టి అపరాధము లేకుండానే బాలుడనైన నన్ను దారు ణంగా హింసించాడు! అంతేకాదు నీభర్త దైవదూషణమూ, ఘోరమైన దైవాపరాధాన్నీ ఏమాత్రం జంకూగొంకూ లేకుండా నిర్వర్తించాడు.

అందుకుతగ్గ ప్రతిఫలాన్నే అతడు అనుభవిస్తున్నాడు. ఇక అటువంటి మహాపాపిని నేను దర్శించను. ఎందుకంటే పతితుడైనవాడిని దర్శించటం వల్లనే అనేక దోషాలు సంప్రాప్తమౌతాయి! కనుక నీవు నాయందు మమకారాన్ని వీడి, నీకు తగిన సతీధర్మాన్ని అనుసరించి అతనిని శ్రద్ధగా సేవించుకో!"

ఈమాటలు విన్న ఇందుమతి దీనంగా యిలా ప్రార్థించింది.

"నాయనా! కరుణను వహించీ, బంధుత్వమును అనుసరించీ, దయతో అనుగ్రహంతో నీతండ్రికిచ్చిన శాపాన్ని ఉపసంహరించు!" అంటూ వేడుకోగా అప్పుడు శాంతచిత్తుడైన భల్లాలుడిలా ఆమెకు బదులిచ్చాడు.

'ఓ పతివ్రతా! జన్మాంతరంలో ఈతడు నీకు కుమారుడై జన్మిస్తాడు! పైనచెప్పిన సకల దుర్లక్షణాలతోనూ ఇతడు దక్షుడన్న పేరుతో జన్మిస్తాడు. నీవు కమల అన్న పేరుతో ప్రఖ్యాతురాలవౌతావు! ఈ దక్షుడి బాధానివారణకై నీ వల్లభుడు 12 సంవత్సరాలు ఘోరతపస్సు చేసినా ఫలితం కనిపించక, పుత్రసహితంగా నిన్ను ఇల్లు వెళ్ళగొడతాడు. అప్పుడు దేశాంతరాలలో తిరుగుతూ, భిక్షాటనమొనరిస్తూ అలమటిస్తూన్న మీకు దైవవశాన ఒక వైనాయక భక్తునితో పరిచయమేర్పడుతుంది. ఆతని అనుగ్రహ విశేషం చేతనే నీ సకల కష్టాలూ తీర్తాయి! అప్పుడు నీ కుమారునికి స్వస్థతకూడా చేకూరుతుంది! అందుకని నీభర్తయొక్క శాపవిమోచనాన్ని నీకోరిక మేరకు తెలిపాను! నీవింక వెళ్ళు!" అంటూ ఆమెను వీడ్కొలిపాడు.

ఓ రాజా! ఈవిధంగా భల్లాలునిచే ఆతని తల్లి నిరాకరించబడి, మనస్సు దుఃఖంతోనూ, సంతోషంతోనూ సమ్మిళితమై ఆమె ఇంటికి వెళ్ళిపోయింది. అప్పుడు దివ్యసుందరమైన విమానం వచ్చింది. ఆ విమానాన్ని అధిరోహించి భల్లాలుడు వైనాయకలోకాన్ని చేరుకున్నాడు. ఓ భీమరాజా! కళ్యాణవైశ్యుని వృత్తాంతాన్నంతటినీ నీకోరిక మేర వివరించాను. భల్లాలుడు చెప్పినట్లుగానే అక్షరంకూడా పొల్లుపోకుండా తరువాతి జన్మంలో జరిగింది. ఆమె కమల అన్నపేరుతోనూ జన్మించి ఆతడు వల్లభుడు అన్నపేరుతో జన్మించగా — ఆ రాజును వరించి దక్షుడిని కుమారుడిగా ప్రసవించింది." అంటూ ముగించాడు మహర్షి!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని

'కళ్యాణవైశ్య-భవిష్యకథనం' అనే 23-వ అధ్యాయం.



24

# దక్ష స్వప్నవృత్తాంతం

(మూలం)

## చతుర్వింశో అధ్యాయః

**భీమ ఉవాచ :-**

దక్షేణ మునిశార్దూల రాజపుత్రేణ ధీమతా ।
అనుష్ఠానం కృతం కుత్ర కథంవా కస్యవామునే ॥ 1

ఏతద్విస్తార్య బ్రూహి త్వం శృణ్వన్ తృప్యామ్యహం వచ । 2

**విశ్వామిత్ర ఉవాచ :-**

అవిదూరే పురస్తస్యాః కౌండిన్యస్య మహావనం ॥ 3

రమ్యం నానావృక్షయుతం నానాశ్వాపద సంకులం ।
నానాపక్షి గణైర్యుక్తం లతాజాల విరాజితం ॥ 4

సన్మనో నిర్మలపయః సరోవాపీ విరాజితం ।
తత్రస్థిత్వా తపశ్చక్రే గజానన మతోషక్యయత్ ॥ 5

ముద్గలే నోపదిష్టేన మంత్రే ణైకాక్షరేణ సః ।
తోషయామాస తందేవం వర్షైర్ద్వాదశ సంమితైః ॥ 6

స్నానై ర్వస్త్రైః సుగంధైశ్చ మాల్యైర్ధూపైశ్చ దీపకైః ।
నైవేద్యం కందమూలైశ్వ భక్షణీయైర ర్పయత్ ॥ 7

మనసా కల్పయామాస దక్షిణాం క్షత్రియర్షభః ।
ఏవం తస్యాగమన్ భూప దినానిత్యేక వింశతిః ॥ 8

తతః ప్రభాత సమయే స్వయమేవం దదర్శసః ।
ఏకం మహామతంగం చ సిందూరాక్తం సుశోభితం ॥ 9

మదస్రావి సుగండాభ్యాం సుందరం గిరిసన్నిభం ।
చారుప్రసన్న వదనం దంత శోభి మహత్కరం ॥ 10

భ్రమర రాశి సమాకీర్ణం గజానన మివాపరం ।
తేన తత్కంఠ దేశేతు రత్నమాల సమర్పితా ॥ 11

తత ఉద్ధాప్య తంస్కంధే స్థాపయామాస దంతిరాట్ । 12

స దంతీ నగరంయాతః పతాక ధ్వజశోభితం । 13

తత స్సప్రతిబుద్ధస్సన్ పప్రచ్ఛ జననీం నిజాం ।
కమలే వదమాతస్త్వ మస్యాభిప్రాయ మద్యమే ॥ 14

ఆరోహణం గజస్కంధే శుభం వా యదివా శుభం । 15

**కమలోవాచ :-**

కమలోవాచ ధన్యస్త్వమసి దృష్టోయం ।
గజరూపీ వినాయకః ఆరోహణ ఫలం రాజ్యప్రాప్తిరేవ నసంశయః ॥ 16

**దక్షఉవాచ :-**

యది రాజ్యస్య ప్రాప్తిస్యా త్తదా । తుభ్యం దదామ్యహం ॥ 17

నరయానం తథాగ్రామాన్ దీపికాం మౌక్తికస్రజం ।
ధర్మంచ కారయిష్యామి గతాష్టాపద దానతః ॥ 18

వ్రతాని నియమాంశ్చైవ దానాన్యన్యాన్యనేకశః । 19

**మునిరువాచ :-**

శృత్వేత్థం కమలాహృష్టా జగాద తనయంప్రతి ॥ 20

త్వయి రాజ్యస్థితే పుత్ర పరమానందతా మమ ।
స్వదర్మే రమతాం చేతః సతః స్యాత్ ప్రభుతస్తవ ॥ 21

ఆయుష్యం విపులంతే అస్తు ద్విజదేవార్చనే రతిః ॥ 22

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**స్వప్నకథనంనామ చతుర్వింశో అధ్యాయ :**



# దక్ష స్వప్నవృత్తాంతం
## 24-వ అధ్యాయము

ఈ కథాగమనాన్నంతటినీ విశ్వామిత్రమహర్షి చెబుతూండగా శ్రద్ధతో వింటూన్న భీముడు యిలా ప్రశ్నించాడు.

"ఓ మునీశ్వరా! ముద్గలునిచేత గణేశమంత్రాన్ని ఉపదేశంగా పొందిన దక్షుడు ఆ మంత్రాన్ని ఎక్కడ అనుష్ఠించాడు? ఆ వృత్తాంతాన్ని వివరించండి! పవిత్రగాథ ఎంతవిన్నా అమృతంతో సమానంగాఉండి ఈ తనివితీరటంలేదు!"

ఆ మాటలకు విశ్వామిత్రుడు యిలా బదులిచ్చాడు.

'ఓ రాజకుమారా! అలా ముద్గలునివద్ద మంత్రోపదేశాన్ని పొందిన ఆ దక్షుడు అక్కడికి సమీపంలోనే ఉన్న 'కౌండిన్యవన'మనే దట్టమైన

అరణ్యంలో తన అనుష్ఠానాన్ని కొనసాగించాడు. ఆ అరణ్యం నానా రకములైన పుష్పలతా శోభితమై, వివిధములైన పక్షుల కిలకిలారావము లతో విలసిల్లుతూ ఎంతో ఆహ్లాదభరితంగా, ప్రశాంతంగాఉన్నది. అక్కడ ఏకాంతస్థలంలో కూర్చుని మంత్రానుష్టానమును తదేకదీక్షతో పన్నెండు సంవత్సరాలకాలం తన కొనసాగించాడు! షోడశోపచారాలతోనూ, మానసిక పూజనూ అరవై రోజులపాటు నిర్విరామంగా చేశాక, ఒకనాటి తెల్లవారు ఝామున అతనికి ఒక దివ్యస్వప్నం కలిగింది.

అందులో సింధూరవర్ణంతో శోభిల్లుతూ, పెద్ద పర్వతంలావున్న ఒక ఏనుగు కలలో కనిపించింది. అది తన తొండముతో ఒక రత్న హారాన్ని ఈతని మెడలో వేయటమేకాక, అతడిని తనమూపుపైకి తొండంతో లేవనెత్తి కూర్చోపెట్టుకుని సర్వాలంకార శోభితమైన రాజనగరి లోకి ఠీవిగా నడిచివెళ్ళింది! అప్పుడు ఆ రాజకుమారుడు కలలోంచి మేల్కొని, తాను చూసిన దృశ్యాన్ని వివరంగా తన తల్లికి చెప్పి 'అమ్మా! ఈస్వప్నంయొక్క ఫలితం శుభమేనా? ఏనుగును స్వప్నంలో దర్శించ వచ్చా?' అంటూ అడిగాడు! దానికామె 'నాయనా! నీకు కలిగిన స్వప్నం సకల శుభాలకూ సూచకమే! గజారోహణ ఫలంగా రాజ్యప్రాప్తి కలుగు తుంది!' కీర్తివంతుడవవుతావు!" అంటూ అభినందించింది.

అప్పుడు ఆ దక్షుడు ఎంతో సంతోషంతో తన తల్లితో, 'తనకు రాజ్యమే ప్రాప్తించినట్లయితే ఆమెకు సమస్త రాజభోగాలనూ కల్పించగల ననీ, తృప్తిదీర ఆమెచే సద్బ్రాహ్మణులకు సువర్ణాన్ని గోసహితంగా దానం కూడా మిప్పించగలననీ, అప్పుడు ఆమె కోరిన వ్రతాలన్నీ యథేచ్ఛగా

ఆచరించుకోవచ్చునీ' తెలిపాడు.

ఆ మాటలకు ఆమె ఎంతోప్రీతితో సంతుష్టురాలై, 'సర్వదా నీవు ధర్మబుద్ధి కలిగిఉందువు! దీర్ఘాయువువై దేవబ్రాహ్మణ పూజలందు అనురక్తి కలిగి చిరయశస్సును పొందెదవు గాక!" అంటూ ఆశీర్వదించింది.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'దక్ష స్వప్నవృత్తాంతం' అనే 24-వ అధ్యాయం.



25

# నూతన రాజ నిర్ణయం

(మూలం)

## పంచవింశో అధ్యాయః

**విశ్వామిత్ర ఉవాచ :-**

శ్రుణు రాజన్ మహాశ్చర్యం దైవ కాలకృతం శుభం ।
కౌండిన్యే నగరే రాజా చంద్రసేనో మహామతిః ॥ 1

స్వకర్మ పరిపాకేన విధనం కాలయోగతః ।
అగమద్దివ్య యానేన ధర్మ బాహుళ్యతో దివం ॥ 2

తచ్ఛ నాగరికాః శృత్వా హాహాకారం ప్రచక్రిరే
ధావమానా యయుస్తత్ర త్యక్త్వా కార్యాణ్యనేకశః ॥ 3

శిరాంసి చ వినిఘ్నంతః పాణిభిః శ్శోకకర్శితాః ।
చస్థలుశ్చ పతంతశ్చ దద్రుశుః ప్రేత భూపతిం ॥ 4

నేముః పాదౌ ప్రగృహ్యైవ దుఃఖ మోహవశం గతాః ।
కేచిద్ధస్తం గృహీత్వైవ స్వప్నమూర్ధ్ని న్యవేశయతీ ॥ 5

రురుదుః సుస్వరం కేచిత్ పాణీస్ప్రుష్ట ముఖస్వనాః ।
మృతా ఇవ నిపేతుశ్చ స్నేహాతిశయతో అపరే ॥ 6

తస్య పత్నీతు సులభా రురోద కరుణస్వరా ।
పాణిభ్యాం నిఘ్నతీ స్వయం హృదయం భ్రుశ దుఃఖితా ॥ 7

వికీర్ణభూషణా మూర్ఛా మాగతా పతితాభువి
సమాన వ్యసనాభిఃసా పురస్త్రీభిర్ధృతా తదా ॥ 8

విలలాప తదాకాంతా చంద్రసేనస్య సుందరీ ।
నిర్లజ్జా నిరనుక్రోశా నాథ నాథేతి జల్పతీ ॥ 9

రే ధాతర్నదయా తేలిస్తి బాలవచ్చరితం తవ ।
యునంక్షి స్నేహభావేన వినియుంక్ష్య కృతార్థకం ॥ 10

రాజ న్నపృష్ట్వా క్వగతో వదమాం కరుణానిధే ।
దినే దినే వదస్యేవం యామి భద్రాసనం ప్రియే ॥ 11

అద్య నిష్ఠురతాం కేన గమితో స్యాగసా మమ ।
తతీక్షమస్య నమామ్యేషా జనమధ్యే గతత్రపా ॥ 12

వయమాం యత్రయాతోసి ప్రియాం తే ప్రియకారిణీం ।
త్రిలోకీం పశ్యతీం శూన్యా మపుత్రాం పతినా వినా ॥ 13

మునిరువాచ :-

సుమంతుః ప్రకృతిస్తస్య మనోరంజన ఏవచ ।
ద్వావప్యవోదితాం తత్ర కింరాజ్యస్య భవిష్యతి ॥ 14

ఆవాభ్యాం అవిచార్యైవ క్వగతో నృపసత్తమ ।
కస్మాన్న వదసే రాజన్ కిమర్థం మౌనమాస్థితః ॥ 15

నపశ్యసి ప్రియాం భార్యా మనాథామివ విహ్వలాం ।
సహైవ యానో నృపతే త్యక్త్వా పర్వం గృహాశ్రమం ॥ 16

అనాథం నగరం తేద్య రాష్ట్రందా కో ధపాస్యతి ॥ 17

మునిరువాచ :-

ఏతస్మిన్నంతరే తత్ర బభాణ బ్రాహ్మణస్సుధీః
వేదశాస్త్రార్థ తత్వజ్ఞః ప్రస్తుతం నిష్ఠురం వచః ॥ 18

స్వార్థపరా యూయం నాప్తః కశ్చన విద్యతే ॥ 19

సుహృదాం రోదనాశ్రూణి ముఖే ప్రేతస్య యాంతిహి ।
పృథీవ్యాం భారతాం యాతి ప్రాణహీనం కళేబరం ॥ 20

బ్రహ్మాండ గోళకే కోను మృతమన్యేఽగచ్ఛతి ।
ఇయరచ సులభా రాజ్ఞీ రోదతే పి విశాలయా ॥ 21

యాస్యా మనోను గత్యర్థం న సారోదితి కర్హిచిత్ ।
యూయం సర్వే నాగరికాః స్వకార్య గమనాకులాః ॥ 22

సూర్యవంశ్యాః సోమవంశ్యాః యే రాజానో మృతానకిం ।
తస్మాదుద్ధాయ సర్వేపి రాజ్ఞః కుర్వంతు సంస్కృతిం ॥ 23

మృతసంస్కారకారీ యః స ఏవాప్తో నచాపరః ।
ఏ తదర్థంహి లోకస్య జ్యాయసీ పుత్ర గృధ్నుతా ॥ 24

తస్మాత్ ఆనీయతాం ధర్మపుత్రోవాప్యస్య ఏవచ ।
సహి క్రియా మారభతు సర్వైర్ధేయా స్తిలాంజలిః ॥ 25

**మునిరువాచ :-**

తతస్తే నాగరాస్సర్వే ద్వావమాత్యౌ స్త్రియశ్చతాః ।
ప్రబోధితా బ్రాహ్మణేన చక్రుస్తస్యోర్ధ్వదైహికం ॥ 26

సుమంతునా కృతం సర్వం సర్వైర్దత్త స్తిలాంజలిః ।
పునః స్నాత్వాతు తేసర్వే నగరం వివిశుశ్చిరాత్ ॥ 27

అశ్నంతి పిచుమందస్య పత్రం నత్వేశ్వరం జనాః ।
సాంత్వయిత్వా తు సులభాం యయుః స్వం స్వం నికేతనం ॥ 28

త్రయోదశాహే నిర్వృత్తే రాజ్ఞ్యై దత్వాంబరాది తే ।
చక్రుస్తే భోజనం ప్రీత్యా ప్రత్యహం బహువాసరం ॥ 29

ఏకదా నాగరా స్సర్వే ద్వావమాత్యౌ నృపప్రియౌ ।
సర్వే సంశయతా ఆసన్ ప్రజాపాలన కర్మణి ॥ 30

ఏతస్మిన్నంతరే తత్ర ముద్గలౌ మునిరాయయౌ ।
ఉవాచ సర్వాశయ విదస్య రాజ్ఞో మహాగజః ॥ 31

గహనో నామ గృహ్ణాతు మాలాం పుష్కరనిర్మితాం ।
సమాజే యస్యకంఠే తాం నిక్షిపేత్స నృపోభవేత్ ॥ 32

తథేతి చ వేదా సర్వే సాధు సాధ్వీత్య పూజయన్ ।
అతీంద్రియజ్ఞాన వతోవచో ముద్గల శర్మణః ॥ 33

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**పంచవింశో అధ్యాయః**



# నూతన రాజ నిర్ణయం
# 25-వ అధ్యాయము

అనంతరం విశ్వామిత్రమహర్షి యిలాఅన్నాడు. 'ఓరాజా! ఈవిధంగా దక్షుడు తన స్వప్నవృత్తాంతాన్ని తన తల్లికి తెలిపి, ఆమె ఆశీస్సులు పొందిన తరువాత దైవవశాన ఒక అద్భుతం జరిగింది. కౌండిన్య నగరాన్ని పాలిస్తున్న చంద్రసేనుడనే రాజు స్వర్గస్థుడైనాడు. ఆ రాజుయొక్క వియోగాన్ని సైపలేని ప్రజలంతా ఎంతో విలపించారు. ప్రజారంజకుడైన పాలకుడవటంచేత చంద్రసేనుడు అపారమైన ప్రజాభిమానాన్ని చూరగొన్నాడు — ప్రజల్ని కన్నబిడ్డలకన్నా మిన్నగా పాలించటంవల్ల ప్రజలకు రాజు స్వర్గస్థుడవటం తీరని లోటైంది. తండ్రిని కోల్పోయిన పిల్లల్లా దిక్కులేనివారయ్యారు.

తలలు బాదుకొనుచూ, గుండెలవిసేలా రోదిస్తూ ప్రజలందరూ రాజభవనానికి వచ్చి రాజుయొక్క పార్థివదేహానికి గౌరవపురస్సరంగా తలలువంచి నమస్కరించారు. ఇక రాణియైన సులభయొక్క మనః స్థితి వర్ణనాతీతం! గుండెలు, నెత్తి మొత్తుకొంటూ అతిదీనంగా రోదించ సాగింది. తన ఆభరణాలనూ, అలంకరణాలనూ అటూ, యిటూ విసరి వేసి దుఃఖభారము అతశయమవగా మూర్ఛిల్లింది! కొందరు పరిచార కులు లేవనెత్తి పట్టుకొనగా 'ఓనాధా! ఓనాధా!' అంటూ ఏడవసాగింది.

అంత క్రూరంగా నొసటివ్రాత వ్రాసినందుకు బ్రహ్మదేవుని నిందిస్తూ, ఒంటరిగా వీడిపోయినందుకు తన పతిదేవుని తప్పుబట్టి దుఃఖాతిశయం తో వివశురాలైంది. అప్పుడు చంద్రసేనుడి మంత్రులైన సుమంత్రుడు, మనోరంజనుడు అక్కడికివచ్చి 'రాజులేని రాజ్యంగతి ఏమవుతుందా?' అని ఆందోళన చెందసాగారు — ఇలా అందరూ నిశ్చేష్టులయి బాధా సర్వభ్రష్టులై ఉండగా దైవవశాన అక్కడికి ఓ యతీశ్వరుడు వచ్చాడు. సకలశాస్త్రపారంగతుడూ, బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తున్నవాడైన ఆ బ్రాహ్మ ణుడు యిలా కర్తవ్యబోధ చేశాడు.

'ఓ ప్రజలారా! మీ స్వార్ధచింతనను కాస్సేపు వదలి ప్రభువుకు శ్రేయస్సును కల్గించేమార్గం ఆలోచించండి. ఇంతకాలం మీ బాగోగు లన్నీ తనవిగా భావించి మీ అందరి శ్రేయస్సుకై అహరహము కృషిచేసిన మీరాజుకు మీరు కృతజ్ఞతచూపే ఆఖరి అవకాశం యిది. ఎందుకంటే మృతుడైన తరువాత ప్రేత తనచుట్టూచేరి రోదిస్తున్న స్నేహితుల, బంధు జనుల కన్నీళ్ళనే ఆహారంగా స్వీకరిస్తాడు. అప్పుడు అతను విడిచిన పాంచభౌతికదేహం భూమికి బరువవుతుంది! ఈ భూప్రపంచంలో ఎక్క

డైనా శరీరంలో ప్రాణాలున్నంతవరకే జీవుడికి అనుబంధాలుంటాయి. ఆ తరువాత ఆ జీవునివెంట ఎవరూ అనుసరించలేరు. అతని సుకృత దుష్కృతాలుమాత్రమే అతని వెంటవెడతాయి. ఈ రాణికూడా తాను అనాథ యైనందుకు దుఃఖిస్తున్నదేతప్ప, రాజును అనుసరించగోరికాదు! మీరంతా మీమీ స్వంతపనులు నెరవేర్చుకొనటంలోనే సమర్థులు. ఇదివరలో ఈ భూమండలాన్ని అనేకమంది ప్రభువులు రాజ్యాలేలారు! సూర్య చంద్రవంశపు రాజులెందరో తమ కాలం చెల్లిపోగానే దివంగతులు అయ్యారుకదా!

కనుక ఇకనైనా మీ రోదనలను ఆపి, పుత్రహీనుడైన ఈ రాజుకు శ్రేయస్సుకై, ఆత్మశాంతికై అంతిమ సంస్కారాలకు ఏర్పాటుచేయండి! మృతునికి అంతిమసంస్కారం చక్కగా నెరవేర్చినవాడే నిజమైన అప్తుడు. ఇటువంటి అపరకర్మలు నిర్వర్తించటానికే శాస్త్రాలు పుత్రుని అవశ్యకతను నిర్దేశించాయి! పుత్రహీనుడైన ఈ రాజుయొక్క అంత్యక్రియలు జరపడానికి ఔరసపుత్రునిగాని, పుత్ర సమానుడైన యితరునిగాని తీసుకొని వచ్చి, తరువాత జరగవల్సిన కార్యక్రమాలను జరిపించండి! మీరందరూ తిలాంజలులు యిచ్చి అతనికి తుది వీడ్కోలివ్వండి!" అంటూ ఆ యతీశ్వరుడు వారందరినీ కర్తవ్యోన్ముఖుల్ని చేశాడు.

"ఓ భీమరాజా! అలా పేరేపించబడిన పురజనులు సుమంతుడనే మంత్రిపుంగవుణ్ణి సంస్కారక్రియలకై నియోగించారు. అతడు అంత్యక్రియలన్నిటినీ యథావిధిగా నిర్వహించాడు. ప్రజలంతా తిలాంజలి సమర్పించి, పట్టణానికి మరలారు. శివుని దర్శనం చేసుకుని ఎవరి యిళ్ళకు వారు చేరుకున్నారు. పదమూడవ రోజున రాణికి నూతన

వస్త్రముల నిచ్చి, ప్రీతితో సుఖభోజనాలు చేశారు. ఇలా కొంతకాలం గడిచాక రాణి, మంత్రులు, పురజనులు రాజ్యపరిపాలనను ఎవరికి అప్పగించాలా? అన్న సందిగ్ధంలోపడి, ఆలోచించసాగారు. ఆ సమయంలో అక్కడికి యాదృచ్ఛికంగా ముద్గల మహాముని విచ్చేశాడు. వారి సమస్యకి ఒక పరిష్కారాన్ని సూచించాడు.

'ఓ జనులారా! గహనమనే పేరుగల రాజుగారి పట్టపుటేనుగు కమలాల మాలను తొండంతో ఎవరిమెడలో వేస్తుందో అతడినే ప్రభువుగా ఎన్నుకుంటే బాగాటుంది' అనగానే ప్రజలంతా సంతోషంతో 'బాగు, బాగు' అంటూ హర్షధ్వానాలు చేశారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'నూతనరాజ నిర్ణయం'** అనే 25-వ అధ్యాయం.



## 26

# పరంపరా వర్ణనం

(మూలం)

### షడ్వింశో అధ్యాయః

**విశ్వామిత్ర ఉవాచ :-**

ఏకస్మిన్దివసే శుభగ్రహయుతేలగ్నే శుభేవాసరే । 1

యోగే చారుఫలే జనేచ నగరే నానావిధే మేళితే మాలాం । 2

రత్నమయీం దదౌ నరపతే రాజ్ఞీ కరేణోః కరే సంప్రార్థ్య । 3

ద్విరదం కురుష్వ నృపతిం లోకేషు యస్తేమతః తాం రాజ్ఞాం । 4

ప్రతిగృహ్య వారణపతిః సంరంజితో ధాతుభి ర్బభ్రామ । 5

ద్విజబంది చారణగణై రాశాసితః సర్వతః నానావాద్య । 6

కరైర్వృతో నృప భటై రాజ్యార్థిభిః పూరుషై ర్లిప్సున్ ।
సర్వజనం సభా పరిగతం యాతో బహిః పత్తనాత్ ॥ 7

నార్య స్తన్నగరే శిశూనథ పతీన్ కృత్వా పురోవస్థితాన్ ।
రాజ్యార్థం వివిధానరాశ్చ బహుధా శ్రేణీముఖాశ్చ స్థితాః ॥ 8

తేసర్వే విమనస్కతాం పరిగతాః స్వం స్వం గృహం చాగతా ।
యాతే అస్మిన్గహనే కరిణ్య థ పురోయాతా బహిశ్చాపరే ॥ 9

గజస్తు యాతః కమలాసుతం తం సంపూజయంతం । 10

ద్విరదాననం తం దృష్ట్వైవ తస్మి న్నిదధే సమాలాం ।
పశ్యత్సు లోకేషు సురేషు నాకే ॥ 11

వస్త్రాణి చ మాల్యాని భూషణాని దక్షాయ దత్తాని తథైవ లోకైః । 12

జ్ఞాత్వామతం పౌరజనస్య రాజా రాజ్ఞః ప్రకృత్యో రుభయో స్తథైవ । 13

వవదు ర్వాద్యసంఘాశ్చ దివ్యా భౌమా అనేకశ ః ।
ముముచుః పుష్పవర్షం తే దేవా హర్షయుతా శ్శుభం ॥ 14

ఉపవిష్టా స్తదాలోకా యథాస్థానం యథాక్రమం ।
నేముశ్చతం దక్షనృప మమాత్యద్వయ సంయుతం ॥ 15

తాంబూలానిచ వస్త్రాణి జనేభ్యః ప్రదదౌ నృపః ।
బ్రాహ్మణాన్ పూజయిత్వైవ దత్వా దానా న్యనేకశః ॥ 16

సంపూజ్య మాతరం తాంతా వస్త్రాలంకరణాదిభిః ।
దాపయామాస దానాని బ్రాహ్మణేభ్యో యథావిధి ॥ 17

నరయానే సమారోప్య స్వయమారుహే గజం ।
అలంకృతం సిక్తమార్గ పతాక ధ్వజసంయుతం ॥ 18

అశ్వారూఢా వమాత్యౌతౌ పురస్కృత్య యయౌ పురం !
స్తువంతి వందినః పౌర నృత్యంత్యప్సరసః పురః గంధర్వా ॥ 19

గాననిష్ఠాతా ధావిత్వా యాంత్యముంపురః జయశబ్దైః ।
న్నమశ్శబ్దో వాద్యశబ్దో గమద్దివం నృపద్వారం సమాసాద్య
నత్వాకేచిత్ ॥ 20

గృహం యయుః సభాయాం వివిశుస్సర్వే సంఖ్యాతితా ।
నృపాస్తదా నృయానం ప్రేషయామాస ముద్గలాయ మహామతిః ॥ 21

ఛత్రం ధ్వజం చామరంచ సుమంతుం ప్రకృతిం తథా ।
ఆయాంతం ముద్గలం దృష్ట్వా స్వాసనాత్ పురతోయయౌ ॥ 22

స కిరీటేన శిరసా పాదయోః ప్రణనామతం ।
న్యవేశయ త్స్వాసనే తం తేనాజ్ఞప్తో న్య ఆసనే ॥ 23

ఉపవిష్టో రాజసంఘైః పూజయామాస తంమునిం
గాం చాపి ప్రదదౌ తత్ర బ్రాహ్మణాయ మహామతిః ॥ 24

ఉవాచతం నృపోదక్షో భో ముద్గల మహామునే అద్యతే ।
మహిమాజాతో లోకైరేతై ర్మహానయం ॥ 25

శరీరే చారుతా రాజ్యప్రాప్తిశ్చ త్వత్ప్రసాదతః ।
కృపావస్థా పూర్వతనోః కేృదృగ్రాజ్యం మహామునే ॥ 26

వినాయక మహంజానే త్వామేవ మునిసత్తమ ।
పునర్మే మస్తకే బ్రహ్మన్ నిధేహి కరపంకజం ॥ 27

యేనాహం సర్వకామానాం భాజనం స్యాం చిరం మునే । 28

**విశ్వామిత్ర ఉవాచ :-**

ఆకర్ణ్య వచనం తస్య ముద్గలో అథాబ్రవీచ్ఛృతం । 29

నతే భయం రిపుకృతం భవిష్యతి కదాచన ।
యం యం కామయసే కామం సర్వం తత్తే భవిష్యతి ॥ 30

తతస్తస్మై దదౌ గ్రామాన్ వాసో రత్న ధనాదికం ।
అన్యేషాం బ్రాహ్మణానాంచ గో ధనాని అంశుకానిచ ॥ 31

ఆశీర్భి రభినంద్యాథ యయుస్తే బ్రాహ్మణా గృహం ।
అమాత్యాభ్యాం గృహేభ్యశ్చ దదౌ గ్రామాననేకశః ॥ 32

ప్రాసాదం కారయామాస గణేశస్య బృహత్తరం ।
కుండినేనగరే తస్మిన్ ప్రాక్తనం సంస్థితం లఘుం ॥ 33

విసర్జయామాస సభాం ప్రవివేశ గృహం నృపః ॥ 34

ఆయయౌ వల్లభస్తత్ర శృత్వావార్తాం జనేరితాం ।
వీరసేనాం నరపతిః స్వ సుతాం పతిమిచ్ఛతీం ॥ 35

దదౌ తస్మై స్వప్నగతః గణేశస్యాజ్ఞయా శుభం ।
దక్షాయ రాజ్ఞే మహతే త్రిలోకశ్రుత కీర్తయే ॥ 36

తస్మాత్తస్యాం భవత్పుత్రో బ్రుహద్భాను రితిశృతః ।
తతో అభవత్ ఖడ్గధరః సులభ స్తత్సుతోభవత్ ॥ 37

పద్మాకరస్త త్తనయో పపుర్దీప్తస్తు తత్సుతః ।
చిత్రసేన స్తత్సుతోభూ చ్చిత్రసేనా త్త్వమేవ హి ॥ 38

బ్రహ్మోవాచ :-

విశ్వామిత్ర ముఖాత్సర్వం శృత్వా వంశపరంపరం ।
తతః స నరశార్దూలో భీమోనామ మహీపతిః ॥ 39

సంతోష్య తం మునిం ప్రార్ధ్య పప్రచ్ఛ ద్విజపుంగవం । 40

భీమ ఉవాచ :-

వినాయకః కదామేస్యా త్సుప్రసన్నో మహామునే ॥ 41

తముపాయం వదవిభో యేనమేవ దనుగ్రహః ।
కదాహం కృతకృత్యః స్యాం దృష్ట్వా దేవం గజాననం ॥ 42

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే పరంపరావర్ణనం నామ**
**షట్వింశో అధ్యాయః**



# పరంపరా వర్ణనం

## 26-వ అధ్యాయము

విశ్వామిత్రుడు భీమునితో ఆ తరువాత జరిగిన కధాసంగ్రహాన్ని యిలా వివరించాడు.

"ఓరాజా! ఇలా ఉండగా ఒకానొక మంచిరోజున సకలప్రజలూ సమావేశమై ఉండగా రాణియైన సులభ పట్టపుటేనుగు తొండానికి ఒక పుష్పమాల తగిలించి, 'ఓ పట్టపు గజమా! ఈ రాజ్యంలో నీకు ఇష్టమైన వానిని ఈ పూలమాల అతని మెడలోవైచి, పాలనకై రాజుగా ఎన్నుకో!' అని ఆదేశించగా ఆ భద్రగజము రాణి ఆజ్ఞను తలదాల్చి సింధూరంతో సర్వాంగ సుందరంగా అలకరించబడి, వేదపండితులైన బ్రాహ్మణులు, వందిమాగధులు తనను అనుసరించగా, వాద్యఘోష ములు కూడానడవగా, ఆ పుష్పహారాన్ని తొండంతో ధరించి, జనుల నందరినీ అఘ్రుణిస్తూ, నగరాన్ని వీడి వెలుపలికిపోయింది. ఈ చిత్రాన్ని చూడటానికి నగరంలో స్త్రీలు తమ తమ పిల్లలతో గవాక్షముల పైకెక్కి

చూడసాగారు. కొందరు ఆ గజము తమవంకకు చూడకపోవటంచేత నిరాశచెంది ఇండ్లకు వెనుదిరిగి వెళ్ళిపోయారు!

అప్పుడు ఆ పట్టపుటేనుగు మందగమనంతో కమలాసుతుడైన దక్షుని వద్దకువెళ్ళి, ఏకాగ్రమనస్కుడై, భక్తితో గణపతిని అచంచలదీక్షతో ఆరాధిస్తూన్న ఆతని మెడలో ఆ పుష్పహారాన్ని వైచింది. ఈ దృశ్యాన్ని అంతరిక్షంలోనుండి గమనిస్తూన్న దేవతాగణములు చకితులైనారు — అప్పుడు ప్రజలందరూ రాజుగా ఎంచుకోబడ్డ ఆ దక్షునికి తమ ప్రేమాదర ములు ఉట్టిపడేలా — నూతనవస్త్రాలు, పుష్పమాలలు, వివిధములైన రత్నాభరణాలూ సమర్పించారు. ఆ శుభతరుణంలో భేరీ మృదంగరావాలు మారుమ్రోగాయి! దేవతలుకూడా సంతోషించి పైనుంచి పుష్పవృష్టి కురి పించారు. మంత్రులిద్దరూ ఆ దక్షుని సమీపించి భక్తిమీర నమస్కరించి, ఆతడికి పరిస్థితిని వివరించి రాజుగా పట్టమును అలంకరించమని ప్రార్థించారు. మంత్రులిరువురు చెరోపక్కా నిలువగా ప్రజలంతా ఆ దక్షప్రభువుకు నమస్కరించారు.

రాజైనాక వేదపండితులైన బ్రాహ్మణులను తాంబులాది సంభావన లతో ఆదరించి, తన తల్లిని కూడా వస్త్రాలంకారములతో పూజించి ఆమెచేత కూడా అనేక దానాలను చేయించాడు దక్షుడు. ఆతరువాత ఆమెను రాజమాతగా పల్లకీలో ఊరేగింపచేసి తానూ స్వయంగా పట్టపుటేనుగను అధిరోహించాడు!

నానావర్ణ పతాకములతో, పూలతోరణాలతో అలంకరించబడిన రాజ నగరులోకి మంత్రులిరువురూ అశ్వారూఢులై అనుసరించగా ప్రవేశించాడు.

వందిమాగధులు జయజయధ్వానములతో కైవారము చేయసాగారు. అప్సరసలు నాట్యంతోనూ, గంధర్వులు తమ అమరగానంతోనూ అల రించారు! ఇక ప్రజలంతా ఒక సముద్రంలా జయజయధ్వానాలను ఉచ్ఛైస్వరంతో చేయగా సామంతులు, పురప్రముఖులతో కూడిన రాజసభ లోకి ప్రభువైన దక్షుడు ప్రవేశించాడు.

ఒక పల్లకీని చక్కగా అలంకరించి ముద్గల మహర్షిని సగౌరవంగా కొనిరమ్మని దక్షుడు ఆదేశించాడు. పల్లకీకూడా మంత్రి సుమంతుడిని ఛత్రచామరాది రాజలాంఛనములతో ముద్గలునివద్దకు పంపాడు. అప్పుడు వారు రాజాజ్ఞననుసరించి ముద్గలుని పల్లకీలో ఆరోహింపచేసి తమవెంట సభాస్థలికి తీసుకువచ్చారు. అది చూచిన రాజు సింహాసనమునుండి దిగ్గున లేచి, మహర్షికి సాదరంగా ఎదురెళ్ళి, తన కిరీటంతోసహా ఆయన పాదాలకు తలను భక్తితో ఆన్చి, ఆయనను రాజసింహాసనంపై కూర్చుండ చేసి, ఆయన అనుమతితో తానూ మరో ఆసనంపైన కూర్చున్నాడు. సామంతరాజుల బృందంతోపాటు ఆ ముద్గలుని యధావిధిగా సత్క రించి, భక్తితో ప్రణమిల్లాడు. అతిథిపూజను చేసి, పాడిఆవును ఆ మహర్షికి వినయంగా సమర్పించాడు.

అప్పుడు దక్షుడు ముద్గలమునితో యిలాఅన్నాడు

'ఓ మునిసత్తమా! తమయొక్క మహిమావిశేషం యిప్పుడే ఈ పుర జనులకు వెల్లడైంది. తమ దివ్యానుగ్రహ ప్రభావంచేతనే నాకు రోగరహిత మైన సుందర శరీరము, రాజ్యప్రాప్తియూ కలిగినవి! ఇప్పుడు పూర్వపు నా దురవస్థ తలుచుకుంటేనే వళ్ళు జలదరిస్తున్నది. అప్పటి ఆ దుస్థితికీ,

తమ అనుగ్రహప్రాప్యమైన ఈనాటి స్థితికీ పోలికేలేదు! ఓమునీశ్వరా! మహాత్ముల దివ్యానుగ్రహానికి అసాధ్యమన్నదేలేదు! రోగిని నిరోగిగా, భోగిగా చేయటం దయానిధులైన మీకే చెల్లింది! తమ దివ్యహస్తాన్ని నా శిరస్సుపైన ఉంచి తమ అనుగ్రహాన్ని నాపై ప్రసరించండి! తమరే సాక్షాత్ వినాయకస్వరూపులు.''

ఆ మాటలకు ముద్గలుడు చిరునవ్వు మోముతో రాజును అనున యిస్తూ యిలాఅన్నాడు.

'నాయనా! దక్షా! నాయొక్క అనుగ్రహ విశేషంచేత ఇకమీదట నీకు ఎన్నడూ శత్రుభయం కలగదు! అంతేకాదు! నీవు సంకల్పించినదే తడవుగా నీ మనోకామనలన్నీ తప్పక నెరవేర్తాయి!'' అంటూ ఆశీర్వ దించాడు. అనంతరం లెక్కలేనన్ని పాడి పశువులను, అగ్రహారాలను ఆ ముద్గలమహర్షికి భక్తితో సమర్పించి ప్రణమిల్లాడు దక్షుడు. ఇతర వేదపండితులకు కూడా గోవులను, వస్త్రాలను ధనధాన్యాలను బహుక రించాడు.

వారుకూడా ఆతడిని చిరకీర్తివికమ్మని ఆశీర్వదించి తమతమ నెలవులకు తిరిగి వెళ్ళిపోయారు! మంత్రులనూ, పరిచారకులనుకూడా తగిన రీతిన సత్కరించి, అందరి మన్ననలనూ పొంది ప్రీతిపాత్రుడైనాడు! ఆ తరువాత కుండిన నగరంలో జీర్ణమైవున్న పాతఆలయాన్ని ఉద్ధరించి, గజాననుని మూర్తిని ప్రతిష్ఠించాడు. అందులో సౌందర్యోపేతమైన ఒక ప్రాకారాన్నికూడా వైభవోపేతంగా నిర్మించాడు. వల్లభుడనే రాజు ఈ వృత్తాంతాన్నంతటినీ విని, తనకు స్వప్నంలో గణేశుడు ఆదేశించిన ప్రకా

రం 'వీరసేన' అన్న కుమార్తెను యిచ్చి దక్షునితో వైభవంగా జరిపించాడు. ఆ దంపతులకు బృహద్భానుడు అనే కుమారుడు జన్మించాడు. ఆ బృహద్భానుడికి ఖడ్గధరుడు, అతనికి సులభుండు, వానికి పద్మాకరుడు, పద్మాకరునకు వపుర్దీప్తి అనేవాడూ, వానికి చిత్రసేనుడూ, చిత్రసేనునికి నీవూ జన్మించారు!" అంటూ విశ్వామిత్రుడు భీమరాజుకు అతని వంశావళిని తెలియజేయగా —

"ఓ మునిపుంగవా! భక్తాభీష్టఫల ప్రదుడైన ఆ వినాయకుడు నాకు ఎలా ప్రసన్నుడౌతాడో, అతడి అనుగ్రహాన్ని పొందే విధమును దయతో నాకు తెలియజేసి నన్ను కృతార్థుడిని చేయ" మంటూ భీముడు విశ్వామిత్రమహర్షిని ప్రార్థించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'పరంపరా వర్ణనం' అనే 26-వ అధ్యాయం.



27

# రుక్మాంగదాభిషేక వర్ణనం

## (మూలం)

## సప్తవింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

క ఉపాయస్తు మునినా విశ్వామిత్రేణ ధీమతా ।
కృపావతా తు భీమాయ కథిత స్తం వదస్వమే ॥ 1

మన్మనో మోహపటలం మృత్యోరివ వినిస్సృతం ।
తత్కధామృత పానేన ప్రీతోహం అమృతోయధా ॥ 2

**బ్రహ్మోవాచ :-**

భీమాయ కథితస్తేన య ఉపాయః శ్రుణుష్వతం ।
ఏకాక్షరం మహామంత్రం భీమాయాకథయ న్మునిః ॥ 3

పారాశర్య మునిశ్రేష్ఠ కథయామి శ్రుణుష్వతం ।
ఉవాచ తం ప్రసన్నాత్మా విశ్వామిత్రః సుధర్మవిత్ ॥ 4

విశ్వామిత్ర ఉవాచ :-

అనేనారాధయ విభుం దైవతం గణనాయకం ।
అనుష్ఠానం కురుష్వత్వం ప్రాసాదేదక్ష నిర్మితే ॥ 5

వినాయకః ప్రసన్నస్తే సర్వాన్కామాన్ప్రదాస్యతి ।
ధర్మమర్థం తథా కామా మోక్షమన్యదపేక్షితం ॥ 6

గచ్ఛవా స్వపురం భీమ చింతాం కామపి మాకురు । 7

బ్రహ్మోవాచ :-

ఇత్యుక్తః స తదాతేన తం ప్రణమ్య యయౌ నృపః ।
సపత్నీకో దదర్శాథ పత్తనం స్వం జహర్షచ ॥ 8

అమాత్యా సేనయాసార్థం నాగరై రీయతుర్నృపం ।
ఆలిలింగు ర్నృపం కేచి న్నేముర్ధూరాత్త థాంతికే ॥ 9

ప్రవివేశ పురం. రాజా సర్వైస్సాకం ధ్వజాలిమత్ ।
సిక్తమార్గం చారుగంధం నానావాదిత్ర శబ్దితం ॥ 10

ఊచుః పరస్పరం లోకాః పురీయం శోభతే అధునా ।
యధా నారీ పతింప్రాప్య యధాంధోవాపి సద్దృశం ॥ 11

ఇతి శృణ్వన్నృ యానస్థః స్తథా సా చారుహాసినీ ।
వస్త్రాలంకార శోభాఢ్యౌ స్తూయమానౌ ముదాన్వితౌ ॥ 12

ఉభౌ వివిశతూ రమ్యం పురం నానర్ధి సంకులం ।
విసృజ్య సర్వలోకం తౌ వస్త్రాలంకార మౌక్తికైః ॥ 13

తాంబూలైస్తేషు యాతేషు భవనం స్వ మగచ్ఛతాం ।
తతః శుభే దినే రాజా దక్ష ప్రాసాద మాగమత్ ॥ 14

య త్కౌండిన్య పురే కారిపురా దక్షేణ ధీమతా । 15

తత్రార్చయామాస విభుం సర్వదాతం వినాయకం ।
ఉపవాస పరో నిత్యం తన్మంత్ర మవలోకయత్ ॥ 16

భోజనే శయనే యానే వచనే శ్వసనేపిచ ।
తమేవ చింత యన్నిత్యం అనన్యమనసా నృపః ॥ 17

జలే స్థలే నభోమార్గే స్వర్గే దేవే నరే ద్రుమే ।
భక్ష్యే పేయే నృపోఽపశ్య ద్వినాయక మనుత్తమం ॥ 18

యం యం పశ్యతి తం నౌతి దృఢాలింగన తత్పరః ।
నగరేతం జనాస్సర్వే పిశాచ ఇతి మేనిరే ॥ 19

తతో వినాయకో భ్యేత్య ధృత్వా పాణితలే నృపం ।
ఆహతం నృపముక్తోసి కిం వాచ్ఛసి వదస్వ తత్ ॥ 20

తమువాచ నృపో నాన్యం జానే త్వచ్చరణాంబుజాత్ ।
తతోవినాయకః ప్రాహ పుత్రస్తే చారుదర్శనః ॥ 21

భనితా ముత్ర్పసాదేన గుణీ స్వర్ణతనుస్సృపః ।
వ్రజ స్వం భవనం దేవ ద్విజపూజా పరోభవ ॥ 22

సగత్వా భవనం రాజా తచ్చకార తథైవచ ।
దేవానాం బ్రాహ్మణా నాంచ పూజనం తర్పణం తథా ॥ 23

అకరో త్సర్వభావేన గణేశః ప్రియతామితి ।
అల్పేనైవతు కాలేన పుత్ర స్తస్యాభవ చ్ఛుభః ॥ 24

దదౌ దానాన్యనేకాని పుత్ర జన్మనిమిత్తతః ।
రుక్మాంగదేతి నామాస్య చక్రే ద్విజవరోదితం ॥ 25

వవృధే బాలకో నిత్యం శుక్లపక్షే యథాశశీ ।
చకార గురుపాత్తం స శిక్షార్థం నృపతిస్సుతం ॥ 26

స చ శ్రవణమాత్రేణ జగ్రాహ గురుణోదితం । 27

సర్వవిద్యా నా థానేన థత్తం యత్కపిలేనచ సో పి విద్యానిధి రభూత్।
గజకర్ణ ఇవాపర రుక్మాంగదేతి బలవాన్ సర్వశాస్త్ర విశారదః ॥ 28

తస్మై పట్టాభిషేకః చకార గుణరాశయే ।
దదౌ చ ద్విజ ముఖ్యేభ్యో రాసో రత్న ధనానిచ ॥ 29

తతోధికాం మహాభక్తిం సోపి చక్రే వినాయకే ।
జజాపైకాక్షరం మంత్రం పితుః ప్రాప్తం దినేదినే ॥ 30

ఏకస్మిన్ దివసే రణ్యం యువరాజా వివేశహ ।
మృగయాంప్య చరద్భూరి జఘాన గవయాన్ మృగాన్ ॥ 31

అతిశ్రాంతో దదర్శాథ మునేః కస్య చిదాశ్రమం ।
నానావృక్ష లతాజాలం త్యక్తవైర మృగాన్వితం ॥ 32

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే రుక్మాంగదఋషే వర్ణనంనామ సప్తవింశో అధ్యాయః**



# రుక్మాంగదాభిషేక వర్ణనం

## 27-వ అధ్యాయము

అనంతరం పరమ తపోనిధియైన వ్యాసమహర్షి బ్రహ్మదేవునితో యిలా అన్నాడు. 'ఓచతురాననా! బుద్ధిశాలియైన విశ్వామిత్రునిచేత భీమునికి ఏమి ఉపదేశమివ్వబడిందో, దేన్ని అనుష్ఠించడంవల్ల అతని సకలాభీష్టములు నెరవేరినాయో, ఆ వివరం దయతో నాకు తెలియజేసి నన్ను మోహపులంపటాన్నుంచి విముక్తుడిని చెయ్యి!'

అప్పుడు చతుర్ముఖుడు యిలా బదులిచ్చాడు.

'ఓ వ్యాసమునీంద్రా! విశ్వామిత్ర మహర్షి భీమునికి చేసిన ఉపదేశము, ఉపకారము యెనలేనిది! అత్యంత ప్రభావోపేతమైన ఏకాక్షర గణపతి మంత్రాన్ని అతనికి ఉపదేశించి, విశ్వామిత్రుడు అతనితో యిలా అన్నాడు.

'ఓరాజా! నీవీ మంత్రంచేత భక్తాభీష్టప్రదుడూ, భక్తవత్సలుడూ ఐన గజవదనుడిని ఆరాధించు! నీ పూర్వీకుడైన దక్షుడు నిర్మించిన గణపతి ఆలయంలో ఈ మంత్రాన్ని అనుష్టించు! మీ పూర్వీకులందరిచేతా పూజలందుకున్న ఆ అనుగ్రహమూర్తి ప్రసన్నుడై నీకూ కోరినట్టి సకలాభీష్టాలనూ అనుగ్రహిస్తాడు! చతుర్విధ పురుషార్థాలనూ యివ్వగల దిట్టయే శంకర తనయుడూ, పార్వతీప్రియనందనుడైన గణపతి! కనుక నీవు ఇక నీ సకల చింతలను వీడి, గణేశానుగ్రహాన్ని పొంది కృతార్థుడివికా!"

ఆ మహర్షి మాటలకు కృతజ్ఞతాభావంతోనూ, ఆనందంతోనూ గొంతు గద్గదమవగా, మహర్షియొక్క కరుణావాత్సల్యాలకు ఆనందాశ్రువులు కళ్ళలో చిప్పిల్లగా, భీమరాజు సాష్టాంగ దండప్రణామాలు ఆచరించి, ఆ మునివద్ద సెలవు తీసుకొని, తన భార్య వెంటరాగా తన నగరానికి తిరిగివెళ్ళాడు.

ఇక రాజుయొక్క నగర ఆగమన వార్తను తెలుసుకున్న మంత్రులు ఆనందోత్సాహాలతో సైన్యంతోనూ, సమస్త రాజలాంఛనాలతోనూ, పరివారంతోనూ, ఎదురువచ్చి నగరంలోకి తీసుకెళ్ళారు. నగరాన్నంతా ఎంతో వేడుకగా సర్వాంగ సుందరంగా అలంకరించి, సమస్త మంగళ వాయిద్యాలు ఊరేగింపుకు ముందు నడువగా భీమరాజునూ, అయన పత్నియైన చారుహాసినినీ రాజమందిరానికి వెంటబెట్టుకొని వెళ్ళారు.

"లోకమున పతినిచేరి పతివ్రతయైన స్త్రీ శోభించినట్లుగా, నేటికి మన భీమప్రభువు తిరిగి రావటంతో మన నగరానికే ఒక క్రొత్త జీవకళ వచ్చింది!" అనుకుంటూ ప్రజలంతా ఆనందోత్సాహాలను హర్షాతిరేకంతో పంచుకున్నారు.

ఆ నగరం అంతాకూడా నిండిన సంతోషంతోనూ, ఏ కొరతాలేనట్టి సర్వసమృద్ధితోనూ కళకళలాడింది. రాజమందిరాన్ని చేరుకోగానే ఆ రాజ దంపతులు సమస్త ప్రజానీకానికీ నూతన వస్త్రాలంకారాలనూ, తాంబు లాదికములనూ, వెలగల అనేక ముత్యాల అభరణాలనూ బహూకరించి వారిని తృప్తులను చేశారు.

ఆ తరువాత ఒకానొక శుభముహూర్తంలో భీమరాజు మహర్షిచేత ఉపదేశించబడిన మంత్రాన్ని అనుష్టానం చేయడానికి కౌండిన్యపురం లోని దక్షునిచే నిర్మించబడిన గణేశమందిర ప్రాసాదాన్ని చేరుకున్నాడు. అక్కడ ఉపవాసాది నియమాలతో ఆ మంత్రాన్ని దీక్షగా జపిస్తూ సర్వ కాల సర్వావస్థలలోనూ ఆ దేవదేవుడైన గణపతిని స్మరిస్తూ, సమస్తమైన చరాచర సృష్టియంతటిలోనూ, పంచభూతాలలోనూ సర్వాన్నీ ఆ గజాన నుని స్వరూపంగానే చూడసాగాడు. అతడికి దేన్ని చూసినా భగవత్స్వరూ పంగానే తోచి దానియందు అపారమైన ప్రేమ కలిగేది. దాన్ని ఆలింగనం చేసుకొని ప్రేమించేవాడు. ఇలా అంతటా భగవద్దర్శనాన్ని పొందుతున్న ఆ రాజు ప్రవర్తనను చూసి కొందరాతనికి మతి భ్రమించిందనుకున్నారు. మరికొందరైతే అదేదో భూతావేశమనుకున్నారు. ఇలాఉండగా ఒకనాడు ఆతని అనన్యభక్తికి ప్రసన్నుడైన గజాననుడు భీమరాజు ఎదుట సాక్షాత్క రించాడు. అతని చేయిపట్టుకొని మనోహరంగా చిరునవ్వులు చిందిస్తూ దయతో యిలాఅన్నాడు.

'ఓ రాజా! నీవు ముక్తుడవైనావు. నీ సమస్త అభీష్టాలన్నీ నెరవేరు స్తాను! నీకు కావలసిన వరం ఏదైనాసరే సంశయించక కోరుకో!'

అన్నాడు. అప్పుడు వినమ్రుడైన ఆ భీమప్రభువు యిలా బదులు పలికాడు.

'ఓ ప్రభూ! నీ దివ్యచరణాలపైని యెనలేని, యెడబాటులేనట్టి భక్తినే నేకోరేది! దాన్ని దయతో నాకు అనుగ్రహించు!' అన్నాడు. అప్పుడు గజాననుడిలా అన్నాడు.

'ఓరాజా! నా అనుగ్రహంవల్ల నీకు గుణవంతుడు, రూపవంతుడూ బంగారువన్నె దేహకాంతితో ప్రకాశించేవాడైనటువంటి యోగ్యుడైన కుమారుడు వరపుత్రుడిగా కలుగుతాడు! నీవింక రాజమందిరానికి వెళ్ళి దేవబ్రాహ్మణ పూజారతుడవై ఉండు!' అంటూ అదృశ్యుడైనాడు.

అప్పుడు ఆ భీమరాజు భగవంతుడైన గణేశుని ఆజ్ఞమేరకు దేవతలనూ, రాజకొలువులో సమస్త బ్రాహ్మణులనూ తృప్తిపరస్తూ, 'అందరిలోనూ అంతర్యామిగా ఉన్న ఆ గణేశుడు తృప్తినొందుగాక!' అనుకుంటూ దేవ, బ్రాహ్మణులను పూజించసాగాడు. ఇలావుండగా కొంతకాలానికి ఆరాజుకు శుభప్రదుడైన మగపిల్లవాడు జన్మించాడు! పుత్రోత్సవ సమయంలో అనేక దానధర్మాలను చేసి, ఆ బాలునికి 'రుక్మాంగదు'డన్న నామకరణం చేశాడు.

దైవదత్తుడైన ఆ బాలుడు శుక్లపక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమానుడై పెరగసాగాడు. ఆ పిల్లవాణ్ణి విద్యాభ్యాసానికై గురుకులవాసానికి పంపారు. కుశాగ్రబుద్ధియై, ఏకసంథాగ్రాహిగా చెప్పినవి చెప్పగానే నేర్చుకోసాగాడు. ఇలా ఆ బాలుడు కపిలమునివద్ద రెండో గజాననుడో అనిపించేలాగా సకల విద్యలలోనూ నిధియైనాడు. ఆ తరువాత భీమరాజు తన తనయుడికి ఒక శుభముహూర్తంలో పట్టాభిషేకం

జరిపించాడు. ఆ రుక్మాం గదుడు కూడా తండ్రివద్ద ఏకాక్షర గణపతి మంత్రాన్ని ఉపదేశంగా పొంది, తదేకదీక్షతో ఆరాధించసాగాడు.

ఇలావుండగా ఒకానొకరోజు రుక్మాంగదుడు వేట నిమిత్తమై అరణ్యానికి వెళ్ళాడు. అనేక జంతువులను వేటాడి అలసి, ఒకానొక ముని ఆశ్రమాన్ని చూశాడు. రమణీయమైన ప్రకృతితో, ఆహ్లాదకరమైన పరిసరాలతో, ఎంతో ప్రశాంతంగా ఉన్న ఆ ఆశ్రమంలో నానా జంతువులూ భయాన్నీ స్వభావ వైరములనూ విడిచి స్నేహంతో మెలుగుతూ ఉన్నాయి. అటువంటి పరమపవిత్రమైన, ప్రశాంతమైన ఆశ్రమాన్ని రుక్మాంగదుడు చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'రుక్మాంగదాభిషేక వర్ణనం'** అనే 27-వ అధ్యాయం.



28

# ప్రాయోపవేశనం

(మూలం)

## అష్టా వింశత్యో అధ్యాయః

బ్రహ్మోవాచ :-

తతోరుక్మాంగదో అపశ్యదృషిం వాచక్నవిం శుభం ।
ముకుందాం తస్యపత్నీంచ స్నిగ్ద మంజుళ భాషిణీం ॥ 1

అతిక్రాంతో నరపతి ర్నమశ్చక్రే ఉభావపి ।
తస్మిన్మునౌ గతేస్నాతుం యయాచే నృప సత్తమః ॥ 2

మాతర్ముకుందే యేదేహి శీతలం జలముత్తమం ।
వినాజలం మమప్రాణా గమిష్యంతి యమ క్షయం ॥ 3

ఆకర్ణ్య తస్యవాచం సా జగాద మదనాతురా ।
త్వాదృశం పురుషం క్వాపి మారా దప్యతి సుందరం ॥ 4

నదేవేషు ననాగేషు యక్ష గంధర్వ పుంజయోః ।
పశ్యామి చారుసర్వాంగం మతే మే హృదయంత్వయి ॥ 5

అత్యాసక్తం త్వదధరామృతపానే చ దేహితత్ ॥ 6

**నారద ఉవాచ :-**

వ్యలీకం సతు శృత్వైవ శ్రాంతత్వా ద్భృశ దుఃఖితః । 7

తిలోత్త మోత్తమాం స జితేంద్రియతయా జగౌ । 8

త్యజ ప్రౌఢిం న మే చిత్తం పారదార్యే విగర్హితే ।
వినాయక ప్రభావేన సక్తం నైవాత్ర కర్హి చిత్ ॥ 9

న జలం పాతుమిచ్ఛామి త్వయా దత్తం సుదుష్టయా ।
ఋషేరాశ్రమ ఇత్యేవం యాతో యాస్య ఇతో శుభే ॥ 10

తం గంతు ముద్యతం పాణిం ధృత్వా వై మదనాతురా ॥ 11

**ముకుంద ఉవాచ :-**

బలాత్కారేణ యోన్యస్య సియం ధర్షితు మిచ్ఛతి । 12

సఏవ నరకం యాతి న స్వయం యాతి తా మపి ।
కృతే త్రేతాయుగే బ్రహ్మ స్త్రీణాం స్వాతంత్ర్య మభ్యధాత్ ॥ 13

న కరోషి యదావాక్యం తదా భస్మ భవిష్యసి ।
అథవా రాజ్య విభ్రష్టం కరిష్యే వనచారిణం ॥ 14

**నారదఉవాచ :-**

ఇత్యుక్త్వా ధావమానాసా కామమా ర్గణపీడితా ॥ 15

రభసా ఆలింగయామాస చుచుంబే వదనం హఠాత్ ।
తతో రుక్మాంగద స్తాంతు బలాచ్చిక్షేప దూరతః ॥ 16

మూర్ఛితా పతితా భూమౌ రంభేవ మరుతా హతా ।
ఉద్ధితాం తాం తదా ప్రాహ పరదార విరక్త ధీః ॥ 17

రుక్మాంగదో మహాభాగే మునిపత్న్యవివేకిని ।
పరపుంసి మనోయస్యాం సావై నిరయభాగ్భవేత్ ॥ 18

నమే మనశ్చతే క్వపి యదిశాష్యే మహోదధిః । 19

ఏవం నిరాకృతా తేన తంశశాప పరుషాన్వితా ।
యథా హం కష్టమగమం తదా త్వం కుష్టభాగ్భవ ॥ 20

యతస్తే హృదయం వజ్రాత్సారభూతం నచద్రుతం ॥ 21

ఇత్థం వదంతీం తాం రాజా నిర్భర్త్స్య బహుధా తతః ।
త్వరయా నిర్గ తస్తస్మా దాశ్రమాద్భృశ దుఃఖితః ॥ 22

స్వం దదర్శ శరీరం సశ్వేతం బక శరీరవత్ ॥ 23

కుష్ట రోగయుతం కాంత్యా హీనంచ భృశకుత్సితం । 24

చింతార్ణవే తదా మగ్నః ఇదమహ గజాననం ।
కి మపరాద్ధంతు చా తేద్య కథమత్రాగతోప్యహిం ॥ 25

ప్రాప్తం కథం సుదుష్టాయాః మునిపత్న్యా స్సమాగమం ॥ 26

త్వయా నూనం సిద్ధిపతే దుష్టాస్సంవర్ధితా భ్రుశం ॥ 27

అవతారాంశ్చ సాధూనాం రక్షణాయ బిభర్షి హి ॥ 28

ఇయం ననాశితా దుష్టా స్వైరిణీ రూప గర్వితా । 29

కథం మమశరీరం తత్ కాంచనస్పర్ధి సుందరం । 30

ఇమా మవస్థాం సంప్రాప్తః కేనవా దుష్టకర్మణా । 31

నవభక్తిం యధా పూర్వం సదాకుర్వే యధావిధి ।
త్వదన్యం నైవ శరణం యామి నాధ గజానన ॥ 32

నేదం శరీరం వక్త్రం వా దర్శయిష్యే జనంప్రతి ।
ప్రాయోపవేశనే నేదం శోషయిష్యే కళేబరం ॥ 33

నిశ్చిత్యైవం నరపతి రాస న్యగ్రోధ సన్నిధౌ ॥ 34

భృత్యా ఇతస్తతో ధావన్ నేక్షంతేస్మ చ తం నృపం ॥ 35

ప్రావృత్తాయాం నిశాయాంచ జగ్ముస్స్వం స్వం నివేశనం ॥ 36

స్వామి సేవకయోర్జాతా గతిశ్చక్రాహ్వయో రివ ॥ 37

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**ప్రాయోపవేశనం నామఅష్టావింశత్యో అధ్యాయః ॥**



# ప్రాయోపవేశనం

# 28-వ అధ్యాయము

## ముకుంద రుక్మాంగదుని మోహించుట

అనంతరం చతుర్ముఖుడిలా చెప్పసాగాడు. 'ఓ వ్యాసమునీంద్రా! అలా వేటకై వచ్చి దప్పిగొని ముని ఆశ్రమానికి చేరుకున్న రుక్మాంగదుడు వాచక్నవి అనే మునీశ్వరుడినీ, మృదుమధురంగా మాట్లాడే ఆతని భార్య ముకుందనూ చూసి, భక్తితో ఆ పుణ్యదంపతులకు నమస్కరించాడు. ఆ తరువాత ముని స్నానార్థం నదీతీరానికి వెళ్ళిపోయాడు. అప్పుడు దప్పిగొన్న రుక్మాంగదుడు ఆ మునిపత్నిని 'తల్లీ'! నా నాలుక దప్పికతో పిడచకట్టుక పోతున్నది. కనుక నాకు త్రాగేందుకు కాసిని చల్లని మంచి నీటిని యిచ్చి పుణ్యం కట్టుకో!' అన్నాడు

ఆ మాటలకు ఆ మునిపత్నియైన ముకుంద ఒక క్షణకాలం ఆ రాజుయొక్క అందచందాలకూ ఠీవికీ మోహితురాలై అతడితో యిలా

అన్నది. "ఓరాజా! అందంలో మన్మధుణ్ణి ధిక్కరించేలావున్నావు. నీవంటి సొగసుకాడిని యిప్పటివరకూ ఎన్నడూ నేను చూసికూడా ఉండలేదు! జయంతుడు, వసంతుడు, నలకూబరుడు కూడా అందంలో, ఠీవిలో నీకాలి గోటికే సరిరారు! అపరమన్మధుడిలా ఉన్న నీయందు నామనస్సు చిక్కుకున్నది. కనుక కామాతురనైన నా కోరిక తీర్చి, నా అధరసుధా పానముచేయి! నామనస్సు రంజిల్లచేయి!"

ఇంద్రియాలను నిగ్రహించినవాడూ, శమదమాలతో సాధనసంపత్తిని అలవర్చుకున్నవాడైన ఆ రుక్మాంగదుడు ఆమె మాటలకు పిడుగు పాటుకు లోనైనట్లు విలవిలలాడాడు! ఆమెకు తగు బుద్ధిగరపుతూ యిలా అన్నాడు.

'ఓ ముకుందా! నీవీ చపలతను వీడు! హేయమైన పరదారా పరిగ్రహానికి — ఆ గజాననుని దివ్యానుగ్రహ లబ్ధుడనైన నేను ఎలా పాల్పడగలను? అధర్మురాలవూ, దుష్టురాలవైన నీవిచ్చిన నీటిని కూడా త్రాగటం పాపం! ఋషి ఆశ్రమము అత్యంత పావనమైనదని యిక్కడికి వచ్చాను! ఇక ఇక్కడనుండి వెడతాను' అంటూ లేచి వెళ్ళిపోబోయాడు!

వెంటనే ఆరాజు చేయి పట్టుకుని ముకుంద ఇలా అంది "ఓరాజా! బలాత్కారముగా యితరుల భార్యను చేపట్టినట్టివాడే నరకాన్ని పొందుతాడు. అంతేకాని, తనంత తానుగా వలచివచ్చిన స్త్రీని చేపడితే ఎట్టి ప్రమాదమూ లేదు! అంతేకాదు; సృష్టికర్తయైన ఆ బ్రహ్మదేవుడు కూడా కృత త్రేతా ద్వాపర యుగాలలో మా స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి వున్నాడు. కనుక నీవు నా కోరికను తీర్చు! లేదా నిన్ను రాజ్యభ్రష్టునిగా

వనచారివిగా చేస్తాను!' అన్నది.

ఇలా అంటూ ఓరాజా! ముకుంద కామోద్దీపితురాలై పరుగెత్తి వచ్చి రుక్మాంగదుడిని బలాత్కారంగా కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నది. అప్పుడు రుక్మాంగదుడామెను బలంతో దూరంగా తోసివైచాడు! అప్పుడామె గాలివాటుకు పడిపోయిన అరటిచెట్టులా నేలనుపడి మూర్ఛిల్లింది! స్పృహలోకి వచ్చిన ఆమెతో రుక్మాంగద మహారాజు యిలా అన్నాడు.

'ఓ అవివేకురాలా! నీవు పరమపవిత్రుడూ, అగ్నిహోత్రం వంటి వాడైన వాచక్నవి మునిభార్యవు! ఇలా పరపుషుడిపై మనసుపడటం నీకు ధర్మభ్రష్టత్వాన్నీ, నరకప్రాప్తినీ కలిగిస్తుంది! అటు సూర్యుడిటు పొడిచినా — సముద్రాలే ఇంకినా, నామనస్సు నీ పాపపు కోరికను అంగీకరించదు!'' అంటూ నిరాకరించాడు' — అంటూ నారదుడు ఆ కథాగమనాన్ని యిలా కొనసాగించసాగాడు.

## ముకుంద రుక్మాంగదుని శపించుట :

ఆమాటలకు తోకతొక్కిన త్రాచులా లేచిన ముకుంద రుక్మాం గదుణ్ణి యిలా శపించింది!

'ఓరాజా! నీ తిరస్కారంవల్ల నేనెలాటి కష్టాన్నీ, వ్యధనూ పొందానో, నీవూ అలాగే కుష్టువ్యాధితో బాధితుడవవుదువుగాక! వజ్రకఠినమైన నీ హృదయం కరుగకపోవటంవల్ల నీకీ శాపమిస్తున్నాను'!

ఆ మాటలకు రుక్మాంగదుడు ఎంతో నొచ్చుకుని అట్టి శంఖిణి తనకు ఎదురవటం కేవలం తన పూర్వజన్మకృత పాపఫలమే అనుకొని

మనస్సులో ఖేదపడుతూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు! అలా వెడుతుండగా మార్గమధ్యంలో అతని శరీరమంతా కొంగశరీరంవలే తెల్లటి శ్వేతకుష్ఠుతో వ్యాపించబడింది! ఎంతో వ్యాకులపడ్డ రుక్మాంగదుడు దుఃఖసాగరంలో మగ్నుడై గజానుడిని యిలాఅన్నాడు.

'ఓగజాననా! నావల్ల నీకేం అపరాధము జరిగింది? ఏ అదృశ్యశక్తి నన్నీ ముని ఆశ్రమానికి తీసుకువచ్చింది? దుష్టురాలైన ఈ మునిపత్ని అసలు నాకెందుకు తటస్థపడింది? ఓ సిద్ధిపతీ! పరమ దయాకరుడవే! ఐనా, నీ దయయొక్క ప్రయోజనాన్ని దుష్టులే ఎక్కువగా పొందుతారనుకుంటాను.

భక్తులను రక్షించేందుకూ దుష్టులను శిక్షించేందుకే నీ అనుగ్రహ అవతారాలన్నమాటను నిజం చేయవాప్రభూ? స్వైరిణి దుష్ప్రవర్తనగల ఈ మునిపత్ని దురాగతాన్ని సహించి ఎందుకు ఊరుకున్నావు? ఈమె దుష్ప్రవర్తన యిలా అప్రతిహతంగా కొనసాగవలసిందేనా? మేలిమి బంగారు శరీరపు వన్నెకలిగి కాంతివంతంగా ప్రకాశించే నా శరీరం ఈనాడు ఇటువంటి దుస్థితిని పొందటానికి కారణమేమిటి? ఏ పూర్వ కర్మ దుష్కర్మఫలంగా నాకీ అగత్యమేర్పడింది? ఓ పార్వతీనందనా! దీనజనావనా! నిన్నుతప్ప అన్యులను ఏమాత్రమూ శరణువేడని వాడనే! నీవే నాకు దిక్కు! ఎప్పటిలాగా నేను నీయందే అచంచలమైన భక్తి విశ్వాసాలతో నీ పాదపద్మాలనే అనవరతము సేవిస్తాను! కాని, ఈ రోగభూయిష్టమైన శరీరాన్నీ — నా అమంగళకరమైన రూపాన్నీ నా ప్రజలకు యిక చూపించబోను! ఈ శరీరాన్ని యింక యిక్కడే ప్రాయోప

వేశంతో శుష్కింపచేస్తాను!' అని నిశ్చయించుకొని ఆ రుక్మాంగదుడు ఒక మఱ్ఱిచెట్టుక్రింద కూర్చున్నాడు. అతని వెంటవచ్చిన భటులు తమ ప్రభువుకై వెదకి, ఎక్కడా జాడ కనుగొనలేక, సాయంసంధ్య అవుతుండగా తమతమ యిళ్ళకు వెనుదిరిగారు. ఈవిధంగా భటులు చంద్రుడికై చక్రవాక పక్షుల్లా తమ ప్రభువుకు దూరమై తీవ్ర వియోగ బాధకు లోనైనారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'ప్రాయోపవేశనం' అనే 28-వ అధ్యాయం.



29

# నారదాగమనం

(మూలం)

## నవమ వింశో అధ్యాయః

**మునిరువాచ :-**

తస్మిన్వటే సమాసీనః కస్మింశ్చిద్దివసే నృపః ॥ 1

దూరాద్దదర్శ దేవర్షిం నారదం మునిపుంగవం ॥ 2

ననామ ప్రార్థయామాస క్షణం విశ్రామ్యతామితి ।
ఉత్తతార నభోమార్గా న్నారదః కరుణానిధిః ॥ 3

పూజయిత్వా యథాశక్తి పప్రచ్ఛ మునిమాదరాత్ ।
అహం రుక్మాంగదో నామ భీమపుత్రో మహాబలః ॥ 4

మృగయాం వ్యచరన్వా చక్నవే రాశ్రమ మాగతః ।
జలయాచ్నా కృతాతత్ర తృషితేన మయా నఘ ॥ 5

తస్యపత్నీ భ్రుశం నష్టా కామార్తా మామ చుంబతా ।
తస్మిన్మునౌ గతేస్నాతుం దుష్టభావేన చేతసా ॥ 6

ఉవాచ మాం భజస్వేతి కామబాణ ప్రపీడితా ।
జితేంద్రియతయా దేవ ప్రసాదా త్ సానిరాకృతా ॥ 7

అశపద్దుఃఖితా అత్యంతం సామా నిష్ఠుర చేతసా ।
కుష్టీభవ మహాదుష్ట స కామాం త్యజసే యతః ॥ 8

బ్రహ్మోవాచ :-

శృత్వై దుష్టవచనం నిర్గతోహం తదాశ్రమాత్ ।
శ్వేతకుష్టీ తదానం జాతో వదమే నిష్కృతిం మునే ॥ 9

వియోగాన్మమ భీమోపి మగ్నఃస్యా దుఃఖసాగరే ।
శృత్వేద్ధం వచనం తస్య నారదః ప్రాహవిశ్వవిత్ ॥ 10

ఉపాయం తస్య కుష్టస్య నాశాయ కరుణాయుతః ॥ 11

నారద ఉవాచ :-

ఆగచ్ఛతా మయా మార్గేదృష్ట మాశ్చర్యముత్తమం । 12

విదర్భే నగరం ఖ్యాతం కదంబమితి సంజ్ఞయా ।
తత్రాప్రాసాదేన మయా దృష్టా మూర్తిర్వైనాయకీ శుభా ॥ 13

చింతామణిరితి ఖ్యాతా సర్వేషాం సర్వకామదా ।
తస్యాగ్రతో మహాకుండం గణేశ పదపూర్వకం ॥ 14

కశ్చిచ్ఛూద్రో మహాకుష్ఠీ జరా జర్జరితో నృప ।
తీర్థయాత్రా ప్రసంగేన కదంబపుర మాగతః ॥ 15

గణేశ కుండే స్నాత్వైవ దివ్యదేహ మవాపసః ।
వినాయక స్వరూపైస్తు గణైరానీత మంబరాత్ ॥ 16

విమానవర మారుహ్య స గతస్థాన ముత్తమం ।
యత్ర గత్వా నశోచంతి న పతంతి పునః క్వచిత్ ॥ 17

ధృష్టో మయైవ రాజేంద్ర తత్ర స్నానాయ సాంప్రతం ॥
స్నాత్వా దేవం సమభ్యర్చ్య చింతితార్థప్రదం విభుం ॥ 18

దేహి దానాని విప్రేభ్యః సద్యః పూతో భవిష్యసి ।
జీర్ణాం త్వచం పరిత్యజ్య సురూపీ భుజగో యథా ॥ 19

బ్రహ్మోవాచ :-

ఇతి వాణీం నారదోక్తాం నిశమ్య మునిసత్తమ ।
న కించిదుక్తవాన్ వాక్యం మగ్న ఆనందసాగరే ॥ 20

గంతుం సముద్యతే తస్మిన్ నారదే మునిపుంగవే ।
ప్రణిపత్య తతో అపృచ్ఛత్సంపూజ్యచ మునిం పునః ॥ 21

**రుక్మాంగద ఉవాచ :-**

తస్మిన్క్షేత్రే పురా కేనసిద్ధిః ప్రాప్తా శుభానఘ ॥
మూర్తిశ్చ స్థాపితా కేన మణిరత్నమయీ శుభా । 22

వైనాయకేతి మే శంస పరం కౌతూహలం మునే ॥
భవాదృశానాం సాధూనాం పరోపకరణే మతిః । 23

అన్యథా భ్రమణే కృత్యం న లోకేషు ప్రదృశ్యతే ॥
లోకేషు వర్షతే మేఘః శేషేణాధ్రియతే ధరా । 24

ఉపకారాయ సూర్యోపి భ్రమతేఽహర్నిశం ద్విజ ॥
సమస్య సర్వభూతేషు సర్వజ్ఞస్య త వాగ్రతః । 25

అనభిజ్ఞేన మూఢేన కిం వక్తవ్యం దయానిధే ॥
పృచ్ఛే తథాపి దేవర్షే సంశయ చ్ఛేదనాయ వై । 27

**నారద ఉవాచ :-**

సాధుపృష్టం త్వయా భూప లోకానుగ్రహ కాంక్షిణా ।
తృప్తోహం తవవాక్యేన సర్వంచ కథయామితే ॥ 28

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**నారదాగమనం నామ ఏకోన త్రింశో అధ్యాయః**



# నారదాగమనం
# 29-వ అధ్యాయము

అప్పుడు ముని యిలాచెబుతున్నాడు. 'ఓరాజా! ఒకానొక రోజున అలా ప్రాయోపవేశం చేయబోతున్న ఆ రుక్మాంగద మహారాజు దూరాన్నుండి వస్తున్న త్రిలోకసంచారియైన నారదమహర్షిని చూశాడు.

## రుక్మాంగదుడు నారదునికి తన శాపవృత్తాంతమును చెప్పుకొనటం

ఎంతో భక్తితో ఆ మహర్షికి నమస్కరించి ''ఓ మునీంద్రా! ఒక క్షణకాలం విశ్రమించండి!'' అంటూ ప్రార్థించాడు. ఆకాశమార్గంలో పయనిస్తున్న నారదమహర్షి ఆ ప్రార్థన విని క్రిందకు దిగినాడు. యధావిధిగా నారదుని పూజించి గౌరవభావంతో యిలా ప్రశ్నించాడు. "ఓ మహర్షి! నేను భీమపుత్రుడైన రుక్మాంగదుడను. వేటకై అరణ్యానికి వచ్చి దప్పిగొన్నాను. సమీపంలోనే ఉన్న వాచక్నవి మహర్షి ఆశ్రమానికి

వెళ్ళి దాహం తీర్చుకుందుకని మంచితీర్థమును అర్థించాను. ఆ ముని పత్ని కామపీడితురాలై తన కోరిక తీర్చమని బలవంతం చేసింది. ఇంద్రియనిగ్రహం కలవాడనవటంచేత — దైవానుగ్రహంవల్ల ఆమె కోరికను నిరాకరించాను. ఆమె దుఃఖిస్తూ నిష్ఠుర మనస్సుతో నన్నిలా శపించింది 'ఓమూర్ఖుడా! కామించిన నన్ను నిరాకరించావు గనుక నీవు కుష్టురోగంతో పీడితుడవగుదువుగాక!'

ఆ దుష్టవాక్యాన్ని విని నేను ఆ ముని ఆశ్రమము విడిచి నా రాజ్యానికి వెడుతూండగా మార్గమధ్యంలో నా దేహము శ్వేతకుష్టుకు లోనైంది. ఓమహర్షీ! దీని నివృత్తికి తగిన పరిహారము చెప్పి నన్ను కృతార్థుణ్ణి చేయండి! నా రాకకై ఎదురుచూచే నాతండ్రి ఈపాటికి నా వియోగంవల్ల యెనలేని దుఃఖసముద్రంలో మునిగి వుంటాడు!"

దైన్యంగా ప్రార్థించిన ఆ రుక్మాంగదుడి జాలిపూరితమైన మాటలకు కరుణార్ద్రహృదయుడైన నారదమహర్షి హృదయం ద్రవించింది. సర్వజ్ఞుడైనట్టి నారదమహర్షి అతని శ్వేతకుష్టువ్యాధి నివారణకై ఒక చక్కటి ఉపాయాన్ని చెప్పాడు.

## నారదుడు రుక్మాంగదునికి వ్యాధినివారణోపాయం చెప్పుట :

'ఓ రుక్మాంగదా! ఎప్పటిలాగే త్రిలోక సంచారంచేస్తూ నేను వస్తూండగా మార్గమధ్యంలో ఒక గొప్ప ఆశ్చర్యాన్ని చూశాను! విదర్భదేశంలో కదంబ మనే నగరం ఉన్నది. అక్కడగల ఒక ప్రాసాదంలో ఒకగొప్ప వైనాయక మూర్తిని చూశాను. భక్తుల సకలాభీష్టాలను నెరవేర్చే ఆ మూర్తికి చింతా మణి వినాయకుడని పేరు! ఆ ఆలయానికి ఎదురుగా

గణేశకుండమనే కొలనుకూడా ఉన్నది. ఒకానొక శూద్రుడు వృద్ధాప్యం చేత కృశించిన దేహంతో అక్కడికి తీర్థయాత్రలకని వచ్చి ఆ కుండంలో స్నానం చేయగానే దివ్యదేహాన్ని పొందాడు. ఆ తరువాత అతనికై వైనాయక లోకాన్నుంచి వినాయకుని దూతలు ఒక విమానము తీసుకు రాగా అందులో ఎక్కి అతడు దుఃఖశోకరహితమైన, పునరావృత్తి రహిత మైన గణేశస్థానాన్ని చేరుకున్నాడు. ఓ రుక్మాంగదా! ఇదంతా నేను స్వయంగా నాకళ్ళారా చూశాను. కనుక నీవు కూడా ఆ పుణ్యక్షేత్రాన్ని సందర్శించుకుని, అక్కడగల ఆ గణేశకుండంలో స్నానమాచరించి, కోరిన కోర్కెలనన్నీ తీర్చే భక్తవరప్రదుడైన ఆ చింతామణిగణేశుని భక్తితో అర్చించి ద్విజోత్తములకు విరివిగా దానధర్మములు చేయి! నీవూ తప్పక ఆరోగ్య వంతుడవౌతావు. సర్పం తన కుబుసాన్ని వీడినట్లు నీవుకూడా ఈ రోగంతో కల్మషమైన దేహాన్ని వీడి పరిశుద్ధదేహాన్ని పొందగలవు!" అంటూ చతుర్ముఖుడు వ్యాసమహర్షికి — రుక్మాంగదునికి నారదుడు చెప్పిన బాధానివారణోపాయాన్ని వివరించి యిలా కొనసాగించాడు. "ఇలా నారదుని నోటినుండి వచ్చిన అమృత వచనాలను విన్న రుక్మాంగదుని అంతరంగం తొలకరి జల్లులకు పుడమిలా ఆనందంతో పులకరించింది! వెళ్ళిపోబోతున్న ఆ మహర్షికి నమస్కరించి శ్రద్ధాళువై తిరిగి రుక్మాం గదుడు యిలా ప్రశ్నించాడు.

'ఓ నారదమునీంద్రా! ఆ చింతామణి గణపతి క్షేత్రంలో ఎవరెవరు యింతకు పూర్వం గణేశానుగ్రహాన్ని పొందారు? అక్కడి మూర్తిని స్థాపించినదెవరు? పరోపకారులైన మీబోంట్లే మావంటి దీనుల దుఃఖాన్ని నివారించగల సమర్థులు. అందుకనే మీరు మూడులోకాల్లోనూ అవిశ్రాం తంగా సంచరిస్తూంటారు! మేఘాలకు వర్షించటం, శేషుడు భూభారాన్ని

వహించటమూ, సూర్యుడు ప్రకాశించటమూ యివన్నీ లోకోపకారానికే గదా! సర్వజ్ఞుడవు దయాంతరంగుడవైన ఓ మునీంద్రా! కనుక నీవు దయతో నా సందేహాన్ని నివృత్తిచెయ్యి!'

ఆ మాటలకు నారదమహర్షి ప్రసన్నంగా యిలా బదులిచ్చాడు.

'ఓ రుక్మాంగదా! నీ ప్రశ్న ఎంతో సమంజసంగా ఉన్నది. మృదు మధురములైన నీ శ్రద్ధాపూరిత వచనాలకు నాకు ఎంతో తృప్తి కలిగింది. తప్పక నీవడిగిన యావద్వృత్తాంతాన్నీ చెబుతాను. విను!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'నారదాగమనం' అనే 29-వ అధ్యాయం.



30

# అహల్యాధర్షణం

(మూలం)

## త్రింశో అధ్యాయః

**నారద ఉవాచ :-**

కదాచిదమరావత్యాంశ క్రం ద్రష్టుం గతోస్మ్యహం ।
స మాం సంపూజ్య విధివదువాచా వనతో భృశం ॥ 1

**ఇంద్రఉవాచ :-**

కించిదాశ్చర్యభూతం మే సంతోషాయ మునే వద ।
భ్రమసే సర్వలోకాంస్త్వం విదితం సర్వమస్తితే ॥ 2

**నారద ఉవాచ :-**

మర్త్యలోకే మయా దృష్టో గౌతమస్యాశ్రమో మహాన్ ।
నానావృక్ష లతాజాలైః నానాపక్షిగణై ర్యుతః ॥ 3

అహల్యాసహితం తత్ర గౌతమం దృష్టవానహం ।
రూపం విలోక్య యస్యాస్తు జాతో హంకామవిహ్వలః ॥ 4

యస్యాః రూపేణ సావిత్రా శచీర్లక్ష్మీ ర్గిరీంద్రజా ఊర్వసే । 5

మేనకా రంభా లోకేఖ్యాతా తిలోత్తమా కే
శాబాలా యయా కారి సానసూయాప్యరుంధతీ ॥ 6

ఛాయా సంజ్ఞా రవేర్భార్యా కశ్యపస్యచ యాదితిః ।
సదృశీ నైవకాపిస్యాన్నా గపత్నీషు వాక్వచిత్ ॥ 7

నచమే రోచతే గానం నపూజా న చ భోజనం ।
బ్రహ్మచర్యం చ మేస్వీయం నిద్రాంచ నలభే క్వచిత్ ॥ 8

త్వరవా నహమాయాతో ద్రష్టుం సాధ్వమరావతీం ।
తుచ్ఛాంపస్య ఇమాం దేవీం వినాతా మమరావతీం ॥ 9

**నారద ఉవాచ :-**

ఇతి శక్రం బ్రువన్నంతర్హితో అహం నృపతే వర ।
అంతర్హితే మయితదా మద్వాక్యం మనసా స్మరన్ ॥ 10

జంభభేదీ మత్స్యకేతువిద్ధో మూర్ఛామవాప సః ।
పశ్యే కదా మునేర్భార్యాం గౌతమస్యేత్య చింతయత్ ॥ 11

కదా అధరామృతం ప్రాప్యముచ్చేయం మదనానలాత్ ।
జీవితుం నైవపశ్యేన్యం తదాశ్లేషం వినాశుభం ॥ 12

ఏవం నిశ్చిత్య సంకల్పం గౌతమో భూత్సజంభహా ।
చింతయన్నేప తాం మార్గే మునేరాశ్రమ మాయయౌ ॥ 13

దదర్శ తామహల్యాంతు స్నాతుం యాతేస గౌతమే । 14

అభ్యంతరగతః ప్రోచే ప్రియే శయ్యాం శుభాకురు । 15

సాచోవాచ జపం త్యక్త్వా కథమద్యాగతోగృహం ।
దివైవ సురతేచ్ఛా కిం కురుషే అతి విగర్హితం ॥ 16

**గౌతమ ఉవాచ :-**

అహం స్నాతుం గతో యావత్తావదేవవరాప్సరాః । 17

తత్రైవ స్నాతు మాయతా జాతా నగ్నా అక్షిగోచరా । 18

బింబాధరా సుచార్వంగీ చారు పీనపయోధరా । 19

నీలగ్నంమే మనోదేవి జపే కామాస్త్ర పీడితం । 20

తతో అహమాశ్రమం ప్రాప్తో రతిందేహి ప్రియే ధునా ।
నో చేత్కామాగ్నినాదగ్ధం మృతంమాం క్వనుపశ్యసి ॥ 21

శపేత్వాం ప్రవ్రజిష్యే వా నిగ్రహిష్యేమ నోభ్రుశం । 22

**అహల్యోవాచ :-**

స్వాధ్యాయం దేవపూజాంచ త్యక్త్వా కిం ప్రార్థ్యతే రతిః ।
నోచితం తవ బ్రహ్మర్షే తథాప్యాజ్ఞాం కరోమ్యహం ॥ 23

భర్తృ శుశ్రూషణాదన్యో ధర్మో నాస్తి స్త్రియాః క్వచిత్ । 24

నారద ఉవాచ :-

స్వరాకృతి స్వభావై స్సామత్వా తం స్వామినం నిజం ॥ 25

వివేశ శయనే రంతు మహల్యా సహవజ్రిణా । 26

నిశ్శంకం చుంబనాశ్లేష నీవీ విస్రంసనాదిభిః ।
ఆకృష్య గౌతమస్త్వేవం చిక్రీడే తాం జంభహా తయా ॥ 27

దివ్యాన్ గంధానుపాఘ్రాయ చకితా శంకితా భృశం ।
తర్కయామాస మనసి కిమయం కూటరూపవాన్ ॥ 28

కళంకో అయం మమ భ్రుశం చంద్రస్యేవ భవేన్ను కిం ।
ఉభే కులేమే నష్టేకిం దుష్టస్యా స్యతు సంగమాత్ ॥ 29

దర్శయిష్యే కథంలోకే యశః శ్యామం సుఖం త్విదం ।
నయిష్యతి గతిం కాం మే ప్రియో భర్తాతు మాం మునిః ॥ 30

ప్రప్రచ్ఛతం శఠం కోపాత్ కోసిత్వ కూటరూపధృక్ ।
విశ్వస్తా స్వామిరూపేణ వద నోచేచ్ఛపామి తే ॥ 31

ఇత్యుక్తశ్శాపభీతో స వావిశ్చక్రే నిజం వపుః ।
దివ్యాభరణ సంయుక్తం కిరీట కటకాన్వితం ॥ 32

కుండలాద్భుత దీప్తిభిర్విలసన్ముఖ పంకజం । 33

ఉవాచ స తతః తాంతు విద్ధిమాం త్వం శచీపతిం ।
లావణ్య దర్శనాత్తేహం విహ్వలో మదనాగ్నినా ॥ 34

నలేభే కుత్రచిచ్ఛర్మ తత ఇద్ధం తృతం మయా ।
ఇతోపి మాంభజస్వ త్వం త్రైలోక్యేశ్వర మాదరాత్ ॥ 35

శృత్వేద్ధం వచనంతస్య మునిపత్నీ రుషాన్వితా ।
వమంతీవ ముఖజ్వాలాం జగాద త్రిదశాధిపం ॥ 36

అస్యతే వపుషో మూఢ మద్భర్తరి సమాగతే ।
అవస్థా కా భవేన్మంద న జానే అహం శతక్రతో ॥ 37

పాతివ్రత్యం త్వయాభగ్నం దుష్టపాపీయసా మమ ।
కాం అవస్థాంగమిష్యామి శాపాద్గౌతమ వాగ్భవాత్ ॥ 38

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**అహల్యాధర్షణం నామ త్రింశో అధ్యాయః**



# అహల్యాధర్షణం

# 30-వ అధ్యాయము

అలా రుక్మాంగద మహారాజు శ్రద్ధాళువై వేసిన ప్రశ్నకు ప్రత్యుత్త రంగా నారదమహర్షి యిలా అన్నాడు.

"నాయనా! రుక్మాంగదా! నేనోసారి త్రిలోకాధిపతియైన ఇంద్రుణ్ణి చూడటానికి అమరావతీ నగరానికి వెళ్ళాను. అప్పుడు ఇంద్రుడు నన్ను మూడు లోకాలలోనూ సంతోషం కలిగించే ఆనందకరమైన విషయం ఏమిటో — ఆ వివరం త్రిలోక సంచారిని గనుక నన్ను చెప్పమని, ఉచిత సత్కారాలనందించి, ప్రశ్నించాడు.

'భూలోకంలో అత్యంత రామణీయకమైన ప్రకృతి పరిసరాలతో — అనేక వృక్షాలతోనూ, లతలతోనూ, పక్షుల కుహూరవాలతో నయనా నందకరంగా విలసిల్లుతూ గౌతమముని ఆశ్రమం! ఆ ప్రశాంత ఆశ్రమం లో అపూర్వ సౌందర్యరాశియైన అహల్యతో కూడిన గౌతమమునిని దర్శించాననీ, ఆమె సౌందర్యం లోకోత్తరమైనదనీ వర్ణనాతీతమైనదనీ ఇంద్రుడెరిగున్న అప్సరసలకన్నా, లక్ష్మీ, పార్వతివంటి దేవతామూర్తుల కన్నా అరుంధతి అనసూయలవంటి మహాపతివ్రతల సౌందర్యంకన్నా

మిన్నయై, సూర్యుని పత్నులైన ఛాయ, సౌంజ్ఞలకన్నా, చివరికి కశ్యప ప్రజాపతి భార్యయైన అదితికన్నా కూడా సౌందర్యవంతురాలనీ, అంద చందాలలో ఆమెకు సాటిరారనీ' దేవరాజైన ఇంద్రుడికి చెప్పాను.

'అటువంటి దివ్యసౌందర్యవంతురాలిని చూడగానే అఖండ బ్రహ్మ చారినైన నాకుసైతం మనస్సు చలించిందనీ, ఇక గానము, భోజన పానాదులేవీ నాకు రుచించలేదనీ, నిద్రకూడా పట్టలేదనీ చివరికి బ్రహ్మ చర్యవ్రతం భంగమౌతుందేమోనన్న భయంకలిగి వెంటనే అక్కడినుండి ఏకాయికి స్వర్గానికి వచ్చాననీ, అందుచేత ఆమెలేని స్వర్గం అలంకారం లేని అతివలా వుంటుందనీ' చెప్పి అంతర్హితుడనైనాను!

ఓ రుక్మాంగదా! అలా నేను ప్రేరేపించి అంతర్హితుడనైనాక ఇంద్రుడు అహల్యను ఆమె రూపలావణ్యాలనూ పదేపదే తన మనస్సు లో తలపోస్తూ మదనబాధ భరించలేనంత ఎక్కువకాగా తట్టుకోలేక మూర్ఛిల్లాడు. కొంతతడవాగాక లేచి

'మహర్షి వివరించిన ఆ అందాలరాశియైన గౌతముని పత్నిని ఎప్పుడు చూడగలనోకదా? ఆమె పొందును శీఘ్రంగా ఏ ఉపాయంచేత పొందగలను? నాకు కలిగే ఈ భరించరాని మదనతాపాన్ని ఎలా ఉపశ మింప చేసుకోగలను? ఆమె అధరాలు చిలికించే సుధారసాన్ని ఎప్పుడు గ్రోలగలను? ఆమెను బిగియార తనివితీర ఎలా కౌగలించుకోగలను? ఆమె లేని ఈ జీవితం నిరర్థకమైనదే!' అని భావిస్తూ ఆమెనే హృదయాన స్మరిస్తూ కామరూపుడవటంచేత గౌతమముని రూపాన్ని ధరించి ఆయన ఆశ్రమాన్ని చేరుకున్నాడు! మహర్షి స్నాన అనుష్టానాదులకనీ స్నానపానా దులకై వెళ్ళేదాకా అనువైన సమయం కోసం వేచివుండి ఆయన వెళ్ళిన

తరువాత కొంతసేపటికి కపటబుద్ధితో గౌతమముని రూపుదాల్చిన శచీపతి — గౌతమముని ఆశ్రమంలో ప్రవేశించి అహల్యను సమీపించి తనకు "మృదుశయ్యను ఏర్పరచ" మంటూ ఋషిపత్నియైన కోరాడు.

అప్పుడా మునిపత్ని ఆశ్చర్యపోతూ "ఓనాథా! తమరు సంధ్యా అనుష్ఠానాలకని ఇప్పుడేగదా నదీతీరానికి వెళ్ళారు. తిరిగి ఇంతలోనే వచ్చేశారేమి? ఎన్నడూలేనిదీ, తపస్వులకత్యంత గర్హనీయమైన ఈ అకాల కామవాంఛ మీలో ఎలా పొడసూపింది? నిషిద్ధమైన దివారతిని కోరు తున్నారెందుకు?" అంటూ ప్రశ్నించింది. అందుకా కపట గౌతమ వేషధారి యైన శచీపతి అహల్యతో యిలా నమ్మబలికాడు.

"ఓ ప్రియురాలా! స్నానార్థమై వెళ్ళిన నేను ఒక అప్సరసను చూశాను. దిగంబరిగా సరస్సులో స్నానంచేస్తున్న ఆమెను చూడగానే నాకూ కోరిక, సంగమేచ్ఛ కలిగింది. ఇక ఉండబట్టలేక వచ్చేశాను! కోరికతో ప్రజ్వరిల్లుతున్న నన్ను నీదరికి చేర్చుకుని నాకు రతిసౌఖ్యాన్నివ్వు! అలా కాకపోతే కామాగ్నికి దగ్ధుడనై నేను మరణించగలను! లేదా నిన్ను శపిస్తాను" అంటూ ఆమెను సమీపించబోయాడు.

భర్తయొక్క ఊహించని ఈ హఠాత్ప్రవర్తనకు విస్తుపోయిన అహల్య "ఓ మునివర్యా! స్వాధ్యాయనంలోను, జపతపానుష్ఠానములతోనూ, దేవతాపూజలతోనూ గడపవల్సిన ఈ ప్రాతఃసమయంలో ఈవిధంగా జంతువుల్లాగా రమింప బూనడం మీకు ఉచితంకాదు. అయినా మీ పట్టిన పట్టు వీడకపోతే — మీ ఆజ్ఞను పాలిస్తాను! భర్తృ ఆజ్ఞాపాలనను మించిన ధర్మం సతుల కెక్కడున్నది?"

'ఓ రుక్మాంగద మహారాజా! ఈవిధంగా రూపంలోనూ, కంఠధ్వని లోనూ, స్వభావ, సంభాషణలలో ముమ్మూర్తులా గౌతమమునిలా ఉన్న

ఆతనిని తన భర్తగానే భావించి, అతని కోరిక తీర్చటానికై శయ్యను చేరింది! అప్పుడు ఇంద్రుడు ఆమెతో యథేచ్ఛగా చుంబన, ఆలింగనాదికములతో రమించాడు. అతని దేహంనుంచి వస్తున్న దివ్య సుగంధానికి చకితురాలైన అహల్య తనలో తానిలా అనుకుంది! 'ఇతడు నాభర్తయేనా? లేక ఎవరైనా కపటరూపందాల్చి నన్ను వంచించారా? అలాగైతే తీరని కళంకంగా మాయనిమచ్చ నా జీవితంపై పడుతుంది! ఈ దుష్టుని సాంగత్యంవల్ల అటు పుట్టినింటికీ యిటు మెట్టినింటికీ అపకీర్తి తెచ్చిన దాననౌతాను!' అని మధనపడుతూ... కోపంతో యిలా అంది

"ఓయీ! నీవెవరో కపటరూపంలో నాభర్త రూపుదాల్చి నన్ను వంచించావు! నీవెవరైనదీ నిజంచెప్పు! లేదా నిన్ను శపించగలను!"

ఆమె శాపానికి భయంచెందిన ఇంద్రుడు తన నిజరూపుదాల్చి ఆమె ఎదుట ప్రత్యక్షమైనాడు.

'ఓ అహల్యా! నన్ను శచీపతియైన ఇంద్రుడిగా తెలుసుకో! నీ రూపలావణ్యము, సౌందర్యములను చూచి నిగ్రహించుకొనలేక ఇలా చేశాను! త్రైలోక్యాధిపతియైన నన్నే యికపైన సేవించుకో!" అన్న ఇంద్రుని మాటలకు క్రోధంతో బుసలుకొట్టే మిన్నాగులా తీక్ష్ణవీక్షణాలతో యిలాఅంది

"ఓ మూఢా! తపస్వియైన నాభర్త యిప్పుడు యింటికివస్తే నీగతేమౌతుందో చెప్పలేను. మహాపాపివైన నీవు నా పాతివ్రత్యాన్ని చెరచినావు! ఇక ఆ మహర్షి శాపంతో నేనెలాంటి అవస్థ పొందుతానోకదా!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'అహల్యాధర్షణం' అనే 30-వ అధ్యాయం.

# 31

# శక్రశాప వర్ణనం

(మూలం)

## ఏకత్రింశో అధ్యాయః

**రుక్మాంగద ఉవాచ :-**

ఆగతే గౌతమే కోవా వృత్తాంతో భూన్మహామునే ।
వదమే సకలం తంతు జిజ్ఞాసా మహతీమమ ॥ 1

**నారద ఉవాచ :-**

నిత్యకర్మ సమాప్యైవ స్వాశ్రమం గౌతమో యయౌ ।
ఆకార్య నిజపత్నీం తాం దేహి పాదోదకం మమ ॥ 2

కిమర్థం నా గతా అద్యత్వం సంముఖం మమపూర్వవత్ ।
నానీత మాసనం కస్మాత్ కథం చాటు నభాషసే ॥ 3

శృత్వేద్థం వచనం తస్య వేపమానా లతేవ సా ।
అధోముఖీ వినిర్గమ్య ముహూర్తా న్మునిమాయయౌ ॥ 4

సాష్టాంగం పతితా భూమౌ తత్పాదోపరి మస్తకా ।
విహ్వలా శాప భీతా సాశనైరథ జగౌ మునిం ॥ 5

ఉషసి త్వం ప్రయాతోసి స్నానం కర్తుం నిజం విధిం ।
తవరూప ధరో దృష్టో దేవేంద్రో మామువాచహ ॥ 6

దృష్ట్వా వరాప్సరోభ్యోపి సుందరీ కామినీ మయా ।
నమే మనో జపే దైవే విధౌ నిత్యే స్థిరంభవేత్ ॥ 7

పరావృత్యా గతస్తస్మాద్రతిం మే దేహి శోభనే ।
త్వమేవేతి మయా భ్రాంత్యా కృతం వాక్యంత ధైవ తత్ ॥ 8

దివ్య గంధానుపాఘ్రాయ వికల్పోమే అభవత్పునః ॥ 9

దురాత్మన్ కోసి నోబ్రూహి నోచే ద్భస్మ భవిష్యసి ।
ఇతి శాప భయాజ్ఞాతః ప్రకటో బలసూదనః ॥ 10

తావదేవ భవద్వాక్యం శ్రుతంతు మునిసత్తమ ।
లజ్జయా నాగతా శీఘ్రు మపరాధం క్షమస్వ మే ॥ 11

స్వయం నివేదనే దోషో పరనివేదనే ।
మంత్రాయు ర్గృహరంధ్ర శ్రీ రతయశ్చౌష ధానిచ ॥ 12

మానావమాన దానాని ప్రకటాని న కారయేత్ ।
ఇత్థం విశమ్య స మునిః కోప వ్యాకులితేంద్రియః ॥ 13

శశాప వనితాం స్వీయాం దుశ్శీలే త్వం శిలాభవ ।
నాజ్ఞాసీర్మే స్వరూపంతం స్వభావం చేష్టితానిచ ॥ 14

పరే పుంసి నిమగ్నాంతే యతశ్చేతోఽతికాముకే ।
యదా దాశరథీ రామో భ్రమద్రాజా వనే వనే ॥ 15

తస్యాంఘ్రి స్పర్శనాదేవ స్వం రూపం ప్రతిప్రత్స్యసే । 16

నారద ఉవాచ :-

తదైవ సాశిలా జాతా తపోనిధి వచోబలాత్ ॥ 17

తస్యాః శాపం సమాకర్ణ్య చకంపే పాకశాసనః ।
ప్రకంపనస్య సంయోగా ద్ధిమవత్పర్వతో యథా ॥ 18

తర్కయామాస మనసి కథం కార్యం మయాధునా ।
సముద్రమధ్యే కూపేవా తటాగే కమలేథవా ॥ 19

లీనో భూత్వా యదాస్థాస్యే తదా జ్ఞాస్యతి మాం మునిః ।
అతో బిడాల రూపేణ విచచార సవజ్రభృత్ ॥ 20

గౌతమస్త్ర మచక్షాణో గృహేద్వారి, తథాశ్రమే ।
క్వగతో దానవరిపుర్యేమే భార్యా విదూషకః ॥ 21

ధ్యానేన బుబుధే తంతు క్షణేన మునిసత్తమః ।
నతే భస్మ కరిష్యామి దేవేంద్రోసి యతః ఖలః ॥ 22

శపామిత్వాం శచీభర్తః సహస్ర భగవాన్భవ ।
శృతవాన్వచనం యావద్రోషేణ మునినేరితం ॥ 23

తావదద్దర్శ స్వం దేహం సహస్ర భగచిహ్నితం ।
తతో దుఃఖార్ణవే మగ్నః శుశోచ బలవృత్రహా ॥ 24

ఇంద్ర ఉవాచ :-

అహం శిక్షాపితో వృద్ధై ర్నానాధర్మా ననేకశః ।
వృద్ధానాం వచనం యన్మే న విచారిత మాదరాత్ ॥ 25

స్వబుద్ధిర్హిత కృత్సర్వా వినాశాయ పరేరితా ।
గురోర్గరీయసీ బుద్ధిః క్షయదా కామినీ మతిః ॥ 26

కుతో నారద వాక్యేన యాతోహం తాం అనిందితాం ।
దేవరాజో భవన్ అస్యంలోకానాం దర్శయే కథం ॥ 27

దివ్యదేహోగతః క్వాద్య నిజభార్యాం వదేను కిం ।
ధిఙ్మాంచ ధిక్స్మరం యేన ప్రాపితోగర్హితాం దశాం ॥ 28

ప్రాణిభిర్భుజ్యతే కర్మ శుభం వా యది వా శుభం । 29

తిర్యగ్యోనిం సమాసాద్య క్షపయిష్యేస్వమాత్మనః ।
నలినీకుట్మలే తిష్ఠే హింద్రగోపకరూప ధ్రుక్ ॥ 30

**ఇతి శ్రీ గణేశ పురాణే ఉపాసనాఖండే**
**శక్రశాపవర్ణనం నామ ఏక త్రింశో అధ్యాయః**



# శక్రశాప వర్ణనం
## 31-వ అధ్యాయము

"మహానుభావా! గౌతమముని తన ఆశ్రమానికి అనుష్టానాదికాలు ముగించుకొని తిరిగివచ్చాక ఏమి జరిగింది? ఆ కథావృత్తాంతాన్ని తెలుసు కోవాలని నాకెంతో కుతుహలంగా వున్నది! దయతో సెలవివ్వండి!" అంటూ మృదుమధురంగా ప్రశ్నించిన రుక్మాంగదుడి ప్రశ్నకి నారదమహర్షి చిరుమందహాసంచేస్తూ ఇలా బదులిచ్చాడు.

"నాయనా! తన నిత్యకర్మానుష్టానములు ముగించుకున్న గౌతమ మహర్షి తన ఆశ్రమానికి తిరిగివచ్చాడు! భార్యను పిలిచాడు. ఆమె రావటం ఆలస్యంచేయటంతో ఇలా ప్రశ్నించాడు

'ఓ ప్రియురాలా! పిలువగానే నాముందుకు వచ్చేదానవు — ఎందు కని ముఖాన్ని చాటేస్తున్నావు? పిలుస్తున్నా బదులుకూడా పలుకటం లేదేమి? రాగానే కూర్చునేందుకు దర్భాసనం పరచేదానివి! అవన్నీ మరచావా?" ఈ మాటలకు అహల్య గాలికి వణికే లతలా గడగడా

వణుకుతూ తల వంచుకొని నెమ్మదిగా కొద్దిసేపయ్యాక భర్తవద్దకు చేరింది. ముని పాదాలపై సాష్టాంగపడి శాపభయంతో విహ్వాలయై మెల్లగా యిలా అన్నది :

"ఓనాథా! మీరు ప్రొద్దున్నే తమ నిత్యానుష్ఠానం నెరవేర్చటానికి నదీతీరానికి వెళ్ళిన సమయంలో శచీపతియైన ఇంద్రుడు కామరూపియై మీరూపం దాల్చి వచ్చాడు. మీకంఠస్వరాన్నే అనుకరిస్తూ స్నానార్థమై వెళ్ళిన తనకు ఒక అపురూప సౌందర్యవతియైన అప్సరస్త్రీ దిగంబరియై స్నానంచేస్తూ కనిపించిందనీ, తమకాన్ని ఆపుకోలేక వచ్చాననీ, రతిసౌఖ్యా న్నిమ్మనీ కోరాడు. మీరేనన్న భావంతో నేనందుకంగీకరించాను. కానీ ఆ ఇంద్రుని శరీరం విరజిమ్మే దివ్యసుగంధానికి ఆశ్చర్యపోయి, అవ మానంతో అనుమానంతో 'ఓ దురాత్మా! నీవు నాభర్త వేషంలో వచ్చి మోసగించిన కపటివి! నీవెవ్వడవో నిజంచెప్పు! లేదా నీపుణ్యం నాశన మౌవటంతోపాటూ భస్మీభూతుడవు అవుతావు!' అని తీవ్రస్వరంతో నిలదీశాను. నా శాపభయానికి వెరచి ఆ త్రిలోకాధిపతి తన నిజరూపాన్ని ధరించాడు. ఇంతలో మీ కంఠధ్వని నా చెవికి వినిపించింది. సిగ్గుతో చితికిపోయి, జుగుప్సతోనూ, ఏవగింపుతోనూ దహించుకుపోతున్న నేను — సహజంగానే మూర్తీభవించిన తపోనిధిలాఉన్న మీ సమ్ముఖంలోకి రావటానికి వెరచాను! నావల్ల జరిగిన ఈ అజ్ఞాన అపరాధాన్ని మన్నిం చండి! చేసిన పాపం చెబితే పోతుందంటారుకదా! ఆ తప్పును కూడా దినమధ్యంలో ప్రకటించినప్పుడే కొంత దోషం తొలగుతుంది!

ఇక నిగూఢంగా దాచవలసినవి మంత్రము, సంగమము, ఆయుర్దా యము, సంపద, రతి, మానము, దానము — వీటిని ఎన్నడూ ప్రక

టించరాదన్నది పెద్దలు విధించిన నియమంకదా!" అంటూవున్న ఆమె మాటలకు క్రోధపరవశుడై గౌతముడు తక్షణం యిలా శపించాడు.

'దురాత్మురాలా! కామంతో కళ్ళు మూసుకుపోయిన నీవు పర పురుషునికి వశ్యురాలవైనావు! నా స్వభావమూ, చేష్టలునూ నీవెరుగున్నవే కదా! నీవు చేసిన ఈ ప్రజ్ఞాపరాధానికి నీవు పాషాణమై పడివుందువుగాక! పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడు దాశరధియై అరణ్యాలలో తిరుగుతూ ఇక్కడికి వచ్చినప్పుడు ఆతడి పాదధూళి నీ శిరస్సున దాల్చి నప్పుడు — అప్పుడే, తిరిగి నీకు నీ నిజరూపం సంప్రాప్తించునుగాక!'

ఇలా తపోధనుడైన మునివాక్యం పూర్తయేంతలోనే ఆ అహల్య శిలారూపం దాల్చింది. ముని ఆగ్రహావేశుడై యిచ్చిన శాపవచనాలను ప్రక్కనే పొంచివుండి విన్న ఇంద్రుడు భయంతో గడగడ వణికిపోతూ తనలో తాను యిలా పశ్చాత్తాపం చెందసాగాడు.

## ఇంద్రుడి పశ్చాత్తాపం

"నేరకపోయి కొరివితో తలగోక్కున్నానే? ఈ ఋషియొక్క ఆగ్రహా న్నుంచి ఇప్పుడు ఎలా తప్పించుకోవటం? ముల్లోకాల్లోనూ ఎక్కడ దాక్కున్నా ఈయన దివ్యదృష్టి కనుగప్పటం అసాధ్యం!" ఇలా భయ పడుతూ పిల్లిరూపం దాల్చి యింట్లో తిరుగసాగాడు.

ఇంట్లోగాని, ఇంటి వెలుపలగాని ఇంద్రుడు కనబడకపోవటంతో 'ఈ జంభారి (జంభాసురుణ్ణి నిర్జించిన ఇంద్రుడు) ఎక్కడికి వెళ్ళాడా? అనుకుంటూ, తన దివ్యదృష్టిచేత, మోసంతో తన భార్యను చెరచిన ఇంద్రుడియొక్క జాడ తెలుసుకొని,

'ఓ ఇంద్రా! నీవు త్రైలోక్యాధిపతివి కనుక నిన్ను భస్మంమాత్రం చేయను! కానీ నీ అకృత్యానికి శాపంమాత్రం పెడతాను! నీవు యికనుంచి సహస్రభగుడవు కమ్ము!' అంటూ శపించాడు. ఇలా రోషావేశంతో పల్కిన మునివాక్కులు అమోఘములై, ఇంద్రుని శరీరమంతా భగ (యోని) చిహ్నములతో నిండిపోయింది!' సిగ్గుతో చితికిపోయిన ఇంద్రుడు తీవ్ర దుఃఖసముద్రంలో మునిగిపోయాడు. 'త్రైలోక్యాధిపతినైన నేనుసైతం సామాన్యుడిలా యుక్తాయుక్త విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయాను కదా! ఎట్టివారికైనా స్వబుద్ధిని అనుసరిస్తేనే సుఖము, గురుబుద్ధివల్ల విశేషమైన శ్రేయస్సునూ ప్రసాదిస్తాయి. ఇక ఇతరుల ఆలోచనలనూ, స్త్రీబుద్ధినీ అనుసరించడంవల్ల వినాశనమే కలుగుతుంది! దేవతలకధిపతినై ఉండికూడా — నారదముని పెట్టిన ప్రలోభానికి ఎలా లోనయ్యాను? దానివల్ల నే వివేకశూన్యుడనై ప్రవర్తించి ఎంతో జుగుప్సాకరమైన ఈ రూపాన్ని పొందాను. ఇప్పుడు నా ప్రియపత్ని ఐన శచీదేవికి ఈ నా వికృత ముఖాన్నెలా చూపించను? నేనెంతటి దుష్టుణ్ణి? ఎటువంటి వాడినైనా కాముడు (మన్మధుడు) వివశుణ్ణిచేసి తీరుతాడు! ఐనా ఇప్పుడెవరిననుకుని ఏంలాభం? ఎవరు చేసిన శుభాశుభ కర్మల ఫలితం వారే అనుభవించాలికదా! కనుక నేచేసిన దుష్కృత్యానికి ప్రతిఫలాన్ని నేనే అనుభవించి తీరుతాను! దానివల్ల తప్ప నాకిక నిష్కృతిలేదు!"

ఇలా అనుకొని ఇంద్రుడు ఒక కీటకరూపం దాల్చి తామరతూడులో దూరి ఇంద్రగోపకమనే కీటకంలా ఉండాలని నిశ్చయించుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'శక్రశాప వర్ణనం' అనే 31-వ అధ్యాయం.

32

# మంత్రకథనం

(మూలం)

## ద్వాత్రింశో అధ్యాయః

**నారదఉవాచ :-**

శక్రేతు నలినీం యాతే తత్పురం త్వహమాగతః ।
బృహస్పతి పురోగాంస్తాం స్తత్రాపశ్యం స్థితాన్ సురాన్ ॥ 1

తేభ్యోహ్య కథయం సర్వం ఉభయో శ్శాపకారణం ।
అహల్యాయా మహేంద్రస్య సంయోగంచ విరూపతాం ॥ 2

సహస్రభగతాం యాతః శక్రో గౌతమశాపతః ।
అహల్యాదర్శణాద్దేవా స్తత్సంగాత్సా శిలాభవత్ ॥ 3

**బ్రహ్మోవాచ :-**

శృత్వా తే నారదోక్తం తత్సర్వే దేవాః శుభాన్వితాః ।
అతిదుఃఖా ద్రుదంతస్తే నిశ్వాసోచ్ఛ్వాస విభ్రమైః ॥ 4

దేవా ఊచు :-

యేనాకారి శతం యజ్ఞా దానవా యేన నిర్జితాః
త్రైలోక్యం పాలితం యేన ముక్తమైంద్రం పదంశుభం ॥ 5

పూజితా బహవోదేవాః బ్రాహ్మణా బ్రహ్మవిత్తః ।
మమ భుక్తా నానావిధాభోగా అన్యేషామతి దుర్లభాః ॥ 7

కుత్ర స్థాస్యత్యసౌ దేవో భోక్ష్యతే స్వప్స్యతే కథం ।
కమద్య శరణం యామః స్వకృతే తత్కృతే పివా ॥ 8

పాలయిష్యతి కోస్మాన్వై పదమైంద్రం శచీం తథా ।
కథం ప్రసన్నతాం యాయాద్గౌతమో మునిసత్తమః ॥ 9

స్వీయభార్యా వియుక్త స్సంస్తత్కృతాఘః స్మరన్‌రుషా ।
అన్యోపాయం నపశ్యామో గౌతమస్య ప్రసాదతః ॥ 10

తస్మాన్నారద యాస్యామో గౌతమం సాంత్వితుం మునిం ।
ఏ వంతే నిర్యయు ర్దేవా నారదేన సమన్వితాః ॥ 11

గౌతమం తే సమాసాద్య బద్ధాంజలిపుటా మునిం ।
తుష్టువు ర్వివిధై ర్వాక్యైః తమేవ శరణంగతాః ॥ 12

దేవా ఊచు :-

తవప్రభావం వక్తుంనో మునే శక్తి ర్నవిద్యతే । 13

గరిమాణం వదేత్కోను మేరోర్తి మవతోపిచ ।
వృష్టిధారా రజోభూమే ర్గంగాయాః సికతా అపి ॥ 14

అంబుధేర్గుణాన్విష్ణో ర్గణయేత్కోనుమూఢదీః ।
ప్రాతరేవోప్త బీజానాం మధ్యాహ్నే సస్య సంపదః ॥ 15

సంపాదితా స్త్వయా పూర్వ మవితా ఋషిసత్తమాః ।
వాలఖిల్యైః ర్యజిం కృత్వాపర ఇంద్రో వినిర్మితః ॥ 16

బ్రహ్మాదిభిః ప్రార్థితాస్తే వక్షిణాం తమకల్పయన్ ।
పయసాం నిధిరేకేన ప్రాశిత శ్చులకేనయత్ ॥ 17

అపరాసృష్టిరారబ్ధా గాధిపుత్రేణ ధీమతా ।
స్తంభితో భుజ ఇంద్రస్య చ్యవనేన మహాత్మనా ॥ 18

తస్మా త్సర్వాత్మనా పుంసాం భవతాం సేవనం సతిః ।
దర్శనం భాషణం పూజా స్పర్శనం పాపనాశనం ॥ 19

ఉప్తకారే రతానాంచ దీనానుగ్రహ కారిణాం ।
ఇంద్రార్థే శరణం యాతాన్ కృపాం కర్తుం త్వమర్హసి ॥ 20

**గౌతమ ఉవాచ :-**

భవతాం దర్శనం చర్మచక్షుషాం నైవజాయతే ।
మమపుణ్యేన జాతం తత్కామ సంపాదనం నృణాం ॥ 21

జన్మా శ్రమ తపో దానం దేహి ఆత్మా వ్రతానిచ ।
సార్థకానీ క్షణేనైవ జాతాని భవతాం ఖలు ॥ 22

ఇదానీం ప్రార్థితం కిం వః తన్నిరూప్యం మమాగ్రతః ।
శక్యంచేత్త త్కరిష్యేహం భవత్ప్రభృతి బలేనతత్ ॥ 23

మునిరువాచ :-

ఇతి తద్వచనం శృత్వా జహ్రూషుస్తే దివౌకసః ।
చంద్రోదయే యథా హర్షం ప్రాప్నోతి జలధి స్ఫుటం ॥ 24

యథా వా బాలభాషాభిః పితరౌ ముదమీయతుః ।
ప్రార్థనాం చక్రిరే సర్వే గౌతమం తం మహామునిం ॥ 25

దేవా ఊచు :-

ఈశ్వరస్యా పరాధేన కామో భస్మత్వమాగతః ।
అగస్కరి త్వయా శక్రో నచప్రాజ్ఞై ర్వియోజితః ॥ 26

ఇదానీం స యథాస్థానం స్వకీయం ప్రాప్నుయాన్మునే ।
క్షమిత్వా తస్య చాగాం సి సర్వేషాం వచనాద్ధిన ః ॥ 27

కృతే తస్మి న్ప్రసాదేతు సర్వేషాం వాంఛితం భవేత్ । 28

నారద ఉవాచ :-

శృత్వా దేవసమూహస్య వచనాని స గౌతమః । 29

ప్రహస్య ప్రత్యువాచేదం సర్వాన్ దేవగణాన్ప్రతి । 30

గౌతముఉవాచ :-

నామాని తస్య నగ్రాహ్యం షతితస్య కృతాగసః । 32

కపటస్య శఠస్యాపి దుష్టస్యా వివేకినః ।
అనుతాప విహీనస్య నిష్కృతి ర్నైవవిద్యతే ॥ 33

తథాపి భవతాం వాక్యాత్ కరిష్యే తత్ప్రియం ।
సురాః భవంతోపి యదారుష్టా స్తదాశాపః పతేన్మయి ॥ 34

పూతోభవతి జంతుర్హి బహుభిర్యేను గృహ్యతే ।
అత ఏకం వదే మంత్రం తస్మైతం ప్రదిశంతుచ ॥ 35

సర్వకర్తా సర్వహర్తా సర్వపాతా కృపానిధిః ।
వినాయకో దేవదేవో బ్రహ్మవిష్ణుః శివాత్మకః ॥ 36

షడక్షర స్తస్య మంత్రో మహాసిద్ధి ప్రదాయకః ।
ఉపదేశే కృతే తస్య దివ్యదేవో భవేత్తు సః ॥ 37

భగాని తస్య యావంతి తావన్నేత్రో భవిష్యం తి ।
స్వరాజ్యం ప్రాప్స్యతే శక్ర ఇతి సత్యం వదామినః ॥ 38

అభిదాయ సురానీద్ధం తూష్ణీమాసీత్స గౌతమః ।
తం చతే పూజయిత్వాతు నమశ్చక్రు ర్ముదాన్వితాః ॥ 39

ప్రదక్షిణీకృత్య పునః ప్రాప్యానుజ్ఞాం యయుస్సురాః । 40

ప్రశంసంతో మునిం తత్ర యత్రాస్తే బలవృత్రహా ।
గౌతమాత్ జ్ఞానసంపన్నాత్సాత్వికో న్యేనవర్తతే ॥ 41

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే మంత్రకథనంనామ**

**ద్వా త్రింశో అధ్యాయః**



# మంత్రకథనం

## 32-వ అధ్యాయము

**శాపవృత్తాంతాన్ని తెలుసుకున్న దేవతలు గౌతముని సన్నిధికిచేరి ఇంద్రాపరాధాన్ని క్షమింపమని వేడుకొనుట!**

ఇలా ఇంద్రుని శాపవృత్తాంతాన్ని రుక్మాంగదుడికి వివరిస్తూన్న నారదమహర్షి ఇలాఅన్నాడు. 'ఓ రుక్మాంగద మహారాజా! అలా దేవేంద్రుడు కీటకరూపంలో తామరతూడులో దాక్కునివున్న సంగతిని. నేను స్వర్గంచేరి అక్కడవున్న దేవతల గురువైన బృహస్పతికీ, అగ్ని, వరుణ, యమ, వాయు, కుబేరులు మొదలైన దిక్పాలకులకీ తెలియ జేసాను. మాయారూపంలో శచీపతి అహల్యను కూడటం, ఋషి ఆగ్రహా నికి గురై శాపాన్ని పొందటమూ చెప్పి, సహస్రభగుడైన తన వికృతరూపం ప్రదర్శించటానికి యిష్టపడని ఇంద్రునిగురించీ, శిలారూపంలోవున్న అహల్యగురించీ తెలిపాను!



హరిద్రా గణపతి

నానుండి ఈ వివరాలన్నీ విన్న దేవప్రముఖులంతా విచారంలో మునిగిపోయారు! నిట్టూర్పులు దీర్ఘంగా విడుస్తూ దుఃఖపడసాగారు.

'నూరు అశ్వమేధక్రతువుల పుణ్యం ఫలితంగా స్వర్గాధిపత్యాన్నీ ముల్లోకాధిపత్యాన్నీ సంపాదించుకొని, దానవులనందరినీ తన శౌర్య పరాక్రమాలతో అణిచివేసి నిష్కంటకంగా మమ్మల్నందరినీ పాలించే మా ప్రియతమ ప్రభువు వియోగం దుస్సహం! దుర్భరం! మాకింక దిక్కెవ్వరు? ఎవరిని ఆశ్రయించి మా మనుగడ కొనసాగించేది? స్వర్గ భోగాలనుభవించే మా ప్రభువు యిప్పుడెక్కడున్నాడో? ఎన్ని యిక్కట్లు పడుతున్నాడో? ఇప్పుడీ అమరావతీనగరమూ, రాణియైన శచీ కూడా అనాథలైనారే? ఏ ఉపాయం చేత క్రోధోద్దీపితుడైన గౌతముని ప్రసన్నుణ్ణి చేసుకోగలం? ఆయన అనుగ్రహాన్ని పొందే మార్గమేమిటి?' యిలా పరిపరివిధాల విచారించి, నన్నుకూడా వెంట తీసుకొని 'గౌతమునిని శాంతింపచేయటానికి వెడదాము రమ్మని' గౌతముని సన్నిధిని చేరు కున్నారు. అప్పుడు ఆ దేవతలందరూ అంజలియొగ్గి తపస్సంపన్నుడూ, అగ్నివంటి తేజస్సుతో ప్రకాశిస్తున్నవాడూ, నిండు చంద్రునివంటి ప్రశాంత తనూ, ప్రసన్నతనూ కలిగిన గౌతమమహర్షిని వివిధరీతుల్లో స్తుతిస్తూ శరణువేడారు.

## దేవతలు గౌతమునిని కీర్తించటం

అప్పుడు అంజలిబద్ధులైన దేవతాగణాలు గౌతమునిని యిలా స్తుతించారు. "ఓ పరమపావనుడవూ, తపోనిధివీ ఐన మునిసత్తమా! మేరుపర్వతంయొక్క, హిమవత్పర్వతముయొక్క ఎత్తూ వర్షధారల

సంఖ్యా, ఇసుకరేణువులనూ, లోకరక్షకుడైన విష్ణుమూర్తి గుణగణాలనూ లెక్కించటం ఎవరితరం? అలాగే ప్రాతఃకాలమున ధ్యానం చల్లి, తపః శక్తిచేత మధ్యాహ్నానికల్లా సస్యసంపదను తయారుచేసి తీవ్రమైన క్షామంలో కూడా ఋషీశ్వరులకు ఆశ్రయమిచ్చిన ఘనుడవు! వాలఖిల్యులచేత యాగం చేయించి మరో యింద్రుడిని తయారుచేసిన అసమాన ప్రతిభా శాలివి! పూర్వం అగస్త్యునిచేత సముద్రాలే ఆపోశన పట్టబడ్డాయి! బుద్ధి శాలియైన విశ్వామిత్రుడిచే బ్రహ్మ సృష్టికి ప్రతిసృష్టి కావించబడింది! చ్యవన మహర్షివల్ల ఇంద్రుడి భుజమే స్థంభింపచేయబడింది! ఓమహాత్మా! శ్రేయస్సుకోరేవారికి సర్వదా మీ దర్శనం, వందనం, ఆశీర్వచనం అభిల షించతగినది! మీకు యొనర్చే సేవ, పూజ సమస్త పాపములనూ క్షయం చేయగలవు! మీనుంచి ఉపకారం కోరివచ్చాము! దీనులమైన మమ్మల్ని మీరే అనుగ్రహించాలి! మిమ్మల్నే నమ్ముకొని శరణుజొచ్చాము! మేము మారాజైన ఇంద్రుడిని కోరివచ్చాము. దయతో మమ్ము అనుగ్ర హించు!" అంటూ ప్రార్థించిన దేవతలందరిని ఎంతో ఆదరంగా ఆహ్వా నించి, వారందరినీ ఉచితాసనాసీనులను గావించి ఎంతో మధురంగా చిరునవ్వు నవ్వుతూ గౌతమమహర్షి యిలాఅన్నాడు :

"పరమ పావనులూ, శుభప్రదులైన ఓ దేవతలారా! మీ దివ్య మంగళరూపం దర్శించటం చర్మచక్షువులకు అలవికాని పని! ఐనా అనేక జన్మార్జిత పుణ్యం ఫలంగా మీ సందర్శనం నాకు లభించింది. ఇందు వల్ల, నాజన్మ, మీరాకతో నా ఆశ్రమమూ, తపస్సూ, దేహమూ, ఆత్మ నే ఆచరించిన వ్రతాదులూ సార్థకమైనాయి. ఇప్పుడు మీ అభీష్టమేమిటో నా ఎదుట చెప్పండి! నావల్ల శక్యమైతే — మీయొక్క అనుగ్రహంతో

మీకార్యం నెరవేరుస్తాను!" అన్నాడు.

'ఓ రుక్మాంగదమహారాజా! గౌతమముని పలుకులు విన్న దేవతల మనస్సులు మేఘాన్ని చూసి పురివిప్పి ఆడే నెమళ్ళే ఐనాయి! చంద్రో దయ మవగానే సముద్రం ఉప్పొంగినట్లుగా వారంతా సంతోషంతో ఉప్పొంగినారు! వారిలా అన్నారు :

"ఓ మహర్షీ! శివుని తపస్సు భంగం చేయబోయిన మన్మథుడిని శంకరుడు మూడోకంట క్రోధాగ్నిలో బుగ్గిచేశాడు. కానీ నీవలా ఇంద్రుని నీ క్రోధాగ్నికి దగ్ధం చేయలేదు! ఘోర అపరాధం చేసిన ఇంద్రుడి ప్రాణాలను తీయకుండా నీ దయను వెల్లడించావు!

ఓ దయానిధీ! మేము నిన్ను కోరేదల్లా ఇప్పుడు నీ అనుగ్రహం వల్ల ఇంద్రుడు తన యథాస్థానాన్ని పొందాలని! మా ప్రార్థనలను అనుస రించి అతని దోషాలను క్షమించు! నీవతనిని అనుగ్రహిస్తే మాకు మా అభీష్టం సిద్ధించినట్లే!"

వారి మాటలకు తపోవ్రతుడైన గౌతముడిలా బదులిచ్చాడు. 'ఓ దేవతలారా! పతితుడు, మహాపాపి ఐన ఆ ఇంద్రుడిపేరును స్మరించటం కూడా దోషమే! చాలా కపటుడు, శఠుడు, దుష్టుడు, యుక్తాయుక్త విచక్షణ కోల్పోయిన అవివేకి! అటువంటి పశ్చాత్తాప రహితుడికి నిష్కృతి లేదు! ఐనా మీ కోరికమేరకు వానికి ప్రియంచేస్తాను! మీవంటి మహనీ యుల మాటను నిరాకరించను! మీ అననుగ్రహానికి గురి కాదల్చు కొనటంలేదు! మీ అందరిచేత అనుగ్రహించబడటంవల్లా, ప్రశంసించ బడటంచేతా అట్టి దుష్టుడు కూడా పవిత్రుడౌతాడు!

కనుక ఓ దేవతలారా! నేను మీకో మంత్రాన్నిస్తాను! అది ఆ ఇంద్రునికి ఉపదేశించండి!"

## గౌతముడు ఇంద్రుని శాపవిమోచనోపాయం చెప్పుట :

"ఓ మహామహులారా! త్రిమూర్తి స్వరూపుడూ, ఆద్యంతాలు లేని వాడూ, సకల శుభప్రదుడూ, విఘ్నములను నివారించువాడైన ఆ గణేశుని షడక్షర మహామంత్రం సర్వసిద్ధిదాయకమైనది. ఈ మంత్రాన్ని మీరు సాంగోపాంగంగా ఇంద్రునికి ఉపదేశిస్తే అతడు అనుష్ఠించి గణేశాను గ్రహంతో దివ్యశరీరాన్ని ధరిస్తాడు. అతని శరీరంపైని భగములన్నీ నేత్రములు కాగలవు! తిరిగి స్వర్గలోకాన్నీ పొందగలడు! ఇది ముమ్మాటికీ సత్యం!" అని కరుణాభరిత దృక్కులతో దేవతాగణాలను సమాధానపరిచి మౌనం వహించాడు. అప్పుడు ఆ సకల దేవతలూ గౌతమముని అను గ్రహానికి పరమానందభరితులై, పూజించి, అతడికి ప్రదక్షిణ నమస్కారము లను సమర్పించి మూర్తీభవించిన శాంతంలా ఉన్న ఆ తపోనిధివద్ద అనుజ్ఞ గైకొని ఇంద్రుడిని వెతుకుతూ, అతడు దాగివున్న సరస్సువద్దకు చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని

'మంత్రకథనం' అనే 32-వ అధ్యాయం.



33

# ఇంద్రశాప మోక్షణం

(మూలం)

## త్రయో స్త్రింశో అధ్యాయః

**నారద ఉవాచ :-**

ఊచుర్దేవా వృత్రహణం బహిర్యాహి శతక్రతో
వయం హి సహితాస్తత్ర నారదేన సురర్షిణా ॥ 1

తం గత్వా గౌతమమునిం ప్రసాద్య త్వా మిహాగతాః ।
ఉపాయస్తేన కథితో వరో దత్తస్తవాపి చ ॥ 2

దోషే జాతే స్వయం సంతః ఖ్యాపయంతి జనేషు తం ।
తత్ర ప్రతిదినం సమ్యక్ కుర్వంతి తన్నిరర్థకం ॥ 3

ఆచ్ఛాదనే దోషవృద్ధిః ఖ్యాపనేతు లయోభవేత్ ।
తస్మా త్వమపి దేవేంద్ర బహిరాగత్య తంవద ॥ 4

దేవర్షిం ప్రతి తంబ్రూహి కురూపాయం మునేరితం ।
వైనాయకం మహామంత్రం గృహాణత్వం షడక్షరం ॥ 5

బ్రహ్మ దదర్శ చాంగుష్టం వివాహే గిరిజేశయోః ।
చస్కంద స తదారేతో లజ్జితో వాఙ్మఖోగతః ॥ 6

జ్ఞాత్వా మహేశః కృతవాన్నిర్ఘోషం తముపాయతః ।
ఇతివాణీం సశృత్త్యైవ దేవర్షిగణ నిర్మితాం ॥ 7

అజగామ బహిశ్శక్రో నలినీకోశతో నృప ।
సర్వేషాం తత్ర దేవానాం శృత్వా వాక్యాని సాదరం ॥ 8

పూయ శోణిత దిగ్ధాంగో మలినః పూతిగంధవాన్ ।
దృష్ట్వా తథావిధం దేవాః నేముస్సర్వే సురేశ్వరం ॥ 9

ఆచ్ఛాద్య ఘ్రాణరంధ్రాణి వస్త్రాపై ర్న్పపసత్తమ ।
సుస్నాతం పునరాయాంతం త మింద్రం వాక్పతిస్తదా ॥ 10

షడక్షరం మహామంత్రం గణేశ స్యోపదిష్టవాన్
ఉపదేశేకృతే తేన దివ్యదేహో బవచ్ఛసః ॥ 11

సహస్రనయనః శ్రీమాన్ బభౌ సూర్య ఇవాపరః ।
తతో వాద్య నినాదైశ్చ జయశబ్దై ర్దివౌకసాం ॥ 12

గంధర్వాణాం గానరవై ర్నాదితా విదిశోదిశః ।
ముముచుః పుష్పవర్షాణి సర్వేదేవా ముదాన్వితాః ॥ 13

ఆశిషో దదుస్సర్వే మునయో నారదాదయః ।
ఆలిలింగు ర్మదాదేవా స్తుష్టువు శ్చాపరేచ తం ॥ 14

కే ఊచుస్తం సుమనసః సనాథాహి వయం త్వయా ।
వినా త్వాం నైవ శోభామో వినాచంద్రం నభోయథా ॥ 15

వినా స్య పితరౌబాలా న సుఖంయాంతి సర్వదా ।
తథా వినా వయం త్వాంహి లభామః శర్మ న క్వచిత్ ॥ 16

**మునిరువాచ :-**

శృత్వేద్థం దేవవచనం జహర్షచ శతక్రతుః ।
ఉవాథ ప్రసన్నాత్మా తథ్యం వాక్యం సురాన్ప్రతి ॥ 17

**ఇంద్ర ఉవాచ:**

మయాకృతం కర్మ సుదుష్టిరం ।
య ద్దేవర్షివాక్యేన విమోహితేన ॥ 18

లబ్ధం ఫలం దుస్సహమద్య సర్వై ।
రుద్ధారితోహం దురితప్రకోపాత్ ॥ 19

నమామి సర్వానమర ప్రబర్హా ।
నృషీంశ్చసర్వాన్ స్సగురుప్రభావాన్ ॥ 20

ఉద్ధర్తు మాత్మాన మతోఖిలామాం ।
సంత్రాతుమర్హాః శరణం ప్రపన్నం ॥ 21

కథం ప్రయత్నో రచితో భవద్భిః ।
ప్రసాదనాయాస్య హి గౌతమస్య ॥ 22

కథం సుమంతం పరమం మదర్థే ।
స ఉక్తవాం స్తత్కథయంతు సర్వే ॥ 23

**దేవా ఊచుః :-**

మునిం పురస్కృత్య గురుం వయంచ
గతా మునిం తం ప్రణిపత్య సమ్యక్ ।
ప్రసాదితో వాగమృతై ర్విచిత్రైః
సయాచ్యమానో పవ్యద త్స్వమంత్రం ॥ 24

యస్యోపదేశేన సహస్రనేత్రో జాతో భవాన్సర్వసుఖాయదేవ । 25

ప్రయాహి దేవత్త్వమరావతీం స్వాం ।
ప్రశాధి సర్వాన్ వివిధాంశ్చ లోకాన్ ॥ 26

**ఇంద్ర ఉవాచ :-**

నాహం ప్రయాస్యే స్వపురీం ప్రసాదం వినా గణేశస్య సురర్షివర్యాః ।
వ్రజంతు యూయం కృత సాధుకృత్యాధామాని దివ్యాని ముదా రమంతః॥ 27

ఏతావతాహం ప్రకటీకృతోహం లజ్జా విలీనో బహుదుర్గతిశ్చ ।
ప్రసాదితో యన్ముని రుగ్రతేజా భవత్ప్రసాదాద్బహు నేత్రతా మే ॥ 28

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**త్రయో స్త్రింశో అధ్యాయః**



# ఇంద్రశాప మోక్షణం
# 33-వ అధ్యాయము

## దేవతలు ఇంద్రునికి హితోపదేశం చేయటం :

"ఓ రుక్మాంగదా! ఈవిధంగా గౌతమమునివద్ద అనుజ్ఞను పొందిన దేవతాగణములు ఇంద్రుడు క్రిమియై దాగివున్న సరోవర తీరానికి వెళ్ళి యిలాఅన్నాడు :

'ఓ ఇంద్రా! నీవు బయటికి రమ్ము! దేవర్షియైన నారదునితో కలసి గౌతమముని ఆశ్రమానికి వెళ్ళి అతడిని ప్రసన్నుణ్ణి చేసుకొని అనుగ్రహాన్ని పొంది నీ సన్నిధికి వచ్చాము. నీ శాపనివృత్తికి, దోష పరిహారానికీ తగిన ఉపాయాన్నికూడా తెలుసుకుని వచ్చాం. అనుగ్రహ మూర్తియైన ఆ ముని వరంగా నీకో ఉపదేశాన్ని కూడా యిచ్చాడు. ఏదైనా దోషం సంభవించినప్పుడు సత్పురుషులు దాన్ని జనసమూహం

ఎదుట ప్రకటిస్తారు. అలా పశ్చాత్తాపం చెందని పక్షంలో ప్రతిక్రియ చేసినా ప్రయోజనం ఉండదు! చేసిన తప్పును కప్పిపెట్టడమనే దోషం దాన్ని బహిరంగంగా ప్రకటించడంవల్ల పోతుంది! కనుక ఓ ఇంద్రా! నీవు వెంటనే బైటకువచ్చి దేవగురువు ఎదుట నీతప్పు ఒప్పుకో! ఆ తరువాత ఆ దోషనివారణకై గౌతమముని ప్రసాదించిన మార్గాన్ని అనుస రించు! వినాయకుని షడక్షరీమంత్రాన్ని ఆయనవద్ద గ్రహించి వీతకల్మ షుడివికా! పూర్వం శివకళ్యాణ సమయంలోకూడా బ్రహ్మ యిలాగే కామమోహితుడై రేతస్ఖలనముకాగా సిగ్గుచెంది తలదించుకుని ఉండగా శివుడా వృత్తాంతం ఎరిగి ఉపాయంతో అతణ్ణి నిర్దోషుడిగా చేశాడు.' ఇలా దేవతలచేత అనునయించబడినాక ఇంద్రుడు తానున్న తామర తూడునుండి బైటకువచ్చి నిలిచాడు. శరీరమంతా రసిఓడుతూ, మలిన మైన శరీరంతో దుర్వాసనకొడుతూ భరించలేనంత దుర్భరుడై ఉండగా ఆ దేవతలు తమ ముక్కులను మూసుకున్నారు.

అప్పుడు స్నానంచేసి పరిశుద్ధుడైనాక ఇంద్రుడు ఆచమించి శుచి ర్భూతుడవగా, బృహస్పతి ఆతనికి గణేశ షడక్షర మహామంత్రాన్ని ఉపదే శించాడు. ఆ ఉపదేశము చెవినిబడినంతనే ఇంద్రుడు దివ్యసుందర మైన దేహాన్ని పొందాడు. ఋషిశాపమువలన సంక్రమించిన వేయి భగములు (యోని చిహ్నములు) కన్నులుగా మారాయి! ఎప్పుడైతే ఇంద్రుడిలా దివ్యదేహాన్ని దాల్చాడో దేవతలు తమ హర్షోద్వేగాన్ని ప్రకటిస్తూ జయ జయ ధ్వానాలు చేశారు. గంధర్వులూ తమ సుమధుర గళాలతో గాత్రాన్ని ఆలపించారు. దేవతలందరూ సంతోషంతో పుష్పవృష్టిని కురి పించారు. నారదుడు మొదలైన మునులంతా దేవతలకు రాజైన

ఇంద్రుణ్ణి ఆశీర్వదించారు. కొందరు దేవతలు అతడిని ఆలింగనం చేసుకున్నారు, మరికొందరు దేవతలాతడిని స్తుతించారు.

'ఓ ఇంద్రా! నిన్ను తిరిగి పొందటంతో మేము కృతార్థులమైనాము. చంద్రుడులేని రేయి, తలితండ్రులులేని శిశువూలాగే నీవులేని అమరావతీ నగరంకూడా శోభించటంలేదు!' అన్న దేవతల వచనాలను విని ఇంద్రు డెంతో సంతసించి, ప్రసన్న హృదయంతో ఆ దేవతలనుగూర్చి ఇలా అన్నాడు :

'ఓ దేవతలారా! నారదముని వాక్యాలచేత ప్రేరితుడనై కామ మోహితుడనై యుక్తాయుక్త విచక్షణను కోల్పోయి చేయరాని అతి హేయమైన దుష్టమైనకర్మ చేశాను! అందుకుతగ్గ ఫలితాన్ని కూడా వెంటనే అనుభవించేశాను! నన్నీ పాపకూపంలోంచి బైటికిలాగి ఉద్ధరిం చారు. ఓ మహాప్రభావంగల దేవతలారా మీకిదే కృతజ్ఞుడినై నమస్క రిస్తున్నాను.'

మహాప్రభావోపేతులైన ఋషీశ్వరులకు నమస్కారము. పాప పంకిలంలోనుంచి నన్ను ఉద్ధరించటానికీ, దీనతతో శరణాగతుడనైన నన్ను రక్షించటానికీ మీకన్నా అన్యులెక్కడ ఉన్నారు? అందుకు మీరే తగినవారు! ఓ దేవతలారా! ఆ గౌతమఋషివద్ద ఈ ప్రశస్తమైన అను గ్రహోపాయాన్ని ఎలా పొందారు? ఆ విశేషాలను వివరించండి!" అంటూ కోరగా ఆ వృత్తాంతాన్ని అంతటినీ దేవేంద్రునికి దేవతాప్రముఖులు వివరించారు. "ఓ ఇంద్రా! ఆ మహామంత్ర ప్రభావం చేతనే నీవు నీ పూర్వవైభవాన్ని పొందగలిగావు! కనుక నీవు తిరిగి వచ్చి యధాప్రకారం

అమరావతిలో నీవు ముల్లోకాలనూ, మమ్మల్నీ పరిపాలించు!" అంటూ వేడుకోగా ఇంద్రుడిలా బదులిచ్చాడు.

"ఓ దేవర్షులారా! నేను నా దోషాన్ని పూర్తిగా గణేశానుగ్రహం పొంది నివారించుకున్న మీదటే అమరావతికి రాగలను! మీరు మీమీ స్థానాలకు వెళ్ళండి. మీ దయతో సంప్రాప్తమైన ఉపాయం సాయంతో నేను విగతదోషుడిని కావలసివుంది! మీ అనుగ్రహవిశేషం వల్లనే నేను సహస్రాక్షుడనైనాను! క్రోధంతో ప్రజ్వరిల్లే గౌతమునిని శాంతింపజేసి అనుగ్రహింప చేసిందికూడా మీకృషి యొక్క విశిష్టతయే!" అంటూ దేవతా గణాలను వీడ్కొలిపి ఇంద్రుడు మంత్రానుష్ఠానానికి ఉపక్రమించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'ఇంద్రశాప మోక్షణము' అనే 33-వ అధ్యాయం.



# 34

# చింతామణి తీర్థవర్ణనం

(మూలం)

## చతుస్త్రింశో అధ్యాయః

**నారద ఉవాచ :-**

కదంబ వృక్షస్య తలే నిధాయ నాసాగ్ర దృష్టిం పరమాననే సః ।
మనో నిరుంధ్యాథ జజాప మంత్రం షడక్షరం జంభరిపు ర్నరేంద్ర ॥ 1

సహస్రవర్షాణి గతాని తస్య మరుత్వతే ర్మారుత భక్షణస్య ।
వల్మీకగుల్మాని శరీరదేశే జాతాని వై భూధర వస్థితస్య ॥ 2

తతః ప్రసన్నో భగవాన్ గణేశో యః సర్వగః సర్వవి దుగ్రతేజాః ।
స్వ తేజసా వహ్ని శశీ న తేజాం స్యాచ్ఛాదయాన్ సర్వ విలోచనాని ॥ 3

చతుర్భుజో రత్నకిరీట మాలీ చార్వంగదః కుండలమండి గండః ।
ముక్తామయం దామ చ నూపురే చ బిభ్రన్మహార్ఘే కటిసూత్రముచ్చైః ॥ 4

యః పుష్కరాక్షః పృథుపుష్కరోపి బృహత్కరః పుష్కరశాలి మూలం ।
ఆవిర్బభూవావ ఖిఅలదేవమూర్తిః సింధూర శాలీ పురతో మఘోన ః ॥ 5

తం దృష్ట్వా భయభీతో అభూత్ కిమిదం కిమివా గతం ।
కథంచ జీవితం మేస్యా దస్థి ప్రాణమయస్య చ ॥ 6

విఘ్నోయం కిం మహానద్య నజానే కేననిర్మతః ।
స్వేద స్రావి శరీరం మే కంపతే బోధిపత్రవత్ ॥ 7

ఇద్ధం విక్లవితం తస్య బబుధేఽఖిల దృగ్విభుః ।
వినాయకో మహేంద్రం తమువాచ మంజులం వచః ॥ 8

**వినాయక ఉవాచ :-**

మా భయం కురుదేవేశ మాంనవేత్సి కథం సుర ।
యన్నిర్గుణం నిర్వికారం చిదానందం సనాతనం ॥ 9

కారణాతీత మవ్యక్తం జగత్కారణ కారణం ।
యం ధ్యాయసి సదా దేవం మంత్రేణానేన నిశ్చలః ॥ 10

శ్రాంతోసి బహుకాలం త్వ మితి ప్రత్యక్షతాం గతః ।
తపసా అనేన తుష్టోహం వరం దాతు మిహాగతః ॥ 11

బ్రహ్మాండానా మనంతానా ముత్పత్తి ప్రళయావనం
మత్తఏవేతి విద్ధిత్వం శృణు యద్వాంఛసే నఘ ॥ 12

**నారద ఉవాచ :-**

శృత్వా తస్య వచోరమ్యం బుబుధే బలభేదనః ।
భగవంతం మహాకాయం దేవదేవం వినాయకం ॥ 13

ననామ పరయా భక్త్యా తత ఉద్ధాయ సత్వరః ।
అవీవదచ్చ చేకాంతః ప్రత్యక్షం బ్రహ్మరూపిణం ॥ 14

**ఇంద్ర ఉవాచ :-**

బ్రహ్మాదయోపి నోదేవా విదుస్త్వాం స దిగీశ్వరాః ।
గుణాంస్తవ మహాబాహో సృష్టిస్థిత్యంత కారిణః ॥ 15

పదంతు కృత్రిమం మహ్యం శతయజ్ఞ సముద్భవం ।
దత్తం తంత్రాప్యంతరా యా భవంతి బహుధా మమ ॥ 16

మయా కథంతు విజ్ఞేయో మహిమా తే గజానన ।
యస్యతే అనుగ్రహః పూర్ణో భవిష్యతి మహేశ్వర । 17

స ఏవ మహిమానంతే జానీయా ద్విఘ్నకారణ । 18

తస్యతే గుణరూపాణి వక్తుం శక్తిర్భవిష్యతి ।
నిరాధారో అఖిలాధారో నిత్యజ్ఞానో ఽఅజరోమరః ॥ 19

నిత్యానందేన సంపూర్ణో మాయావీ క్షరఏవచ । 20

అక్షరః పరమాత్మాచ విశ్వరూపో అఖిలేశ్వరః ।
ఉగ్రైస్తపోభిస్త్వాం జ్ఞాత్వా నివృత్తాః సనకాదయః ॥ 21

షడక్షర ప్రభావేన దృష్టోసి పరమేశ్వర ।
పురా యం బ్రహ్మణాదిష్టో మంత్రో మే నుగ్రహేణ వై । 22

ఉక్తవాంశ్చైవ మాం బ్రహ్మ యదాము విస్మరిష్యసి ।
తదైవ భ్రశ్యసే స్థానా ద్దుర్దశాం చైవయాస్యసి । 23

తతోమయాతి లుబ్ధేన దుర్భాగ్యవశగేన తు ।
ధర్షితా మునిపత్నీ సా తతోదుర్గతి మాప్తవాన్ । 24

## చింతామణి క్షేత్రవర్ణనం

పునశ్చ ధిషణోక్తేన తేన మంత్రేణ దృష్టవాన్
స్వరూపం తవ దేవేశ సహస్రనయనో అధునా । 25

అన్యమేకం వరం యాచే యతస్త్వం చింతితార్థదః
ఇదం కదంబ నగరం చింతామణీ పురం త్వితి । 26

అనుష్ఠానఫలం ప్రాప్తం యత్తే దృఢ పదాంబుజి ।
ఇదానీం తు వరంయాచే యం తం మే దేహి విఘ్నప । 27

తవ విస్మరణం దేవ న భవేన్మే తథాకురు
మనోమే రమతాం నిత్యం తవ పాదాంబుజే విభో । 28

అద్య ప్రభృతి లోకేస్మిన్ ఖ్యాతిం యాతు గజానన
చింతామణీ తి తీర్థంతు సరశ్చ ప్రథతా మిదం ॥ 29

అస్మిన్ స్నానేన దానేన ధర్మకామార్థ ముక్తయః ।
జనానాం స్థిదయ స్సంతు ప్రసాదాత్తే జగద్గురో ॥ 30

**మునిరువాచ :-**

ఆకర్ణ్య వచనం శాక్రం మేఘగంభీర నిస్స్వనః ।
ఉవాచ శ్లక్షణయా వాచా విఘ్నేశో జగతాం పతిః । 31

**వినాయక ఉవాచ :-**

ఇదం సంపత్స్యతే సర్వం యత్త్వయా ప్రార్థితం విభో ।
అన్యఏకో వరస్తేస్తు స్వపదే త్వం స్థిరోభవ । 32

అవిస్మృతిశ్చ సతతం మమతేస్తు సురేశ్వర ।
యదాచ సంకటం తే స్యాత్తదా మాం స్మర వాసవ ॥ 33

ఆవిర్భావేన తే కార్యం సర్వం సంపాదయేఽనిశం ।
ఇదం చింతామణిపురం ఖ్యాతం భువి భవిష్యతి ॥ 34

కదంబపుర మిత్యే తత్తీర్థం చింతామణీతి చ ।
అత్ర స్నానేన సర్వేషాం సిద్ధయోపి కరే స్థితాః । 35

**నారద ఉవాచ :-**

చింతింతం వః ప్రదాస్యామి చింతామణి వినాయకః ।
ఏవం వరంతతో లబ్ధ్వా స్వసింధు మానయద్ధరిః । 36

కృత్వాభిషేకం తద్వారా పూజయామాస తం విభుం
గజాననం మహాభాగం పరివార సమన్వితం । 37

పూజితః సురనాథేన తత్రైవాంతర్దధే విభుః ।
స్థాపయామాస శక్రోపి స్ఫాటికాం మూర్తిమాదరాత్ ॥ 38

వైనాయకీం శుభాం దివ్యాం సర్వావయవ సుందరాం ।
కారయామాస విపులం ప్రాసాదం రత్న కాంచనైః । 39

నత్వా ప్రదక్షిణీకృత్య శక్రః స్వం పదమభ్యగాత్ ।
తదే తద్భువి విఖ్యాతం చింతామణి సరోమహత్ ॥ 40

అద్యాఽపి సా శుభజలా గంగా శక్రస్య శాసనాత్ ।
కృత్వాభిషేకం తన్మూర్తౌ యాతి స్వంధామ సర్వదా । 41

ఏవంతేక్షేత్ర మహిమా కథితోవద్భుత దర్శనః ।
సర్వదోష హరః శ్రీమాన్ సర్వకామప్రద శ్శుభం‌ః । 42

తత్రగత్వా మహిపాల స్నానంకురు యథావిధి
సర్వదోష వినిర్ముక్తో భవిష్యసి న సంశయః ॥ 43

**బ్రహ్మోవాచ :-**

తతౌ యయౌ మునిః శీఘ్రు మనుపృచ్ఛచ తం నృపం ।
అశీర్భి రభినంద్యైవ స రుక్మాంగద మాదరాత్ । 44

**ఇతి శ్రీగణేశపురాణే ఉపాసనాఖండే చింతామణి తీర్థవర్ణనం నామ చతు స్త్రింశో అధ్యాయః**



# చింతామణి తీర్థవర్ణనం

# 34-వ అధ్యాయము

అతరువాత కథను నారదమహర్షి యిలా కొనసాగించాడు. "ఓ రుక్మాంగదా! అలా దేవగురువైన బృహస్పతివద్ద గణపతి షడక్షర మహా మంత్రాన్ని ఉపదేశంగా పొందిన దేవేంద్రుడు ఎంతో శ్రద్ధాళువై కదంబ వృక్షంక్రింద తగు ఆసనముపైన కూర్చుని నిష్ఠగా ఆ మంత్రాన్ని అను ష్ఠించసాగాడు. మనస్సును నిగ్రహించి, కేవలం వాయువును మాత్రమే భక్షిస్తూ అలా వేయి సంవత్సరాలకాలం గణేశునికై ఘోరతపస్సును ఆచరించాడు. ఇలా తదేకదీక్షతో తనను ఉపాసిస్తూన్న సురలరాజైన ఇంద్రుని తపస్సుకు భక్తవరదుడైన గణేశుడు అమిత ప్రసన్నుడై సూర్య చంద్రాదులను తలదన్నే దివ్య తేజస్సుతో, కళ్ళు మిరుమిట్లుగొలిపే ప్రకాశంతో నాలుగు బాహువులకూ భుజకీర్తులనూ ధగధగాయమానంగా ప్రకాశించే రత్నకిరీటాన్నీ దాల్చి, రత్నకుండలాలతోనూ, ముత్యాలహారం తోనూ శోభిల్లుతూ, పాదాలకు సైతం దివ్యాభరణాలను ధరించి బంగారు మొలత్రాటితో పుష్పమాలాలంకృతుడై సకలారాధ్యుడు అద్యుడూ దేవత లందరిచేతా మొదటిగా పూజల నందుకునేవాడూ ఐన గణపతి దివ్య రూపంలో సాక్షాత్కరించాడు.

ఆ మూర్తిని చూసిన ఇంద్రుడు క్షణకాలం విభ్రాంతిచెందాడు 'కేవలం అస్థిపంజరంలావున్న నేను ఇది ఎలా తట్టుకోగలను? నా తపస్సుకు విఘ్నం కల్పించటానికి ఏర్పడిందా? భయవిభ్రమాలతో ముచ్చెమటలు పట్టి నా శరీరం అశ్వద్ధపత్రంలా కంపిస్తోంది!' ఇలా అనుకుంటూ కలవరపడుతూన్న ఇంద్రుని భయాన్ని సర్వజ్ఞుడైన గజానను అతని భయం పోయేలా మృదుమధురంగా యిలా అన్నాడు.

## వినాయకుని సాక్షాత్కారం

"ఓ సురేంద్రా! ఇంద్రా! షడక్షర మహామంత్రంతో ఎవరినైతే నీవిన్నేళ్ళుగా ఆరాధిస్తున్నావో ఆ మంత్రమూర్తినైన గణపతిని నేనే! నీ కఠోర తపోదీక్షకు కడుసంతుష్టుడనైనాను! యావత్ సృష్టి, స్థితి, లయములూ నావల్లనే జరుగుతున్నాయి!

కనుక నీ మనోభీష్టము ఎలాంటిదైనా అనుగ్రహిస్తాను! సంకోచ పడకుండా అడుగు!"

అమృతోపమములైన ఆ వాక్కులు చెవిన పడగానే హృదయం లోంచి భక్తి పెల్లుబికిరాగా సాష్టాంగ దండప్రణామాలు ఆచరించి చేతులు మోడ్చి గద్గదస్వరంతో పులకితగాత్రుడై యిలాఅన్నాడు.

"ఓప్రభూ! నీ గుణగణాలను త్రిమూర్తులూ, అష్టదిక్పాలకులు సైతం తెలుసుకోలేరంటే — యిక సామాన్యుల గురించి చెప్పేదేముంది? సృష్టిస్థితిలయాలు నీవల్లనే జరుగుతాయి. నూరు అశ్వమేధయాగాలు చేసి ఇంద్రపదవిని సముపార్జించుకో గలిగాను! ఐనా ఆ పదమూ, దాని నిర్వహణా — అనేక అంతరాయాలతో కూడినవి! ఓ కార్యకారణ స్వరూపా! నీ మహిమ వర్ణనాతీతం! నీవెవరినైతే అనుగ్రహించదలిచావో

— వారికి మాత్రమే నీ లీలావిభూతి ఎరుగుట సాధ్యం! అతి దుస్సాధ్యమైన నీ అనుగ్రహం వల్లనే నీ గుణగణాలను వర్ణించగలను. నిర్గుణ స్వరూపుడవై, ఆద్యంతాల కతీతుడవై, సకల జగదాధారుడవై, నిత్య సత్య జ్ఞానస్వరూపుడవై వెలుగొందే పరబ్రహ్మమే నీవు! సకలదేవతా స్వరూపుడవైన నిన్ను సనకాది ఋషులు తమ సుదీర్ఘ తపస్సుతో ప్రసన్నుణ్ణి కావించుకోగలిగారు!''

“ఓ దేవదేవా! షడక్షరీ మహామంత్రముయొక్క అమోఘ ప్రభావం చేతనే నీ సందర్శన భాగ్యం కలిగింది! ఇదివరలోనే చతుర్ముఖుడు నాకీ మంత్రాన్ని ఉపదేశించి, ‘ఓ ఇంద్రా! నీవెప్పుడైతే ఈ మంత్రాన్ని వీడుతావో, అప్పుడు నీ స్థానం భ్రష్టమై, దుర్దశ కలుగుతుంది!’ అంటూ హెచ్చరించాడు.''

“వివేకహీనుడనై మునిపత్నిని బలాత్కరించాను! తగ్గ ఫలితాన్ని అనుభవించాను! తిరిగి బృహస్పతిచే ఉపదేశించబడిన ఈ మంత్రం చేత నిన్ను దర్శించుకుకోగలిగాను! నీ అనుగ్రహంచేతనే సహస్రాక్షుడనైనాను! కోరిన వరాలననుగ్రహించే కామధేనువు, కల్పవృక్షముల వంటివాడవైన నిన్నొక వరం అర్థిస్తున్నాను. ‘ఈ ప్రదేశాన్ని (కదంబపురాన్ని) చింతామణి పురమని ప్రసిద్ధికెక్కేలాగున అనుగ్రహించు! — నీవిక్కడే ‘చింతామణి వినాయకుడ’న్న పేరుతో వెలియుదువుగాక!’ నీ చరణారవిందములపట్ల విస్మృతిలేనట్టి భక్తిని నాకనుగ్రహించు! ఈ సరోవరానికి చింతామణీ సరోవరమన్న ఖ్యాతీ, యిక్కడ ఈ తీర్థంలో స్నానమాడి సంకల్పంచేసి ఆచరించిన దానములచే ధర్మార్థకామములనే మూడు పురుషార్థములూ పొందేలా, ఇక్కడ అనుష్టానాదులు చేసేవారికి సకల

సిద్ధులూ లభ్యమయ్యేలా అనుగ్రహించు!" అంటూ వేడిన శచీపతి ప్రార్థనకు అమితసంతుష్టుడైన ఆ కరివరదనుడు చిరునవ్వుతో "తథాస్తు!" (అలాగే అగుగాక!) అంటూ ఆశీర్వదించాడు.

దేవరాజైన ఇంద్రుడు దేవలోకంనుంచి స్వర్ణనదిని రప్పించి, ఆ పవిత్ర నదీజలాలతో వరదుడైన గజాననుని అభిషేకించి, అర్చనాదికాలు సమర్పించాడు! ఇలా సురరాజుయొక్క పూజలందుకొని భక్తవత్సలుడైన ఆ గజాననుడు అంతర్హితుడైనాడు. ఆ తరువాత అత్యంత సౌందర్యోపేతమైన గణేశుని స్ఫటిక విగ్రహాన్ని అక్కడ స్థాపించి, ప్రదక్షిణ నమస్కారాదులను చేసి, తన స్థానమునకు వెళ్ళిపోయాడు."

"ఓ రుక్మాంగదమహారాజా! ఈ ప్రకారంగా ఇంద్రునిచేత నిర్మితమైన ఈ సరస్సే చింతామణి సరోవరమన్న ఖ్యాతిగాంచింది. ఇంద్రుని శాసనం మేరకు యిప్పటికీ ఆ జలాలకు అనంతమైన శక్తి గలిగి వున్నాయి! ప్రతిదినమూ ఇంద్రుడు వచ్చి ఈ తీర్థములో గణేశునికి అభిషేకార్చనలు చేసివెడతాడు! 'ఓరాజా! ఇది చింతామణి క్షేత్రమహిమ! ఈ పవిత్ర చరిత్ర చెప్పినవారికి, చదివినవారికి, విన్నవారికీ సకల దోషాలూ నివారించబడి, అన్ని అభీష్టములు నెరవేరతాయి. దీనికి ఎట్టి సందేహమూలేదు! కనుక నీవు కూడా ఆ చింతామణీ తీర్థానికి వెళ్ళి అక్కడ స్నానాదులు చేసి సకల కల్మషాలనుంచీ విముక్తిని పొందు!" అని నారద మహర్షి రుక్మాంగదునికి ఉపదేశించి ఆశీర్వదించి వెళ్ళిపోయాడు!" అంటూ బ్రహ్మ వ్యాసమహర్షికి ఆ కథనాన్ని తెలియజేశాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
"**చింతామణీ తీర్థవర్ణనం**" అనే 34-వ అధ్యాయం.

35

# కదంబపుర గతవర్ణనం

(మూలం)

## పంచ త్రింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

దేవర్షేతు గతే తస్మి న్నృపః కిమకరో త్తదా ।
రుక్మాంగదో మే కథయ కథామేత్రాం మనోరమాం ॥ 1

**బ్రహ్మోవాచ :-**

కృత్యోపదేశం సుమహాంతమేవం ।
గతే మునౌ నారద నామ్ని పుత్ర ॥ 2

రుక్మాంగదో హర్షయుతో దదర్శ
సేనాం స్వకీయాం చతురంగిణీం తాం । 3

తయాపి దృష్టో నృపతి ర్విరూపో యస్స్వర్ణకాంతీ రతిభర్త్రురూపః
ఆసీ త్సురేద్ధం ।
కథ మేవజాతః సంశయ్యః పప్రచ్ఛ నృపం నిమిత్తం ।

**సేనాన్య ఊచు :-**

గిరీన్వనాని సరితో భ్రాంత్వా చ పయమాగతాః ।
క్షుత్తృక్ష పరీతా రాజేంద్రా త్వద్ధర్శన సముత్సుకాః ॥ 5

పదే పదే ప్రపశ్యంతః సంప్రాప్తా స్తే పదాంబుజం । 6

ఇమా మవస్థాం దృష్ట్వాతే దుఃఖా దుఃఖతరం గతాః ।
కిం నిమిత్త మభూత్తంన్నః కథయస్య నృపోత్తమ । 7

**నృప ఉవాచ :-**

అహ మగ్రే సమాయాతః స్త్రుషితః క్షుదితశ్చ హ । 8

అపశ్యం పురత శ్శీఘ్రం వాచక్నవి గృహాశ్రమం ।
తత్ర గత్వా మయాదృష్టా తస్య పత్నీ శుభాననా ॥ 9

నామ్నా ముకుందేతి శుభా యాచితా సా జలం మయా ।
సాతు దుష్టా స్వైరిణీచ మా మువాచా అశుభం వచః । 10

రతింకురు మయాసార్ధం నోచేచ్ఛా వందధామి ।
తే నిరాకృతా మయా సాతు బలచ్ఛుద్ధేన చేతసా । 11

తద్భర్తరి గతేస్నాతుం సా మాం దుష్టా అశపద్రుషా
తతస్తు వృక్షమూలే హం ఉపవిష్టోహి దుఃఖితః ॥ 12

ప్రభావా త్పూర్వపుణ్యస్య దృష్టవాన్ న్నారదం మునిం ।
తేన మే కథితో ఽధిష్టనాశకో విధిరుత్తమః ॥ 13

చింతామణీ క్షేత్రగతో గణేశతీర్థంశ్రితః ।
మహిమా కథితస్తేన తస్యతీర్థస్య విస్తరాత్ ॥ 14

తత్ర స్నానం సమాఖ్యాతం మునినా దివ్యచక్షుషా ।
అతః స్నాతుం గమిష్యామి స్వ దోషస్యా పనుత్తమే ॥ 15

యాంతు సర్వే మయా సార్ధం తత్ర స్నాతుం యదీచ్ఛత । 16

స్నాత్వాదత్వా యథాశక్తి సంపూజ్యచ వినాయకం ।
పూతా స్తయోః ప్రభావేణ యాస్యామః స్వపురం తతః । 17

**క ఉవాచ :-**

ఇతి తే నిశ్చయం బుధ్వా జగ్మూ రాజపురసస్సరాః ।
దృష్ట్వా తీర్థం గణేశాఖ్యం దివ్యదేహో బభౌ నృపః ॥ 18

తప్తకాంచన వర్ణాభో యథాపూర్వం మునీశ్వర । 19

తతో రుక్మాంగదో మేనే నారదోక్తా మృతం వచః । 20

తత్ర స్నాత్వా దదౌ దానాన్యనేకాని నృపస్తదా ।'
రుక్మాంగదో బ్రాహ్మణేభ్యో ముదా పరమయాయుతః ॥ 21

వినాయకం పూజయిత్వా తేజోరాశిం దదర్శనః ।
విమాన మర్కప్రతిమం బ్రాహ్మణాః సేవకాశ్చతే । 22

వినాయక గణైర్జుష్ట మప్సరః కిన్నరైర్యుతం ।
నత్వా నృపస్తాన్ప్రచ్ఛ కే యూయం కుత ఆగతాః । 23

మాతాః కస్య కిమత్రాస్తి కార్యం తద్బ్రూత సాదరం । 24

బ్రహ్మోవాచ :-

శృత్వా నృపతి వాక్యాని మంజులాని విమానగాః । 25

దూతా వినాయకస్యోచుః ధన్యోసి నృపసత్తమ ।
యేనతే సర్వభావేన ధ్యాత శ్చింతామణిః ప్రభుః । 26

తీర్థయాత్రా కృతా సమ్యక్ దానం దత్వా యథావిధి ।
చింతామణిః పూజితశ్చ కృతకృత్యోసి సాంప్రతం ॥ 27

చింతితస్య ప్రదానాద్ధి చింతామణి రయంస్మృతః ।
వయంచ కృతకృత్యాస్మో దర్శనాత్తవ సువ్రత ॥ 28

మహిమానం నజానీమ స్తవభక్తే న్నృపోత్తమ ।
కాయేన వచసా బుధ్యా జీవస్యాప్యర్పణే నచ ॥ 29

ఆరాధితస్త్వయా దేవః సర్వ బ్రహ్మాండనాయకః ।
వినాయక స్తస్యదూతా స్తేన చ ప్రేషితాన్నృపః । 30

ఉత్సుకః స ఉవాచాస్మాన్ మద్భక్తం శీఘ్రయాయినః ।
రుక్మాంగదం విమానేన ఆనయంతు మమాంతికం ॥ 31

ఇతి శృత్వా వయం యాతా ఆరోహస్య నభోగమం ।
యాహి శీఘ్రతరం దేవం సహాస్మాభి ర్వినాయకం ॥ 32

బ్రహ్మోవాచ :-

ఇతి శృత్వా వచస్తేషాం ఆహ రుక్మాంగదో నృపః ।
క్వాహం మందమతి ర్దూతాః క్వచా ఖండితవిగ్రహః ॥ 33

అప్రమేయో ప్రతర్క్యశ్చ చిన్మాత్రో విభురవ్యయః ।
సర్గ స్థిత్యప్యయానాం యః కారణం కారణాతిగః ॥ 34

తస్యాదరో మయికథం నజానే తీర్థజం ఫలం ।
జన్మాంతర గతం కిం మే ఫలితం పుణ్యముత్తమం । 35

తేన వో దర్శనం జాతమగ్రేతి ఫలదం శుభం ।
యూయం ధన్యతరా యేషాం ప్రత్యక్షో అహర్నిశం విభుః ॥ 36

ఇత్యుక్త్వా పూజయామాస దత్వా చరణపంకజం ।
ప్రార్థయామాస సర్వాంస్తాన్ పితామహ నృపోత్తమః ॥ 37

బ్రహ్మణ్యః సత్యవాదీ చ భీమో భీమపరాక్రమః ।
వినా తం కథమాయామి మాతరం చారుహాసినీం ॥ 38

తయా ప్యారాధితో దేవో దేవదేవో వినాయకః ।
జన్మావధి నచాన్యం సా మనుతే దేవతాంతరం । 39

**దూత ఉవాచ :-**

ఏవంచే త్తర్హి తీర్థేస్మిన్ కురు స్నానం తయోరపి ।
శ్రేయస్తస్మైచ తస్మైచ పిత్రే మాత్రే ప్రదీయతాం ॥ 40

తతస్తా వపి నేష్యామో విమాన పరమాస్థితా ॥ 41

**బ్రహ్మోవాచ :-**

ఇతి తద్వచనం శృత్వా కృత్వాప్రతికృతిం కుశైః
కుశోసి కుశపుత్రోసి బ్రహ్మణా నిర్మితః పురా ॥ 42

త్వయి స్నాతే తు సస్నాతో యస్యేదం గ్రంధిబంధనం ।
ఏవం మంత్రం సముచ్చార్య సర్వేషా మానుపూర్వశః ॥ 43

గ్రామ్యాణాం సర్వలోకానాం చక్రే స్నానవిధిం నృపః ।
చింతామణి క్షేత్రగతే తీర్థే గాణేశసంజ్ఞకే ॥ 44

తతో రుక్మాంగదో రాజా సబలో దూతవాక్యతః ।
విమానవర మారుహ్య కౌండిన్యం పురమాయయౌ ॥ 45

వాద్యఘోషై ర్బ్రహ్మఘోషై ర్గంధర్వాప్సరసాం రవైః ।
నాదితం గగనం తేన విమానేన దిశోదశ । 46

మాతాపితృభ్యాం ప్రదదౌ శ్రేయో రుక్మాంగదో నృపః ।
సర్వేషా మేవ లోకానాం స్నానశ్రేయో వినాయకే ॥ 47

దత్తమాత్రేతు కౌశేయ స్నానజే శ్రేయసిద్ధ్రువం ।
వినాయకాజ్ఞ యాన్యాని విమానాని సమాయయుః ॥ 48

ప్రత్యేకం తే సమారూఢాః ఏకైకం గగనేచరం ।
ఏవం రుక్మాంగదో భీమ స్తన్మాతా చారుహాసినీ ॥ 49

సర్వేలోకా యయుస్తత్ర యత్రదేవో వినాయకః ।
ఏవం తన్నగరం సర్వ మాబాల శ్వాపదావధి ॥ 50

**క ఉవాచ :-**

పుణ్యా ద్గణేశ తీర్థస్య స్నానజా త్స్వర్గతిం గతం ।
ఇతితే కథితం సర్వం యతద్యత్పృష్టం త్వయామునే ॥ 51

చింతామణి క్షేత్రగతం మాహాత్మ్యం తీర్థ సంభవం ।
యచ్ఛృణోతి సరో భక్త్యా సోపి తద్గతి మాప్నుయాత్ ॥ 52

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**కదంబపురగతవర్ణనం నామ**
**పంచ త్రింశో అధ్యాయః**



# కదంబపుర గతవర్ణనం
# 35-వ అధ్యాయము

"ఓ చతురాననా! ఆవిధంగా చింతామణితీర్థమహిమను వివరించి నారదమహర్షి అంతర్ధానం చెందాక రుక్మాంగదుడు ఏమిచేశాడు? తదుపరి కథావిధానమెట్టిది? నాకు వివరించండి!" అన్న వ్యాసుని అభ్యర్థనకు బ్రహ్మ యిలా బదులిచ్చాడు.

"ఓ వ్యాసమునీంద్రా! అలా నారదమహర్షి **గణేశషడక్షరీ మహా మంత్రోపదేశం** చేసి, 'చింతామణితీర్థాన్ని' ఆ తీర్థమహిమను వర్ణించి వెళ్ళిపోయిన తరువాత, తన తలపైనుంచి ఒకపెద్ద భారం తొలగినంత సంతోషించి, రుక్మాంగదుడు తనని వెదుకుతూ వస్తూన్న తన సేనాపరివారాన్ని చూశాడు. రాజుని అతని సైనికులు పోల్చుకోలేకపోయారు. స్వర్ణకాంతితో, మన్మధుడి సౌందర్యాన్నే తలదన్నేంత అందగాడైన తమ ప్రభువైన రుక్మాంగద మహారాజు — అలా కాంతిహీనుడై, వికృతరూపం ధరించి వుండటాన్ని వారు అర్ధంచేసుకోలేక అతడిని ఇలా ప్రశ్నించారు.

"ఓ రాజా! నీజాడ తెలియక, నిన్ను అన్వేషిస్తూ అరణ్యాలు, నదులూ అన్నీ దాటి, ఆకలిదప్పుల బారినపడి అలసిసొలసి చివరకు నిన్ను ఇప్పటికి దర్శించగలిగాము. నీకీ దురవస్థ ఎలా సంప్రాప్తించిందో? ఆ వివరం మాకు తెలియజేయవలసింది" అంటూ కుశలప్రశ్న వేసిన ఆ పరివారానికి రుక్మాంగదుడు తాను దప్పికగొని వాచక్నవి ఆశ్రమానికి వెళ్ళి అక్కడ మంచినీటిని అర్థించిన వైనమూ, ఋషిపత్నియైన ముకుంద తనపై మరులుగొని తన పొందుగోరి బలవంతం చేయటమూ, తాను ఆమెను నిరాకరించినందుకు ప్రతిగా, ఆమె తనకు శాపమివ్వడమూ, అప్పుడు విధివైపరీత్యానికి ఖిన్నుడై దుఃఖిస్తున్న తనకు దేవఋషియైన నారదమహర్షి ప్రత్యక్షమై, చింతామణిక్షేత్ర మహిమనూ అక్కడ స్నానంచేస్తే నాకు గల సమస్తచింతలూ తొలగగలవన్న ఉపాయం ఎరిగించటమూ అంతా పూసగుచ్చినట్లు వివరించి, తాను ఆ చింతామణి క్షేత్రానికి వెళ్ళదలిచానని చెప్పాడు.

ఆ తరువాత పరివార సమేతుడై చింతామణి తీర్థమునకు వెళ్ళాడు. ఆ తీర్థాన్ని సందర్శించినంత మాత్రాన్నే ఆ రాజు తన రోగభూయిష్టమైన శరీరాన్ని పాము కుబుసం వీడినట్లు విడిచి, దివ్యదేహాన్ని పొందాడు.

అప్పుడు ఆతడు పూర్వంలా బంగారువన్నె దేహంగలిగి ప్రకాశించాడు. 'ఆహా! నారదమహర్షి వాక్యాలు అక్షరసత్యాలుకదా!' అని మనస్సులో సంతోషాన్ని అనంతమైన ప్రశాంతినీ పొంది, ఆ చింతామణీ తీర్థంలో విధివిధానపూర్వకంగా పుణ్యస్నాన మాచరించి, అనేక దానాలను సైతం ఆచరించాడు. ఎంతో సంతోషంతో భక్తిగా అక్కడ వెలసిన వినాయకుని అర్చించాడు. ఇలా అర్చిస్తూ ఉండగా సూర్యకాంతిని తల

దన్నేటట్లున్న ప్రకాశం కళ్ళుమిరుమిట్లు గొలుపుతూఉన్న ఒక దివ్య విమానం అతని కంటపడింది. అందులోఉన్న వైనాయక గణములు అప్సరలతో, కిన్నర కింపురుష గణాలతో అలరారుతూ ఉండటాన్ని చూసి, అందులోని వారిని 'ఓ దూతలారా! మీరెవరు? ఎవరి దూతలు? ఎక్కడినుండి విచ్చేశారు? మీ ఆగమనంలోని కారణమేమిటి?' ఆ వివరాలు దయతో తెలుప'మంటూ ప్రార్థించగా, ఆ వైనాయక దూతలిలా అన్నారు.

"ఓరాజా! నీవు ధన్యుడివి! అనన్యభక్తితో చింతామణీ తీర్థములో సుస్నాతుడవై, విధివత్తుగా విఘ్న నివారకుడైన గణేశుని అర్చించి సకలములైన దానాలనూ శ్రద్ధతే చేశావు. కనుక నీవు కోరిన అభీష్టము నెరవేరింది. చింతితార్థములన్నీ ఇచ్చేవాడు గనుకే ఆ దేవదేవునికి **'చింతామణీ వినాయకుడ'**న్న ఖ్యాతి కలిగింది! త్రికరణశుద్ధిగా ఆత్మార్పణబుద్ధితో నీవు చేసిన ఆరాధన ఎంతో ఫలప్రదమైనది! అంతేకాదు ఆ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన గణపతికిచేసే అర్చన, ఎంతో అనుగ్రహాన్ని ప్రసాదిస్తుంది. అందుచేతనే ఆ దేవుడు నిన్ను అనుగ్రహించి సశరీరునిగా తీసుకురమ్మని మమ్మల్ని యిక్కడకు ఈ ప్రత్యేక విమానంలో పంపించాడు! కనుక నీవు వెంటనే దీన్ని అధిరోహించి, ఆ వినాయకుని సన్నిధికి రావలసింది!" అంటూ కోరారు.

"ఓ వ్యాసమునీంద్రా! అలా దూతల వాక్యములు విని రుక్మాంగదుడిలా బదులు పలికాడు."

'ఓ దూతలారా! సకల జగన్నియామకుడైన ఆ దేవదేవుడెక్కడ? మందబుద్ధినైన నేనెక్కడ? సర్వవ్యాపకుడూ, అవ్యయుడు, త్రిమూర్త్యాత్మ

కుడు, కారణాతీతుడైన ఆ విఘ్నేశ్వరునకు నామీద ఇంతటి ఆదరణ ఎలాకల్గింది? ఇది అనంతకోటి పుణ్యప్రదమైన ఈ తీర్థమహిమా? లేక నా పూర్వజన్మల సుకృతం ఈనాటికి పరిపాకమైనదా? బహుశః అందు వల్లనే కాబోలు! పుణ్యమూర్తులైన మిమ్మల్ని చూడగలిగాను! మీరు అనంత పుణ్యస్వరూపులవటం వల్లనే అనునిత్యం ఆ స్వామి సన్నిధిలో ఉంటూ, ఆయనను సేవించుకునే మహద్భాగ్యం పొందారు. యిలా పలుకుతూ, వారికి నమస్కరించి వారితో రుక్మాంగదుడు యిలా అన్నాడు.

“ఓ దూతలారా! రాజనగరులో నా తండ్రియైన భీముడు పరమ ధార్మికుడు, సత్యసంధుడు అమేయ పరాక్రమోపేతుడై ఉన్నాడు. నా జననియైన చారుహాసిని కూడా పరమ పతివ్రత. వయోవృద్ధులైన నా జననీ జనకులను విడిచి కేవలం నా స్వార్థం మాత్రమే చూసుకొన బూనటం అనుచితంకదా?”

అందుకాదూతలు “అయితే ఓ రుక్మాంగదా! నీవు వారి పేరిట కూడా సంకల్పం చెప్పి కుశాకంకణం (దర్భలతో పేనిన కంకణం) ధరించి వారి సద్గతి నిమిత్తమైకూడా ఈ చింతామణీ తీర్థంలో స్నానం చెయ్యి! ఆ పుణ్యవిశేషంవల్ల వారుకూడా గణేశలోక ప్రాప్తిని నిస్సందేహంగా పొందగలరు” అన్నారు.

దూతల ఆ సూచనమేరకు రాజు కుశా కంకణాలను తన తలి దండ్రులపేరిట, తన రాజ్యంలోని ప్రజలపేరా ధరించి, ఆ పుణ్యతీర్థంలో స్నానాలు విడివిడిగా ఆచరించాడు. అలా స్నానవిధులను సంకల్ప

సహితంగా, సమంత్రకంగా నిర్వహించాక, వినాయకదూతలు మరికొన్ని విమానాలతో వచ్చారు.

ఆకాశమండలమంతా మంగళవాయిద్యాలతోనూ, వేదఘోషల తోనూ గంధర్వుల గానంతోనూ దశదిశలా మారుమ్రోగింది. అప్పుడు రుక్మాంగదుడు తల్లిదండ్రులకు, పురజనులకూ తన చింతామణీ తీర్థపు స్నానఫలాన్ని ధారపోశాడు. ఆ తరువాత మాతాపితరులతోనూ, పురజనుల తోనూ కూడి గణేశస్థానానికి ఆ ప్రత్యేక విమానాన్ని నధిరోహించి వెళ్ళాడు. ఓ వ్యాసమునీంద్రా! ఈవిధంగా ఆ గణేశతీర్థ పుణ్యప్రభావంచేత అబాల గోపాలమూ సద్గతిని పొందారు. ఓ మునీంద్రా! నీవడిన చింతామణీక్షేత్ర మహత్మ్యాన్నంతటినీ వివరించాను. ఏ మానువులు ఈ మహాత్మ్యాన్ని భక్తిశ్రద్ధలతో వింటారో వారుకూడా సద్గతిని పొందుతారు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'కదంబపురగత వర్ణనం' అనే 35-వ అధ్యాయం.



36

# గృత్సమదోపాఖ్యానం

## (మూలం)

## షట్త్రింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

శృతం గణేశతీర్థస్య మహాత్మ్యం కమలాసన ।
రుక్మాంగదస్య చరితం కౌండిన్య పురవాసినాం ॥ 1

**బ్రహ్మోవాచ :-**

తథాపి బ్రూహిమే బ్రహ్మన్ ముకుందాచరితం శుభం ।
గతే రుక్మాంగదే సాతు జజ్వాల మదనాగ్నినా ॥ 2

దావాగ్నినా యథా గ్రీష్మే మహా వనస్థలీసుత ।
ముకుందా నా లభచ్ఛర్మ వనే శీతల మారుతే ॥ 3

లతా పుష్పమయే స్థానే చంద్ర చందన తోపిచ ।
తస్యా నరోచతే హాస్యం గీతం నృత్యం కథాంతరం ॥ 4

అన్నం జలం విహ్వలాయాస్త చ్చిత్తాయా మునీశ్వర ।
క్షుత్తృట్ శ్రమేణ తస్యాస్తు క్షణంనిద్రాన మాయయా ॥ 5

తామింద్రోబుబుధే కాంతాం ప్రసుప్తాం విజనే వనే ।
కామాతురాం విహ్వలాంచ రుక్మాంగద కృతేసుత ॥ 6

ధృత్వా రౌక్మాంగదం రూపం బుభుజే కాముకాం తు తాం ।
అలిలింగ ముదాశక్రో ముకుందా జఘ్రాంషే భృశం ॥ 7

సాపి రుక్మాంగదం తంతు చుచుంబే సుభృశం సుత ।
సోపి తస్యాః కుచౌ పీనౌ మమర్ద దృఢముష్టినా 8

వ్యంశాకాం వ్యంశుకో రేమే నిశ్శంకం సతయా సహా ।
తతస్సా లజ్జమానేవ స్వగృహం ప్రత్యపద్యత ॥ 9

ఇంద్రో రుక్మాంగదో భూత స్తత్రైవాంతర్దధే సుత ।
మేనే రుక్మాంగదో భుక్త స్తతో గర్భందధౌ సుత ॥ 10

సుషువే నవమే మాసి సువేలాయాం సుతం శుభం ।
చారు సర్వా నవద్యాంగం రూపేణ మదనాతిగం ॥ 11

తస్య శబ్దేన మహతా ధరణ్యాం పతితస్యరతు
సనాదం దశదిగ్బ్బుంద మభూత్త్వం భూ రసాతలం ॥ 12

పక్షిణో బభ్రముస్సర్వే ఉడ్డీయోడ్డీయ సర్వతః ॥ 13

వాచక్నవి స్సమాయాతం స్తక్త్వ్యా స్వం నిత్యకర్మచ । 14

ముకుందా చరితంతేన నైవబుద్ధం కదాచన ।
జాతకర్మాదికం సర్వం చకార భృశహర్షితః ॥ 15

దదౌ దానం యథాశక్తి బ్రాహ్మణేభ్యో యథార్హతః ।
దశాహే తు వ్యతీతే స నామకర్మా కరోన్మునిః ॥ 16

గృత్సమదే త్యనుజ్ఞాతో జ్యోతిశ్శాస్త్ర పర్త్వైజైః ।
తతస్తు పంచమేజ్దేస్య వ్రతబంధం చకారహ ॥ 17

వేదవ్రతాని చత్వారి చకార షటుకస్యసః ।
సకృ న్నిగదమాత్రేణ గృహ్ణాతి బ్రహ్మతేజసా ॥ 18

వేద శాస్త్రనిధి ర్జాతః స్వకర్మ కుశలోపి చ ।
కదాచి త్సుముహూర్తే తా పితా వాచక్నవి స్సుతం ॥ 19

గణానాం త్వేతి ఋఙ్మంత్రం మహాంత ముపదిష్టవాన్ ।
ఉవాచచ మహామంత్రో వైదికాఖిల సిద్ధిదః ॥ 20

అగమోక్తేషు మంత్రేషు సర్వేషు శ్రేష్ఠ ఏవచ ।
ధ్యాత్వా గజాననం దేవం జపైనం స్థిరమానసః ॥ 21

వరాం సిద్ధిం సమాప్యైవ ఖ్యాతిం లోకే గమిష్యసి ।
తతో గృత్సమదో విప్రో మంత్రం ప్రాప్య పితుర్ముఖాత్ ॥ 22

అనుష్ఠానరతో భూత్వా జపధ్యాస పరోభవత్ । 23

ఏవం బహు తిథేకాలే గతేతు మునిపుంగవే ।
తస్మిన్ మగధదేశే యో రాజా మగధ పంజ్ఞితః ॥ 24

చారురూపో మహామానీ దానశూరో అరిమర్దనః ।
నానాలంకార శోభాఢ్యో మహార్హాసన సంశ్రితః ॥ 25

సుధర్మా సనగో ధీరః పురుహూత ఐవాపరః ।
చతురంగ బలోపేతో జ్ఞానీ పండితమానదః ॥ 26

అమాత్యౌ ద్వౌ జ్ఞాననిధీ వాచస్పత్యధికౌ గుణైః ।
అంబాకానామ భార్యాస్య చారురూపా గుణాధికా ॥ 27

పతివ్రతా మహాభాగా శాపానుగ్రహణే క్షమా ।
తస్యరాజ్ఞః పితుః శ్రాద్ధే సమాజగ్ము ర్మహర్షయః ॥ 28

రాజ్ఞాహూతా వశిష్ఠాత్రి ప్రముఖా శ్రుతిపారగాః ।
ఆకారితో గృత్సమద స్తపస్వీ శుచిమానసః । 29

తతః శాస్త్రప్రసంగేన ప్రౌఢిం గృత్సమదోవదత్ ।
తమత్రి ర్ధిగ్ధి గిత్యేవ మబ్రవీన్మునిసన్నిధౌ ॥ 30

తపస్వీతి భవాన్మాన్యో నముని స్త్వం యతస్తవ ॥ 31

జన్మ రుక్మాంగదాజ్జాతం రాజపుత్రా ద్విచారయ
న్మాస్మ త్సమక్షం పూజార్హ ఐతోగచ్ఛ స్వమాశ్రం ।
ఐతి అత్రివచనం శృత్వా క్రోధదీప్త ఇవజ్వలన్ ॥ 32

దహన్నివ త్రిలోకీం సః భక్షయన్నివ తాన్మునీన్ ।
అపరేత్య పలాయంత సింహం దృష్ట్వా యథామృగాః ॥ 33

ఉవాచ తత్ర సదసి వశిష్ఠాదీన్మునీన్ ప్రతి । 34

**గృత్సమద ఉవాచ :-**

యర్హి రుక్మాంగదస్యాహం న భవేయం మునీశ్వరాః ।
తదాశాపాగ్ని నాయుష్మాన్ కుర్మాం భస్మా నశేషితాన్ ॥ 35

**బ్రహ్మోవాచ :-**

ఇత్యుక్త్వా తాన్ మునీన్ సర్వాన్ ప్రయయౌ మాతరం ప్రతి ।
పప్రచ్ఛతాం గృత్సమదో వద దుష్టేతి కాముకే ॥ 36

ముకుందే వదమే తత్త్వం నోచేద్భస్మ భవిష్యసి ।
ఆకర్ణ్యైవం వచస్తస్య చ కంపే భ్రుశ విహ్వలా ॥ 37

ముకుందా మారుతేనేవ కదలీ కుట్మలాన్వితా ।
ఉవాచ దీనయా వాచా బద్ధాంజలిపుటా సతీ ॥ 38

**ముకుందోవాచ :-**

మృగయాసక్త చిత్తో భూద్రుష్టసార్ధో నృపోత్తమః ।
త్రైలోక్య సుభగో దృష్టో మయా రుక్మాంగద శ్శుభః ॥ 39

అనుస్మానరతె వాచక్నవౌ మే భర్తరిప్రియే ।
అనివార్యః స్త్రియ ఇతి స్మృత్వా వాక్యం విధీరితం । 40

తస్మిన్నృపే సక్తమనా జాతాస్మి నపితా తవ ।
శృత్వేత్థం వచనం తస్యాః మౌనవాన్ స మునిర్యయౌ ॥ 41

లజ్జయా అధోముఖః శాపమభ్యధాజ్జననీం ప్రతిపుత్ర ఉవాచ । 42

**పుత్ర ఉవాచ :-**

దుష్టే మూఢే పాపరతే కాననే కంటకేభవ ॥ 43

అసంఖ్యేయ ఫలాసర్వేః ప్రాణిభిః పరివర్జితా ।
సాపి శాపం దదౌ తస్మై క్రోధావిష్టో సుతాయ హి ॥ 44

జననీ త్వమనాదృత్య యతశ్శప్తా ఖలుత్వయా ।
అత శ్శపామి త్వాం పుత్ర త్వత్తః పుత్రోతి దారుణః ॥ 45

త్రైలోక్యభయదో దైత్యో భవిష్యతి మహాబలః ।
ఏవం శశపతు స్తౌతు మాతాపుత్రౌ పరస్పరం ॥ 46

**శుక ఉవాచ :-**

సా తదైవ శరీరం తత్త్యక్త్వాభూ ద్బదరీవనే ।
వర్జితా పక్షిసంఘాత్తై ర్వారజై రండజై రపి ॥ 47

తతోంతరిక్షే వాగాసీ దింద్రా ద్గుత్సమదో హ్యభూత్ ।
స్సతు గృత్సమదో బ్రహ్మన్ న్ననుష్ఠానాయ జగ్మివాన్ ॥ 48

ఇదం గృత్సమదాఖ్యానం యశ్శృణోతి నరోత్తమః ।
నససంకట మాప్నోతి వాంఛితం లభతే ఖిలం ॥ 49

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**గృత్సమదో పాఖ్యానం నామ**
**షట్త్రింశో అధ్యాయః**



# గృత్సమదోపాఖ్యానం

## 36-వ అధ్యాయము

ఆ తరువాత వ్యాసమునీంద్రుడిలా ప్రశ్నించాడు "ఓ చతురాననా! చింతామణి గణేశతీర్థ మహిమనంతటినీ చెప్పావు. కౌండిన్యపురవాసుల యొక్కా రుక్మాంగదునియొక్క చరిత్రలను వివరించావు. కాని విరహాంత రింతయైన వాచక్నవి మహర్షిపత్నియైన ముకుంద వృత్తాంతమేమిటో తెలియజేయ గోరతాను! అలా రుక్మాంగదుని శపించిన తరువాత ఆమె ఏమైంది? ఆ వివరం దయతో నాకు తెలియజేయవలసింది!"

ఈ మాటలకు చతుర్ముఖుడైన సృష్టికర్త యిలా బదులిచ్చాడు. "ఆ ప్రకారంగా శాపోపహతుడైన రుక్మాంగదుడు తనతో పొందును తిరస్కరించి వెళ్ళిపోయాక, అరణ్యంలో చెలరేగిన కార్చిచ్చుచేత అడవి మొత్తం దగ్ధమైపోయినట్లు, ఆ ఋషిపత్నియైన ముకుందకు తను మదనాగ్నిలో తప్తురాలవటంచేత అన్నపానాదులు ఎంతమాత్రం రుచించ లేదు. శైత్యోపచారములుగాని, నృత్యగీతాలుగాని ఆమెకు ఇసుమంతైనా

స్వాంతనను యివ్వలేకపోయాయి! ఆకలిదప్పికల బాధతో ఆమె సోషతో మూర్ఛిల్లింది! ఆ బడలికకూ, శ్రమకూ అలసి సొలసిపోయి, నిద్రించింది. అలా నిర్జనారణ్యంలో అత్యంత సౌందర్యవతి, లావణ్యవతియైన ఆ ఋషిపత్ని ఒంటరిగా నిద్రించటమూ, రుక్మాంగదుని పొందుకై కామా తురురాలై, వివశురాలై వుండటమూ చూసిన ఇంద్రుడు వెంటనే తాను రుక్మాంగదుని రూపం దాల్చివచ్చి కాముకురాలైన ఆమెతో కూడి సుఖించి రతిలో రమించాడు. ఆమెను చుంబనల (ముద్దుల) తోనూ, కౌగిలింతల తోనూ తృప్తిపరచి, సంతోషించాడు.

ఆ ఋషిపత్నికూడా ఆ సురాధిపతిని రుక్మాంగదుడిగానే భావించి శృంగారరసంలో ఓలలాడి పరవశించింది! ఆ సంగమం తరువాత తృప్తి రాలైన ఆమె చాలా సిగ్గుపడి తన యిల్లు చేరుకున్నది. ఇంద్రుడు కూడా తన నిజరూపం దాల్చి అంతర్ధానం చెందాడు.

ఆ ముకుంద రుక్మాంగదుడే తనతో రమించినాడని భావించి గర్భం ధరించింది! నవమాసాలు నిండాక ఒక శుభముహూర్తంలో శుభ ప్రదుడైన కుమారుణ్ణి కన్నది. లోకోత్తరమైన సౌందర్యవంతుడైన ఆ పిల్లవాడు భూపతనమవ్వగానే బ్రహ్మాండగోళాలు దశదిశలు దద్దరిల్లే టంతటి పెద్ద ధ్వని కలిగింది. ఆ ధ్వనిని విన్న పక్షులన్నీ భయపడి ఆకసంలోకి పైకెగిరినాయి. ఆ ధ్వనికి వాచక్నవి మహర్షికూడా తన నిత్యానుష్ఠానము వీడి ఆశ్రమం చేరుకున్నాడు. ఐతే తనభార్య చేసిన దుష్టచేష్టను ఏమాత్రం కనుక్కొనలేకపోయాడు. పుట్టినవాడు తన కుమారు డేనన్న భావంతో ఆ బాలుడికి జాతకర్మవంటి సంస్కారాలను యధావిధి గా జరిపించాడు. తన శక్త్యానుసారం బ్రాహ్మణులకు అనేక దానధర్మా

లను చేశాడు. పదకొండవరోజున ఆ బాలుడికి 'గృత్సమదుడు' అని నామకరణం చేశాడు. అతడికి ఐదవఏడు రాగానే ఉపనయన సంస్కారం జరిపాడు! ఆ వటువుచేత వేదవ్రతాలను యధావిధిగా చేయించాడు. అప్పుడు గురుకులవాసానికి వెళ్ళిన గృత్సమదుడు ఏకసంధాగ్రహిగానూ కేవల శ్రవణమాత్రంచేతనే సకల విద్యలనూ నేర్చుకొని, వాటిలో ప్రౌఢి మను సంపాదించాడు. వేదశాస్త్రాలలో నిధియై, స్వకర్మానుష్ఠానంలో కుశలుడైనాడు.

ఇలాఉండగా వాచక్నవి మహర్షి ఒకానొక శుభముహూర్తంలో తన కుమారుడైన గృత్సమదుడిని చేరబిలిచి "గణానాంత్వా" అనే ఋగ్మం త్రాన్ని ఉపదేశించి 'నాయనా! ఇది వైదికమంత్రాలన్నింటిలోకీ సర్వశ్రేష్ఠ మైనది. అన్ని సిద్ధులనూ అలవోకగా ప్రసాదిస్తుంది! కనుక ఓ కుమారా! దేవదేవుడైన గజాననుని ఈ మంత్రంతో ఏకమనస్సుతో నిశ్చలంగా ధ్యానించు! అలా చేస్తే సర్వోత్కృష్టమైన సిద్ధిని పొంది, ఈ లోకంలో తరగని కీర్తిని పొందగలవు!' అంటూ ఆశీర్వదించాడు.

అలా తండ్రినుండి పొందిన మంత్రాన్ని అత్యంత శ్రద్ధాభక్తులతో జపధ్యానములతో గృత్సమదుడు అనుష్టించాడు. ఇలా చాలాకాలం గడి చింది. నిరంతరం గణేశధ్యానతత్పరుడైన గృత్సమదుడు అచంచల భక్తి శ్రద్ధలతో గణేశుని ఆరాధించాడు. ఇలాఉండగా, ఒకానొక సమయంలో మగధరాజ్యాన్ని పరిపాలించే మగధుడనే రాజుయింట పితృశ్రాద్ధము సంప్రాప్తమైంది. ఆ రాజు ఎంతో ధార్మికుడు, అత్యంత సౌందర్యవంతుడై, మాన్యుడని తలవబడేవాడు. ఆ రాజుచేత ఆహ్వానించబడి వశిష్టుడు, అత్రి మొదలైన ప్రముఖ మహర్షులంతాకూడా అక్కడికి వచ్చారు. గృత్స

మదుడు కూడా రాజాహ్వానాన్ని అందుకుని ఆ రాజమందిరాన్ని చేరు కున్నాడు. అక్కడ అన్యోన్యమైన శాస్త్రచర్చలలో తన పాండిత్య ప్రకర్షచేత అందరినీ వాదములో ఓడించాడు. అప్పుడు అత్రిమహర్షి అతడిని చులకనచేసి మాట్లాడాడు.

'ఓయీ! నీవు తపస్వివని మాన్యత కల్పించామేకాని, నీవు మును. లలో గణింపతగినవాడివి కావు! ఎందుకంటే నీవు క్షత్రీయుడైన రుక్మాం గదుడివలన జన్మించావు! నీవు మాపంక్తిని కూర్చోతగవు! అవునో కాదో విచారణ జరుపుకొని నిర్ధారించుకో! నీవిక పైపై ఆర్భాటాలను చాలించి నీ ఆశ్రమానికి వెళ్ళటం మంచిది!''

ఈ మాటలకు తోకత్రొక్కిన పాములా లేచిన గృత్సమదుడు క్రోధోద్దీపితుడై 'ఓ మునీశ్వరులారా! మీరారోపించినట్లు నేను రుక్మాం గదుని కుమారుడను కానిపక్షంలో మిమ్మల్నందర్ని నా శాపాగ్నిలో భస్మం చేస్తాను!'' అంటూ విసవిసా తన ఆశ్రమాన్ని చేరుకుని తన తల్లినిలా నిలదీశాడు.

"ఓ పాపాత్మురాలా! నా జన్మకు కారకుడెవరో నిజంచెప్పు! నీ యొక్క బుద్ధిచాపల్యంవల్ల, శీలరాహిత్యంవల్ల కళంకితవైనావు! ఇప్పటికైనా నీవు నిజం చెప్పనిపక్షంలో నిన్ను నా తపోగ్నితో భస్మంచేస్తాను!'' అంటూ ఆగ్రహోదగ్రుడై నిప్పుల్నే చెరిగాడు!

ఆ మాటలకు శాపభయంతో గడగడలాడుతూ ఆ ముకుంద వివశురాలై 'మృగయాసక్తుడైన, అతి సౌందర్యోపేతుడైన రుక్మాంగదుని చూచి తాను మోహించాననీ, స్నానార్థం వాచక్నవి నదీతీరానికి వెళ్ళి నప్పుడు తానతని పొందుకోరానని, అందుచే అతడే నీ తండ్రియని'

గడగడలాడుతూ చెప్పింది. ఆ మాటలకు గృత్సమదుడు సిగ్గుతో చితికి పోయాడు కోపంతో వణికిపోతూ తల్లిని యిలా శపించాడు.

"నీవు నీ సౌందర్యాన్ని యెరగాచేసి ఉచితానుచితాలు మరచి పశువులా ప్రవర్తించావు. కనుక నీవు అడవిలో కంటకవృక్షము (ముళ్ళ చెట్టు) గా మారి అందరిచేత వదలివేయబడుదువు గాక!"

అప్పుడు ఆ ముకుందకూడా యిలా ప్రతిశాప మిచ్చింది.

"ఓ కుమారా! జన్మనిచ్చిన తల్లినని కూడా చూడకుండా నన్ను అనాదరించి శపించావు! కనుక నీకు త్రిలోకాలకూ కంటకుడైనవాడూ అతి దారుణమైనవాడూ, మహా బలపరాక్రమోపేతుడైన రాక్షసుడు కొడుకుగా జనించుగాక!"

ఇలా ఆ తల్లీకొడుకులిద్దరూ ఆగ్రహంతో ఒకరినొకరు శపించుకొన గానే — ఆ ముకుంద బదరికాశ్రమంలో ప్రాణులేవీ సంచరించని ప్రాంతంలో కంటకవృక్షమై (ముళ్ళచెట్టై) జన్మించింది. ఆ సమయంలో అశరీరవాణి ఆకాశంలోంచి 'ఇంద్రుని వలననే గృత్సమదుడు జన్మిం చాడు' అంటూ పలికింది. ఈ ప్రకారంగా అక్కడి అలజడిఅంతా సమసి పోయాక గృత్సమదుడు తన మంత్రానుష్టానానికి అరణ్యానికి వెళ్ళి పోయాడు. ఎవరైతే ఈ గృత్సమదోపాఖ్యానాన్ని శ్రద్ధతో వింటారో, పఠిస్తారో, అట్టివారు అన్ని సంకటములనుంచీ విడివడి, తమతమ మనోభీష్టాలను తప్పక పొందగలరు!" అంటూ చతుర్ముఖుడు వ్యాసమహర్షికి చెప్పాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'గృత్సమదోపాఖ్యానం' అనే 36-వ అధ్యాయం.

# 37

# వరదాఖ్యానం

## (మూలం)

## సప్త త్రింశో అధ్యాయః

**బ్రహ్మా ఉవాచ :-**

భ్రమన్మని ర్దదశాఽగ్రే వనం పుష్పక సంజ్ఞితం ।
నానాద్రుమ లతాకీర్ణం పుష్పప్రకర శోభితం ॥ 1

శోభితం నిర్ఝరజలై నిర్ఝరై ర్మునిసత్తమైః ।
ననానుతాన్ గృత్సమదోస్య వసచ్చ తదాజ్ఞయా ॥ 2

తత్రస్నాత్వా జపంచక్రే పాదాంగుష్టాగ్ర ధిష్టితః ।
స్థిరేణమనసా ధ్యాయన్ దేవం విఘ్నేశ్వరం విభుం ॥ 3

నాసాగ్రస్యస్త దృష్టి స్సన్నిరీక్షన్న దిశోదశ ।
జితేంద్రియో జితశ్వాసో జితాత్మా మారుతాశనః ॥ 4

దివ్య వర్షసరహస్రం స తపస్తేపే సుదారుణం ।
ఉన్మీల్య నయనం పశ్యద్యదా గృత్సమదో మునిః ॥ 5

తదా నేత్రోద్భతో వహ్నిః త్రిదాశాన్సర్యతాపయత్ ।
శశంకిరే తదాదేవాన్ కస్యాయం పదభాగ్భవేత్ ॥ 6

అపరం గలితం పత్రం భక్షయన్నేకమేవచ ।
యత్నమాస్థాయ పరమం స్థాణుభూతో అతినిశ్చలః । 7

దశపంచ సహస్రాణి తేపే నిశ్చలమానసః ।
తతో వినాయకో దృష్ట్వా తపనం తస్య దుర్ఘటం 8

అనుగ్రహాయ తస్యాథ ప్రాదురాసీ త్సుదీప్తిమాన్ ।
యధా ధేనుర్వత్సరవం శృత్వా ధావతి సత్వరం ॥ 9

తధా వినాయకో దేవః శీఘ్రం గృత్సమదం యయౌ
భాసయంస్తేజసా విశ్వం సహస్రరవి సన్నిభః । 10

చలత్కర్ణతాలో బృహద్దంతివీలో ముదాచారుఖేలో లసచ్చంద్రభాలః ।
బృహత్పద్మమాలో జగత్కార్యమూలః కరే కంజనాళో నమత్సేవిమేలః । 11

సింహారూఢో దశభుజో వ్యాల యజ్ఞోపవీతవాన్
కుంకుమాగరు కస్తూరీ చారు చందన చర్చితః 12

సిద్ధి బుద్ధి యుతశ్రీమాన్ కోటిసూర్యాధిక ద్యుతిః
అనిర్వాచ్య స్వరూపోపి లీలయా సీత్ పురోమునైః ॥ 13

తత్తేజసా హితం తేజో మునైస్తస్య మహాత్మనః ।
బ్రధ్నస్య తేజసా యద్వన్నాక్షత్రం చాంద్రజం మహిః । 14

నిమీల్య నయనే సోథ చకంపే భృశవిహ్వాలః ।
బ్రధ్నస్య తేజసాయద్వన్నా క్షత్రం చాంద్రజం మహిః ॥ 15

నిమీల్య నయనే సోథ చకంపే భృశవిహ్వాలః ।
పపాత మూర్చితో భూమౌ విస్మృత ధ్యానమంగళం 16

పునశ్చ మనసా ధ్యాయన్ గజానన మనామయం ।
మనసా తర్కయన్విఘ్న నిమిత్తం వ్యాకులోమునిః ॥ 17

కిమేతత్ క్షోభజననం సహసా సముపస్థితం ।
అద్యప్రభృతి యత్తప్తం తత్కధం మే వృధాగతం ॥ 18

పాహి దేవేశ సర్వాత్మన్ విఘ్నా దస్మాద్భయానకాన్ । 19

త్వామృతే శరణం యామి కమన్యం జగదీశ్వరం:
మహద్దుఃఖం సదా దేవ ప్రాప్తంకేనచ హేతునా
నాస్మత్సక్తా పూజనీయ ఇతి యత్ దహతే మనః । 20

**బ్రహ్మోవాచ :-**

ఇతి తద్గదితం శృత్వా జగాద స వినాయకః । 21

**గణేశ ఉవాచ :-**

అనుగ్రహాయ సంప్రాప్తం విద్ధి మాం గణనాయకం । 22

సనకాదిభి రప్రాప్యం చిరం నియమమాస్థితైః
త్యక్త్వాభయం బ్రూహీ యత్తే వాంఛితం మునిసత్తమ ॥ 23

ఏకాంగుష్ఠేన తపసా తోషితోహం త్వయానిశం । 24

బ్రహ్మోవాచ :-

నిశమ్యేద్ధం వచస్తస్య దేవదేవస్య శోభనం 25

దండవత్ప్రణనామైనం నిజానంద పరిప్లుతం ।
ఉవాచ పరమప్రీతో వరదం తం వినాయకం ॥ 26

గృత్సమద ఉవాచ :-

అద్యమే సఫలం జన్మ తపసో నియమస్యచ ।
అఖండానంద రూపోయో బ్రహ్మ భూయోనిరాకృతిః ॥ 27

ముంచన్నశ్రూణి నేత్రాభ్యాం ఆనందేన ననర్తచ ।
చిదానందఘనో వేదశాస్త్రాణా మప్యగోచరః ॥ 28

సద్యో దృష్టో మయాసాక్షాత్ కిం ప్రార్థయే విభో ।
తవాజ్ఞయా తథాప్యేకం ప్రార్థయే ద్విరదానన ॥ 29

చతురాశీ తిల క్షాసు యోనిషు శ్రేష్ఠతాసుచ ।
మనుష్యాణాం మహాభాగ వర్ణాస్తత్ర మహత్తరాః ॥ 30

తత్రాపి బ్రాహ్మణాః శేష్ఠా స్తత్రాపి జ్ఞానినః పరాః ।
జ్ఞాని ష్వనుష్ఠాన పరాస్తేషుచ బ్రహ్మవేదినః । 31

నవ భక్తేషు సర్వేషు శేష్ఠతాంచ గజానన ।
అన్యంచైకం వరంయాచే తంచ మే దేహి శంకర ॥ 32

తవభక్త్యైక నిలయం త్రైలోక్యాకర్షణ క్షమం ।
విఖ్యాతం త్రిషులోకేషు నమస్యం సురమానుషైః । 33

ఏవం మాం కురు విఘ్నేశ యదితుష్టో ఖిలార్థకృత్ ।
వనంచ పుష్పకంనామ్నా ఖ్యాతిం యాతు సురేశ్వర ॥ 34

అస్మిన్ స్థిత్వాచ భక్తానాం కామాన్పూరయ నిత్యదా । 35

ఇదంచ పుష్పకపురం చతుర్దిక్షు విశేషతః । 36

గణేశపురమిత్యేవం ప్రథాం యాతు గజానన । 37

**బ్రహ్మోవాచ :-**

ఇతి తద్వచనం శ్రుత్వా జగాద ద్విరదాననః ॥ 38

**గణేశ ఉవాచ :-**

సాధు సాధు మహాబాహో ప్రసన్నే మయిదుర్లభం ।
భక్తానాం త్రిషులోకేషు నకించిన్మునిపుంగవ ॥ 39

త్వయా యత్ప్రార్థితం విప్ర తత్తేసర్వం భవిష్యతి ।
విప్రత్వం దుర్లభతరం ప్రసన్నేన మయార్పితం । 40

గణానాంత్వేతి మంత్రస్య వైదికస్య యత్వస్త్వయా
జపః క్రతో మునేఽతస్త్వమృషిరస్య భవిష్యసి ।
బ్రహ్మాదిషుచ దేవేషు వశిష్ఠాది మునిష్వపి
ఖ్యాతిం యాస్యసి సర్వత్ర పరం శ్రైష్ఠ్య ముపాగతః ॥ 41

సర్వేషుఆరబ్ధ కార్యేషు పూర్వంతే మమచాపరం
స్మరణం యే కరిష్యంతి తేషాం సిద్ధిర్భవిష్యతి ॥ 42

ఋతేజ్ఞానా ద్దైవతర్షి చందసాం కర్మనిష్ఫలం ।
పుత్రశ్చ బలవాన్ సర్వదేవానాం సుభయంకరః ॥ 43

భవిష్యతి మహాఖ్యాతిం త్రిషులోకేషు యాస్యతి ।
అజేయ్యస్సర్వదేవానాం వినారుద్రం భవిభ్యతి । 44

మద్భక్తో మద్గతప్రాణో మన్నిష్ఠో మత్పరాయణ ః ।
ఇదంచ నగరం దేవయుగే పుష్పక సంజ్ఞితం । 45

త్రేతాయాం మణిపూరంచ భావకం ద్వాపరేఽపిచ ।
కలౌతు భద్రకంనామ ఖ్యాతం లోకే భవిష్యతి । 46

అత్రస్నానేన దానేన సర్వాన్కామాన వాప్నుయాత్ । 47

**బ్రహ్మోవాచ :-**

ఏవం దత్వా వరాం స్తస్మై తత్రైవాంతర్దధే విభుః । 48

తస్మిన్నంతర్హితే తత్ర స్థాపయామాస వై మునిః ।
గణేశమూర్తి ప్రాసాదం కారయామాస సుందరం ॥ 49

వరదేతి చ తన్నామ స్థాపయామాస శాశ్వతం ।
సిద్ధిస్థానంచ తత్రత్రైవ గద్గణేశస్య ప్రసాదతః ॥ 50

కామాన్పుష్ణాతి సర్వేషాం పుష్పకం క్షేత్రమిత్యపి ।
పూజయామాస తం మూర్తిం భక్తి భావసమన్వితః ॥ 51

ఇమాం కథాం యశ్శృణుయా న్మునీంద్ర । 52

శ్రీ విఘ్నరాజస్య వరప్రదానం లభేత్సకామా నఖిలాన్ గణేశ ।
భక్తిం దృఢాం సంసృతి మోచనీంచ ॥ 53

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే వరదాఖ్యానంనామ**
**సప్త త్రింశో అధ్యాయః**



# వరదాఖ్యానం
## 37-వ అధ్యాయము

బ్రహ్మ ఆ తరువాతి కథను యిలా కొనసాగించాడు :

'ఓ వ్యాసమునీంద్రా! అలా అనుష్ఠానానికని వెళ్ళిన గృత్సమదుడు తపమాచరించటానికి తగిన ప్రదేశాన్ని అన్వేషిస్తూ అరణ్యాలగుండా వెళ్ళ సాగాడు. ఒకచోట పుష్పకమనే అతి రమణీయమైన వనాన్ని కనుగొన్నాడు.

అనేక వృక్షాలతోటీ, లతలతోటి శోభితమై, గలగలా ప్రవహించే సెలయేళ్ళతో, అతి ప్రశాంతంగా ఉన్న ఆ వనంలో ప్రవేశించి ఆ ప్రదే శంలో విహరించే దేవతాగణాల అనుమతిని పొంది, అక్కడ నివాస మేర్పరుచుకుని, కాలి బొటనవ్రేలిపైన నిలచి అనన్యమైన ఏకాగ్రభక్తితో తన శ్వాసనుసైతం నిరోధించి, కేవలం వాయువును భక్షిస్తూ అలా వేయి సంవత్సరాలకాలం ఘోరమైన తపస్సును ఆచరించాడు. ఆ తపస్సు యొక్క తీవ్రతకు తపోగ్నిజ్వాలలు వెలువడి దేవతలను తపింపచేశాయి!

అలా — మరికొంతకాలం 'రాలిన ఒక్కో ఆకునూ ఆహారంగా స్వీకరిస్తూ' ధృఢప్రయత్నంతో ధ్యానంచేస్తూండగా — మరో పదిహేనువేల సంవత్స రాలు గడిచాయి!

అటువంటి దారుణమైన తపస్సును చూసి అతడిని అనుగ్రహించ టానికని వినాయకుడు తేజోరూపంగా ఆవిర్భవించాడు! లేగదూడ పిలుపు విన్న గోమాతలా, అలా గృత్సమదుని సన్నిధికి గజాననుడు చేరుకున్నాడు. తన కిరణాలతో దిగంతాలలోని చీకట్లను పారద్రోలే సూర్యునిలా, అద్భుతమైన తేజఃపుంజముతో, అతని ఎదుట ప్రత్యక్ష మయ్యాడు. ఆ దివ్యమైన రూపం ఎలావున్నదంటే — చేటలవంటి చెవులు చలిస్తూండగా, మదించిన ఎనుగులా, ఏకదంతాన్ని ధరించి, తొండమును విలాసంగా యిటూ అటూ విసరుతూ, శిరస్సున చంద్ర కళను ధరించి, కంఠాన పద్మముల మాలతో, చేతిలో తామరతూడును ధరించి, సింహవాహనారూఢుడైన ఆ స్వామి పదిచేతులతోనూ కుంకుమ, అంగరు, కస్తూరి కలిపిన గంధముతో పూయబడిన దివ్యదేహంతో, సర్పయజ్ఞోపవీతాన్ని దాల్చి, సిద్ధి, బుద్ధి యనే భార్యలు చెరోప్రక్కగా ఉండగా, ఇది అని నిర్వచించలేని అనిర్వాచ్య స్వరూపుడై యుండి కూడా భక్తకోటులను అనుగ్రహించేందుకై లీలగా సగుణస్వరూపమును దాల్చి ఆ గృత్సమదుని ఎదుట సాక్షాత్కరించాడు! అప్పుడు అపారమైన తపస్సుతో వెలిగే ఆ ముని తేజస్సు, గణేశుని ఎదుట వెలాతెలా పోయింది! ఆ దర్శనానికి దిగ్భ్రమచెందిన గృత్సమదుడు భయచకితుడై — ఇది ఏదో విఘ్నం కాబోలునని మూర్ఛిల్లాడు! అప్పుడు తేరుకొని మనస్సులోనే గణేశుడిని యిలా ప్రార్థించసాగాడు.

"ఓ దేవదేవుడవైన విఘ్నేశా! నా తపస్సుకి ఇట్టి విఘ్నం ఎలా కలిగింది? నన్ను ఈ మహావిఘ్నమునుండి వెంటనే రక్షించు! ఏకారణం చేత నా తపస్సుకిట్టి మహాదుఃఖము సంప్రాప్తించింది? నిన్ను వినా యింకెవరిని శరణుకోరను? 'నీవు మా పంక్తిలో కూర్చొనేందుకూ, పూజార్హుడవుకావు!' అంటూ అత్రి మహాముని తిరస్కారంతో పలికిన మాట ముల్లులా నా హృదయంలో గుచ్చుకుని బాధిస్తున్నది! ఈ సంకటం నుంచి ఇక గడిచి గట్టెక్కేదెలాగు?"

'ఓ వ్యాసమునీంద్రా! ఇలా మనస్సులో పరిపరివిధాల తర్కించుకుంటూ వ్యధచెందుతున్న గృత్సమదునితో సర్వజ్ఞుడైన గజాననుడిలా అన్నాడు.

"నాయనా! నీవు నా భక్తులందరిలోకీ అగ్రస్థానంలో వున్నావు! నిన్ననుగ్రహించదలచి వచ్చిన నీ ఇష్టదైవాన్ని, వరమీయవచ్చిన వేల్పును — గజాననుడిని నేనేనయ్యా! ఎంతో తపోనిష్ఠాగరిష్ఠులైన సనకాదులకు సైతం దర్శన దుర్లభమైన ఈ నా స్వరూపాన్ని నీయందుగల ప్రత్యేక అనుగ్రహంగా కనబరిచాను! కనుక నీవు సకలమైనట్టి భయసంకోచాలనూ వీడి నీ మనోభీష్టాన్ని తెలుపు! నీవు కేవలం పాదాంగుష్ఠముపై నిలచి చేసిన తపస్సు నాకెంతో సంతోషాన్నిచ్చింది!"

ఓ కృష్ణద్వైపాయనా! ఆ గణేశుని అనుగ్రహవచనాలను విన్న గత్సమదుడు సంతుష్టాంతరంగుడై, సంతోషంతో పులకాంకితుడై, భక్తిమీర సాష్టాంగ నమస్కారమును ఆచరించి ఆ వరదగజాననుడితో యిలా అన్నాడు :

"ఓ పరమానుగ్రహమూర్తీ! వరదవిఘ్నేశా! నీ అమోఘసాక్షాత్కారం చేత నాజన్మ, నాతపస్సు, నియమాలు సఫలమైనాయి! అఖండమైన ఆనందమే స్వరూపమైనవాడవు! పరబ్రహ్మవు! నిరాకారుడవు! లీలార్థమై స్వరూపం ధరించి భక్తావళిని అనుగ్రహించే ప్రేమైకమూర్తివి!" అంటూ గొంతు గద్గదమవగా, భావాతిరేకంతో ఆనందపరవశుడై 'చిదానంద ఘనుడు, వేదశాస్త్రాలచేత కనుగొనబడేవాడు ఐన పరమాత్మ నేడు నాకు సాక్షాత్కరించాడు! ఇక నేనేమి కోరుకోనా?' అంటూ మరింత భక్తి పెల్లుబికి రాగా ఆనందభాష్పాలు కన్నులనుంచి జాలువారగా

"ఓ కరుణాసింధో! నీ అనుగ్రహం అపారమైనది! భవసాగరాన్ని తరింపచేయటానికి తారకుడివి! ఐనాప్రభూ! ఎనభైనాల్గులక్షల జీవ రాసులలో మనుష్యుడు ముఖ్యుడు! అందులోని చతుర్వర్ణాలలోనూ బ్రాహ్మణజన్మ, బ్రాహ్మణులలోనూ జ్ఞానులు, వారిలోనూ అనుష్ఠాన పరులూ అట్టి అనుష్ఠానపరులలో బ్రహ్మవేత్తలూ శ్రేష్ఠులు! అందుచే ఓ పరమేశ్వరా! అట్టి బ్రహ్మజ్ఞానాన్ని నాకు అనుగ్రహించు! నీయందు ధృఢభక్తినీ, ఎన్నటికీ మరువని అనన్యచిత్తాన్నీ నాకు ప్రసాదించు!! నిన్ను ఆరాధించే భక్తులలోకెల్లా, నాకు శ్రేష్టత్వాన్ని యివ్వు!

ముల్లోకాలలో అందరిచేతా కొనియాడబడే ప్రఖ్యాతినీ, నమస్కార యోగ్యతనూ నాకు కలుగజేయి! ఈ తపోభూమి పుష్పకమనే పేర ప్రఖ్యాతమవుగాక! ఓదేవా! నీవిక్కడనే అనుగ్రహమూర్తివై వెలసి సదా నీ భక్తుల మనోభీష్టాలను నెరవేర్చు! ఈ పుష్పకపురము నేటినుండీ నీపేర గణేశపురమని ప్రసిద్ధిచెందుగాక!"

అంటూ పునః పునః సాష్టాంగ నమస్కారములు చేశాడు! అప్పుడు దరహాసంచిందే మోముతో ఆ విఘ్నపతి యిలా వరమిచ్చాడు :

"ఓ మునిశ్రేష్ఠా! నా అనుగ్రహం పొందిన భక్తులకు ఈ ముల్లో కాలలోనూ అసాధ్యమేమీలేదు! ఓ బ్రాహ్మణోత్తమా! నీ మనోభీష్టము యధాతధంగా తప్పక నెరవేరగలదు! దుర్లభతరమైన బ్రాహ్మణత్వాన్ని నీకు అనుగ్రహించాను. నీవు 'గణానాంత్వా' అన్న ఋగ్మంత్రాన్ని జపించావు గనుక ఆ 'మంత్రానికి నీవే ఋషి'వి కాగలవు! బ్రహ్మాది దేవగణాలలోనూ, వశిష్టాది మునిగణాలలోనూ నీవు పరమోత్కృష్టత్వం పొందగలవు. కార్యార్థులైన సర్వులూ — యికనుంచి సకల కార్యారంభ ములలోనూ ముందుగా నిన్ను స్మరించాకనే, నన్ను స్మరింతురుగాక! ఈరకంగా చేసినవారికి సకల కార్యాలూ సిద్ధించగలవు! **ఋషి, దేవతా ఛందస్సులను ఎరుగని దేవతాకార్యాలేవీ ఫలితాన్నివ్వవు!**

సకల దేవతలకు భయాన్ని గొలిపేవాడూ, ముల్లోకాలలోనూ విఖ్యాతుడైన మహా పరాక్రమవంతుడైన పుత్రుడు నీకు జన్మిస్తాడు! రుద్రుడుతప్ప అతడు ఎవరివల్లా జయింపబడని శక్తిసంపన్నుడు! నాయందు అనన్యభక్తి గలవాడౌతాడు!

నీవు తపమాచరించిన ఈ వనము కృతయుగంలో 'పుష్పక'మనీ, త్రేతాయుగంలో 'మణిపుర'మనీ, ద్వాపరయుగములో 'భానక'మనీ కలి యుగంలో 'భద్రక'మన్న పేర్లతో విఖ్యాతమౌతుంది! ఇచట స్నానాదికాలు చేయటంవల్ల సర్వులకూ సకల మనోభీష్టాలు సిద్ధించగలవు."

"ఓ వ్యాసమునీంద్రా! ఇట్లా వరదుడైన గజవదనుడు ఆ మునికి

విశేష వరాలను దయతో అనుగ్రహించి అంతర్హితుడైనాడు. ఆ తరువాత అక్కడ ఒక చక్కని గణేశప్రాసాదాన్ని నిర్మించి, అక్కడ 'వరదగణపతి' మూర్తిని ప్రతిష్టచేశాడు గృత్సమదుడు. గణేశుని అనుగ్రహంవల్ల దీనికి **'సిద్ధిస్థానము'** అన్న ఖ్యాతి గల్గింది! అప్పుడాముని భక్తిభావసమన్వితుడై, ఆ వరదగణపతిని చక్కగా పూజించాడు!

"ఓ మునీంద్రా! విఘ్నరాజుయొక్క ఈ వరదాఖ్యానాన్ని ఎవరైతే వింటారో, పఠిస్తారో, అట్టివారు సకలాభీష్టాలనూ పొంది గణేశానుగ్రహం వల్ల మోక్షం పొందగలరు!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'వరదాఖ్యానం' అనే 37-వ అధ్యాయం.



38

# వరప్రదానం

(మూలం)

## అష్టస్త్రింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

తతో గృత్సమదస్యాసీ త్కథం వృత్తిః సురేశ్వర ।
తన్మమాచక్ష్వ యత్నేన శ్రద్ధధానస్య పద్మజ ॥ 1

**బ్రహ్మోవాచ :-**

తతః సర్వేమునిగణా మానయామాసు రాదరాత్ ।
బ్రహ్మ న్మునివరశ్రేష్ఠం నేముర్గృత్సమదం చతం ॥ 2

వరదానా ద్గణేశస్య వవృస్తం యజ్ఞకర్మణి ।
సర్వారంభే గణేశస్య పూజనాదౌచ సస్మరుః ॥ 3

ఏవం విఖ్యాతి మగమ త్స మునిర్గణాయకే ।
భక్తించ పరమాంచక్రే జపన్మంత్రం సునిశ్చలః ॥ 4

కదాచిత్సముని ర్వ్యాపశ చుక్షువే బలముత్తరం ।
దిశో నభశ్చ పృధివీం నాదయన్ గిరిగహ్వరాన్ ॥ 5

అపశ్యత్పురతో యావత్ తావద్బాలం భయంకరం ।
రక్తవర్ణం మహానాదం జపాకుసుమ సన్నిభం ॥ 6

తేజోరాశించ ముష్ణంతం నేత్రాలోక పధం ముహుః ।
దృష్ట్వా స తాదృశం బాలం చకంపే భయవిహ్వలః ॥ 7

తర్కయామాస మనసా విఘ్నఃకోయ మిహాగతః ।
నజానే గణనాధేన దత్తః పుత్రో మహాద్భుతః ॥ 8

పశ్యతిస్మ పునస్సోముం చారు వక్త్రం సులోచనం । 9

చారు రుక్మాంగదం చారు ముకుటం చారు నూపురం । 10

చారుణా కటిసూత్రేణ రాజత్కటితటం సుతం ।
పప్రచ్ఛ తం మునిః కోపి కస్యాసి కించికీర్షసి । 11

క్వచతే పితరౌ స్థానం వద తేజోనిధేర్భక । 12

**క ఉవాచ :-**

శ్రుత్వేత్థం వచనం తస్య జగాద బాలకో మునిం ॥ 13

బాలక ఉవాచ :-

భూత భావి భవజ్ఞానీ కింమాం త్వం పరివృచ్ఛసి ।
తథాప్యా జ్ఞావశో వచ్మి శ్రుతాతవ జనిర్మమ ॥ 14

త్వమేవ జనకో మాతా కృపాంకురు మమోపరి ।
పాలయస్వ పితర్మాంత్వం దినాని కతిచిన్మనే ॥ 15

త్రైలోక్యాక్రమణే శక్తో దేవేన్ద్రాం వశవర్తినం ।
కరిష్యామినసందేహో వీక్ష్యసే పౌరుషం మమ ॥ 16

బ్రహ్మోవాచ :-

ఇత్యాకర్ణ్య వచస్తస్య భయహర్ష సమన్వితః ।
ఉవాచ శ్లక్ష్ణయావాచా మునిర్ధృత్సమదో వచః ॥ 17

యద్యయం జాతమాత్రోపి శక్తస్త్రైలోక్య కర్మణే
తస్మాదస్య ప్రదాస్యామి స్వం మంత్రం స్వాత్మజస్యహి ॥ 18

యేనాస్య వాంఛితం దేవః పరితుష్టో వినాయకః ।
ప్రదాస్యతి జగన్నాథో మమకీర్తి ర్భవిష్యతి ॥ 19

ఏవం సంచిత్య మనసా తస్మై స్వం మంత్రమాదిశత్ ।
గణానాంత్వేతి తం చాహ కుర్వనుష్ఠానమాదరాత్ ॥ 20

జపస్వ వైదికం మంత్రం చిత్తం స్థాప్య గజాననే
సంతుష్టస్తే యదాపుత్ర సర్వాన్కామాన్ ప్రదాస్యతి । 21

ఏవంప్రాప్త మహామంత్రో జగామ తపసే వనం ।
ఏకాంగుష్ఠేనా వతస్థే నిరాహారో జితేంద్రియః ॥ 22

ధ్యాయన్గజాననందేవం మనసా నిశ్చలేతేన సః । 23

జపతన్తస్య వర్షాణి సార్ధాయుత మితానిచ ।
గతాని తస్య । ముఖతో బభూవాగ్ని ర్దిశోజ్వలన్ ॥ 24

భయం బభూవ దేవానాం దైత్యానాం తలవాసినాం ॥ 25

తతస్త త్తపసా తుష్ట ఆవిరాసీ ద్గజాననః ।
దిశో వితిమిరాః కుర్వన్ ఛాదయన్ భానుమండలం ॥ 26

భ్రామయన్ పుష్కరం చారు సువిషాణం ముదాయుతః ।
తద్బృంహితరవం శృత్వా బాలకో విహ్వలన్నివ ॥ 27

ఉన్మీల్య నేత్రే సోపశ్య ద్దేవం తం పురతస్థితం ।
చతుర్భుజం మహాకాయం నానాభూషా విభూషితం ॥ 28

పరశుం కమలం మాలాం మోదకాన్బిభ్రతం కరైః ।
తేజసా ధర్షిత స్తస్య ధైర్యం కృతాననామసః ॥ 29

బద్ధాంజలిపుటో భూత్వా ప్రార్థయామాస తం విభుం । 30

బాలక ఉవాచ :-

కిం మాం ధర్షయసే దేవభక్తం త్వాం శరణాగతం
భవ సౌమ్యతరో దేవ దేహిమేఽఖిలవాంచితం । 31

బ్రహ్మోవాచ :-

ఇత్యాకర్ణ్య వచస్తస్య సం జహార స్వకంమహః ।
ఉవాచ పరమప్రీతో సావధానో భవార్భక । 32

యంధ్యాయసి దివారాత్రౌ సోహంతే వరదోధునా
మమేదం పరమం రూపం స్వప్రకాశం జగన్మయం ॥ 33

నవిదు ర్బహ్మరుద్రాద్యాః కుతోవేత్స్యంతి మానవాః । 34

దేవాశ్చ మునయస్సర్వే నచ రాజర్షయో అపరే ।
నాసురా సిద్ధగంధర్వా ననాగా నచ దానవాః 35

సోహం తప తపోబద్ధో వరం దాతు మిహాగతః ।
వరయస్వ వరాన్మత్తో యాన్ త్వం మనసేచ్ఛతి 36

స ఉవాచ తతోబాలో ధన్యోహం తవదర్శనాత్
పితాధన్యతరోమేద్య సార్థకం జన్మమే తవః । 37

స్తుతిం కర్తుంనజానామి బాలభావాత్సురేశ్వర
యతస్తం సర్వజగతాం కర్తా పాతాపహారకః 38



డుంఢి గణపతి

త్వద్భాసా భాసయత్యేష రవిరగ్నిశ్చ చంద్రమాః ।
చరాచరం చేతయసే స్వ మహాత్మ్యా న్మహామతే ॥ 39

మహిమానం మహాంతంతే కేశా అపి నవైవిదుః ।
యదిమే వరదోసిత్వం తన్మేదేహి గజానన ॥ 40

త్రైలోక్యాకర్షణే శక్తిం విశిష్టాం దేహిమే విభో ।
దేవదానవ గంధర్వా మనుష్యోరగ రాక్షసాః ॥ 41

వశ్యామమ సదా సంతు ముని కిన్నర చారణాః ।
మనసా చింతితం యన్మేతత్త త్సిధ్యతు సర్వదా ॥ 42

ఇంద్రాదయో లోకపాలాః సేవాం కుర్వంతుమే సదా ।
ఇహ భోగాననేకాన్మే ముక్తిం చాంతే ప్రయచ్ఛచ ॥ 43

అన్యం చ తే వరం యాచే పురమేతత్త వాజ్ఞయా ।
ప్రథాం యాతు యతశ్చాత్ర తప్తముగ్రం తపోమయా ॥ 44

గణేశపురమితి చ ఖ్యాతింయాతు జనేష్టదం । 45

**గణేశ ఉవాచ :-**

త్రయాణామపి లోకానాం ఆక్రమం త్వం కరిష్యసి ॥ 46

సర్వేభ్యోన భయంతేస్తి సర్వే వశ్యాశ్చతే సదా ।
ఆయసం కాంచనం రౌప్యం మయాదత్తం పురత్రయం ॥ 47

అభేద్యం సర్వదేవానాం కామగం శంకరం వినా ।
త్రిపురేతిచ తేనామ ఖ్యాతింలోకే గమిష్యతి ॥ 48

యద్వైకేనచ బాణే శివోభేత్స్యతి తేపురం తద్వైవ ।
యస్యాసే ముక్తిం నాత్రకార్యా విచారణా ॥ 49

అన్యత్రే వాంఛితం సర్వం యత్ప్రసాదా ద్భవిష్యతి । 50

**బ్రహ్మోవాచ :-**

దత్వేద్ధం స వరాన్ దేవ స్తత్రైవాంతర్దధే విభుః ।
విషాదమగమద్దేవ వియోగా త్రిపురాసురః ॥ 51

హర్షం చ విపులం లేభే వరాన్ ప్రాప్య యథేప్సితాన్ ।
త్రైలోక్య విజయం కర్తుం యతతేస్మ తతోబలాత్ ॥ 52

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**వరప్రదానం నామ అష్ట త్రింశో అధ్యాయః**



# వరప్రదానం
## 38-వ అధ్యాయము

అనంతరం వ్యాసమునీంద్రుడిలా ప్రశ్నించాడు "ఓ పద్మసంభవా! ఆ తరువాత జరిగిన గృత్సమదుని వృత్తాంతమును తెలుసుకొన గోరు తున్నాను. నాకు చెప్పవలసింది!" అంటు వేడిన వ్యాసమహర్షితో బ్రహ్మ యిలాఅన్నాడు.

"ఓ వ్యాసమునీంద్రా! అప్పుడు సకల మునిగణాలు గృత్సమదుని గౌరవించి నమస్కరించారు. అప్పటినుంచీ సకల కార్యారంభములలోనూ చేసే గణపతి పూజలో ముందుగా ఆ మునికే నమస్కరించసాగారు. ఈరీతిగా ఎంతో ప్రఖ్యాతిని గాంచిన గృత్సమదుడు సునిశ్చితభక్తితో ఏకాగ్రచిత్తంతో గణేశునే ధ్యానిస్తూ ఉత్కృష్ట భక్తిని పొందాడు! ఇలా ఉండగా ఒకానొక సమయంలో పెద్దధ్వని అయేలా ఆ ముని తుమ్మి నాడు. ఆ తుమ్ముధ్వనికి పర్వతగుహలు అదిరిపడ్డాయి. క్షణంలో తన

ఎదుట ఒక బాలకుడు కనిపించాడు. ఎఱ్ఱని దేహకాంతిని కలిగి పెద్ద ధ్వనినిచేస్తూ తేజోరాశితో కళ్ళు మిరుమిట్లు గొల్పుతూన్న ఆ బాలకుని చూసి భయంతో గృత్సమదముని గడగడావణికాడు.

'ఆహా! ఇదియేమి విపత్తు? ఈ పుత్రుడు గజాననునిచే యివ్వ బడినాడా ఏమి?' అనుకుంటూ తిరిగి తేరిపార ఆ పిల్లవానివంక చూడగా — సౌందర్యోపేతమైన ముఖారవిందంతో, పద్మరేకులవంటి విశాల నేత్రా లను కలిగి, బంగారు భుజకీర్తులతో, బాహుపురులు, దివ్యమైన కిరీ టము, పాదాలంకారాలనూ కలిగి, కటిప్రదేశంలో బంగారు మొలత్రాటిని ధరించి, నవమన్మధుడిలా ఉన్న ఆ బాలకుణ్ణి చూసిన ముని యిలా ప్రశ్నించాడు :

"ఓ బాలకా! నీవెవరవు? ఎవ్వరివాడవు? ఏంచేయడానికి వచ్చావు? నీ తలిదండ్రులెక్కడుంటారు?" ఆ మాటలకు ఆ బాలకుడిలా బదు లిచ్చాడు :

"త్రికాలజ్ఞానివైన ఓ గృత్సమదమునీంద్రా! అన్నీ యెఱిగివుండీ, నన్నెందుకు యిలా ప్రశ్నిస్తున్నావు? ఐనా నీ ఆజ్ఞననుసరించి చెబుతాను విను! నేను నీ క్షుతము (తుమ్ము) నుండి జనించాను. కనుక నాకు తల్లివీ, తండ్రివీ యిక నీవే! నన్ను దయతో కొన్నాళ్ళు సంరక్షించు! ఇంద్రునితోసహా ముల్లోకాలనూ ఆక్రమించగల బలపరాక్రమం కల వాడిని! కొద్దికాలంలోనే నా అప్రమేయపౌరుషాన్ని నీవు చూడగలవు!"

ఈ మాటలకు ముగ్ధుడైన ఆముని తనలో 'ఆహా! ఈ బాలకు డెవరో పుట్టీ పుట్టగానే తాను ముల్లోకాలనూ గెలువగల సమర్థుణ్ణంటూ

ప్రకటించుకున్నాడే? వీడెవరోగాని అసాధ్యుడిలా ఉన్నాడు! కనుక వీడి శక్తియుక్తులు మరింతగా యినుమడింపచేయగలందులకు నా మంత్రాన్ని యితడికి ఉపదేశిస్తాను! ఆ మంత్రప్రభావంతో వరదుడైన గణేశుడీతనికి సకల వాంఛితములను ప్రసాదించగలడు! వీడివల్ల నాకూ ఘనకీర్తి లభించగలదు" అని సంకల్పించి ఆ బాలునికి తన 'గణానాంత్వా' అన్న ఋగ్మంత్రాన్ని ఉపదేశించాడు. అలా ఉపదేశించి తరువాత ఇలా అనుగ్రహవచనాలతో అతడినిలా ఆశీర్వదించాడు.

'ఓ చిరంజీవీ! 'గణానాంత్వా' అన్న ఈ మంత్రాన్ని నీవు నిశ్చలమైన మనస్సుతో జపించు! ఆ గజాననుని అనుగ్రహాన్ని పొందిననాడు నీ సకలాభీష్టములూ నెరవేరతాయి!' ఇలా గృత్సమదుడినుంచి మంత్రోపదేశాన్నీ, అనుగ్రహాశీస్సులనూ, బడసిన ఆ బాలకుడు వెంటనే ఒక నిర్జన అరణ్యానికి వెళ్ళి, అక్కడ ఇంద్రియాలను నియమించి, తదేక దీక్షతో, కాలి బొటనవేలుపై నిలచి, ఐదువేల సంవత్సరాలకాలం నిరాఘాటంగా తండ్రి ఉపదేశించిన ఆ మంత్రాన్ని జపించాడు! అప్పుడాతడి ముఖంలోనుంచి వెంటనే తపోగ్నిజ్వాలలు వెలువడి దిక్కులనంతా ప్రజ్వరిల్లచేస్తూ దేవగణాలకూ, పాతాళంలోని రాక్షసులకూసైతం భయోత్పాతాన్ని కలిగించాయి! అప్పుడు ఆ బాలుని తపస్సుకు సంతుష్టుడైన గజాననుడు అతడి ఎదుట సాక్షాత్కరించాడు.

దిక్కులనెల్లా ప్రజ్వరిల్లచేస్తూ, సూర్యకాంతిని ధిక్కరించే తేజఃప్రకాశంతో తొండమును అలవోకగా అటూయిటూ ఆడిస్తూన్న ఆ గజాననుని ఘీంకారం విన్న ఆ బాలకుడు భయంతో వివశుడై నేత్రాలను విప్పి ఎదురుగా నిలచిన ఆ దేవదేవుని చూచాడు.

నాలుగు బాహువులతోనూ, పెద్ద ఉదరంతోనూ, నానాలంకారము లతో అలంకరించబడి, పరశువు, పద్మము, జపమాల, మోదకములను నాల్గుచేతులలోనూ దాల్చివున్న ఆ దివ్యతేజోమూర్తియొక్క ప్రకాశానికి ముందు నిర్ఘాంతపోయి, ఆ తరువాత క్రొద్దిగా తడబడి, తిరిగి ధైర్యాన్ని పుంజుకుని ఆ ప్రభువునిలా ప్రార్థించసాగాడు.

"ఓ దేవా! నీకు అనన్య భక్తుడను, శరణాగతుడనూ ఐన నన్ను యిలా భయపెట్టడం నీకు భావ్యమా? సౌమ్యరూపాన్ని దాల్చి నా వాంఛితార్థములను ప్రసాదించి, నన్ను అనుగ్రహించవే!"

ఓ వ్యాసమునీంద్రా! అప్పుడు ఆ భక్తవరదుడైన గణాధిపుడు ఆతడి ప్రార్థనతో తన భయంకర రూపాన్ని ఉపసంహరించి, ఎంతో ప్రీతితో సౌమ్యరూపందాల్చి ఆ బాలకుణ్ణి పిలిచి

"నాయనా! నీవు స్వస్థచిత్తుడివికా! అహోరాత్రాలు ఎవరి నుద్దేశించి ధ్యానం చేశావో, ఆ నీ ధ్యానమూర్తిని నేనే! నీయందు పూర్తి ప్రసన్నతను కలిగి, నీకు వరాలను అనుగ్రహించదలచి వచ్చాను! ఈ నా రూపం స్వప్రకాశమైనదీ, జగన్మయమైన నా పరరూపమును బ్రహ్మరుద్రాదులు కూడా తెలుసుకోలేరు! దేవతలు, మునులు, గంధర్వులు, అసురులు వీరెవ్వరికీ కూడా ఇది గ్రహింపనలవికానట్టిది! అటువంటి నేను, నీ శ్రద్ధతోకూడిన తపస్సుకు బద్ధుడనై నిన్ను అనుగ్రహించదలచాను. కోరిన వరమివ్వటానికై వచ్చాను! కనుక నావల్ల నీకేమేమి వరములు కావాలో అవన్నీ కోరుకో!" అన్నాడు.

ఆ మాటలకు ఆ బాలకుడిలా అన్నాడు : ఓ దేవా! నీ దివ్య

మంగళ తేజోమయ రూపాన్ని దర్శించటంతో నా జన్మ నేటికి చరితార్థ మైంది! నాతపస్సు, నా జననీజనకులూ ధన్యులైనారు. బాలుడనైన కారణంచేత నీ మహిమా విశేషాన్ని వర్ణించలేకపోయాను. సకల జగత్తుకూ నీవే ఆధారభూతుడవు! సూర్యాది గ్రహగోళాలు నీ భావనవల్లనే ప్రకాశిస్తు న్నాయి. నీ మహిమావిశేషంచేతనే జగత్తంతా చలిస్తున్నది. అట్టి నీ మహిమావిశేషాన్ని త్రిమూర్తులైనా పూర్తిగా గ్రహింపలేరు! ఐనా నీవు దయతో వరాన్ననుగ్రహించగోరితే ఈనాటినుంచీ 'మూడు లోకాలలోనూ ఎక్కడా నాకు తిరుగుండరాదు! దేవఅసుర గణాలందరూ నాకు వశ్యులై ఉండాలి! దేన్ని సంకల్పించినా తక్షణమే అది సిద్ధించేలా సంకల్పసిద్ధినీ ప్రసాదించు! ఇహలోకంలో సకలభోగాలను అనుభవించాక అంత్యమున మోక్షాన్నిపొందేలా అనుగ్రహించు!

"ఓ భక్తవరదా! నేను తపస్సు ఆచరించిన ఈ ప్రదేశము ఇకనుంచీ 'గణేశపురము' అన్నపేరిట లోకవిఖ్యాతినిగాంచుగాక!"

అంటూ వేడిన ఆ బాలుడితో గజాననుడిలా ప్రసన్నుడై, అనుగ్రహ వచనాలు పలికాడు :

"ఓ బాలకా! నీవు కోరినట్లే నీకు త్రైలోక్యాకర్షణశక్తి కలుగగలదు! నీకెవరివల్లా ఎటువంటి భయమూ కలుగదు! మూడు పురములు బంగారంతో, వెండితో, ఇనుముతో నిర్మించియిస్తాను! కోరుకున్న స్థలానికి వెళ్ళే కామగమనశక్తిని అవి కలిగివుంటాయి. ఒక్క లయకారకుడైన శంకరుడి చేతతప్ప అవి భేదింపబడనివి! ఈలోకంలో నీవు త్రిపురాసురు డన్న ఖ్యాతిగాంచెదవు! ఏనాడైతే శంకరుడు తన ఏకైక బాణంతో ఈ

మూడింటినీ భేదిస్తాడో ఆనాడే నీవు ముక్తి పొందగలవు! ఇది ముమ్మాటికీ సత్యము! ఇంకా నీవడిగిన ఇతర వాంఛితములన్నీ తప్పక ఈడేర గలవు!''

వ్యాసమునీంద్రా! ఈ విధంగా ఆతడికి వరాలనూ అనుగ్రహించి గజాననుడు అంతర్హితుడైనాడు. ఆ దైవవియోగానికి ఆ బాలకుడు ఖిన్నుడైకూడా ఆ వరముల లబ్ధికి సంతోషయుక్తుడైనాడు. అనంతరం తన వరబలగర్వముతో ముల్లోకాలను ఆక్రమింప ప్రయత్నించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని

'వరప్రదానం' అనే 38-వ అధ్యాయం.



39

# ఇంద్రపరాజయం

(మూలం)

## ఏకోన చత్వారింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

తతః కిమకరోద్బ్రహ్మన్ త్రిపురో వరదర్పితః ।
తత్సర్వం కౌతుకం మహ్యం వక్తుమర్హస్యశేషతః ॥ 1

**బ్రహ్మోవాచ :-**

తతః కాశ్మీర పాషాణభవాం మూర్తిం గజాననీం ।
స్థాపయామాస విధివత్ బ్రాహ్మణై ర్మంత్రకోవిదైః ॥ 2

మహాంతం కాంచనం దివ్యం మణిముక్తా విభూషితం ।
గణేశపురమధ్యే స ప్రాసాదం కృతవాన్ శుభం ॥ 3

ఉపచారై షోడశభిః పూజాయామాస తం విభుం ।
నమస్కారై రసంఖ్యాతైః స్తుతిభిః ప్రార్థనైరపి ॥ 4

క్షమాప్య దేవదేవేశం అనుజ్ఞాప్య యయౌబహిః ।
దదౌ దానాన్యనేకాని బ్రాహ్మణేభ్యో యథార్థతః 5

తతస్తదభవత్ స్థానం బంగాళే త్రిపురస్య హ
గణేశపుర మిత్యేవం సర్వేషాం సర్వసిద్ధిదం ॥ 6

తతః స్సత్రిపురో దైత్యో గజానన వరోద్ధతః ।
నృలోకాన్పాలయామాస దేవానామాక్రమే రతః ॥ 7

పదాతయః తురంగాశ్చ గజాశ్చ రథినస్తథా ।
దశదిగ్భ్యో యయుస్తంతు సేవార్థం బలవత్తరాః ॥ 8

రాజానః సేవకాజాతాః అనుకూల్యేన తస్య హ
ప్రతికూలా గతా మృత్యుం యుద్ధం కర్తు మునీశ్వరాః । 9

ఏవమాక్రమ్య భూఖండం తతోగా దమరావతీం ।
తత ఇంద్రో దేవగణై ర్నానాయుద్ధ కరైర్వృతః ॥ 10

ఐరావత సమారూఢో యయౌ యుద్ధాయ దంశితః
సోపి సేనాం త్రిధాచక్రే చతురంగాం మహాబలః । 11

భీమకాయం మహాదైత్యం వజ్రదంష్ట్రం చ దానవం ।
ధనుర్యుద్ధే గదాయుద్ధే శస్త్రయుద్ధే చ కోవిదం । 12

అస్త్రయుద్ధే మల్లయుద్ధే నిష్ణాతం దైత్యపుంగవం ।
భీమకాయ మహోచత్స నృలోకస్యాధిపో భవ । 13

కాలకూటం వజ్రదంష్ట్రం జగాద త్రిపురో బ్రవీత్ ।
త్రిభాగయానయా యాహి సేనయా త్వం రసాతలం ॥ 14

శేషముఖ్యాన్ సర్వనాగాన్ వశాన్కురు మమాజ్ఞయా ।
అహం త్రిభాగయా శక్రం అక్రమిష్యే అఖిలాన్ సురాన్ ॥ 15

భీమకాయో వజ్రదంష్ట్రో యథాజ్ఞప్తౌ ప్రతస్థతుః ।
చతురంగ బలైర్యుక్తః స్వయం స్యందన మాయయౌ ॥ 16

దివ్యాన్ వృక్షాన్ బభంజుస్తే వార్యమాణాస్తు సైనికాః ।
తత్రస్థిత్వా దైత్యరాజో దూతాన్ శక్రాయ ప్రాహిణోత్ ॥ 17

అత్రానయంతు తం శక్రం దర్శనాయ త్వరాన్వితాః ।
వదంతు మమవాక్యం వా మృత్యులోకం వ్రజాధునా ॥ 18

తత్ర త్వాం పాలయిష్యామి సామ్నా దేహ్యమమరావతీం ।
యది యుద్ధేచ తే బుద్ధి స్తదాశీఘ్రం ప్రయాహి మాం ॥ 19

తే గత్వా శక్ర మాచఖ్యు స్త్రిపురాసుర చేష్టితం ।
శృత్వేద్ధం వచనం తేషాం వజ్రాహత ఇవాచలః ॥ 20

చకంపేచా చలరిపు ర్వాయునేవయథా తరుః ।
చింతయా వ్యాకులీభూతః కిమేతదితి చింతయన్ ॥ 21

క్రోధానలేన జజ్వాల సంరక్తాఖిల లోచనః
కుర్వన్నస్మేవ లోకానాం శోషయన్నివ వారిధీన్ ॥ 22

ఉవాచ దూతాన్ గచ్ఛంతు యాంతు యుద్ధాయ సత్వరాః ।
స్వయ మైరావతారూఢో జగర్జ సురశత్రుహా । 23

తేన నాదేన మహతా క్షోభయన్ భువనత్రయం ।
శృత్వా తద్వచనం తేతు గతా దూతా యధాగతం ॥ 24

విభుధాశ్చాపి సంనద్ధా నానాశస్త్రాసి పాణయః ।
భిండివాల ధరాః కేచి త్కేచి చ్ఛక్త్యుష్టిపాణయః ॥ 25

ముద్గరాసిధరాః కేచి ద్ధనుర్బాణ కరాః పదే ।
గదా ఖేటకరాః కేచి త్కేచిత్తు దండపాణయః ॥ 26

ఏవం దేవగణై ర్యుక్తో వజ్రభృన్నిర్యయౌ బహిః ।
కృత స్వస్త్యయనో విప్రైః నానా వాదిత్రనిస్స్వనైః ॥ 27

త్రిపురో దూతవాక్యేన జ్ఞాత్వా యుద్ధోద్యమంతు తం । 28

సన్నద్ధామకరోత్ సేనాం ప్రహృష్టాం చతురంగిణీం ।
అసంఖ్యాతాం సమాధాయ హయారూఢోఽభినిర్యయౌ । 29

పరస్పరం దదృశతు స్తైసేనే వీరభూషణే । 30

కోలాహలో మహానాసీత్ బృంహితై ర్హేషితై రపి ।
క్ష్వేళితై రథఘోషైశ్చ వాద్యఘోషై రనేకధా ॥ 31

తతో హుంకారమాత్రేణ నోదితా స్త్రిపురేణ తే ।
వీరా యయుధిరే దైః న సంమ్మర్దో మహానభూత్ ॥ 32

నాభూ త్స్వపర భేదో పి జఘ్నుదేవ పరస్పరం ।
ఏవం సుతుములే ఽన్యే మృతాస్తే దానవా బహు ॥ 33

సుమనసోపి పతితా దైత్యశస్త్ర ప్రపీడితాః ।
బభుస్తే సైనికాస్తత్ర పుష్పితా ఐవ కింశుకాః ॥ 34

అశయ్యాః శ్ఛయితాః కేచి దంఘ్రిహీనా స్తథాపరే ।
క్రమేలకా గజాధ్యక్షై రథాశ్వాశ్చ పదాతినః ॥ 35

తతః పలాయనపరాః దైత్యా యాతాదిశో దశ ।
సింహం దృష్ట్వైవ సహసా మృగా జీవనకాంక్షిణః ॥ 36

తతో నివార్య తత్సైన్యం బృందారక రిపుః స్వయం ।
క్రోధానల మహాజ్వాలో గర్జన్మేఘా ఇవాపరః । 37

శక్రసాన్నిధ్య మగమత్ భక్షయన్నివ రోదసీ ।
స్వఖడ్గేనాహన తీవ్రం హస్తం వజ్రధరం హరేః ॥ 38

వజ్రం పపాత తద్ధాస్తా త్తదద్భుత మివాభవత్
తదా దాయా హనద్దైత్యస్తే నైవ ఇరావతం గజం । 39

ఐరావతః ప్రహారేణ పలాయనపరో యయౌ ।
తతో జఘాన సహరిర్ముష్టినా దైత్యపుంగవం । 40

స క్షణం పతితో భూమౌ తతఉద్ధాయ వేగవాన్ ।
జఘాన ముష్టినా శక్రం ధరణ్యాం తమపాతయత్ ॥ 41

తత ఉద్ధాయ మఘవాన్ దైత్యంప్రాహ రుషాన్వితః ।
ఇదానీం మల్లయుద్ధాయ సజ్జీభవాసురేశ్వర ॥ 42

తతః స విస్మయావిష్టః ఉవాచ బలగర్వితః ।
కిమర్థం త్వం నిజప్రాణై నిర్దయోసి సురేశ్వర ॥ 43

కృమికీట పతంగానాం ప్రాణోతీవ ప్రియోమతః ।
గచ్ఛదేవ ధరణ్యాంతే స్థానం దత్తం మయాశుభం ॥ 44

బ్రహ్మోవాచ :-

ఇతి తద్వచనం శృత్వా జగాద బలవృత్రహా ।
యద్యహం జీవితా త్వాంహి మోచయామి నచేద్రిపో । 45

తదాహం ధరణీం యామిత్వదాజ్ఞావశగోధమ ।
త్వమేవ హితమూర్ధాఽద్య ధరణీం యాస్యసే ఖల ॥ 46

వదత్యేవం తు దేవేంద్రే దైత్యేంద్రో నిజఘాన తం ।
ముష్టినా హృదయేదుష్టః స్తతోయుద్ధ మభూత్తయోః ॥ 47

చాణూర కృష్ణయోర్యద్వత్ పరస్పర జయైషిణోః ।
హృదయం హృదయే నైవ హస్తం హస్తేన జఘ్నతుః ॥ 48

జానుభ్యం జానునీచోరూ తాభ్యాం తౌ చ నిజఘ్నతుః ।
మస్తకం మస్తకేనైవ కూర్పరం కూర్పరేణతు ॥ 49

పృష్ఠం పృష్ఠేన పాదాభ్యాం పాదౌ తా వభిజఘ్నతుః ।
పాదౌ గృహిత్వా దైత్యో అస్య భ్రామయిత్వా ముహుర్ముహుః॥ 50

తత్యాజ దూరతః శక్రం యథానజ్ఞాయతే క్వచిత్ ।
ఆరురోహ తతస్తంతు చతురంతం గజేశ్వరం ॥ 51

తతో దేవగణా స్సర్వే హిమవద్గిరి గహ్వరం ।
యయుస్సక్రం విచిన్వంతో దైత్య సంత్రాస ప్రీడితాః త్రాపితాః ॥ 52

కుత్రవా పతితో దేవో ద్రక్ష్యామోవా కథం విభుం ।
ఏవం సంచితయం తస్తే భ్రమంతో దదృశుశ్చతే ॥ 53

అథోముఖం సమాయాంతం దేవేంద్రం తం తదైవహ ।
ప్రణేము ర్దేవసంఘాః తమాలిలింగుః తస్తథాపరే ॥ 54

పూజయామాసు రపరే విజయామాస కశ్చన ।
పాద సంవాహనం చాస్య చక్రుః కేచస భక్తితః ॥ 55

తత్రైవ న్యవసన్ సర్వే గుప్తరూపా స్సురాస్తదా ।
దైత్యస్తు ఐరావతారూఢో యయౌ తా మమరావతీ । 56

దేవస్థానాని దైత్యానాం ఇంద్రాసనగత స్స్వయం ।
దదౌ విభజ్య ప్రత్యేకం మానపూర్వం సురద్విషాం ॥ 57

దివ్య వాదిత్ర నిర్ఘోషైః శృణ్వన్ గాంధర్వ నిస్స్వనాన్ ।
కిన్నరైః సేవ్యమానస్తు రేమే చాప్సరసా గణైః ॥ 58

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**ఇంద్రపరాజయో నామ ఏకోన చత్వారింశో అధ్యాయః**



# ఇంద్రపరాజయం
## 39-వ అధ్యాయము

అప్పుడు పరాశర తనయుడైన వ్యాసమహర్షి బ్రహ్మదేవుని ఇలా ప్రశ్నించాడు :

"ఓ పద్మసంభవా! ఈ రకంగా గణేశానుగ్రహాన్నీ, వరసంపదనూ ఆశీస్సుగా పొందిన త్రిపురుడు వరగర్వంతో ఏంచేశాడు? ఆతరువాతి కథా విధానమంతా నాకు వినిపించగోర్తాను!"

"ఓ వ్యాసమునీంద్రా! ఈవిధంగా ప్రధముడైన గణాధిపతియొక్క విశేషానుగ్రహాన్ని పొందిన త్రిపురుడు, ముందుగా కాశ్మీరసంభవమైన నల్లటిరాయితో గజాననునిమూర్తిని తయారుచేయించి, మంత్రకోవిదులైన ఆగమపండితులతో యధావిధిగా ఆలయంలో ప్రతిష్ఠించాడు. మణిమాణిక్యాలతో అలంకృతమైన ఒక బంగారు భవనాన్ని నిర్మించి, ఆ గజాననుని అందులోనుంచి షోడశోపచారములతో పూజించాడు. స్తోత్రములతో

గణేశుని సన్నుతించి, యధావిధిగా పూజలను సమర్పించి భూసురులకు భూరిదానాలనిచ్చాడు. గణేశపురంగా ప్రసిద్ధిచెందిన ఆ పట్టణము బెంగాల్ లో ఉన్నది! గణేశానుగ్రహంగా తనకు సిద్ధించిన శక్తులచేత తన బల గర్వంతో ఆ త్రిపురాసురుడు భూమండలాన్నంతటినీ ఆక్రమించాడు! అలా భూమినంతటినీ ఏకచ్ఛత్రాధిపతిగా పరిపాలిస్తూ, నలుదిక్కుల నుంచీ చతురంగబలాలనూ సమీకరించుకొని, దేవలోకంపై కూడా దండ యాత్రకు సన్నద్ధుడయ్యాడు. అమరావతిపై దండెత్తివెళ్ళిన త్రిపురుని ఎదుర్కోవటానికి దేవేంద్రుడు తన సమస్త సైన్యాలతోనూ ఐరావతాన్ని ఎక్కి యుద్ధానికి వెళ్ళాడు!

యుద్ధరంగంలో — వ్యూహరచనలో నిపుణుడైన ఆ త్రిపురుడు తన సేననంతటినీ మూడుభాగాలుగా చేశాడు. ఒకభాగానికి ధనుర్విద్య లోనూ, గదాయుద్ధంలోనూ శస్త్రాస్త్రకోవిదుడైన వంజ్రదంష్టుని నాయకునిగా నియమించి అతనికి మనుష్యలోకాధిపత్యాన్నిచ్చాడు.

మూడోవంతు సేనతో కాలకూటుడనేవాడిని రసాతలానికి పంపి శేషముఖ్యులైన మహానాగులందరినీ వశులను చేసుకొమ్మని ఆ సేనను ఆదేశించాడు.

ఇక మిగిలిన మూడవభాగాన్ని తాను స్వయంగా వెంటపెట్టుకుని వెళ్ళి చతురంగ బలసమేతుడై స్వర్గంలోని నందనవనంపైకి దాడికై వెళ్ళాడు.

అక్కడ తనసేనల్ని విధ్వంసానికి పురికొల్పి, ఆ నందనవనంలోని దివ్యవృక్షాల నెన్నిటినో ఆతడు భగ్నంచేశాడు అలా త్రిపురుడు నందనో

ధ్యానంలో నిలచివుండి అమరాధిపతి ఇంద్రునికి తన దూతద్వారా యిలా సందేశం పంపాడు.

"నీవీ అమరావతీ నగరాన్ని నాకు సమర్పించి, మనుష్యలోకం లోకి వెళ్ళి నాకు వశుడవై ఉండు! లేదా నీకు చేవఉంటే, యుద్ధం చేయగల సత్తాఉంటే సన్నద్ధుడవైరా!"

దూతలు ఇంద్రుని సముఖానికి వెళ్ళి అతనికి త్రిపురుని సందేశం యావత్తూ వినిపించారు. ఆ మాటలు చెవిన పడగానే పిడుగుపాటుకు తల్లడిల్లిన పర్వతంలా ఆగ్రహంతో, అవమానంతో గడగడా వణికి — దిగ్భ్రాంతి చెందాడు. తిరిగి అంతలోనే తాను కోలుకుని, అవమానాగ్నితో దహించుకుపోతూ 'ఆ దూతలతో తాను యుద్ధమే చేయగోర్తున్నాని' బదులు పంపించాడు. దేవసేనలనన్నిటినీ యుద్ధ సమాయత్తంచేసి ఐరావతాన్ని అధిరోహించిన ఇంద్రుడు ప్రళయకాల మేఘంలా గర్జించాడు! ఆ శబ్దానికి ముల్లోకాలూ క్షోభించాయి! త్రిపురుని దూతలు ఇంద్రుని సమాధానం త్రిపురునికి తెలియజేసారు! సమస్త దేవతాసైన్యమూ శస్త్రాస్త్రములను ధరించి తన వెంటరాగా దేవరాజైన ఇంద్రుడు పోరుకు సిద్ధమయ్యాడు.

## త్రిపురాసుర యుద్ధం

ఇలా ఇంద్రుడు నానా వాద్యఘోషములతోనూ, బ్రాహ్మణ స్వస్తి పుణ్యాహవచనములతో యుద్ధసన్నద్ధుడై బయల్వెడలాడు. అప్పుడు దూతలద్వారా ఇంద్రుడు యుద్ధసమాయత్తుడైనట్లు తెలుసుకున్న త్రిపురుడు తన సేనల్నికూడా ఉత్సాహపరుస్తూ, తానూ ఒక ఉత్తమాశ్వాన్ని

అధిరోహించి, చతురంగ బలాలతోటీ యుద్ధానికి బయల్దేరాడు.

అప్పుడు జరగబోయే భీకర యుద్ధారంభానికి సూచనగా, శంఖా రావాలూ, భేరీనాదాలూ యుద్ధరంగంలో ఇరుపక్షాలలో మింటినంటాయి! త్రిపురుడు సేనల్ని పురికొల్పుతూ హుంకారాన్ని చేయగానే వారంతా భీకరంగా యుద్ధానికి తలపడ్డారు. ఇరుసైన్యాలూ స్వ, పర భేదంలేకుండా సంకులసమరం చేయసాగారు. అసంఖ్యాకంగా దానవవీరులూ, దానవ శస్త్రాలచేత పీడింపబడ్డ దేవతలూ కూడా కొందరు నేలకూలారు.

ఆ రక్తపు ధారలకు తడిసిన యిరువర్గాల సైనికులూ పుష్పించిన మోదుగచెట్లలా కనిపించసాగారు. కొందరు దానవులు నేలకూలారు. మరికొందరు క్షతగాత్రులైనారు. అలాగే లొట్టిపిట్టలనూ, ఏనుగులను, గుఱ్ఱాలనూ అధిరోహించిన సైనికులు విశేషంగా ఆ యుద్ధభూమిలో నేల కూలారు. అప్పుడు సింహాన్ని చూచి బెదిరిన లేళ్ళగుంపులా యుద్ధరంగం నుంచి నలుదిక్కులకూ పారిపోయారు!

అప్పుడు త్రిపురుడు ప్రళయాగ్నిలా మండిపోతూ, తన సేనలను యుద్ధానికి పురిగొల్పుతూ — ప్రళయకాలమేఘంలా గర్జిస్తూ, తాను స్వయంగా ఇంద్రుడితో పోరుకి తలపడ్డాడు

వెంటనే ఒక్కసారిగా ఇంద్రుడి మీదకురికి, వజ్రాయుధాన్ని పట్టిన అతడి చేతిని తన వాడి ఖడ్గంతో ఒక్కవేటున నరికాడు. ఆ అదురుకు ఇంద్రుడి చేతనున్న వజ్రాయుధం క్రిందపడింది. ఆ వజ్రాయుధంతో ఐరావతాన్ని తలపై కొట్టాడు. ఆ దెబ్బతిన్న ఐరావతం భయంతో పారి పోయింది! క్షణంలో ఇంద్రుడి ఆ ముష్టిఘాతానికి మూర్ఛిల్లిన త్రిపురుడు

కోలుకొని ఇంద్రుణ్ణి తన చేతితో చరిచాడు. కొంతసేపటికి లేచిన ఇంద్రుడుకూడా తిరిగి ఆ త్రిపురాసురుడిని తనతో మల్లయుద్ధానికి ఆహ్వానించాడు.

ఆ మాటలకు ఆశ్చర్యపోయిన త్రిపురుడు "ఓ అమరేంద్రా! నీవెందుకు యిలా నీ ప్రాణాలపై నిర్దయుడవైనావు? క్రిమికీటకాదులకు సైతం తమ ప్రాణాలంటే తీపేకదా! నామాట విని నీవు భూలోకానికి పారిపో! నీకు అయితే అక్కడ తలదాచుకునేందుకు నీకో స్థానం కల్పిస్తాను!"

పద్మసంభవుడిలా అన్నాడు 'ఓ మునీంద్రా! ఈవిధంగా త్రిపురుని చేత రెచ్చగొట్టబడ్డ శచీపతి మండిపడుతూ :

'ఓ దానవాధమా! నా బొందిలో ప్రాణమున్నంతవరకూ నిన్ను వదలను! నీచేత చిక్కిననాడు నీ ఆజ్ఞానుసారమే భూలోకానికి వెడతాను"

## ఇంద్రపరాజయం

ఇలా ఆవేశపూరితుడై ఇంద్రుడు నిప్పులుక్రక్కుతుండగా, అతడి వక్షస్థలాన్ని త్రిపురుడు తన పిడికిలితో మోదాడు. ఆదెబ్బకు ఇంద్రుడూ అమిత క్రోధోద్రిక్తుడైనాడు. ఇరువురూ కొదమసింహాల్లాగా, చాణూర కృష్ణుల్లాగా — ఒకరితో ఒకరు భీకరంగా పోరాడారు. గుండె-గుండే రాపాడిస్తూ తలను తలతోనూ, వీపును వీపుతోనూ, పాదాలతో మరొకరి పాదాలను తన్నుకుంటూ చాలాసేపు వీరోచితంగా పోరాడారు.

అప్పుడా దైత్యుడు శచీపతి కాలుపట్టుకొని పైకెత్తి గిరగిరా త్రిప్పి విసరివైచాడు. తాను స్వయంగా ఐరావతాన్ని అధిరోహించాడు! దేవ గణాలు తమ ప్రభువు జాడతెలియక, దిక్కుతోచనివారై ఇంద్రుని అన్వేషిస్తూ హిమవత్పర్వత గుహలవైపుకు పారిపోయారు.

'ఇక మన రాజైన ఇంద్రుని ఎలా కలువగలము?' అనకుంటూ తమలోతాము తర్కించుకుంటూ, వెడుతున్న దేవగణాలకు దూరాన్నుంచి సిగ్గుతో తలవంచుకు వస్తున్న ఇంద్రుడు కనిపించాడు. దేవతలకు కొన ప్రాణం లేచివచ్చినట్లై తమ ప్రభువును అత్యంత ఆదరంతో సేవించుకొని హిమవత్పర్వత గుహలలో ప్రాణాలను కడచేతిలో బెట్టుకొని తల దాచుకున్నారు.

త్రిపురుడు మాత్రం విజయగర్వంతో ఐరావతాన్నెక్కి అమరావతిని చేరుకుని, తన అనుచరులనే అష్టదిక్కులకూ దిక్పాలకులుగా నియమించి, తాను మాత్రం ఇంద్రుడి స్థానాన్ని అధిరోహించి దివ్యవాయిద్యాల ఘోషలో, గాంధర్వగానం వీనులకింపు చేయగా, అప్సరసల నాట్యసల్లాపాలను వీక్షిస్తూ, వారితో క్రీడిస్తూ, ఉల్లాసంగా కాలం గడపసాగాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'ఇంద్రపరాజయం' అనే 39-వ అధ్యాయం.



(40)

# స్తోత్ర నిరూపణం

(మూలం)

## చత్వారింశో అధ్యాయః

**బ్రహ్మోవాచ :-**

అక్రమ్య దేవధిష్ట్యాని దైత్యోగాద్బ్రహ్మణః పదం ।
పరాక్రమం దైత్యకృతం శృత్వా దేవముఖాత్పురా ॥ 1

బ్రహ్మ యయౌ నాభిపద్మం విష్ణుః క్షీరనిధిం యయౌ ।
దైత్యస్య మానసౌ పుత్రౌ ప్రచండ శ్చండ ఏవచ ॥ 2

ప్రచండం స్థాపయామాస బ్రహ్మలోకే ధినాయకం ।
తతశ్చండంచ వైకుంఠే చకార స్వామినం స్వయం ॥ 3

తతః కైలాస మగమత్తంచ దోర్భ్యామ చాలయత్ ।
భయభీతాచ గిరిజాని ఙ్గే శంకరం భ్రుశం ॥ 4

తతః కైలాస మగమద్యుద్ధాకాంక్షీ మహాసురః ।
తేన తుష్టో మహాదేవో దైత్యస్య పౌరుషేణ చ ॥ 5

బహిర్యయౌ వరందాతుం నిజభక్త సుఖప్రదః ।
దదర్శ త్రిపురం దైత్యం వరం వృణీష్వేత్యథా బ్రవీత్ ॥ 6

స వవ్రే యదితుష్టోసి దేహి కైలాసమధ్యమే ।
గచ్ఛ మందారశిఖరం యావన్మమ మనోరథః ॥ 7

శంకరోపి దదౌ తస్మై కైలాసం స్వల్పకాలినే ।
స్వయం జగామ గిరిశో మందరాద్రిం గణైర్వృతః ॥ 8

కైలాస శిఖరారూఢో జహర్ష త్రిపురాసురః ।
ఏవం దేవాన్ వశే కృత్వా పునరాయా ద్రసాతలం ॥ 9

భీమకాయోపి బలవాన్ భూమండల గతోబలాత్ ।
వశేచకార నృపతీ నృషీన్ సర్వాన్ బబంధచ ॥ 10

అగ్నికుండాని సర్వాణి దేవతృప్తికరాణి చ ।
ఆశ్రమాంశ్చ బభంజాశు తీర్థానిచ విశేషత ః ॥ 11

తాపసాం స్త్రాసయామాస కారాగార సమాశ్రయాత్ ।
స్వాహా స్వధా వషట్కారాన్ వేదస్యాభ్యసనా నిచ ॥ 12

సదాచారాన్ సదా ద్వేష్టి సర్వగర్వ సమన్వితః ।
వజ్రదంష్ట్రోథ సంప్రాప్తి పాతాలాని వశేనయత్ ॥ 13

శేషంచ వాసుకిం చైవ తక్షకం సర్వభోగినః ।
నిర్విషాన్ సవిషాం శ్చైవ చకార వశవర్తినః ॥ 14

వజ్రదంష్ట్రో రత్నజాతం బుభుజే ప్రేషయచ్ఛృతం ।
నాగాంగనాభిశ్చ కుతూహలేన రేమేసదా సౌ సమదోతి హర్షాత్ ॥ 15

భోగాన్విభుంజన్ వివిధాని రత్నాన్యాదాయ యాతః స్త్రిపురాంతికేసః ।
పాతాలవశ్యతాం శంసన్ లేభే మానస్తతోధికం ॥ 16

వస్త్రాణిచ మహార్హాణి గ్రామాన్ దాసాననేకశః ।
ఏవం త్రిలోకా న్వశగాన్ కృత్వా దైత్యో ననందహ ॥ 17

దేవాస్సర్వే గుహావాసా శ్చింతయామాసు రన్వహం ।
కథమస్య వధః కస్మిన్ కాలే వాపి భవిష్యతి ॥ 18

కస్మాద్వేతి నజానీమో లబ్ధో నేన వరః కుతః ।
ఏవం వ్యాకులచిత్తేషు సురేషు మునిసత్తమ । 19

ఆయయౌ నారద స్తత్ర త్రైలోక్య చరః ఇచ్ఛయా ।
దదర్శదీనాన్దేవాం స్తా నుత్తతార నభః పథాత్ ॥ 20

దృష్ట్వా సర్వే నారదం త ముత్తస్థు స్సహసాదరాత్ ।
ఆలిలింగుశ్చ నేముశ్చ పుపూజుశ్చ యథాక్రమం ॥ 21

విశ్రాంతం పరి పప్రచ్ఛు స్త్రిపురస్య వరాదికం । 22

**దేవా ఊచు :-**

త్రిపురేణ సమాక్రాంతం త్రైలోక్యం స చరాచరం ॥ 23

స్థానాని నేగృహీతాని కిశాస్తే నాపినిర్జితాః ।
శరణం కం ప్రజామోద్య కదంతస్య వధోభవేత్ ॥ 24

వరాశ్చ కేనదత్తానో వదాస్య త్రిపురస్యభోః । 25

**నారద ఉవాచ :-**

కథయామి సమాసేన దైత్యస్య చేష్టితం మహత్ ॥ 26

దివ్యవర్ష సహస్రం స తతాప పరమం తపః ।
ప్రసాదయామాస విభుం గణేశం దేవనాయకం ॥ 27

తేనాస్మై దుర్ధరా దత్తా వరాః సర్వభయంకరాః
దేవర్షి పితృభూతేభ్యో యక్షరక్షః పిశాచతః ॥ 28

ననాగేభ్యో భయందత్తం వినైకం శంకరం విభుం ।
ప్రసాదయంతు దేవేశం ద్విరదానన మాదరాత్ ॥ 29

ఆరాధయంతు సర్వేపి విఘ్నేశం సర్వసిద్ధిదం । 30

**దేవా ఊచుః :-**

కథ మారాధనం తస్యేదేవదేవస్య ధీమతః ।
కర్తవ్యం మునిశార్దూల కృపయా తద్వద స్వనః ॥ 31

**నారద ఉవాచ :-**

అహ మేకాక్షరం మంత్రం కథయా మ్యఖిలాన్ప్రతి ॥ 32

తేన మంత్రేణ తే సర్వే మయా దత్తేన భక్తితః ।
అనుష్ఠానం ప్రకుర్వంతు సర్వేపి స్థిరమానసాః ॥ 33

యావ త్ప్రత్యక్షతామేతి దేవోసౌ గణనాయకః ।
సఏవ తద్వధోపాయం న్వదిష్య త్యఖిలాన్ప్రతి ॥ 34

నాన్యోపాయం ప్రవక్ష్యామి తస్మాత్కుర్వంతు మేవచః । 35

బ్రహ్మోవాచ :-

ఇత్యుక్త్వా నారద స్సర్వానుపదిశ్య మనుంచతం ॥ 36

జగామ తక్షణాదేన వీణాగానరతో మునిః ।
తత స్సర్వే సురవరాః గణేశ ధ్యానతత్పరాః ॥ 37

ఏకపాదస్థితాః కేచిత్ కేచిత్పద్మాసన స్థితాః । 38

కేచిద్వీరాసనయుతాః కేచిన్మీలితలోచనా ।
నిరాహారా జితశ్వాసా జేపు ర్మంత్రం మునీరితం । 39

తతో బహుగతేకాలే కరుణాబి ర్గజాననః ।
అనుష్ఠానం నిరీక్ష్యైషాం దేవానాం చిరకాలజం ॥ 40

ఆవిర్బభూవ గణపస్తేషామగ్రే వరప్రదః ।
ఉల్లస త్స్వర్ణమకుట శ్చారుకుండల మండితః ॥ 41

దంతన్యస్త కరోరాజత్ త్కటిసూత్ర వరాంగదః ।
పాశం సృణించ పరశుం కమలంచ భుజైర్ధథత్ । 42

రక్తచందన కస్తూరీ సిందూర శశిభూషణః ।
విద్యుత్తేజో లసత్కాంతిః కోటిసూర్య సమప్రభః ॥ 43

దృష్ట్వైవం సహసా దేవం వినాయక మనామయం ।
తేజసా ధర్షితా స్సర్వే భయమాపు శ్చ కేచన । 44

ప్రణేముః సహసా కేచి ద్దేవా స్తం ద్విరదాననం ।
పూజయామా సురవరే హర్ష గద్గద భాషిణః ॥ 45

స్వ సంకష్టవినాశాయ తుష్టువుః కేపితం విభుం ।
ప్రసాదసుముఖం దేవం సుముఖం సంకటాపహం । 46

**దేవా ఊచు :-**

నమో నమస్తే పరమార్థ రూప నమో నమస్తేఽఖిల కారణాయ ।
నమో నమస్తే ఖిలకారకాయ సర్వేంద్రియాణా మధివాసినేపి ॥ 47

నమోనమో భూతమయాయ తేస్తు నమో నమో భూతకృతే సురేశ ।
నమో నమ స్సర్వధియాం ప్రబోధ నమోనమో విశ్వలయోద్భవాయ ॥ 48

నమో నమో విశ్వభృతే అఖిలేశ నమోనమః కారణ కారణాయ ।
నమో నమో వేదవిరామ ద్రుశ్య నమో నమః సర్వవరప్రదాయ । 49

నమో నమో వాగవిచారభూత నమో నమో విఘ్ననివారణాయ ।
నమో నమో భక్తమనోరథస్తే నమో నమో భక్తమనోరథేజ్ఞ ॥ 50

నమో నమో విశ్వ విధాన దక్ష నమో నమో భక్తమనోరథేశ ।
నమో నమో దైత్యవినాశహేతో నమో నమః సంకటనాశకాయ ॥ 51

నమో నమోః కారుణికోత్తమాయ నమో నమో జ్ఞానమయాయ తే అస్తు ।
నమో నమో అజ్ఞానవినాశనాయ నమో నమో భక్తవిభూతిదాయ ॥ 52

నమో నమో భక్తవిభూతిదాంత్రే నమో నమో భక్తవిమోక్షణాయ ।
నమో నమో భక్తవిబంధనాయ నమో నమస్తే ప్రవిభక్త మూర్తే॥ 53

నమో నమ స్త్వత్వవిబోధకాయ నమో నమ స్తత్వవిదుత్తమాయ ।
నమో నమస్తే అఖిల కర్మసాక్షిణే నమో నమస్తే గణనాయకాయ ॥ 54

బ్రహ్మోవాచ :-

ఏవంస్తుతః స్సురైర్దేవో ద్విరదానవ ఈశ్వరః ।
ఉవాచ పరమప్రీతో హర్షయన్ సురసత్తమాన్ ॥ 55

గణేశ ఉవాచ :-

స్తోత్రేణ తపసాచైవ సురాః సంతుష్టిమాగతః ।
దదామి సకలాభీష్టం తద్వృణుధ్వం సురేశ్వరాః ॥ 56

దేవా ఊచుః :-

యదితుష్టోసి దేవేశ త్రిపురం జహి (సత్వరం) దానవం ।
సర్వేషా మధికారాన్నో గృహిత్వాయ స్తుతిష్ఠతి ॥ 57

త్వయైవాస్యాభయం దత్తం సర్వామర సమూహతః ।
అతస్మ సంకటం ప్రాప్తాః సంకటాన్మో చయాశునః ॥ 58

**గణేశ ఉవాచ :-**

త్వమేవ శరణం ప్రాప్తా ఏష ఏవ వరోహినః ।
వారయిష్యే భయం సర్వం తస్మాత్ ఘోరతరాద్ధివః । 59

భవత్కృత మిదం స్తోత్రం అతి ప్రీతికరం మమ ।
సంకష్టనాశన మితి విఖ్యాతంచ భవిష్యతి ॥ 60

పఠతాం శృణ్వతాం చైవ సర్వ కామప్రదం నృణాం ।
త్రిసంధ్యం యఃపఠే దేతత్సంకష్టం నాప్నుయాత్క్వచిత్ ॥ 61

**బ్రహ్మోవాచ :-**

ఇతి దత్వా వరం తేషాం సురాణాం జగదీశ్వరః ।
పశ్యతాం మునిదేవానాం తత్రైవాంతర్దధే విభుః ॥ 62

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**స్తోత్రనిరూపణం నామ చత్వారింశో అధ్యాయః**



# స్తోత్ర నిరూపణం
# 40-వ అధ్యాయము

ఆ తరువాత కథను వ్యాసమహర్షికి బ్రహ్మ యిలాచెప్పాడు. ఓ వ్యాసమునీంద్రా! ఈరకంగా దేవతాస్థానాల నన్నింటినీ ఆక్రమించి త్రిపురుడు బ్రహ్మలోకానికి దండెత్తివెళ్ళాడు. దేవతలవల్ల ఆతడి పరాక్రమం గురించివిన్న బ్రహ్మ విష్ణువుయొక్క నాభికమలంలో లీనమైనాడు. విష్ణువుకూడా, ఆ రాక్షసుడి కంటబడకుండా క్షీరసముద్రానికి వెళ్ళాడు. తన మానసపుత్రుడైన ప్రచండుని బ్రహ్మలోకానికి అధిపతినిచేసి, రెండో కుమారుడైన చండుని వైకుంఠానికి అధిపతిగా చేశాడు.

తాను స్వయంగా కైలాసానికి వెళ్ళి తన బాహువులతో కైలాసాన్ని కంపింపచేసాడు! ఆ భయానికి గిరిజ శివుని గట్టిగా ఆలింగనం చేసుకున్నది. తరువాత బైటకువచ్చిన శంకరుడితో ఆ రాక్షసుడిలా అన్నాడు.

'నీకు ప్రాణాలమీద ఆశఉంటే మందరాద్రికి పోయి తలదాచుకో!' నాకు తృప్తి గలిగేదాకా నీవు అక్కడేఉండు!' అని కోరిన ఆ రాక్షసుడికి గల అల్పాయుర్దాయాన్ని గుర్తుపెట్టుకున్న శంకరుడు ఆతడి కోరిక ననుసరించి మందరపర్వతానికి వెళ్ళిపోయాడు అప్పుడా అసురుడు కైలాసశిఖరాన్ని అధిరోహించి అమిత సంతోషాన్ని పొందాడు.

అలా దేవలోకాలన్నీ ఆక్రమించి, రసాతలంవైపుకు వచ్చాడు. ఆ త్రిపురాసురుడు. భూమండలాన్ని ఆక్రమించిన భీమకాయుడు బలాత్కారంగా రాజుల రాజ్యాలనన్నింటినీ కబళించి, ఋషులందరినీ బంధించాడు. దేవతలకు తృప్తినొసగే అగ్నిహోత్రాదులనన్నీ భగ్నంచేశాడు. ఆశ్రమాలనూ తీర్థాలనూ పాడుచేసి, తాపసులందరినీ కారాగారాలలో బంధించాడు. గర్వోన్మత్తుడై 'స్వాహాకారా'లను, 'స్వధాకారా'లనూ ద్వేషిస్తూ ఉండి బ్రహ్మవేత్తలైన భూసురులను బాధించసాగాడు.

ఇక వజ్రదంష్టుడు సప్తపాతాళలోకాలను వశపరుచుకున్నాడు. శేషుడు, వాసుకి, తక్షకుడు మొదలైన నాగులనందరినీ వశపర్చుకున్నాడు. ఆ నాగుల తలలపైనున్న రత్నాలనన్నిటినీ తీసుకొనివచ్చి త్రిపురునికి సమర్పించాడు. ఆరకమైన పరాక్రమం చూపిన వజ్రదంష్టుడిని త్రిపురుడు అభినందించాడు.

ఈవిధంగా లోకకంటకుడైన ఆ త్రిపురుని దుష్టతకు మిక్కిలి వ్యాకులత చెందుతూన్న హిమవత్పర్వత గుహలలోని దేవతలకు నారద మహర్షి ప్రత్యక్షమై వారి బాధానివారణకై గణేశానుగ్రహం పొందటమే సరైన మార్గమని ఉపదేశించగా

సమస్త దేవతలూ భక్తితో గద్గదకంఠంతో తమకు సంప్రాప్తించిన ఈ ఘోరమైన సంకటాన్నుంచి రక్షించమని సాష్టాంగనమస్కారంచేసి భక్తితో పరిపూర్ణ శరణాగతితో ఈవిధంగా ప్రార్థించారు సంకటమోచన గణేశ్వరుని గురించి భక్తితో!

**దేవతలు :**

నమోనమస్తే! — ఓ పరబ్రహ్మ పరతత్త్వ స్వరూపా! ఈ సమస్త సృష్టికీ కారణభూతుడవైన నీకిదే నమస్కారం!!

సర్వేంద్రియములకు అధిష్టానదైవమై మా మనస్సూ, ఇంద్రియములు పనిచేయించే ప్రాణస్వరూపుడవై అఖిల కారణుడవైన అంతర్యామి స్వరూపుడవైన నీకు నమస్కారము.

పంచభూతాత్మకుడవై సమస్త సృష్టిగా వెలుగొందునోదేవా! అట్టి పంచభూత స్వరూపమునకు ఆదిభూతమైన నీకిదే నమస్కారము! పంచ భూతములనూ సృష్టించిన భూతస్రష్టకు, పరమేష్టికిదే మా నమస్కారం! మా సర్వేంద్రియములనూ మేల్కొలిపి, మా మనస్సూ, ఇంద్రియములనూ పనిచేయించే అంతర్యామిస్వరూపా! సమస్త సృష్టికీ అధిభూతుడైన నీకు సృష్టిస్థితి ప్రళయాధినాథుడైన పరమాత్ముడైన గణేశునకిదే నమస్కారము.

ఓ సమస్తవిశ్వస్వరూపా! ఈసృష్టికి కారణభూతుడవై సమస్త భూతములకు మూలకారణుడవైన నీకిదే ఓ కారణకారణా నమస్కారము!

ఓ వేదస్వరూపా! వేదస్వరములన్నీ చేరి ప్రాణస్వరూపుడైన ఏ పరమాత్మునిలో లీనమౌతున్నాయో అట్టి వేదాంత వేదవిరామరూపుడైన

నీకివే మా నమోవాకములు — మమ్ములను వరములనుగ్రహించి రక్షించు!

ఓ వాక్కులకూ, మనస్సునకూ అందని పరతత్త్వస్వరూపుడా! మా విఘ్నములను నివారించు! మేమిదే నీకు శరణుపొందుతున్నాము. భక్తుల మనోరథములు సంకల్పమాత్రములో తీర్చే ఓ భక్తమనోహరా! మా మనోరథములు సిద్ధింపజేయి! సమస్త రాక్షసవినాశకుడా! మా సర్వ సంకటములను నివారించి అసురులబారినుంచి రక్షించుము! ఓ పరమ కారుణికుడా! కరుణామయుడా! జ్ఞానమయుడా! అపరిమిత దయా స్వరూపుడైన నీకిదే మా నమోవాకములు! ఓ పరమాత్ముడా! సమస్త జ్ఞానమునూ నశింపచేసే సుఖములనూ, భోగములనూ ప్రసాదించి భక్తుల జ్ఞానమును నీమాయచే హరించే యోగమాయాస్వరూపా! నమస్కారము!

భక్తిహీనులైన పాషండుల సంపదలను హరించే పరమాత్ముడా! నిజభక్తులకు ముక్తిని ప్రసాదించే భవబంధవినాశకుడా! నీకివే మా నమోవాకములు. నమస్తే! నమస్తే!! సమస్త సృష్టియంతా వ్యాపించి విభాగము లేని ఏకాత్మస్వరూపుడా! విభక్తమైనట్లుగా సృష్టిరూపంలో గోచరించే అవిభక్తమూర్తీ! నీకిదే మా శరణాగతి!

ఓ పరమపరతత్త్వ జ్ఞానబోధకుడా! పరబ్రహ్మతత్త్వవిధుడా! గురు స్వరూపుడవైన నీకు తత్త్వవిబోధకునకు మా నివాళులు!

ఓ సమస్త భక్తుల బహుజన్మముల కర్మలకు సాక్షీభూతుడవైన కర్మసాక్షీ! జీవుల గుణస్వరూపుడవై వారి స్వభావాన్ని నడిపించే గుణ నాయకా! నమస్కారము!

పరమాత్ముడైన గణేశా! సుముఖుడా! సంకష్ట వినాశకుడా! మా సంకటములను నశింపచేయి. నమో నమస్తే! నమో నమః" అంటూ స్తోత్రంచేశారు దేవతలు! అంతట బ్రహ్మ మొదలైన దేవతలు ఈవిధంగా స్తోత్రంచేయగా పరమేశ్వరుడైన గణపతి దయార్ద్రహృదయుడై అనుగ్రహం తో వారిని చూస్తూ ఇలాచెప్పాడు :

**గణేశ ఉవాచ :**

ఓ దేవతలారా! మీ భక్తికీ, తపస్సుకూ, మీ మిక్కిలి ఆర్తితో చేసిన ఈ స్తోత్రమునకు నేను చాలా సంతుష్టుడనైనాను! మీ కోరికలేవో కోరుకుంటే తప్పక అనుగ్రహించగలను. అనగా దేవతలు :

ఓ పరమాత్ముడా! మీకు మాయందు దయకలిగితే చాలు! త్వరగా ఈ ఘోరరాక్షసుడైన త్రిపురాసురుని సంహరించు! మా సమస్త దేవతల అధికారాలన్నీ కబళించిన ఈ దురహంకారిని నిర్మూలించు! మా సమస్థ దేవతలకూ నీవు ఒక్కడవే అభయప్రదానమిచ్చి మా ఆత్మలకు కలిగిన సంకటములను నివారించగలవాడివి! ఓ సంకటమోచన గణేశా! నీకిదే మా భక్తిపూర్వక శరణాగతి చేస్తున్నాము! మాకు నీకన్నా పరదైవము లేదు! నీవే మాకు దిక్కు!" అని ప్రార్థించగా గణేశుడు వారితో :

**గణేశ ఉవాచ :**

ఓ దేవతలారా! తప్పక నీకు కలిగిన ఈ రాక్షసబాధను నివారి స్తాను! ఘోరమైన ఈ ఆపదనుండి రక్షింపచేయగల ఈ మీరుచేసిన స్తోత్రం శాశ్వతముగా నిలుచుగాక — 'సంకటనాశన గణపతిస్తోత్ర'మని! భవిష్యత్ కాలాలలో ఎవరైతే దీనిని పఠించి నాకు ప్రార్థనచేస్తారో వారందరికీకూడా సమస్త సంకటములు నివారించగలను. సమస్త కోరిక

లనూ అనుగ్రహించగలను. అంతేకాదు ఏమానవుడైనాసరే మూడు సంధ్యలలోనూ భక్తితో అనుష్ఠానపరుడై ఈ సంకటమోచన గణేశస్తోత్రాన్ని పఠిస్తారో అట్టివానికి ఎట్టి సంకటములు కలుగవని నేనిదే అనుగ్రహిస్తున్నాను!" అంటూ అమోఘమైన వరాన్ని దేవతలకు భగవంతుడైన గణపతి అనుగ్రహించి చూస్తుండగానే మెరుపు మెరిసినట్లు అంతర్ధానం చెందాడు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'స్తోత్ర నిరూపణం'** అనే 40-వ అధ్యాయం.



41

# బ్రాహ్మణాభీష్ట ప్రదానం

(మూలం)

## ఏక చత్వారింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

వరదేన గణేశేన ప్రభుణా సర్వకారిణా ।
కిం కృతం తన్మమాచక్ష్వ పృచ్ఛామిత్వాం చతురానన ॥ 1

**బ్రహ్మోవాచ :-**

తతో గజాననో విప్రరూపేణ త్రిపురం యయౌ ।
మహాసన సంవిష్టం దదర్శ ద్విజసత్తమః ॥ 2

ఉద్ధాయ స సమస్కృత్య స్వాసనే చోపవేశయత్ ।
సంపూజ్య పరిపప్రచ్ఛ కుత ఆగమ్యతే ద్విజ ॥ 3

కా విద్యా కిం చతే నామ పృచ్ఛతే బ్రూహిమేద్విజ ।
ప్రయోజనం చ కింతేస్తి శక్తి శ్చేత్కరవామహే ॥ 4

**ద్విజ ఉవాచ :-**

సాయం గృహ వయందైత్య సర్వజ్ఞాః సర్వవేదినః ।
ఇచ్ఛావిహారా లోకానాం భ్రమా మోహిత కామ్యయా ॥ 5

కలాధరేత్యేవ నామ్నా విఖ్యాతా భువనత్రయే ।
ద్రష్టుకామా వైభవం తే సంప్రాప్తా భవనం తవ ॥ 6

అఖిలాః సంపదస్తేతు దృష్ట్వా తృప్తాస్మ సాంప్రతం ।
న కైలాసే చ వైకుంఠే బ్రహ్మలోకేపి నేదృశీ ॥ 7

సదే శాక్రేన వైనం సద్యాదృశీ దృశ్యతే తవ । 8

**దైత్య ఉవాచ :-**

నామ మాత్రం కలాధారః కింవా జానాసి తాం ద్విజః ॥ 9

సంపదః సర్వలోకేషు యాభ్య ఏతాం ప్రశంససి ।
జానాసి చే ద్దర్శయ మే తాసాంమధ్యే మహోత్కటాం ॥ 10

దృష్ట్వా దాస్యే వాంఛితం తే ప్రియం ప్రాణమపి ద్విజ ।
నస్మరే పరిహాసేపి వితథం భాషితం మునే ॥ 11

**కలాధర ఉవాచ :-**

పరేషాం సంపదం దృష్ట్వా కిం స్యాత్తవ సురద్విష ।
వినయాత్తే ప్రసన్నోహం కలయాతే దదామి వై ॥ 12

కాంచనం రాజితం లోహం త్రిపురం శరసంస్థితం ।
రమ తత్ర స్థిరో దైత్య చిరకాలం యథాసుఖం ॥ 13

అభేద్యం దేవ గంధర్వైర్మానుషై రురగైరపి ।
కల్పితార్థ ప్రదం తత్తే కామగం కామదం శుభం ॥ 14

యద్వైవైకేన బాణేన కస్మింశ్చి త్కాలపర్యయే ।
భేత్స్యతే తత్ హరోదైత్య తదా నాశముపైష్యతి ॥ 15

బ్రహ్మోవాచ :-

ఇత్యుక్త్వా ధనురాదాయ సంస్థభ్య శరమంతరా ।
పురత్రయం నిర్మమేసౌ భువనత్రయ సన్నిభం ॥ 16

విచిత్రైర్భవనై రమ్యైః దీర్ఘికారామ సంయుతైః ।
నానా పక్షిగణైర్జుష్టం సర్వకామప్రదం ఖగం ॥ 17

మాయయా మోహితో దైత్య స్తత్రస్థో జహృషే భృశం ।
జగర్జ ఘనవద్దైత్యో లోకత్రయ వికంపనః ॥ 18

న మత్తో శ్రేష్ఠ ఇత్యేవం గర్వ దర్ప సమన్వితః ।
త్రైలోక్యం క్షోభయామాస బ్రాహ్మణం తమథా బ్రవీత్ ॥ 19

యాచస్వ దుర్లభతరం తత్తేదాస్యే ద్విజోత్తమ ।
ఇత్యుక్త్వా సద్విజః ప్రాహ తం దైత్యం`నిస్పృహోపినన్ ॥ 20

ద్విజ ఉవాచ :-

అహం కైలాసమగమం దృష్టవాన్ మూర్తి త్రమాం ।
శివేన పూజితాం సమ్యగ్గాణేశీం చింతితార్థదాం ॥ 21

తామానయ త్వం మేదేహి శక్తిర్యద్య సురేశ్వర ।
నైతాదృశీ మయామూర్తి త్రైలోక్యం చేరతేక్షితా ॥ 22

అతోమమ మనస్తస్యాం ఆసక్తం దైత్యసత్తమ ।
తాం ప్రాప్య కృతకృత్యోహం భవిష్యామ్య సురేశ్వర ॥ 23

కీర్తింతే ప్రథయిష్యామి త్రైలోక్యే సచరాచరే ।
న దాతా త్రిపురాచ్ఛ్రేష్ఠో వాంఛితం యః ప్రయచ్ఛతి ॥ 24

దైత్య ఉవాచ :-

శంకరం కింకరం మన్యే గణయే నచ దేవతాః ।
ఆనయిత్వా ప్రదాస్యామి తాం మూర్తిం ద్వీజపుంగవ ॥ 25

బ్రహ్మోవాచ :-

ఇత్యుక్త్వా పూజయామాస తం కలాధర మాదరాత్ ।
దదౌ తస్మై దశగ్రామాన్ గో వస్త్ర భూషణాని చ ॥ 26

ముక్తాఫలాని భూరీణి మహార్హాణీఇతరాణిచ ।
రత్నానిచ ప్రవాళాని రాంకవాస్తరణానిచ ॥ 27

దాసీదాస శతం నానా భూషాయుక్తం దదౌ అసురః ।
సదశ్వాన్ సవరూథాంశ్చ స్వర్ణాక్షాన్ రాజతాన్ రథాన్ ॥ 28

ప్రగృహ్యైత ద్భలాద్ధత్తం ప్రయయౌ స కళాధరః ।
స్వాశ్రమం హర్షయన్ పత్నీం సర్వానాశ్రమవాసినః ॥ 29

**బ్రహ్మోవాచ :-**

ఏవంచ సర్వవృత్తాంతం నారదోఽకథ యత్పురాన్ ।
తేపి కాలం ప్రతీక్షంతో దివసా నతి చక్రముః ॥ 31

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే నారదాగమనం**
**బ్రాహ్మణాశీష్వ ప్రదానం నామ ఏక చత్వారింశో అధ్యాయః**



# బ్రాహ్మణాభీష్ట ప్రదానం

## 41-వ అధ్యాయము

ఆ తరువాత పరాశరనందనుడైన వ్యాసమహర్షి "ఓ చతురాననా! అలా దేవతలకు వరప్రదానం చేశాక సకల గణాలకూ అధిపతియైన గణపతి వరదుడై ఏమేమి లీలలను గావించాడో — ఆ వివరాలను వినాలని కుతూహలంగా వున్నది. కనుక నాకు తెలియజేయవలసింది!" అన్న వ్యాసుని అభ్యర్థనకు బ్రహ్మ యిలా బదులిచ్చాడు.

"ఓ వ్యాసమునీంద్రా! దేవతలకందరికీ వరప్రదానం చేసిన గజాననుడు తానొక బ్రాహ్మణవేషందాల్చి త్రిపురుని సన్నిధికి వెళ్ళాడు. దేవేంద్రుని ఐశ్వర్యాన్నే మరపించేలా వెలలేని రత్నాలతో పొదగబడిన దివ్యసింహాసనాన్ని అధిష్ఠించి వున్న ఆ దానవుడిని చూశాడు.

అప్పుడు దిగ్గున సింహాసనంనుండి లేచి త్రిపురుడా బ్రాహ్మణుని ఎంతో ఆదరంగా తన ఆసనంపై కూర్చుండచేసి భక్తిశ్రద్ధలతో సపర్యలను చేసి పూజించి యిలా ప్రశ్నించాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా! నీవెవరు? ఎక్కడినుండి వచ్చావు? నీకు ఎందులో పాండిత్యమున్నది? నీవిలా రాజసభకు ఏ కార్యార్థివై వచ్చావు? నీ కోరికేదైనాసరే సంకోచించకుండా చెప్పు! నా శక్తిమేఱ నెరవేరుస్తాను!"

అప్పుడా బ్రాహ్మణుడు "ఓ దానవశ్రేష్టా! సాయంతనగృహం కలవాడిని, నాపేరు కళాధరుడు. త్రికాలవేదిని! నీ సంపదలను గూర్చి విని పేరు, ఖ్యాతి విని చూద్దామని వచ్చాను. నీకు గల భోగభాగ్యాలను అఖిలమైన సంపదలను చూచి సంతుష్టుణ్ణైయ్యాను. నీ సంపదా, ఐశ్వర్యమూ కైలాసంలోగాని, వైకుంఠంలోగాని సత్య, స్వర్గలోకాలలో ఎక్కడా కానరాదు!"

ఆ మాటలకు ఆ దైత్యుడిలా అన్నాడు :

"ఓ బ్రాహ్మణోత్తమా! నీవు పేరుకే కళాధరుడివి గాని, అన్ని లోకాలలోని విశేషాలనూ నీవెరిగున్నట్లే మాట్లాడుతున్నావే! నా సంపదనంతగా పొగుడుతున్నావే — అలాటి విశేషాలేమైనా నీవెరిగుంటే అలాంటి వాటిలో గొప్పదేదో నాకూ తెలియజేయి! నీ ప్రజ్ఞను నిర్ధారించుకుని నీ వాంఛితార్థముల నన్నిటినీ తీరుస్తాను. ఆడినమాట తప్పను! చివరికి నాప్రాణాన్నైనా సమర్పిస్తాను. ఇదిమట్టుకు యదార్థంసుమా!"

"ఓ దానవా! పరుల ఐశ్వర్యాన్ని గురించి తెలుసుకోవడంవల్లా వాటిని చూడటంవల్లా నీకేమిటి ఉపయోగం? ఐనా నీ వినయ విధేయతలకు ఎంతో ప్రసన్నుడనైనాను! నాకు కల్గినవి నీకు అనుగ్రహంగా యిస్తాను. బాణాలపైన నిర్మింపబడిన, బంగారు, వెండి, లోహముల ప్రాకారాలతో తయారైన త్రిపురాలనూ నీకు ప్రసాదిస్తాను.

ఆ పట్టణాలలో సుస్థిరంగా సుఖంగా నివసించు.

ఆ పురములు దేవతలకుగాని, మనుష్యులచేతగాని గంధర్వుల చేతగాని భేదింపబడరానివి — కోరుకున్న తావుకు వెళ్ళగల 'కామ గమనం' గలవై ఉండగలవు! సకలసకలైశ్వర్యాలూ ఆ పురములలో తాండవమాడతాయి. ఐతే ఏనాడైతే రుద్రుడు ఆ మూడింటినీ ఒకే బాణంతో భేదిస్తాడో అప్పుడు వాటితోపాటూ నీవూ నశిస్తావు!"

ఇలా అభయప్రదానంచేసిన కళాధరుడు ఒక ధనుస్సును పాతి దానిమీద త్రిపురాలనూ నిర్మించాడు. నానా చిత్ర విచిత్ర భవనములతో, రకరకాల దిగుడుబావులూ, ఉద్యానవనాలతోనూ అలరారుతూ, సకల పక్షిగణముల కిలకిలారావాలతో అంతరిక్షంలో వ్రేలాడే ఆ పురత్రయాన్ని తన మాయతో నిర్మించి యిచ్చాడు.

అలా తనని ఆ బ్రాహ్మణుని మాయ కప్పేయగా ఆ పురంలో తన నివాసమేర్పరుచుకొని నివసిస్తూ సంతోషంగా ఆ దానవప్రభువు కాలం గడపసాగాడు. ఆ సంతోషంతో, బలగర్వంతో గర్వోన్మత్తుడై మూడు లోకాలనూ గడగడ లాడించేలా గర్జించేవాడు. ఇలా మదగర్వంతో సకల లోకలవాసులకూ కంటకప్రాయుడై, త్రిపురుడు ఆ మాయాబ్రాహ్మణునితో యిలాఅన్నాడు :

"ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ఎట్టి దుర్లభతరమైన దాన్నైనాసరే కోరుకో! ఇస్తాను!" అనగానే — ఆ బ్రాహ్మణుడు నిష్కాముడైఉండీ మాయావిగనుక ఇలా వరాన్ని కోరుకున్నాడు :

"ఓ దానవా! నేను నీవద్దకు వస్తూ, మార్గమధ్యంలో కైలాసశిఖరా నికి వెళ్ళి అక్కడ పరమశివునిచేత అర్చించబడుతూన్న సకల కామప్రదు

డైన గణపతిమూర్తిని చూశాను. నీకు సామర్థ్యంఉంటే ఆ మూర్తిని తెచ్చి నాకివ్వు! అసలలాంటి మూర్తి మూడు లోకాలలోనూ నాకెక్కడా తటస్థపడలేదు! అందుచేతనే నా మనస్సు దానిపై పూర్తిగా లగ్నమై యున్నది.

అలాంటి మూర్తిని పొందటంవల్ల నేనూ కృతకృత్యుడనౌతాను! నీకూ అడిగినవారికి లేదనకుండా యిస్తావన్న ఖ్యాతి లభిస్తుంది!"

ఆ మాటలకు గర్వంతో వివశుడైన త్రిపురాసురుడు "ఓ బ్రాహ్మణోత్తమా! ఆ శంకరుడు నాకు కింకరుడే! నేను ఏ దేవతనీ లెక్కచేయను! నీవు కోరిన ప్రకారంగానే కైలాసమునకు వెళ్ళి అమూర్తి నీకు తెచ్చిస్తాను!" ఇలాఅని ఆ బ్రాహ్మణుని అత్యంత ఆదరంతో పూజించాడు. అతడికి లెక్కకుమీరిన ఆవులను, వస్త్రభూషణాలనూ, పదిగ్రామాలనూ, విలువైన ముత్యాలహారాలతోపాటూ, రత్నాలు, పగడాలు, తివాసీలు, దాసదాసీలు, బంగారు ఇరుసులతో ఒప్పే వెండిరథాలూ, ఉత్తమాశ్వములు మొదలైనవన్నీ సమర్పించాడు.

అప్పుడా కలాధరుడు బలాత్కారంగా తనకు సమర్పించబడిన సపర్యల నందుకొని తన ఆశ్రమానికి వెళ్ళి తన భార్యను యితర ఆశ్రమవాసులను సంతోషపరిచాడు. ఓ వ్యాసమునీంద్రా! ఈ జరిగిన యావద్వృత్తాంతాన్నీ నారదుడు దేవతాగణాలకు తెలియచెప్పాడు. అప్పుడు దేవతలుకూడా తగుకాలం కోసం నిరీక్షిస్తూ కాలం గడపసాగాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'బ్రాహ్మణాభీష్టప్రదానం' అనే 41వ అధ్యాయం.

42

# యుద్ధవర్ణనం

(మూలం)

## ద్విచత్వారింశో అధ్యాయః

వ్యాస ఉవాచ :-

కృతవాన్ కిముద్దైత్యః స గతే తస్మిన్కళాధరే ।
కథమానీయ దత్తాస్మై మూర్తి శ్చింతామణే ఝ్శుభా ॥ 1

ఏతత్కథయ మే సర్వం విస్తార్య చతురానన ।
లీలాః గజాననీః శృణ్వన్ న తృప్యామి సమాసతః ॥ 2

బ్రహ్మోవాచ :-

తస్మిన్గతే యదకరో త్సదైత్యో మునిసత్తమ ।
తత్సర్వం కథయిష్యామి శృణుష్వావహితో మునే ॥ 3

దూతం సంప్రేషయామాస మందరాద్రి స్థితం శివం ।
అశిక్షయత్ శివంగత్వా బ్రూత మద్వా క్యమాదరాత్ ॥ 4

మూర్తి శ్చింతామణేః త్రేస్తి గృహే సర్వార్థదా శుభా ।
దేహి తం దైత్యరాజాయ సామ్నైవ గిరిజాపతే ॥ 5

పాతాలే స్వర్గలోకేవా మర్త్యేవా పునరద్భుతం ।
తత్సర్వం తేన దైత్యేన హ్యానీతం స్వగృహే బలాత్ ॥ 6

శీఘ్రమానీయతాం దేవ యావో దైత్యం మహాబలం ।
నా దాస్యసే యదా సామ్నా తదా దైత్యః పరాక్రమీ ॥ 7

గ్రహిష్యతి బలాత్తాంతు తతోదుఃఖ మవాప్స్యసి ।
ఇతి దైత్యవచః శ్రుత్వా జగ్మతుస్తౌ శివంప్రతి ॥ 8

ఆహతుస్తౌ మహాదేవం దైత్యరాజేన శిక్షితం ।
ఇత్థం దూతవచశ్శ్రుత్వా త్రినేత్రః క్రోధమూర్ఛితః ॥ 9

ఉవాచ దూతౌ దూతౌవామితి కృత్వా క్షమే వచః ।
కామస్యేవ భవేద్భస్మ నోచేద్వాం నాత్రసంశయః ॥ 10

కిం కార్యం తేన దైత్యే స తృణీభూతేన మే విభోః ।
ఆయాతు యుద్ధమేవాస్తు మర్తుకామో మమంతికం ॥ 11

నేయం మూర్తిస్తేన శక్యా ప్రాప్తుం జన్మ శతైరపి ।
ప్రళయాగ్నిః పతంగేన కిం శాంతి మధిగచ్ఛతి ॥ 12

మేరోః పాతో మూషకేన శక్యః కర్తుం కిమోజసా ।
అసంఖ్య జలనిష్కాశా చ్ఛుష్కః స్యాత్కిం మహోదధిః । 13

బ్రహ్మోవాచ :-

శృత్వాతు శాంకరీం వాణీం దైత్యాః యాతా యధాగతం ।
అబ్రూ స్వామినం వాక్యం శతభునా యదుదీరితం । 14

తధాకర్ణ్య ప్రజజ్వాల దైత్యో వాక్యార్థకోవిదః
క్రోధానలేన దీప్తాసౌ త్రైలోక్యం ప్రదహన్నివ ॥ 15

ఆజ్ఞాపయచ్చ యుద్ధాయ స్వసేనాం చతురంగిణీం ।
నిర్గతా సహసా సేనా మందరాచల సమ్ముఖా 16

భూతలం ఛాదయామాస నిర్మర్యాదో యధాంబుధిః ।
అనేకసూర్య సంకాశా విక్రాంతైః శస్త్రసంచయైః ॥ 17

గర్జతీషు నవద్వారం మృత్యోర్మానస కంపినీ
దైత్య స్త్రిపురమారుహ్య విమాన సదృశం మహత్ ॥ 18

మనోవేగం తతః పశ్చా జ్జిఘాంసుః శంభు మాయయా ।
బృహ హన్మణిమయం చారు కవచం కుండలేంగదే ॥ 19

ముక్తామాలాం ముద్రికాశ్చ కటిసూత్రం చ కాంచనం ।
మకుటం రత్నఖచితం మహార్ఘం బిభ్రదుల్లసత్ । 20

యస్య శబ్దేన మహతా చకంపే హరమానసం ।
తద్ధనుః సనిషంగం చ కౌర్మం ఖేట మసిం దృఢం ॥ 21

శుశుభే శక్తికా దివ్యావ వహద్యాం దైత్యపుంగవః ।
వందిన శ్చారణాశ్చాపి యయు రస్యాగ్రతోముదా ॥ 22

శంకరో దూతవాక్యేన శృత్వా దైత్యం సమాగతం ।
అసంఖ్య బలసంయుక్తం యుయుత్సుం కాలకర్షితం ॥ 23

శూలపాణిరపి తదా సంపూజ్య ద్విరదాననం ।
ప్రణమ్య తం పరిక్రమ్య పురస్కృత్య బలంబలాత్ ॥ 24

అయయౌ క్రోధదీప్తార్వః స్వస్థలాద్రణ మండలం ।
తే వీరా వీరశబ్దేన నాదయంతో దిశోదశ ॥ 25

అభిజగ్ముః ప్రహరణైః పరస్పర వధేప్సవః ।
అభూతాం మీలితే రజనౌ స్తిమిరసంకులే ॥ 26

స్వ పర జ్ఞానరహితే జఘ్నుతూ రణమూర్ధని ।
అభవత్తుములం యుద్ధం నప్రజ్ఞాయతం కించన ॥ 27

గజాశ్వ రథ వీరాణాం హతానాం శోణితో క్షితే ।
శాంతే రజస్యయుధ్యంత వీరావీరై పృథక్ పృథక్ ॥ 28

కేచిత్ప్రాసైః కేపిఖడ్గైః కేచిత్బాణైః శిలాశిలైః । 29

తృష్టిభి ర్మృష్టిభిః కేచిత్కేచిత్ త్పరశు తోమరైః ।
హతానాం తత్ర వీరాణాం హయానాం చ పదాతినాం ॥ 30

అసృత్ నదీ సమభవత్ కేశ శైవల వాహినీ ।
ఖేటకూర్మాః ఖడ్గమత్స్యా శిరః కమల భూషణా । 31

ఛత్రా వర్తా ఘోరతరా కబంధ వృక్షవాహినీ ।
వీర సంతోష జననీ గృధ్ర గోమాయు హర్షకృత్ ॥ 32

దృష్ట్వా నదీంతు గిరిశో యయౌ దైత్యాంతికం బలీ ।
దైత్యోపి త్రిపురారూఢో యయౌ తస్య పురః పురః ॥ 33

నాయకౌ సంగతౌ దృష్ట్వా ద్వంద్వశోన్యే పరస్పరం ।
అవ్యాకులం యుయుధిరే దైతేయాః శాంభవాస్తదా ॥ 34

నానా ప్రహరణై ర్దివ్యై శస్త్రై రస్త్రై ర్ధమైరపి ।
తేషాం యుద్ధాని నామాని కథయిష్యే సమాసతః ॥ 35

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**యుద్ధవర్ణనం నామ ద్వి చత్వారింశో అధ్యాయః**



# యుద్ధవర్ణనం
## 42-వ అధ్యాయము

"ఓ కమలసంభవా! కలాధరుడనే ఆ బ్రాహ్మణుడు వెళ్ళిపోయాక ఆ దైత్యుడైన త్రిపురుడు ఆ చింతామణి గణేశుని మూర్తిని ఎలా తెచ్చిచ్చాడు? ఆ వివరం నాకు తెలియజేయి! భక్తాభీష్టప్రదుడైన గజాననుని లీలల్ని ఎంతగా విన్నా తనివితీరటంలేదు!" అన్న వ్యాసుని వచనాలకు బ్రహ్మ మనోహరంగా చిరునవ్వులు చిందిస్తూ

"ఓ కృష్ణద్వైపాయనా! అనంతరం ఆ త్రిపురుడు ఏమిచేశాడో ఆ వివరాన్నంతా చెబుతాను. సావధానమనస్కుడవై విను!"

"అలా ఆ కళాధరుడిచేత ఉత్తేజితుడైన త్రిపురుడు మందరాద్రి పైన ఉన్న శంకరుడివద్దకు తన దూతల్ని ఇరువురిని ఈ సందేశంతో పంపించాడు. 'నీవద్ద అత్యంత శుభకరమూ, సకలార్థప్రదమూ యైన చింతామణి గణేశుని మూర్తి ఉన్నదట! దాన్ని మా దైత్యరాజైన

త్రిపురునికి సామపూర్వకంగా సమర్పించు! అంతేకాదు త్రైలోక్య ప్రభువైన అతని వద్దకు ముల్లోకాలలోనూ శ్రేష్టములైన వస్తువులన్నీ చేరాయి. నీ శ్రేయస్సును కోరుకునేవాడవైతే వెంటనే మాకది తెచ్చివ్వు! లేదా నీవు మా దైత్యేంద్రుని ఆగ్రహజ్వాలలకు గురికాగలవు!'

ఆ మాటలు విన్న శంకరుడు భగ్గున మండిపడ్డాడు. 'ఓ దూతలారా! కేవలం మీరు దూతలైనందుననే బ్రతికిపోయారు. లేకపోతే ఈపాటికి మీరూ మన్మధుడిలా నా క్రోధాగ్నికి ఆహుతై భస్మీభూతులయ్యేవారు! మీ ప్రభువు నాకొక గడ్డిపోచతో సమానం! అతనితో నాకేమి ప్రసక్తి? మృత్యువును కోరుకునేటట్లయితే నాతో తలపడమనండి!' ప్రళయ కాలాగ్నిని తుమ్మెద ఆర్పలేనట్లు, మూషికం మేరువును క్రింద పడతోయలేనట్లు మీరాజు యింకా వెయ్యి జన్మలెత్తినాసరే ఆ గణేశ మూర్తిని నావద్దనుండి పొందటం అసాధ్యం! ఈమాటని వెళ్ళి మీ ప్రభువుకు చెప్పండి!"

"ఓ వ్యాసమునీంద్రా! శంకరుని ఈ ప్రతివచనాలను — త్రిపురుని దూతలు ఆఘమేఘాలమీద అతడివద్దకు వినిపించారు! వాక్యార్థములను గ్రహించటంలో ప్రవీణుడైన త్రిపురుడు అగ్గిమీద గుగ్గిలంలా మండిపోయాడు ఈ ప్రత్యుత్తరాన్ని విని! అంతే! తన సర్వసేనల్నీ యుద్ధానికి సమాయత్తపరిచాడు. చతురంగబలాలనూ వెంట తీసుకొని మందర పర్వతం వద్దకు శివునిపై యుద్ధానికి తరలివెళ్ళాడు.

సకల శస్త్రాస్త్ర సమన్వితులైన సేనలతో కామగమనంగల తన మూడు పురాలనూ అధిరోహించి మనోవేగంతో శంకరుడిపైకి తలపడ

టానికే నిశ్చయించుకొని దీపంవద్దకువెళ్ళే శలభంలా వెళ్ళాడు. రత్న కిరీటాన్ని, ఖడ్గఖేటకాలనూ, ధనుర్బాణాలనూ ధరించి, హరుని మనస్సునే భయంతో కంపింపచేసేలా సింహగర్జనలనుచేస్తూ తాను బయలుదేరి వెళ్ళాడు. ఆ అపురూప సంగ్రామాన్ని కనులారా తిలకించాలని దేవతలు ఉవ్విళ్ళూరసాగారు. త్రిపురుడు యుద్ధసన్నద్ధుడై వచ్చాడన్న వార్తను విన్న శంకరుడు గజాననుని అర్చించి ప్రదక్షిణ నమస్కారాదులను సమర్పించి క్రోధాగ్నిజ్వాలలను నేత్రాలలోంచి క్రక్కుతూ బైలుదేరాడు.

ఆ సేనావాహిని పదఘట్టనలకు భూమి యావత్తూ అదిరింది! పైకి ధూళిలేచి నా-పర భేదాలు తెలియని స్థితిలో యిరుసేనలూ సంకుల సమరానికి దిగారు! అలా జరిగిన భీకర సంగ్రామంలో తెగిపడ్డ ఏనుగుల, గుఱ్ఱాల తలలతోనూ, పారుతున్న రక్తం ఏరులై ప్రవహించింది. ఆ రక్తప్రవాహంలో కొట్టుకొనిపోయే శిరస్సులూ, మొండె ములను చూసిన శంకరుడు రోషపరవశుడై ఒకపెట్టున ఆ రాక్షసునిపైకి ఉరికాడు.

ఆ త్రిపురుడు కూడా తన పురముల నధిరోహించి శివునెదుర్కోగా ఇరు సైన్యాలలోని ప్రధానులూ ఒకరితో నొకరు ద్వంద్వయుద్ధానికి పూనుకున్నారు. శస్త్రాస్త్రాలతోనూ, పెరికిన చెట్లతోనూ ఒకరినొకరు మోదుకోసాగారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
"యుద్ధవర్ణనం" అనే 42వ అధ్యాయం.



43

# త్రిపురవిజయం

(మూలం)

## త్రి చత్వారింశో అధ్యాయః

**బహ్మోవాచ :-**

అయుధ్యేతాం ద్వంద్వశోఽథ గిరీశా సురనాయకౌ
షణ్ముఖేన ప్రచండశ్చ నందినా చండఏవచ ॥ 1

యుయుధే పుష్పదంతోపి భీమకాయేన వీర్యవాన్
భ్రుశుండీ కాలకూటేన విషవక్త్రాణ హారిణా । 2

అయుధ్యేతాం వీరభద్రః వజ్రదంష్ట్రౌ మహాబలౌ
ఇంద్రోపి యుయుధే తత్ర దైత్యామాత్యేన వీర్యవాన్ 3

దైత్య పుత్రేణ బలినా జయంతో యుద్ధ దుర్మదః
కావ్యేన యుయుధే తత్ర సూరాచార్యో అ స్త్రవిత్తమః 4

దేవానాంచైవ దైత్యానా మేవం ద్వంద్వా న్యనేకశః । 5

వర్ణితుం నైవశక్యాని మయావర్ష శతైరపి ॥ 6

రథినో రథిభిస్సార్థం గజినో గజిభిస్సహ ।
పదాతాశ్చ పదాతిభిః అశ్వారోహాః స్వ సదృశైః ॥ 7

యుయుధుః సంయుగే నానా వాద్యనినాదితే ।
హేషితైబృం హితైఃక్ష్వేళై ర్నేమినాదైశ్చ శబ్దితే ॥ 8

కేచిచ్చ మల్లయుద్ధేన యుయుధు ర్వివిధేన తు ।
జఘ్నురంగాని చాంగేషు త్యక్త్వా శస్త్రాణి సంయుగే ॥ 9

తతః ప్రచండో నవభి స్తాడయామాస షణ్ముఖం ।
ఆకర్ణాకర్ష నిసృతై దృఢైర్బాణైః శిలాశితైః ॥ 10

అప్రాప్తానేవ త్యాచ్ఛిత్వా శరైః సన్నతపర్వభిః ।
కార్తికేయః పంచభిస్తం తాడయామాస సాయకైః ॥ 11

సంమ్మూర్ఛితో ఉపతద్భూమౌ ప్రచండో భ్రాంతమానసః ।
నందినాపి హతశ్చండః పంచభిర్నిశితై శ్శరైః । 12

మూర్ఛామవాప సహసా పతితో ధరణీతలే ।
భీమకాయః పుష్పదంతం అవిధ్య ద్దశభిశ్శరై ॥ 13

ఛాదయామాస సమరే స్వశరైః నిశితైశ్శతాన్
బిభిదే వాహనత్తంచ సోపి భూతలమాశ్రితః ॥ 14

కాలకూటం భుశుండిస్తు పాతయామాస పంచభిః ।
శరై ర్మహాబలస్తత్ర వీరభద్రో రుషాయుతః ॥ 15

వజ్రదంష్ట్రం తతోజఘ్నే చతుర్భిర్నిశితై శ్శరై ః ।
తాన్నివార్య స్వయం జఘ్నే వీరభద్రం త్రిభిశ్శరైః ॥ 16

తానాపతత ఏవాశు వీరభద్రోఽచ్ఛినత్త్రిభిః ।
పాతయామాస వేగేన వజ్రదంష్ట్రం త్రిభిశ్శరైః । 17

ఇంద్రోపి వజ్రపాతేన దైత్యామాత్యం న్యపాతయత్ ।
ఉద్యమ్య నిశితం ఖడ్గం దైత్యపుత్రః సమాయయౌ ॥ 18

హంతుకామో జయంతం తం వీరేషు పతితేషుచ ।
తం నిరీక్ష్య తదాయాంతం ఖడ్గం చిచ్ఛేద పత్రిణా । 19

జయంతో భ్యహనత్ శీఘ్రం దైత్యసూనుం త్రిభిశ్శరైః ।
తైరాహతో వమన్ రక్తం న్యపతన్మోహసంయుతః ॥ 20

ఏవం సర్వేషు సైన్యేషు ప్రభగ్నేషు సమంతతః ।
దృష్ట్వా పలాయనపరాన్ దైత్యాన్ దేవగణార్దితాన్ । 21

అధావన్ పృష్ఠతః కేచిత్ ప్రంమథాః జయశాలినః ।
ఏవం జయత్సు దేవేషు స్వసైన్య విద్రుతేపిచ ॥ 22

అయయౌ స్వయమేవేశం త్రిపురాధిష్ఠితో సురః ।
శస్త్రయుద్ధం పురాకృత్వా యుధ్యేతా మస్త్రతోహ్యుభౌ ॥ 23

వారుణాస్త్రం జహోద్దైత్యో వృష్టిర్ఘోరతరా భవత్ ।
నీహారబాహంతే యుద్ధే న ప్రాజ్ఞాయత కించన ॥ 24

క్వచి ద్విద్యుత్ప్రకాశేన స్వపర జ్ఞానకారిణా ।
యుద్ధమాసీత్ సుములం ఘోరరూపం దురాసదం ॥ 25

విలోక్య సైన్యం తత్సర్వం వృష్టివాత ప్రపీడితం ।
శిలాపాతభయం ద్యాతే స్వసైన్యేతు దిశోదశ ॥ 26

వాయవ్యమస్త్రం గిరిశో మోచయామాస సత్వరం ।
మహావాతా న్మహామేఘాః విశీర్ణాః ఖండశోంబరే ॥ 27

వాతేన ఘూర్ణితా సేనా దైత్యానాం సర్వతోదిశం । 28

జగణః పక్షిషిచ్ఛాని వీరోష్ణిషాణి దూరతః
పతితా ఘూర్ణితా కేచిద్రథాశ్వ గజపత్తయః ।
ఉన్మీలితా లతావృక్షా శ్ఛాదయంతి స్మ సైనికాన్ ॥ 29

పన్నగాస్త్రేణ తం వాయుం తథాదైత్యో న్యవారయత్ । 30

ఆకర్ణం ధనురాకృష్య తుణాద్బాణం ప్రగృహ్యాచ
మంత్రయన్ననలాస్త్రేణ శివసైన్యే న్యపాతయత్ ।
అంగారవృష్టిః సహసా పతితాసర్వదాహినీ ॥ 31

ప్రళయం మేనిరే సర్వే జ్వాలామాలాభి రర్దితాః ।
జ్వాలాభ్యో దీప్యమానాభ్యో మహాభీతికరంః పుమాన్ ॥ 32

ఆవిరాసీ న్మహాకాయో లిఖన్మూర్ధ్నా నభస్థలం ।
దంష్ట్రాకరాళవదనో మహారావః క్షుధాతురః ॥ 33

లాలయన్ రసనాం ఘోరాం శతయోజన విస్తృతాం ।
నాసా పవనవేగేన భ్రమయన్ కుంజరాన్ రణే ॥ 34

భక్షయామాస తాం సేనాం ఉరగానివ పక్షిరాట్
అపీపలద్గర్గసేనా తేన పుంసా ప్రపీడితా 35

శివపృష్ఠం సమాసాద్య రక్ష రక్షేతి చాబ్రవీత్ ।
మాభీష్టేత్యభయం తస్యై దత్వా వహ్నిం న్యవారయత్ ॥ 36

పర్జన్యాస్త్ర ప్రపాతేన తత్ క్షణాద్గిరిజాపతి ।
బాణేనైకేన తం ఘోరం పురుషం స న్యపాతయత్ ॥ 37

తత ఉద్ధాయ పురుషో భభక్ష శివసైనికాన్ ।
యుయుః పలాయనపరాః ప్రమథా భయవిహ్వలాః ॥ 38

స్కలంతో నిపతంతశ్చ నిశ్వసంత అశ్రుకంపిరే ।
శివోపి నిస్సహాయత్వా ద్దరీమేవా న్వపద్యత ॥ 39

షడాననాదయో వీరా అనున స్రస్తమేవహి ।
జిష్ణుః క్షుర్గిరిజాంద్రైత్యో విచింత్యై కాకినీం గిరౌ । 40

విహాయ రణభూమింతు యయౌ కైలాసమేవసః ।
దూరాద్దృష్ట్వా తమాయాంతం చ కంపేగిరిజా తదా ॥ 41

ఉవాచ పితరం గత్వా దైత్యోమాం కిన్నునేష్యతి ।
తస్యాస్తద్వచనం శృత్వా నీత్వా తాం దుర్గమాం గుహాం ॥ 42

అవిజ్ఞాతాం స్వేతరేణ స్థాపయామాస నిర్భయాం ।
సోపి దైత్యస్తతో హైమం గిరిం రత్నగ్రహణేచ్ఛయా । 43

అగతో నదదర్శాథ గిరిజాం క్వాపిసత్తమ 44

భ్రమన్ దదర్శతత్రైకాం మూర్తిం చింతామణేశ్శుభాం ।
సహస్ర సూర్యసంకాశం నానాలంకారశోభినీం । 45

త్రైలోక్యసుందరాం సద్యోగృహిత్వా స్వస్థలం యయౌ । 46

నానావాదిత్ర నిర్ఘోషైః స్తువద్భి ర్వంశిభి ర్వృతః ।
తతః పాతాళమగమ త్సర్వత్ర విజయీ బలీ । 47

గచ్ఛతస్తస్య దైత్యస్య హస్తేప్యంతర్హితా తథా ।
మూర్తిశ్చింతామణేః పాతు తదద్భుత మివాభవత్ । 48

తమేవాశకునం మత్వా తత్పురం పునరావిశత్ ।
అత్యంతం దురంతాం విమానాశ్చింతాం సముపాగతః । 49

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**త్రిపురవిజయో నామ త్రి చత్వారింశో అధ్యాయః**



# త్రిపురవిజయం
## 43-వ అధ్యాయము

అప్పుడు బ్రహ్మ పరాశరాత్మజుడైన వ్యాసమునీంద్రునితో యిలా యుద్ధవర్ణనం చేయసాగాడు "త్రిపురుడు నేరుగా శంకరుడితో తలపడ్డాడు. ప్రచండునితో షణ్ముఖుడు పోరసాగాడు. చండుని శివవాహనమైన నందీశ్వరుడెదుర్కొన్నాడు. పుష్పదంతుడు భీమకాయునితోనూ, భ్రుశుండుడు కాలకూటుని తోనూ, వీరభద్రునితో వజ్రదంష్ట్రుడును, ఇంద్రుడు దైత్యామాత్యునితోనూ జయంతుడు దైత్యకుమారునితోనూ, సకల అస్త్రాలను ఎరిగివున్న బృహస్పతి శుక్రాచార్యునితోనూ — యిలా అనేకమంది దేవతాగణాలు రాక్షసులతో ద్వంద్వయుద్ధానికి తలపడ్డారు. రథికులు రథికులతోనూ గజారోహకులు గజారొహకులతోనూ, అశ్వికులు అశ్వారోహకులతోనూ పదాతులు పదాతిదళములతోనూ, ఘోరంగా ఆ రణరంగంలో తలపడ్డారు. కొందరు అస్త్రశస్త్రాలను విడిచిపెట్టి మల్లయుద్ధానికి దిగారు. ప్రచుండుని తొమ్మిది బాణాలనూ దేవసేనాపతియైన

కుమారస్వామి మార్గమధ్యంలోనే త్రుంచివేశాడు. అప్పుడు కుమారుడు తన ఐదు వాడిశరాలలో ప్రచండుని మూర్ఛిల్లచేయగా — అతడు నేలకొరిగాడు. భీమకాయుని బాణాలను పుష్పదంతుడు తృంచివైచి, అతనిని తిరిగి తన మూడు వాడి బాణాలతో నేలకూల్చాడు. అలాగే భ్రుశండుని చేతిలో కాలకూటుడు పడగొట్టబడ్డాడు. వీరభద్రుడు, వజ్ర దంష్ట్రుడూ పరస్పరం బాణాలను ఒకరిపై ఒకరు కురిపించుకున్నారు.

ఇంద్రుని వజ్రాయుధం వ్రేటుకి దైత్యామాత్యుడు మరణించాడు జయంతుడు విజృంభించి దైత్యకుమారుని తన బాణాలతో వధించాడు. అతడు వెంటనే నెత్తురుక్రక్కుతూ మరణించాడు. ఇలా అనేకవిధాలుగా రాక్షససైన్యమంతా వధింపబడటం చూసిన ఆ అసురరాజు క్రోధోద్రిక్తుడై నేరుగా శంకరునితోనే యుద్ధం చేయమొదలెట్టాడు. ముందుగా శస్త్రాల తోనూ ఆ తరువాత అస్త్రాలతోనూ, ఆ ఉభయులూ భీకరమైన యుద్ధం ఆరంభించారు. శివునిపై ఆ అసురుడు వారణాస్త్రం ప్రయోగించి, వర్ష వృష్టిని కురిపించాడు. తన దేవతాసైన్యమంతా అలా వర్షంతో పీడింప బడటం గమనించిన శంకరుడు వెంటనే వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించి ఆ మేఘాలను చెల్లాచెదురు చేసేశాడు.

ఆ ఝుంఝూమారుతానికి తెగిపడ్డ వీరుల శిరస్సులు అన్ని వైపులా ఎగురకొట్టబడ్డాయి! రథాలతో ఢీకొట్టబడిన రథాలు, ఏనుగులతో ఏనుగులు, గుఱ్ఱములతో గుఱ్ఱాలు ఢీకొని, చూర్ణం కాసాగాయి! ఆ మహావాయువుచేత వృక్షాలూ, లతలూ పెకలించబడి రణరంగాన్నంతటినీ కప్పవేశాయి.

ఇలా రాక్షససేనను పీడిస్తున్న వాయవ్యాస్త్రాన్ని పన్నగాస్త్రం వైచి త్రిపురుడు మరలగొట్టాడు. చెవిదాకా వింటినారిని సారించి, మంత్రించిన ఆగ్నేయాస్త్రాన్ని దేవతాసైన్యాలపై ప్రయోగించాడు! ఏదో అగ్ని ప్రళయమే సంభవించిందేమోనన్న భయంతో అందరు కంపిస్తూండగా, ఆ మండు తున్న జ్వాలలలోంచి ఒక భీకరాకారుడు ఉద్భవించి, ఘోరంగా విజృం భించి దేవతాసైన్యాల నన్నింటినీ కబళించసాగాడు. ఆ భయానికి శివ సేనలన్నీ శివుని వెనుకదాగి 'రక్ష! రక్ష!' అంటు మొరలుపెట్టారు! శివుడు తన సైన్యాన్ని భయపడవలదంటూ ఆశ్వాసించి, పర్జన్యాస్త్రం ప్రయోగించి ఆ పెనుభూతాన్ని వెనక్కి మరల్చాడు! ఒక బాణంతో ఆ అఘోర పురుషుని పడవేయగా — అతడు వెంటనే లేచి శివుని సైనికులను ఆరగించసాగాడు. ప్రమథగణాలన్నీ భయభ్రాంతులై నలుదెసలకూ పారి పోగా శివుడు నిస్సహాయుడై పర్వతగుహలో తలదాచుకోవాల్సి వచ్చింది.

## త్రిపుర విజయం

దేవసేనాధిపతియైన కుమారస్వామి మొదలైన వారందరూ శివుని అనుసరించారు. ఒంటరిగావున్న పార్వతిని చెరపట్టదలచి, మేరుపర్వతానికి దండెత్తినట్లు వెళ్ళాడు త్రిపురుడు. అతణ్ణి అల్లంతదూరాన్నే గమనించిన గిరినందన తన దండ్రియైన హిమవంతుని చెంత గుహలో తలదాచు కున్నది!

అప్పుడామెను ఎలాగైనా పట్టుకోవాలని తీవ్రంగా యత్నించి విఫలుడై, అంతటా ఆ పార్వతిని అన్వేషిస్తూ వస్తున్న త్రిపురునికి మార్గ మధ్యంలో కోటిసూర్య ప్రకాశమానమై, అన్ని అలంకారాలతోనూ శోభి

స్తున్న 'చింతామణీగణేశ విగ్రహాన్ని' చూడటం జరిగింది! ఆ విగ్రహాన్ని సంగ్రహించి తన స్వస్థానానికి చేరుకున్నాడు. వందిమాగధులు జయజయ ధ్వానాలు చేస్తుండగా, త్రిపురుడు పురప్రవేశం చేసి అక్కడినుండి పాతాళంలో తన విజయాన్ని చాటుకోదలచి వెళ్ళసాగాడు! ఇంతలో అకస్మాత్తుగా అతని చేతిలోని వైనాయకమూర్తి అంతర్ధానమైంది!

త్రిపురుడు ఈ హఠాత్పరిణామానికి ఖిన్నుడై, ఇదొక అపశకునంగా భావించి, మూర్తియొక్క వియోగానికి చింతిస్తూ, తన నగరాన్ని చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'త్రిపురవిజయం' అనే 43-వ అధ్యాయం.



44

# నారదాగమనం - గణేశదర్శనం

(మూలం)

## చతుశ్చత్వారింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

తతః కిమకరోచ్ఛంభు స్త్రిపురేణ పరాజితః ।
కథం తమజయద్దైత్యం త్రిపురం జయశాలినం ॥ 1

**బ్రహ్మోవాచ :-**

తతశ్శంభుః పరాం చింతామాపేదే మనసాసకృత్ ।
స్వాహాస్వధా విహీనంతు భూతలం పరిచింతయన్ । 2

కదా స్వస్థానగా దేవా భవిష్యంతి గతజ్వరాః ।
కేనో పాయేన వాసః స్యాద్దుర్జయస్య పరాజయః 3

ఏవం చింతాతురే తస్మిన్ నారదో మునిసత్తమః ।
ఆయయౌ శంకరం ద్రష్టుం దేవాన్ సర్వాన్ యదృచ్ఛయా ॥ 4

తందృష్ట్వా జహృషో దేవో మర్త్యః ప్రాప్య యథామృతం ।
పూజయామాస విధివత్కృతాసన పరిగ్రహం ॥ 5

ఆలింగ్య తమువాచేద్ధం శివశ్చింతాతురో మునిం ।
దేవానాం హితమన్విచ్ఛన్ దైత్యస్య వధమేవచ ॥ 6

**శివ ఉవాచ :-**

దైత్యేన సర్వదేవానాం కదనం కృతమోజసా ।
తద్రణేభగ్న సంకల్పాః సర్వేదేవాః పలాయితాః । 7

యాతా దశదిశో బ్రహ్మన్ కః కుత్రాస్తే నవేద్మ్యహం ।
మమాప్యస్త్రాణి తేనాస్త్రైః ప్రభగ్నాని సహస్రశః ॥ 8

**బ్రహ్మోవాచ :-**

శృత్వా శివవచః సోముమవాదీన్ముని సత్తమ ।
మత్వా సః పరమాశ్చర్యం త్రైలోక్యేశ పరాభవం । 9

**నారద ఉవాచ :-**

సర్వజ్ఞె సర్వవిద్యేశే సర్వేశే సర్వకర్తరి ।
సర్వావనే సర్వహరే సర్వస్యాపి నియంతరి ॥ 10

శక్తే కర్తు మకర్తుం వాన్యథా కర్తుమపి ప్రభో ।
అణిమాది గుణోపేతే షడైశ్వర్య విలాసిని ॥ 11

కిం వక్తవ్యం మయాదేవ సర్వవక్తు వరేత్వయి
మునినా గాన సక్తేన త్రిలోకేం భ్రమతానిశం 12

తవ వాక్యానురోధేన విచార్య ప్రాబ్రవీమ్యహం ।
ఏవముక్త్వా క్షణం ధ్యాత్వా పునః ప్రాహ శివంమునిః । 13

**మునిరువాచ :-**

యుద్ధాయ గంతుకామేన నార్చితో గణపస్త్వయా ।
అతః పరాభవం ప్రాప్తో వహ్నినేత్రః పినాకధ్రుత్ । 14

ఇదానీమర్చయ పురా విఘ్నేశం విఘ్నవారణం ।
ప్రసాద్య తద్వరం లబ్ధ్వాయాహి యుద్ధాయ సాదరం । 15

పరాజేష్యతి తం దైత్యం నాత్రకార్యా విచారణా । 16

**బ్రహ్మోవాచ :-**

తేనాపి త ప్రసాదేవో మహితారాధితః పురా 17

తేనతస్మై వరోదత్తోఽఖిలవిఘ్నౌఘహారిణా ।
మహేశ్వరం వినామృత్యు ర్నకేనాపి భవేత్తవ ॥ 18

తస్మాద్గిరిశ తస్యేదం కామగం తు పురత్రయం
ఏకేషుణా దారయ స్వజయోపాయో యమీరితః । 19

ప్రహర్షమతులం లేభేశ్రుత్వోపాయం మునే శివః
శ్రుత్వా గజానన గిరం పూర్వోక్తాం ప్రాహతం మునిం । 20

**శివ ఉవాచ :-**

సత్యముక్తం త్వయా బ్రహ్మన్ స్త్వద్వాకేన స్మృతం
మయా ఉపదిష్టో పూర్వమేవ మంత్రౌ తేన మునే మమ । 21

షడక్షర ఏకాక్షరౌ తౌ సర్వసంకట హారకౌ ।
యుద్ధే వ్యాసక్తచిత్తైన నజస్తౌ నచనంస్మృతౌ ॥ 22

సర్వవిఘ్నహరో దేవో న స్మృతోహి గజాననః ।
సర్వేషాం కారణం కర్తా పాతాహర్తా వినాయకః । 23

**మునిరువాచ :-**

తం తోషయ మహాదేవ మహాదేవం గజాననం ॥ 24

**బ్రహ్మోవాచ :-**

విసర్జ్య నారదం దేవో జగామ తపసే శివః ॥ 25

దండకారణ్య దేశేతు పద్మాసన స్థితో జపత్ ।
ప్రణిధాయ బలాత్ ఖాని నియమ్యధ్యాన తత్పరః ॥ 26

సోతపత్ తప ఉగ్రంతు శతవర్షాణి శంకరః ।
తతస్తన్యముఖాంభోజాని ర్గతస్తు వుమాన్పర । 27

పంచవక్త్రో దశభుజో లలాటేందు శ్శశిప్రభః ।
ముండమాలః సర్పభూషో ముకుటాంగద భూషణః । 28

అగ్న్యర్క శశినో భాభిస్తిరస్కుర్వన్దశా యుధః
తద్భాసా ధర్షితో దేవో పశ్యదుగ్రం పురః స్థితం । 29

వినాయకం పంచముఖం పంచాస్యమపరంశివం 30

తం దృష్ట్వా తర్కయద్దేవః కిమహం ద్వివిధోఅభవం । 31

కింవా మమైవరూపేణ త్రిపురోయ మిహాగతః
త్రయస్త్రింశత్కోటి దేవేష్వ పరః పంచవక్త్రవాన్ ॥ 32

అథవా స్వప్న ఏవాయం దృష్టో దీర్ఘతరో మయా ।
అథవా మేవరం దాతుం ఆగతోయం గజాననః । 33

సర్వవిఘ్నహరం దేవం యంధ్యాయామి దివానిశం । 34

బ్రహ్మోవాచ :-

ఏవమాకర్ణ్య తద్వాక్యం ఉవాచ ద్విరదాననః ॥ 35

అంతర్యస్మరితో దేవః సోయం విఘ్నహరో విభుః
నమే స్వరూపం జానంతి దేవర్షి చతురాననాః । 36

న వేదాః సోపనిషదః కుతః షట్శాస్త్ర వేదినః ।
అశేష భువనస్యాహం కర్తా పాతాపహారకః 37

బ్రహ్మాదిస్థావర చర త్రిగుణానామహం ప్రభుః ।
తపసానేన తుష్టోహం వరందాతుంమిహాగతః
వరాన్వృణు మహాదేవ యావతోమత్త ఇచ్ఛసి । 38

**ఇతి శ్రీగణేశపురాణే ఉపాసనాఖండే నారదాగమనం,**
**గణేశదర్శనం నామ చతుశ్చత్వారింశో అధ్యాయః**



# నారదాగమనం - గణేశదర్శనం

## 44-వ అధ్యాయము

"త్రిపురాసురునిచేత పరాజితుడైన శివుడు ఆ తరువాతేమి చేశాడు? పరాక్రమంతోనూ, వరబలగర్వంతోనూ మత్తుడైన, ఆ రక్కసుని ఎలా చిత్తుచేశాడు?' ఆ వివరం నాకు తాము దయతో తెలుపవలసింది" అంటూ ప్రార్థించిన ఆ పరాశరనందనునితో చతుర్ముఖుడిలా బదులిచ్చాడు.

"నాయనా! ఆ రకంగా త్రిపురునిచేత ఓడించబడి కొండగుహలో తలదాల్చుకోవాల్సి వచ్చినందుకు శంకరుడు ఎంతాగానో నొచ్చుకుని — 'తిరిగి భూలోకంలో దేవతలకై ధర్మస్వరూపాలైన యజ్ఞాలు ఎప్పుడు నిర్వహించబడతాయో? నాచెవులకు 'స్వాహా', 'స్వధా' మంత్రాలెప్పుడు వినబడగలవోకదా? తిరిగి దేవతాగణాలకు తమతమ స్వస్థానాలు లభించే దెన్నడోకదా? ఈ రాక్షసుణ్ణి చూస్తే అజేయుడై వున్నాడే? ఎలా యితణ్ణి ఓడించటం?' అనుకుంటూ మధనపడుతూండగా అక్కడికి యాదృచ్ఛి

కంగా దేవర్షియైన నారదమహర్షి రావటం జరిగింది! అందుకు పరమా నందభరితుడై ఆ యోగీశ్వరుడైన శంకరుడు నారదునికి ఎదురేగి ఆహ్వా నించి ఉచితాసనమిచ్చి, ఆతనిని యధావిధిగా సత్కరించి, ఎంతో ఆద రంతో, ఆలింగనం చేసుకున్నాడు.

"ఓ దేవర్షీ! త్రిపురునితో జరిగిన ఘోరసంగ్రామంలో దేవతలు పరాజితులై పారిపోయారు! ఎంతో శక్తివంతాలైన నా దివ్యాస్త్రాలన్నీ ఆ అసురుని ధాటికి వమ్మైపోయాయి! ఎందువలన నా ప్రతాపం కొర గాకుండా పోయింది? దీనికేదైనా ఉపాయం సూచించవలసింది!" అంటూ అర్థించిన శంకరునితో బ్రహ్మమానసపుత్రుడూ త్రిలోకసంచారీ దేవర్షియైన నారదుడు యిలా అన్నాడు :

## శివ వరదానం

"ఓ సదాశివా! నీవు సర్వమూ ఎరిగినవాడివి, సకల విద్యలకూ అధిపతివీ, అందరినీ రక్షించేదీ — చివరకు హరుడవై సర్వాన్నీ లయం చేసేవాడవూ, అన్నిటికీ సమర్థుడవు, ఐశ్వర్యప్రదుడవు, అందరకూ అన్నీ ఉపదేశించగలవాడవూ అయిన నీకు చెప్పగలగినంతటివాడను కాక పోయినా, నీ ఆజ్ఞమేరకు నాకు తోచిన సలహానిస్తాను" అంటూ క్షణ కాలం ధ్యానమగ్నుడై శివునితో యిలాఅన్నాడు

'ఓ శంకరా! నీవ్వ మూడోకంటితో మన్మధుడంతటివాడిపై అగ్నినే వర్షించగలవాడవైనా, 'పినాక'మనే దివ్యధనుస్సును నీ చేతపూనినప్పటికీ, యింకా నిన్ను విజయం వరించలేదంటే — అందుకు కారణం ఒక్కటే కన్పడుతున్నది — యుద్ధసన్నద్ధుడవై నీవు రణరంగానికి తరలివెళ్ళే ముందు సకలార్థప్రదుడూ, సకల విఘ్న నివారకుడూ ఐన గణేశుని

ప్రార్థించి, పూజించి ఆయనయొక్క అనుగ్రహాన్ని బడయలేదు! అందు వల్లనే విజయం నిన్ను వంచించింది! ఇప్పటికైనా నీవు చేసిన తప్పిదాన్ని గుర్తెరిగి, ఆ గజాననుని మనసా, వాచా, కర్మణా అర్చించి, ఆయన అనుగ్రహాన్ని సంపాదించుకో! అప్పుడు నీకు గెలుపు సుగమమౌతుంది.

ఇంకో ముఖ్యవిషయం... ఆ త్రిపురుడు కూడా సామాన్యుడు కాదు! వినాయకుని ఘోరతపస్సుతో ప్రసన్నుని చేసుకొని వరాలను పొందాడు. అన్యులెవరికీ అతడిని వధించడం సాధ్యంకాదు. అది నీవలనే జరగాల్సివుంది. వినాయకుని దివ్య అనుగ్రహం పొందటంచేత — అతడు కేవలం నీ శరముచేతనే — అదీ నీవు ఒకే శరంతో అతడి మూడు పురాలనూ నీవు భేదించినప్పుడే, ఆనాడే వధించబడతాడని గణనాథుడు అతడిని ఆశీర్వదించాడు. అందువల్ల నీవా విఘ్నహరుని ప్రసన్నుని చేసుకుని మరలా ప్రయత్నించు. విజయం నీకు అవశ్యం సిద్ధించగలదు!''

అప్పుడు ఆమాటలతో తన అంతరంగానికి స్వాంతన కలుగగా శంకరుడు — తనకు లోగడ గణేశునిచేత ఉపదిష్టములైన ఏకాక్షరీ, షడక్షరీ గణేశమంత్రాలు గుర్తుకువచ్చాయనీ, ఆ మంత్రానుష్ఠానం సర్వ సంకష్టాలనుంచీ విముక్తిని ప్రసాదిస్తుందన్న విషయం నారదమహర్షితో చెప్పి, ఆ ప్రకారంగా తపస్సు చేయడానికి ఉద్యుక్తుడై, దండకారణ్యమే అందుకు తగిన స్థలమని భావించి వెంటనే అక్కడకు చేరుకున్నాడు.

పద్మాసనంలో కూర్చుని, ఇంద్రియములన్నింటినీ వశపర్చుకుని, ఏకాగ్రతతో నిశ్చలధ్యానతత్పరుడై, — నూరుసంవత్సరాల కాలం ఘోర తపస్సు ఆచరించాడు. అలా చిరకాలం మహోగ్రతపస్సును ఆచరించిన

పరమశివుని ఎదుట మరోశివుడా? అన్న భ్రాంతికలిగేలా గణేశుడు తన దివ్యదర్శనాన్ని ప్రసాదించాడు. ఐదుముఖాలతోనూ, పది బాహువులతో శిరస్సున చంద్రకళను ధరించి మెడలో పుర్రెలమాల, సర్పాలంకారాలతో, కిరీట కుండలాలతో — సూర్యచంద్రుల కాంతినే తలదన్నేటటువంటి దివ్యకాంతితో విరజిమ్మే ఆయుధాలు ధరించి, మహాతేజస్సుతో, మహోగ్ర రూపుడై సాక్షాత్కరించాడు.

ఆ హఠాత్సంఘటనకు విభ్రమచెందిన శంకరుడు ఇది కలయా? నిజమా? లేక ఇతడు మరో శంకరుడా? ఐతే ఈయనకు ఐదు శిరస్సు లెలా సంభవించాయి? నేను తపస్సు చేస్తున్నదెవరికోసమో అట్టి ఆ విఘ్నేశుడితడు కాదుకదా? అనుకుంటూ తర్కించుకుంటూండగా, సర్వజ్ఞు డైన ఆ గజాననుడిలా అన్నాడు :

"ఓ శంకరా! నీ హృదయకమలంలో ఎవర్ని నీవు అనన్యచిత్తంతో ధ్యానిస్తున్నావో, అట్టి గజాననుడనే నేను! నా అనుగ్రహంతోతప్ప నా ఈ స్వరూపాన్ని బ్రహ్మాదులుసైతం గుర్తించలేరు! అంతెందుకు? వేదాలు, వేదశిరస్సులూ కూడా నా స్వరూపాన్ని వివరించలేక మౌనమే వహించాయి! ఇక మానవులసంగతి గురించి వేరేచెప్పాలా? ఓ శంకరా! ఈ సకల జగత్తుకూ, ఇంకా వీటికావలగల అనేక కోట్లబ్రహ్మాండాలకూ సృష్టి, స్థితి, లయ కారకుడను నేనే సుమా! సమస్త జగత్తులకూ నేనే ప్రభువును! ఓ మహాదేవా! నీ మనోభీష్టాన్ని అది ఎటువంటిదైనాసరే — అనుగ్ర హిస్తాను! నీకేమేం వరాలు కావాలో కోరుకో!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'నారదాగమనం – గణేశదర్శనం' అనే 44-వ అధ్యాయం.

45

# శివస్య వరదానం

(మూలం)

## పంచ చత్వారింశో అధ్యాయః

**మునిరువాచ :-**

తతః ప్రసన్నే విఘ్నేశే దేవేశే విఘ్నహారిణీ ।
వరాన్ దిత్సతి శర్వాయ కిం కిం వవ్రే సదాశివః ॥ 1

**బ్రహ్మోవాచ :-**

గణేశ వచనం శృత్వా శివో వాక్యమథాబ్రవీత్ ।
స్మృత్వా గజాననం తంతు స్వస్వరూపం వరప్రదం । 2

**శివ ఉవాచ :-**

దశాపి నేత్రాణి మమాధ్య ధన్యాన్యథోభుజాః పూజనతః తవాద్య ।
తవానతేః పంచశిరాంసి ధన్యా న్యథస్తుతేః పంచముఖాని దేవ । 3

పృధ్వీజలం వాయురథో దిశశ్చ తేజశ్చకాలః కలనాత్మకోపి
నభో రసో రూపమథాపి గంధః స్పర్శశ్చ శబ్దో మన ఇంద్రియాణి । 4

గంధర్వ యక్షాః పితరో మనుష్యా దేవర్షయా దేవగణాశ్చ సర్వే ।
బ్రహ్మేంద్ర రుద్రా వసవోధ సాధ్యాస్త్వత్తః ప్రసూతాః స చరా చరాశ్చ ॥ 5

సృజస్యదో విశ్వమనన్య బుద్ధే రజోగుణాత్వాసి సమస్తమేతత్ ।
తమోగుణాత్సంహరసే గణేశ నిత్యోనిరీహాఖిల కర్మసాక్షి । 6

బ్రహ్మోవాచ :-

తతోహ మబ్రువం దేవం గణేశంతం శివాజ్ఞయా ।
నామచా కరవంతస్య యత్తచ్ఛృణు మహామతే ॥ 7

త్వన్నామ బీజం ప్రధమం మాతృకాణా మోంకారరూపం
శృతి మూలభూతం ।
యతో గణానాం త్వమసీహ ఈశో గణేశ ఇత్యేవ తవాస్తు నామ । 8

ఓమిత్యథోక్తే గణనాయకేన తుతోషశర్వః
ప్రదదౌ వరాంశ్చ యంః సర్వకార్యేషుత వేశ కుర్యాత్ ।
స్మృత్వాస్మృతిం తదంతం నలభేదవిఘ్నం ॥ 9

వినాస్మృతిం తేన లభేచ్ఛకోపి
వాంఛార్థ సిద్ధిం క్రిమికీటకోపి
శైవై స్త్వదీయైరధ వైష్ణవైశ్చ శాక్తైశ్చ సౌరైరధ సర్వకార్యే 10

శుభా శుభే లౌకిక వైదికే వాత్వమర్చనీయః ప్రథమం ప్రయత్నాత్ ।
యన్మంగళం సర్వజనేషు దేవ స యక్ష విద్యాధర పన్నగేషు । 11

తస్యేశ్వరో మంగళమూర్తి తాం త్వంయతో యతో మంగళ కృత్స్వభక్తి ।
అహంపురా నర్చయతస్త దేశ త్వయ్యస్మృతేత్త్య వరస్య యుద్ధే ॥ 12

అవందనాచ్చాప పరాభవం తం తతస్త వాంఘ్రింశరణం ప్రపన్నః ।
క్షమాపరాధం మమ సర్వశక్తే జయం ప్రయచ్ఛాఖిల జన్యకాలే ॥ 13

యే సర్వథాత్వాం నభజంతి దేవ జడాః దరిద్రాః ప్రభవంతు తేపి ।
భజంతి తే భక్తియుతా మనుష్యాః ప్రాతి సిద్ధిం నిఖిలార్థదాత్రీం ॥ 14

క ఉవాచ :-

ఇద్ధం నిశమ్యాఖిల వాక్యసారవేత్తావ దద్వాక్యమిదం గిరీశం ।
యదా యదా మే స్మరణం విదధ్యాస్త దాంతికం తేహ మియాంమేశ ॥ 15

మన్నామ బీజే న నిమంత్రయిత్వై కం బాణంతు తే నైవపుర త్రయం తత్ ।
నిపాతయా స్మన్మహ సామ హేవ కృసత్వా దైత్యం ఖలు భస్మసాత్వం ॥ 16

తతః స్వనామ్నా మ వదత్సహస్రం గణాధిపోస్మై ప్రణతాయ సమ్యక్ ।
శివాయ భక్త్యా పరితుష్టచిత్తో జయప్రదం కామ్యకరం జనానాం ॥ 17

ఉవాచ చైనం రణకాల ఏతత్ పఠస్వదైత్యాన్విని హంసి శీఘ్రం ।
త్రిసంధ్య మే తస్య జపాన్నరాణాం సిధ్యంతి కామాః సకలా అభీష్టాః ॥ 18

శృత్వాతు వాక్యం ద్విరదాననస్య తం పూజ్య సమ్యక్ శివ ఉజ్జహర్ష ।
సంస్థాపయామాస మహాగణేశం ప్రాసాదముచ్చైర్ద్రుఢమాశు చక్రే ॥ 19

సంతర్ప్య దేవాన్ మునిసిద్ధ సంఘాన్ దానాని దత్త్వాద్విజ పుంగవేభ్యః।
పునశ్చ సంపూజ్య నమశ్చకార దేవం గిరీశో వరదం గణేశం। 20

వాచసర్వాన్ మణిపూరియంతు విఖ్యాతిమాగచ్ఛతు సర్వలోకే।
దేవేన సర్వైశ్చ తథోదితై స్తై రంతర్దధు స్తే గణనాధముఖ్యాః। 21

అంతర్హితే మునిగణే సురేగణేశే
శర్వోప్య గాత్స్వనిలయం స్వగణైరుపేతః
గంధర్వ యక్షనివహై రమరాంగనాభిః
వృత్తం నిజం పరముదా గిరిజా మువాచ ॥ 22

శృత్వా తదామృత వచః సకలం గిరీశా
ద్దేవేశ్వరాము ముదిరే మునయ స్సదారాః।
యోగీశ్వరాశ్చ నిహతం త్రిపురం
స్వధిష్ణ్యమ మం షత్యాపధి గతం గిరిశప్రసాదాత్। 23

**ఇతి శ్రీగణేశపురాణే ఉపాసనాఖండే**
**శివస్య వరదానం నామ పంచ చత్వారింశో అధ్యాయః**



# శివస్య వరదానం
## 45-వ అధ్యాయము

ఈ కథనాన్ని అంతటినీ శ్రద్ధగా వింటున్న సత్యవతీనందనుడు — ఇలా అడిగాడు. "ఓ చతురాననా! సర్వజనుల విఘ్నాల అంధకారాన్ని పారద్రోలే అవిఘ్నకరుడనే సూర్యుడు — ఆ భక్తవత్సలుడు ప్రత్యక్షమై శంభునికి ఏయే వరాలను ప్రసాదించాడు? శివుడేమేం వరాలను అర్థిం చాడు? ఆ వివరం చెప్పవలసింది!" అన్న ఈ మాటలకు బ్రహ్మ ఇలా చెప్పసాగాడు.

"భక్తవత్సలుడైన గజవదనుడు చెప్పిన అనుగ్రహ వచనాలకు శివు డిలా ప్రత్యుత్తరమిచ్చాడు. 'ఓ గజాననా! నిన్ను దర్శించటంచేతనే నా పదినేత్రాలూ ధన్యతచెందాయి! పరమ పావనములైన నీ పాదారవిందా లకు ప్రణమిల్లడంతో నా ఐదుశిరస్సులూ ధన్యతచెందాయి. నిన్ను స్తుతించటంచేత నా జిహ్వాకూడా ధన్యమైంది!

సమస్త సృష్టీ, అందులోని పంచస్థూలభూతాలు, సూక్ష్మభూత ములూ, గంధర్వ, యక్ష, భూతసంఘాలూ. బ్రహ్మ, ఇంద్ర రుద్రాదులూ వీరితోపాటూ సమస్త చరాచర జగత్తంతా నీవల్లనే సృష్టించబడుతోంది!

బ్రహ్మగా రజోగుణ ప్రభావంతో సమస్త సృష్టినీ రచిస్తున్నదీ, సత్త్వ గుణం ఉద్దీపించగా స్థితికర్తగా జగద్రక్షణాభారం వహిస్తున్నదీ, చివరికి అంత్యములో తమఃస్వరూపుడవై రుద్రుని అంశగా యావత్సృష్టినీ లయం చేస్తున్నదీ, అద్భుతమైన నీ లీలావిభూతేతప్ప అన్యమేమీ కాదు!

వాస్తవానికి నీవు గుణాతీతుడవు! ఎట్టి కోరికలూ లేనివాడవు! సాక్షిస్వరూపుడవై సకల జీవులలోనూ అంతర్యామివై ప్రవర్ధిల్లుతావు! సకల మంత్రాలకు ముందుగా నీ స్వరూపమైన ప్రణవమే ఉచ్చరించబడును గాక! ఏ కారణంవల్ల నీవు సకల గణములకూ అధిపతివో, ఆ కారణం చేతనే నీవు గణేశుడవని ప్రసిద్ధుడవవుదువుగాక!

ఓదేవా! ఎవరైతే తమ సకలకార్యముల ఆరంభంలో నిన్ను స్మరిస్తారో వారి సర్వకార్యములు నిర్విఘ్నమౌనుగాక! ఎట్టివారికైనా నిన్ను స్మరించనిదే కార్యములు సానుకూలంకావు!

ఓ గజాననా! శైవులు, శాక్తేయులు, వైష్ణవులు, సౌరమతస్థులు ఎవరికైనా శుభాశుభాది లౌకిక, వైదిక కర్మారంభములలో ముందుగా నీవు అర్చించతగినవాడవు!

సకల జీవులకు కలిగే సమస్త శుభాలకూ కూడా నీవే అధిపతివి! మంగళకరుడవు, మంగళస్వరూపుడవు! నీ భక్తులకు సకల మంగళ ములూ కలుగజేసేవాడవు! ఓదేవా! అజ్ఞానంతో ముందుగా నిన్ను

అర్చించకుండా యుద్ధం చేయబూనడం వల్లనే దైత్యునివద్ద ఘోరంగా పరాజితుణ్ణైనాను!

నీ చరణారవిందాలకు మొక్కనిదే — నిన్ను స్మరించనిదే జయం కలగడమన్నది అసంభవం! అందుచేత అవిద్యనూ, విఘ్నాంధకారాన్నీ పోగొట్టే ఓ భాస్కరా! నాయొక్క సమస్త అపరాధాలను క్షమించి నాకు విజయాన్ని అనుగ్రహించు!

నిన్ను విముఖులై తమ కార్యారంభంలో అర్చించి సేవించని వారు జడులై, దరిద్రులౌతారు! ఎవరికైతే నీ చరణాలపట్ల తరగని అనురక్తి ఉంటుందో, వారే సకలకార్య సిద్ధినీ, ఐశ్వర్యాన్నీ కరతలామలకంగా పొందగలరు!''

ఈ మాటలకు అత్యంత ప్రసన్నుడైన గజాననుడు శివునితో యిలా అన్నాడు :

''ఓ శంకరా! నీవెప్పుడెప్పుడు నన్ను శరణుపొందనిచ్ఛగిస్తావో అప్పుడప్పుడు నీ ఎదుటే ప్రత్యక్షమౌతాను. నీకు నామబీజంతో అభిమంత్రించి యిప్పుడొక బాణాన్ని ప్రసాదిస్తాను!'' అంటూ తన సహస్రనామాలనూ ప్రణతుడైన శివునికి ఉపదేశించాడు!

'దీన్ని యుద్ధకాలంలో పఠించటంవల్ల దైత్యులనందన్నీ అనాయాసంగా వధించగలవు! త్రిసంధ్యలలోనూ దీన్ని పఠించటంవల్ల మానవులకు సర్వాభీష్టములూ సిద్ధిస్తాయి.'

అన్న గణేశుని అనుగ్రహవచనాలను విన్న శివుడు పరమానంద భరితుడైనాడు. అప్పుడు శివుడు ఒక గణేశ మహాప్రాసాదాన్ని నిర్మించి

సకల దేవతలనూ, మునిసిద్ధ సంఘాలను తన దానధర్మాలతో తృప్తి పరచాడు. భూసురులైన బ్రాహ్మణులకు అనేక భూరి దానాలనుచేసి తిరిగి వరదగణేశుని పూజించి

'ఓ దేవతలారా! ఇది మణిపురమన్న పేరుతో విఖ్యాతిచెందుగాక!' అంటూ అనుగ్రహవచనాలను పలికి, సమస్తదేవతలూ, శంకరుడూ కూడా వినాయకునితో అంతర్హితులైనారు.

ఆతరువాత శంకరుడు కైలాసానికి వెళ్ళి, యక్ష గంధర్వ సమూహాలతోనూ దేవతాంగనల మధ్యనా ఉన్న పార్వతికి ఈ విశేషాల నన్నింటినీ వివరించాడు. అవి విన్న దేవతలు, మునులు, యోగీశ్వరులు, దేవతాంగనలు ఎంతో సంతోషించారు. అందరూ శివుని అనుగ్రహంచేత తమతమ స్వస్థానాలను తిరిగి సంపాదించుకున్నట్లుగా భావించారు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'శివస్య వరదానం' అనే 45-వ అధ్యాయం



46

# నామసహస్రోపదేశం

(మూలం)

## షష్ఠ చత్వారింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

కథం నామ సహస్రం స్వం గణేశ ఉపదిష్టవాన్ ।
శివాయై తన్మమా చక్ష్వ లోకానుగ్రహ తత్పర ॥ 1

**బ్రహ్మోవాచ :-**

ఏవం దేవో పురారాతిః పురత్రయజయోద్యమే ।
అనర్చనా ద్గణేశస్య జాతో విఘ్నాకుల కిలః ॥ 2

మనసా స వినిర్ధార్య తతస్తద్విఘ్న కారణం ।
మహాగణపతిం భక్త్యా సమభ్యర్చ్య యధావిధి ॥ 3

విఘ్న ప్రశమనోపాయం అపృచ్ఛద పరాజితః ।
సంతుష్టః పూజయా శంభోః మహాగణపతి స్స్వయం ॥ 4

సర్వవిఘ్నైక హరణం సర్వకామ పలప్రదం ।
తతస్తస్మై స్వకం నామ్నాం సహస్ర మిదమబ్రవీత్ ॥ 5

**ఇతి శ్రీగణేశపురాణే ఉపాసనాఖండే**
**ఈశ్వర గణేశ సంవాదే - గణేశ సహస్రనామకథనం నామ**
**షట్చత్వారింశో అధ్యాయః**



# నామసహస్రోపదేశం

# 46-వ అధ్యాయము

"ఓ చతురాననా! భక్తవత్సలుడైన గణేశుడు తన సహస్రనామములను స్వయంగా లోకానుగ్రహకాంక్షియైన ఈశ్వరునికి **ఉపదేశించాడా?** ఆశ్చర్యంగావున్నదే? దయతో ఆ వివరం తెలుపవలసింది!" అంటూ ప్రార్థించిన వ్యాసమునీంద్రునితో బ్రహ్మ యిలా చెప్పాడు.

"ఓ వ్యాసమునీంద్రా! శంకరుడు త్రిపురునితో యుద్ధానికి తలపడి పోరుకై వెళ్ళేసమయంలో గజాననుని స్మరించకపోవటంచేత — గెలుపుకి అవరోధాలు విఘ్నములుగా కలిగాయి! అప్పుడు భక్తిభావంతో యథావిధిగా విఘ్నహరుడైన గణేశుని పూజించి, తన గెలుపుకి ఉపాయాన్ననుగ్రహించమని ప్రార్థించగా — ఆతని పూజకు సంతుష్టుడైన గణేశుడు తానే స్వయంగా ఈశ్వరునికి సర్వవిఘ్న హరమైన, సకల శుభప్రదమైన ఈ గణేశ సహస్రనామాన్ని ఉపదేశించాడు. ఇది అత్యంత ప్రభావవంతమైనది."

ఇది శ్రీ గణేశపురాణం ఉపాసనాఖండంలోని
'నామసహస్రోపదేశం' అనే 46-వ అధ్యాయం!

47

# శంకర విజయం

(మూలం)

## సప్త చత్వారింశో అధ్యాయః

**వ్యాస ఉవాచ :-**

నామ్నాసహస్రే సంప్రాప్తే ప్రసన్నేచ గజాననే ।
తతః కిమకరో ద్బ్రహ్మన్ హర స్తత్కథయస్వ మే ॥ 1

**బ్రహ్మోవాచ :-**

గణేశ వరదానేన నామ్నాం చైవోపదేశతః ।
ప్రహృష్టః శంకరో నృత్యన్ జగర్జచ మహాస్వనః ॥ 2

ఆహూయ స్వగణాన్ దేవాన్ యుద్ధావసర మాదిశత్ ।
తేచ హర్షేణ మహతా యయుర్దేవాః శివాంతికం ॥ 3

బ్రహ్మా కుబేరో అథ పురందరో
గ్నిర్వాయుశ్చసోమో వరుణోర్య మాచ ।
గంధర్వ యక్షా గ్రహకిన్నరాశ్చ
సర్వే నమస్కృత్య శివం స్తువంతః ॥ 4

దేవా ఊచుః :-

మహాదేవ జగన్నాథ జగదానంద దాయక ।
త్వయాహతం మహాదైత్యం కదా ద్రక్ష్యామహే వయం ॥ 5

స్థానభ్రష్టా వయం తేన కృతా విశ్వవిఘాతినా । 6

బ్రహ్మోవాచ :-

ఏవం దేవ వచః శృత్వా పినాకీ నిర్యయౌ ముదా ॥ 7

గణేశం మనసా ధ్యాయన్ యుద్ధాయ కృత నిశ్చయః ।
వేగేన భవనం ప్రాప్య దేవగంధర్వ సంయుతః ॥ 8

తావచ్చ దైత్యం చారైస్సు వృత్తాంతః సన్నిరూపితః ।
ఆగతః సురసైన్యేన యుద్ధాయ గిరిజాపతిః ॥ 9

తస్య సైన్యాన్యనహ్యంత శస్త్రై రస్త్రైశ్చ కంచుకైః ।
సచ దైత్యో మహానాదో యుద్ధ భూషణభూషితః ॥ 10

వీరా నానందయామాస వాస స్స్రగ్ధూపకైర్ధనైః ।
అనేక యాన సంస్థేషు యోద్ధుము త్రిపురః స్వయం । 11

ఆరురోహ మహాదైత్యో నాదయన్ వి దిశో దిశః ।
తతోయుద్ధం స్సమభవత్ సేనయో రుభయోర్మహత్ । 12

శస్త్రై ర్నానావిధైర్భాణై మర్మభేది భిరాయసైః ।
అసృజ్నదీప్రవాహో భూన్మార్గ రోధనకారకః ॥ 13

శస్త్రాహతా బభుర్యోధాః పుష్పితాః కిం శుకాఇవ ।
కేచి చ్ఛద్మభ వైరేణ జీవగ్రాహను మారయన్ ॥ 14

కేచి త్కచేషుధృత్వై వశిరాంసి చిఛిదుర్బలాత్ ।
ధావతాం రథి వీరాణాం అశ్వానాం కరిణామపి ॥ 15

అంఘ్రిపాత భవోరేణుః వ్యానశేరోదసీక్షణాత్ ।
అంధకారే ఘోరతరే నప్రాజ్ఞాయతకించన ॥ 16

చక్రురేవంతదాయుద్ధం వీరా నానావిధా భృశం ।
జీవితాశాం పరిత్యజ్య మర్తవ్యే కృతనిశ్చయాః ॥ 17

అదృశ్యంత మృతాదేవా గతేరజసి వాయునా ।
విద్రుతే సురసైన్యేచ దైత్య సైన్యేచ హర్షితే ॥ 18

అయయౌ సమరశ్లాఘీ వజ్రహస్తః పురందరః ।
శతకోటిం నిరీక్ష్యైవ దుద్రువుర్దైత్య దానవాః ॥ 19

సవజ్రపా రసురాన్ చూర్ణయామాస వజ్రభృత్ ।
తత్యాజుర్జీవితం తేతు చండవజ్ర ప్రహారతః ॥ 20

కేచిచ్ఛ భగ్నచరణాః కేచిద్భగ్న శిరోధరాః ।
కేచిద్వి దీర్ణ జఠరాఃఛిన్న స్కంధభుజాః అపరే ॥ 21

ఛిన్నాశ్వానాంచ వీరాణాంవాగజానాం రధినాంతథా ।
కేషాంచి దురవోభిన్నా జంఘాసుచ హతాః పరే ॥ 22

ఛిన్నగుల్ఫాః పరేపేతుర్నిమిషా త్పేతుస్తథా అపరే ।
నిహతానాం అసృక్స్రౌతైః జజ్ఞిరే నిమ్నగాఋహు ॥ 23

ఉత్సాహ వర్ధనాస్తేషాం వీరాణాం జయకాంక్షిణాం ।
తతః శనైర్గర్జమానో దదర్శ త్రిపురాసురః ॥ 24

నిహితం బహుధా సైన్యం శక్రంయోద్దు మధాయయౌ ।
బభాష శక్రం దృష్ట్వైవ కిమర్థం మర్తు మిచ్ఛసి ॥ 25

అపైహి యుద్ధాజ్జీవంస్త్వం నప్పష్టం హన్మివా నవ ।
కాతే శక్తిర్మయా యుద్ధం కర్తుం తవశచీపతే । 26

అజః సింహేన కిం యుద్ధం కరిష్యతి వదస్వ మే ।
ఏహి యుధ్య స్వశక్తిశ్చేన్నోచేద్గచ్ఛ యధాసుఖం ॥ 27

ఏవముక్తేస్థితే శక్రే వవర్ష సాయకాన్ బహూన్ ।
సజ్యంకృత్వా ధనుర్దైత్యో దేవసేనా మతాడయత్ । 28

ఏక స్మాన్మంత్రితాద్బాణా ద సంఖ్యాతాయయుః శరాః ।
మృధ్నంతో దేవగంధర్వాన్ రోదసీ సమపూరయన్ ॥ 29

అంధకారం పునరభూత్ బాణజాలై ర్నిరంతరం ।
తద్బాణైరపి తేదేవా వ్యంగాఃపేతు ర్ధరాతలే ॥ 30

బలహాస్యప తద్బాహౌ ప్రహార వరపీడితః ।
సర్వేషు దేవవర్యేషు మూర్ఛితేషు మహేశ్వరః ॥ 31

శ్లాఘంతం బహుగర్జంతం యుధ్యతం నాభ్యరోచయత్ ।
మనసాపూజ యచ్ఛంభుః స్తస్యదైత్యస్య పౌరుషం ॥ 32

ఏతస్మిన్నంతరే తత్ర నారదో ద్రష్టుమాయయౌ ।
పూజితః ప్రవదత్ శంభుం శృణుష్వ నీలలోహిత ॥ 33

**నారద ఉవాచ :-**

త్వయా చింతా నకర్తవ్యా త్రిపురస్య వధం ప్రతి ।
వక్ష్యేతస్య వధోపాయం తం కురుష్వ మహేశ్వర ॥ 34

తేనపూర్వం తపోకారి దుష్కరం బ్రహ్మణోపి హి ।
ఆరాధితో గణపతిః సతస్మై సర్వవాంఛితం ॥ 35

యద్యత్తేన వృతం దేవో దత్తవాన్ అవిచారితం ।
పురత్రయం కామగమ మేకబాణాశ్రితం మహత్ । 36

మరుద్గతి విహీనం తదభేద్యం సర్వనిర్జరైః ।
నఏవ ముక్తవాన్ గుహ్యం శరేణైకేనయిస్తవ ॥ 37

పురత్రయం భేత్స్యతే తే తస్మాన్మృత్యు మవాప్స్యసి ।
ఏవముక్త్వా గతేతస్మిన్ నారదే మునిసత్తమే ॥ 38

మూర్ఛితాన్ విబుధాన్ శర్వః సావధాన మథాకరోత్ ।
సస్మార ఇభముఖం వాక్యం స్మారితో నారదేనతు ॥ 39

మహాప్రయత్న మారేభే దైత్యరాజ వధాయసః ।
తేజసా సర్వనాశాయ శక్తో దేవో నిజేచ్ఛయా ॥ 40

రథం సురూపం శశిసూర్యచక్రం
యంతార మిందీవరజం చకార ।
ధనుర్గిరీంద్రం శరమచ్యుతం
సధుర్యాశ్వినే యావయుజ ద్గిరీశః ॥ 41

ఆచమ్యదేవం మనసావిచింత్య
తేనోపదిష్టం చ జ జాప నామ్నాం ।
సహస్ర మేకాక్షర మంత్రయుక్తం
అమంత్ర యత్తేన పినాక ముగ్రం ॥ 42

అమంత్రయన్మహాబాణం విష్ణురూపం యదాశివః ।
చకంపే ధరణీ శేషో వనాని గిరయోపి చ । 43

బభ్రముః ఖగణాస్సర్వే చుకూజుశ్చమహారవాన్ ।
శబ్దేనాజగ వస్యాపి విభ్రాంతాః సురమానుషాః ॥ 44

ఆముంచత్తం యదా బాణం తదాదగ్ధం సభస్థలం ।
భూమండలం స పాతాళం జ్వాలా మాలాభిరంజసా ॥ 45

దృష్ట్వా పపాల దైత్యేంద్రః ససైన్యః పురసంశ్రయః ।
జవేనాగాచ్ఛరః సోపి అదహద్దైత్యంస పురత్రయం ॥ 46.

దైత్యదేహగతం తేజో భర్గదేహే లయం యయౌ ।
వశ్యతాం సర్వసైన్యానాం దైత్యదానవ రక్షసాం ॥ 47

తతోంతరిక్షే వాగాసీత్ ముక్తో దైత్యః శివేణహతః ।
తతస్తే తుష్టువుర్దేవాః మునయోపి త్రిలోచనం ॥ 48

జగుర్గంధర్వ నిచయాః చారణాః శృతి తత్పరాః ।
ననృతు శ్చాప్సరస్సంఘాః కిన్నరా వాద్య వాదకాః ॥ 49

ముముచుః పుష్పవర్షాణి నారదాద్యాః సురర్షయః ।
యయుః శివాజ్ఞయా దేవాః స్వం స్వం స్థానం నిరాధయః ॥ 50

నమస్కృత్య మహేశానం త్రిపురాసుర ఘాతినం ।
మునయోపి నిరుద్వేగాః స్వస్వానుష్టాన తత్పరాః ॥ 51

ఆసన్ తస్తస్మిన్నాతే దైత్యే వేదవేదాంగ శాలినః ।
అగ్నిహోత్రాణి యజ్ఞాంశ్చ దానాని చ వ్రతానిచ ॥ 52

చక్రుః సర్వజనా భూమౌ పునరుత్సాహ సంయుతాః ।
శైవాది గణ స్కందైః సర్వైః పారిషదై రపి ॥ 53

కృతావనామస్త్ర్యక్షోపి విభజ్యతం మహారథం ।
జయశబ్దే స్తూర్యశబ్దై ర్దేవదుందుభి నిస్స్వనైః ॥ 54

అలంకృతం శైలరాజం కైలాసం ముదితో యయౌ ।
త్రిపురారి రితిస్పష్టం తతో నామాస్య పప్రధే ॥ 55

ఏవం మహాగణపతేః మంత్ర సామర్థ్యమీరితం ।
సహస్ర నామ్నా మపిచ ప్రభావోయం నిరూపితః ॥ 56

నవిజ్ఞాతో మదన్యేన కస్యాపిన నివేదితః ।
పఠనాత్ శ్రవణాదస్య సర్వకామఫలం లభేత్ । 57

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**శంకరవిజయోనామ సప్త చత్వారింశో అధ్యాయః**



# శంకర విజయం

## 47-వ అధ్యాయము

లోకకళ్యాణాన్ని అపేక్షించే కృష్ణద్వైపాయనుడైన వ్యాసభగవాను డిలా ప్రశ్నించాడు : 'ఓ చతురాననా! అలా ప్రసన్నుడైన గణపతి ప్రపన్నుడైన శంకరుని విజయసంసిద్ధికై నామసహస్రాన్ని స్వయంగా ఉపదే శించాక, శంకరుడేమిచేశాడో ఆ వివరం నాకు తెలుపవలసింది!"

బ్రహ్మ యిలా చెప్పసాగాడు. "పేదకు దొరికిన పెన్నిధిలా, కింకర్త వ్యతామూఢుడై ఖిన్నుడైవున్న ఉమాపతికి — గణేశుని వరప్రదానం ఎంతో సంతోషాన్ని ఇచ్చింది. ఆ సంతోషంతో పరమ ఉత్సాహవంతుడై ఆనంద తాండవం చేస్తూ దిక్కులు పిక్కటిల్లేలా బిగ్గరగా గర్జించాడు శంకరుడు! వెంటనే దేవతాసైన్యాల నన్నిటినీ తిరిగి సమీకరించుకుని వారందర్నీ యుద్ధసన్నద్ధులవమంటూ ఆజ్ఞాపించాడు. ద్విగుణీకృత ఉత్సా హంతో పునరుజ్జీవితులైన దిక్పాలకులూ, బ్రహ్మాది దేవతలూ శివునకు నమస్కరించి తమ ఆపన్నివారకుడైన పినాకపాణినిలా స్తుతించసాగారు :

"ఓ మహాదేవా! జగదానందకారకా! నీవల్లనే నిర్జించబడవలసినట్టి ఘోరదైత్యుడైన త్రిపురుని అంతాన్ని, మా ఉల్లములు రంజిల్లగా ఎన్నడు కన్నులారా చూస్తామోగదా? విశ్వానికే విఘాతకుడై వాడుచేసిన అకృత్యాల వల్లనేకదా మాకు మా నిజస్థానాలనుంచి స్థానభ్రష్టత సంప్రాప్తమైంది?"

దేవతల దైన్యమైన ఈ పలుకులకు ఉత్తేజితుడై కర్తవ్యోన్ముఖుడైన గిరిజాపతి అత్యంత సంతోషముతో గజాననుని ధ్యానించి, యుద్ధోన్ముఖుడై బయలుదేరాడు. శివుడు యుద్ధసన్నద్ధుడై వస్తున్నాడన్న వార్త ముందుగానే చారులవల్ల తెలుసుకున్న త్రిపురుడు తన దివ్యమైన కవచకుండలాలను ధరించి, అసుర సైనికులందరినీ తగు పారితోషికాలతో సంతోషపరచి, వివిధ వాహనాలపై అధిరోహించిన సైన్యమంతా వెంటరాగా తాను స్వయంగా త్రిపురాన్నధిరోహించి, నలుదెసలా మారుమ్రోగే ధ్వనిని చేస్తూ బయలుదేరాడు.

వెంటనే ఇరుసైన్యాలూ సంకుల సమరానికి తలపడ్డాయి! తమ తమ శస్త్రాస్త్రాలతో, శరములతో, ఖడ్గములతో ఇరుపక్షాల వీరులమధ్యా భీకరమైన యుద్ధము సాగుతుండగా వారి రక్తం నదులుకట్టి ప్రవహించ సాగింది!

ఓ మునీంద్రా! అలా వైరి శస్త్రాల దెబ్బలచే గాయపడ్డ ఇరుపక్షాల సైనికులూ ఎఱ్ఱగా, పుష్పించిన మోదుగవృక్షాల్లా కన్పించసాగారు. ఆ గందరగోళంలో యిరు పక్షాలలోనూ స్వపరభేదము తెలుసుకోలేనంత ఘోరంగా పోరు కొనసాగింది. ఇదిలాఉండగా వాయువుచేత పెనుగాలి దుమారంలా చెలరేగి ఆ ధూళి ముఖమంతా కొట్టపడ్డ దేవతాసైన్యం అధికంగా పడిపోయి, మిగిలినవారు పారిపోసాగారు. అప్పుడు దేవరాజైన

ఇంద్రుడు విజృంభించి తన వజ్రప్రహారములతో దైత్యసైన్యాలను చూర్ణము చేయసాగాడు! ఆ భయానికి కొందరు చచ్చినవారిలా పడు కున్నారు. ఆ భీకరయుద్ధంలో దైత్యుల కాళ్ళుచేతులూ, శిరస్సులు తెగిపడి రక్తం కాలువలై ప్రవహించసాగింది!

ఈ దృశ్యాన్ని చూసిన త్రిపురుడు మండిపడి, సింహనాదములు చేస్తూ ముందుకు చొచ్చుకువచ్చి ఇంద్రుడితో తలపడ్డాడు.

'నీకు ప్రాణాలమీద ఏమైనా తీపివుంటే వెంటనే పారిపో! రణభూమినుంచి వెన్నిచ్చి పారిపోయేవాడిని నేనేమీ చేయను!' అంటూ కవ్వించిన త్రిపురుడి మాటలకు రోషాన్వితుడై శచీపతియైన ఇంద్రుడు నిలచి శౌర్యంతో యుద్ధంచేశాడు. ఒక్కోబాణాన్నీ త్రిపురుడు అభిమంత్రించి ప్రయోగించగా అది వెంటనే అనేక బాణాలుగా రూపొంది ఆకాశాన్నంత టినీ కప్పివేస్తూ దేవతాసైన్యాలను బాధించసాగింది. వెనువెంటనే ప్రయో గించిన ఆ దైత్యుని మరో శరానికి ఇంద్రుడు మూర్ఛిల్లాడు. ఆ అద్భుత పరాక్రమానికి అచ్చెరువొందిన శంకరునికి నారదుడు దర్శనమిచ్చి ఆతనికి రాక్షసవధోపాయాన్నిలా చెప్పసాగాడు.

## నారదుడు త్రిపురాసుర వధోపాయం చెప్పుట

"ఓ శంకరా! ఈ రాక్షసుడు గతంలో గణేశుడిని గురించి ఘోర తపస్సుచేసి మూడు అభేద్యమైన పురాలను, అశేషవరాలనూ పొందాడు. అప్పుడు గజాననుడే 'ఎన్నడైతే ఒకే బాణంతో ఈ మూడు పురాలూ భేదించబడతాయో, అప్పుడే, అలా భేదించిన వెంటనే అతని చేతిలో నీకు మృత్యువు సంభవిస్తుంది!' అంటూ వరమిచ్చాడు! కనుక నీవు ఆ ప్రకారమే చేయవలసింది!" అంటూ దేవరహస్యం తెలిపి నారద

మహర్షి అంతర్ధానం చెందాడు.

శంకరుడు ఆనందంతో, మూర్ఛిల్లిన దేవసైన్యాలను స్వస్థపరచి, గజాననుని వాక్యమును స్మరించి దైత్యవధకు మహాప్రయత్నాన్ని చేసాడు.

మహాప్రభావశాలియైన ఆ గరళకంఠుడు భూమిని రథంగానూ, సూర్యచంద్రులనే రథచక్రాలుగానూ, బ్రహ్మదేవుని రథసారథిగా చేసుకున్నాడు.

మేరువును ధనుస్సుగానూ, అచ్యుతుని అస్త్రంగానూ, అశ్వినీ దేవతలనే రథాశ్వాలుగాచేసి, ఆచమించిన శంకరుడు గజాననుని తన హృదయంలో ధ్యానించి, ఆయన ఉపదేశించిన సహస్రనామాలనూ ఉచ్ఛరించి, ఏకాక్షర గణపతిమంత్రంతో తన బాణాన్ని అభిమంత్రించాడు.

ఆ ఉధృతానికి భూమి శేషుడూ, పర్వత శిఖరాలతో నదీవనాలతోసహా గడగడా వణికింది!

ఆ ప్రభావవంతమైన బాణాన్ని శంకరుడు వింటినారి సారించి విడువగానే ఆకాశమంతా దగ్ధమైంది! భూ పాతాళలోకాల్లో కూడా మంటలు వ్యాపించసాగినాయి! త్రిపురాధిష్ఠితుడైన ఆ రాక్షసుడు ఆ బాణాన్ని చూడటంతోటే వెలవెల బోయాడు! అప్పుడా ఆ అఘోరాస్త్రము మహావేగంతో వచ్చి త్రిపురాలనూ భస్మంచేసి, దానవశ్రేష్ఠుడైన అసురుని కూడా భస్మం చేసింది! అప్పుడు అందరు చూస్తుండగా ఆ రాక్షస్సుని శరీరంలోంచి తేజస్సు వచ్చి శంకరుని శరీరంలో లయించింది!

''శివునిచేత హతుడైన లోకకంటకుడైన రాక్షసుడు ముక్తిని పొందాడు!'' అంటూ ఆకాశవాణి పలికింది!

దేవతలు, మునులూ విజయుడైన శంభుని స్తుతించారు. గంధర్వులు గానం చేశారు! అప్సరలు ఆనందంతో నాట్యం చేశారు. కిన్నెరలు వాద్యములను వాయించారు. నారదాది దేవర్షులు ఆనందంతో పుష్పవృష్టి కురిపించారు! దేవతలంతా శివుని అనుజ్ఞ గైకొని నిర్భయంగా తమతమ నెలవులకు వెళ్ళారు. త్రిపురాంతకుడైన ఈశ్వరునికి నమస్కరించి మునీశ్వరులు సైతం తమ అనుష్టానాదులను చేసుకోడానికి తరలి వెళ్ళారు. అప్పటినుంచి వేదవిదులైన బ్రాహ్మణులు అగ్నిహోత్రాది కర్మలను నిరాటంకంగా కొనసాగించారు.

అప్పుడు స్కందుడు మొదలైన శివగణాలు అభివాదం చేయగా శంకరుడు తిరిగి ఆ రథాన్ని విభాగం చేసివేశాడు. జయజయ ధ్వానాలతోనూ, దుందుభి ధ్వనులచేత మారుమ్రోగుతూ. సర్వాలంకృతమైన కైలాసము చేరాడు!

అప్పటినుంచి శంకరునికి 'త్రిపురాంతకుడు' అన్న ప్రఖ్యాతి లోకంలో కలిగింది! ఈవిధంగా మహాగణపతి మంత్రసామర్ధ్యము, సహస్రనామ ప్రాశస్త్యమూ వివరించబడింది! ఓ వ్యాసమునీంద్రా! ఈ విషయం నేను తప్ప ఇంకెవరూ ఎరుగరు! నేనూ ఈ మహాత్మ్యాన్ని ఎవ్వరికీ యింత వరకూ చెప్పియుండలేదు! దీన్ని చదవటంవల్లా, వినటంవల్ల సర్వ కామనలూ సిద్ధిస్తాయి!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'శంకర విజయం' అనే 47-వ అధ్యాయం.



48

# అంబావిర్భావం

(మూలం)

## అష్ట చత్వారింశో అధ్యాయః

వ్యాస ఉవాచ :-

శృతం మయా మహాఖ్యానం త్రిపురస్య వధాశ్రయం । 1

తథాపి శ్రోతుమిచ్ఛామి క్వస్థితా జగదంబికాః
కథమావిర్భభూవైషా అతిథౌదగ్ధః క్వదైత్యరాట్ ।
ఏతత్సర్వం సవిస్తారం కథయస్వ పితామహా ॥ 2

బ్రహ్మోవాచ :-

బాహులే పౌర్ణమాస్యాంస సాయం దగ్ధో మహాసురః ।
దివా యుద్ధం మహాఘోరం ప్రాగేవ వర్ణితంహి తత్ ॥ 3

యతోర్చితః సురైస్సర్వైః జయశాలీ సురారిహా ।
అత స్తస్యాం దీపదానం కుర్వంతి భువి మానవాః ॥ 4

తస్యాం స్నానంచ దానంచ జప హోమాదికంచ యత్ ।
బహుళం జాయతే యస్మా తస్మాత్సాబాహులీ స్మృతా । 5

తస్యాం యేతు నకుర్వంతి త్రిపురారి మహోత్సవం ।
న లభంతే జయం క్వాపి దగ్ధపుణ్యాః భవంతి తే ॥ 6

అతస్తస్యాం పౌర్ణమాస్యాం ప్రాతరర్చంతి యే శివం ।
నిశి యత్తైః కృతంపాపం విలయం ప్రతిపద్యతే । 7

అజన్మతః కృతం పాపం మధ్యాహ్నార్చనతస్తథా ।
సప్త జన్మార్జితం పాపం ప్రదోషార్చనతో మునే ॥ 8

ఆవిర్భావం శివాయాస్త్వం కధ్యమానం మయాశృణు ।
తస్యమృత్యుం శివాజ్ఞాత్వా భయాదంతర్హితా శివా । 9

ఆవిరాశీ జ్జగన్మాతా హిమాచల గుహాముఖాత్ ।
దదర్శ పర్వతం ఘోరం సింహవ్యాఘ్ర మృగాకులం ॥ 10

అపశ్యంతీ శివం సాతు విరహాకుల మానసా ।
విలలాప భృశం భీతా మాతాతహ శివేతిచ ॥ 11

కథం మాంనవిజానీషే సర్వజ్ఞస్సన్ సదాశివ
వన ఏకాకీనీం ఘోరే క్రందంతీం కురరీమివ 12

కదామేదర్శనం తేస్యాత్ కిం మాం విస్మృతవానసి ।
శక్తానజీవితం ధర్తుం సోఢుంవా విరహం హర ॥ 13

తాపత్యమపి కుత్రాసి నమే శోకం శృణోషి కిం ।
త్వాంవినా శరణం కం వాయామి కింవా కరోమ్యహం ॥ 14

యోజయస్వ పునర్మాంత్వం శివేనచ శివేనచ ।
ఇదానీం పునరుత్పన్నాం జానీహి జఠరాత్తవ ॥ 15

వరంతమేవ శీఘ్రంమే గవేషయ సదాశివం ।
నోచే ద్దేహపరిత్యాగం భృగోరస్మాత్కరోమ్యహం ॥ 16

సూత ఉవాచ :-

ఏవం రుదంత్యా స్తస్యాస్తు శృత్వా తాం గిరముత్తమాం ।
న్యవేదయత్ హిమవతే కశ్చినాగత్య ధీవరః ॥ 17

ధీవర ఉవాచ :-

కాచి న్నితంబినీ బాలా సర్వాభరణ భూషితా ।
తాటంకే బిభ్రతీశృత్యో ర్మండలే ఇవభాస్వతః ॥ 18

నానారత్న లసద్దీప్తి ముకుటం మస్తకే భృశం ।
లలాటేతు చతుష్కోణం ముక్తాషోడశ శోభితం ॥ 19

పుష్పం కాంచనరత్నాఢ్యం ముక్తాదామ విలంబి తం ।
సీమంతాంతర్గతం చారు నాసికే స్వర్ణమౌక్తికం ॥ 20

అంగదే చారుణీ బాహ్వోర్హస్తయో ర్వలయానిచ ।	21

ముక్తాఫలమయీం మాలాం లసత్కంచుక సంశ్రితాం ।
హేమరత్న మయీం కాంచీం కటీ క్షౌమవృతే శుభాం ॥	22

గుల్ఫయోః శృంఖలే హైమే సింజచ్చారు సునూపురే ।
పాదాంగులీష్వపి పృధక్త్యత్రద్భూషణ ముత్తమం ॥	23

ఏవం సర్వా నవద్యాంగీ రుదతీ విహ్వలా భ్రుశం ।
దృష్ట్వా పృష్టానమాం వ్యక్తిగృహ్ణాతి సా తవాభిధాం ॥	24

**బ్రహ్మోవాచ :-**

ఇద్ధం నిశమ్య హిమవాం స్త్వరితస్తాం సుతాంయయౌ ।
సాంత్వయన్ హేతుగర్భాభిః వాగ్భిస్తామవదత్ సుధీః ॥	25

**హిమవానువాచ :-**

కిమర్ధం శోచసే సుభ్రూసృష్టిస్థిత్యంత హేతుకే ।
సర్వలక్షణ సంపూర్ణే సర్వశక్తియుతేనఘే ॥	26

అకర్తుమన్యధా కర్తుం కర్తుమేశే మహేశ్వరి ।
అవాప్త సర్వకామేచ సర్వప్రాణ్యాంతరంగతే ॥	27

సనియుక్తా శివేనత్వం సర్వాంతర్యామిణీ శుభే ।
అధాऽపియోజయిష్యే త్వాం శివేన శివకారిణా ॥	28

ఉత్తిష్ఠేతి గృహిత్వా తా మాయయౌ నిజమందిరం ।
ననందపార్వతీ తత్ర దృష్ట్వామేనాం సుతాన్వితాం ॥ 29

నిశ్వాసపరమా స్యాసత్ శ్శివం ద్రష్టుంసముత్సుకా ।
ఉవాచ పితరం నత్వా సాధూపాయం వదస్వ మే ॥ 30

వ్రతం దానం తపోవాపి ధుష్కరం శివ లబ్ధయే ।
కరిష్యే తమహంతాత పూర్వవత్తప ఉత్తమం ॥ 31

బ్రహ్మోవాచ :-

ఆవదజ్జనక స్తాంతు విచార్య మనసా అసకృత్
కార్యసిద్ధికరం శీఘ్రం ఉపాయం శృణు తంమునే ॥ 32

హిమవానువాచ :-

శృణుపార్వతి వక్ష్యామి సాధూపాయం శివాప్తయే ।
ఉపాస్య విఘ్నరాజస్య ధర్మార్థ కామమోక్షదాం ॥ 33

అనుష్ఠితాం మహేంద్రాద్యై ర్దేవైశ్చ నారదాదిభిః ।
ప్రాప్తాశ్చ సిద్ధయస్తాస్తాః శక్రాది పదలక్షణాః ॥ 34

బ్రహ్మణః సృష్టి సామర్థ్యం దత్తం తేన మహాత్మనా ।
విష్ణోశ్చావన సామర్థ్యం దత్తం సర్వేశ్వరేణ హ ॥ 35

శివస్యాపిచ తే నైవ సామర్థ్యం సంహృతౌ ధృడం ।
శేషస్యాపి చ తేనైవ సర్వవిఘ్నహరేణచ ॥ 36

ధరాదరణ సామర్థ్యం దత్తం సర్వేశ్వరేణ హ ।
యస్య స్వరూపం నవిదు ర్బ్రహ్మాద్యా మునయోపి చ ॥ 37

వాచామగోచరో యోసౌ మనసో చాప్యగోచరః ।
గజానన స్వరూపేణ పరిదృశ్యోఅమిశ్వరః ॥ 38

అతస్తేనైవ రూపేణ సర్వారంభేషు పూజ్యతే ।
త ముపాసస్వ సర్వేశం మయాప్రోక్తేన వర్త్మనా ॥ 39

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**అంబావిర్భావంనామ అష్టాచత్వారింశో అధ్యాయః**



# అంబావిర్భావం
# 48-వ అధ్యాయము

అనంతరం వ్యాసమునీంద్రుడు బ్రహ్మదేవుని ఇలా ప్రశ్నించాడు. "ఓ చతురాననా! త్రిపురాసుర సంహార చరిత్రను నాకు వర్ణించి చెప్పావు! సరే! అలా కైలాసంలో ఆ త్రిపురుని బారినుండి తప్పించుకున్న జగదంబిక పార్వతి ఎక్కడ ఉన్నదో, తిరిగి ఎప్పుడు ఉద్భవించిందో ఆ వివరాలన్నీ, దానవశ్రేష్టుడైన త్రిపురుడు ఏరోజున వధించబడినదీ మొదలైన వివరాలన్నీ నాకు దయతో చెప్పు!"

"ఓ వ్యాసమునీంద్రా! పూర్ణమి తిథి తిథుల అన్నిటిలోకి ప్రభావ వంతమైనది! ఆరోజు దినభాగమంతా శంకరుడు దానవునితో ఘోరంగా యుద్ధంచేశాడు. ఆరోజు సాయంకాలము ప్రదోషపువేళ త్రిపురములతో సహా దైత్యేంద్రుడైన త్రిపురుడుకూడా శివుని బాణాగ్నియొక్క అమోఘ

ప్రభావంచేత దగ్ధం కావించబడ్డాడు. ఆరోజుననే సకల దేవతలూ శర్వుని అర్చించిన శుభతరుణం! కనుకనే ఓమునివర్యా! ఆరోజు ఉదయాన్నే ఎవరైతే త్రిపురారిని అర్చిస్తారో వారికి సర్వత్రా విజయం సంప్రాప్త మౌతుంది! వారి పుణ్యమూ ఇతోధికంగా వృద్ధిఅవుతుంది! అందుచేతనే విజ్ఞులైనవారు తప్పక ఆరోజున అర్చించి శివానుగ్రహానికి పాత్రులౌతారు! అయితే ఆరోజున త్రికాలాలలోనూ శివార్చన యొక్క ఫలితం యిలా ఉంటుంది. ప్రాతఃకాలార్చనకు ఫలం రాత్రియందు చేసిన సకల పాపములూ నశిస్తాయి! మాధ్యాహ్నికార్చనవల్ల జన్మించినదాదిగా చేసిన పాపములు నశించిపోతాయి! ఇక ప్రదోషవేళ శంభుని పూజించటం వల్ల ఏడు జన్మాలలోనూ ఆచరించిన దుష్కర్మలు దగ్ధమౌతాయి! ఇంత మహత్తరమైనదవటంవల్లనే 'పౌర్ణమి' తిథిని పర్వదినంగా భావిస్తారు!

ఓ పరాశరనందనా! త్రిపురుడు శివుని బాణాగ్నికి దగ్ధుడైన సంగతి తెలుసున్న గిరినందన హిమవంతుని పర్వతగుహ బైట ఆవిర్భవించింది! అలా వెలుపలికివచ్చి వెలుపల సింహ, వ్యాఘ్రములచేత నానావిధము లైన అడవిమృగాలతో నిండివున్న ఘోరమైన ఆ పర్వతాన్ని చూసి ఎక్కడా తన భర్తయైన శంకరుని జాడ కానరాక

'ఓ ప్రాణనాథా! నిన్ను విడిచి నేనెలా జీవించి ఉండగలను? యిక నీ దివ్యవదనాన్ని సందర్శించుకునే భాగ్యం నాకు ఎన్నటికి కలిగేది? నిన్ను వీడి క్షణకాలం కూడా మనలేను! ఓతండ్రీ! హిమ వంతుడా! నాఈ దుఃఖాన్ని నీవుకూడా గమనించుటలేదా? యిక నేను ఎవ్వరి శరణువేడను? నా వ్యధని తీర్చగలవారెవ్వరు? ఓతండ్రీ! నీవెలా

గైనా ఆ మంగళకరుడైన నా నాధునితో సంయోగము కలిగేలా చూడు! నీవు పూనుకొని నా భర్తతో పునఃసమాగమం కల్పించకపోయావా నాకిక ప్రాణత్యాగమే గతి!'' అంటూ గోడుగోడున విలపిస్తున్న సంగతిని ఒక కిరాతుడు యిలా పర్వతరాజైన హిమవంతుని చెవిన వేశాడు.

''ఓ పర్వతరాజా! ఒక మంగళప్రదురాలైన స్త్రీ, సర్వాలంకారములతో అలంకృతయై, చెవులకు గుండ్రని తాటంకాలనూ, నుదుట ముత్యాలతో అలంకరించబడ్డ ఆభరణాన్నీ ధరించి, ముక్కుకు బంగారు ముక్కెఅనూ, చేతులకు దండకడియాలతో మురుగులతోపాటు వెలలేని నవరత్నఖచిత తాపితమైన ఉంగరాన్ని ధరించి, మెడలో ముత్యాలహారాలతో, మొలకు మెరిసే బంగారు వడ్డాణంతో ఘల్లున మ్రోగే కాలి యందెల అలంకారాలతోనూ శోభిల్లుతుండగా, ఎందుకో ఆమె అతి దుఃఖంతో వివశురాలై నీపేరునుమాత్రం బిగ్గరగా చెబుతూ శోకిస్తోంది! ఏవివరమూ, అడిగినా చెప్పదు! ఆమెనోట వినవచ్చిన నీపేరు విని, నీతో అవిషయం చెప్పిపోదామని వచ్చాను!''

ఈ మాటలు విన్న పర్వతుడు వేగంగా ఆ పర్వతగుహను సమీపించి, తన కుమార్తెయైన జగదంబికను అక్కున చేర్చుకొని ఊరడించాడు. ఆమెయొక్క నిజస్వరూపాన్ని గుర్తుచేస్తూ

''ఓతల్లీ! నీవు సర్వశక్తిమంతురాలవూ, సకల సృష్టిస్థితిలయములకై కారకురాలవూ, సమస్త కోరికలు పరిపూర్తియైనట్టి మంగళప్రదురాలవు! నీకీ దైన్యమేమిటమ్మా? సర్వాంతర్యామిణిగా ఉన్న నీకు శివునితో వియోగమెక్కడుంది? శివుడిని అనుసరించేకదా 'శక్తి' ఉండేది? ఐనా లోకదృష్టితో నీకూ, నీ భర్తతో సమాగమం ఏర్పాటుచేస్తాను! అందాకా నీవు నావద్దనే

ఉందువుగాని రాతల్లీ!" అంటూ ఆమెను తనవెంట తీసుకువెళ్ళాడు.

అక్కడ తన తల్లిని చూసిన పర్వతరాజనందిని ఎంతో ఆనం దించింది! ఐనా భర్తయొక్క వియోగం తనని వేధిస్తూండటంతో విరహాగ్ని లో తప్తురాలై వేడివేడి నిట్టూర్పులు విడువసాగింది! తన తండ్రికి నమస్క రించి 'ఓతండ్రీ! నాభర్తయైన సాంబశివుడిని తిరిగి పొందేందుకు ఏదైనా చక్కని ఉపాయం — తపంగాని, వ్రతంగాని ఉపదేశించు! అలాచేసి, పూర్వంలా ఘోరతపస్సు ఆచరించి నాభర్త అనుగ్రహాన్ని పొందుతాను!" అని కోరగా క్షణకాలం ధ్యానమగ్నుడై, హిమవంతుడు తన కుమార్తెకు సకల కార్య సిద్ధినీ ప్రసాదించగల మహాప్రభావవంతమైన ఉపాయాన్ని యిలా తెలిపాడు.

'అమ్మాయీ! పార్వతీ! పరమశివుని సన్నిధిని తిరిగి నీవు ప్రాప్తించు కునేందుకు ఒక ఉపాయాన్ని తెలియజేస్తాను! జాగ్రత్తగా విని, దాన్ని శ్రద్ధగా ఆచరించి, నీ మనోభీష్టాన్ని అనంత సౌభాగ్యాన్నీ పొందు!

సర్వులకూ చతుర్విధ పురుషార్థాలనూ ఇవ్వగలదీ, ఇంద్రాది సకల దేవతలచేతనూ సలుపబడుతున్నదీ, మహాప్రభావ సంపన్నమైనదీ — విఘ్నరాజు ఐన గజాననుని ఉపాసన! సృష్టికర్తయైన బ్రహ్మకు ఆ సామ ర్థ్యాన్ని అనుగ్రహించిందీ, స్థితికర్తగా లోకపాలనం చేసే శక్తిని విష్ణువుకూ, సర్వాన్నీ లయం చేయగల శక్తి హరునికీ ఆ గణేశుడే యిచ్చి అనుగ్ర హించి ఉన్నాడు!

ఇక భూభారాన్ని వహించగల సామర్థ్యాన్ని శేషునికి ప్రసాదించిందీ ఆతడే! ఆతడు అవాఙ్మానస గోచరుడు. బ్రహ్మేంద్రాదులుగాని, నారదాది

మహర్షులుగాని ఆ సర్వేశ్వరుని స్వరూపం తెలుసుకోలేరు. నిర్గుణ పరబ్రహ్మ స్వరూపుడై ఉన్నప్పటికీ, తన నిజ భక్తజనుల అనుగ్రహార్థమై ఈ అనుగ్రహకరమైన గజానన రూపంలో ఆవిర్భవించాడు! సర్వులచేతా, సకల కార్యారంభాలలోనూ పూజించబడే ఆ వరదగణేశమూర్తి సకల శుభఫలప్రదుడు! కనుక నీవు ఆ గజానన స్వరూపుని, సర్వేశుడైన ఆ దేవదేవుని నే చెప్పే నియమాలతో శ్రద్ధగా పూజించి ఆతడి పరమానుగ్రహాన్ని పొందు!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'అంబావిర్భావం' అనే 48-వ అధ్యాయం.



49

# గణేశ పార్థివ పూజావిధానం

(మూలం)

## ఏకోన చత్వారింశో అధ్యాయః

**పార్వత్యువాచ :-**

దయానిధే గిరీంద్ర త్వం పితర్మే వద సత్వరం ।
ఉపాసనాం గణేశస్య సర్వేశస్య జగద్గురోః ॥ 1

యయా శివం సమేభ్యత్య శివంప్రాప్స్యామి శాశ్వతం ।
మర్త్యలోకేఽపి లోకానాముపకారో భవిష్యతి ॥ 2

**హిమవానువాచ :-**

తవస్నేహ వశాద్దేవి రహస్యం పరమం శుభం ।
లోకానాం చోపకారాయ వక్ష్యే శృణ్వేకమానసా । 3

ప్రత్యూషకాల ఉద్ధాయ నైఋుతీం దిశమావ్రజేత్ ।
ఆచ్ఛాద్య ధరణీం పూర్వం తృణకాష్ట దలైరపి । 4

ఉర్వరాం వర్జయేత్ తిష్ఠన్నుత్సర్పన్నచ బుద్ధిమాన్ ।
త్యక్త్వా మూత్రపురీషేతు యథోక్తం శౌచమాచరేత్ ॥ 5

దంతజిహ్వా విశుద్ధించ కృత్వా స్నాతుం తతో వ్రజేత్ ।
నదీం తటాకం వాపీంవా సరః కూపమ థాపివా ॥ 6

కృత్వా పూర్వం మలస్నానం మంత్రస్నానం తతశ్చరేత్ ।
మృదావా చందనేనాపి తిలకం కుంకుమేన వా ॥ 7

కుర్యాద్ధౌతే వాససీవా పరిధాయ శుభాసనే ।
ఉపవిశ్యైక చిత్తస్తు సర్వం నిత్యం సమాప్యచ ॥ 8

మృత్తికాం సుందరాం స్నిగ్ధాం క్షుద్ర పాషాణ వర్జితాం ।
సు విశుద్ధాం మవల్మీకాం జలసిక్తాం విమర్దయేత్ । 9

కృత్వా చారుతరాం మూర్తిం గణేశస్య శుభాం స్వయం ।
సర్వావయవ సంపూర్ణాం చతుర్భుజ విరాజితాం । 10

వరశ్వాది స్వాయుధాని దధతీం సుందరాం ఘనాం ।
స్థాప్య పీఠేతతః పాణీన్ ప్రక్షాళ్య మేలయేత్సుధీః । 11

పూజాద్రవ్యాణి సర్వాణి జలాదీని ప్రయత్నతః ।
అష్టగంధా నక్షతాంశ్చ రక్తపుష్పాణి గుగ్గులం ॥ 12

త్రి పంచసప్తభిః పత్రైర్యుతాన్ దూర్వాంకురాన్శుభాన్ ।
అష్టోత్తర శతం నీలాన్ శ్వేతానానీయ సుందరాన్ ॥ 13

ఘృత దీపం తైలదీపం నైవేద్యం వివిధం శుభం ।
మోదకాపూప లడ్డూకాన్ పాయసం శర్కరాయుతం ॥ 14

సూక్ష్మంచ తండులాన్నం చ వ్యంజనాని బహూనిచ ।
సచంద్ర పూగచూర్ణాఢ్యం ఖాద్యఖాదిబిరసంయుతం ॥ 15

ఏలా లవంగ సంమిశ్రం తాంబూలం కేసరాన్వితం ॥ 16

జంబూ ఆమ పనసాదీని ద్రాక్షా రంభా ఫలానిచ ॥ 17

తత్తదృతుభవానీశే నీరాకేలాని చానయేత్ ।
బహుప్రకార మార్త్రిక్యం కాంచనీం దక్షిణాంతథా ॥ 18

## పార్థివ గణేశవిధి

ఏవం సంభృత సంభారః ఏకాంత స్థలమాస్థితః ।
చేలాజిన నేకుశమయే ఆసనేచ కృతాసనః ॥ 19

భూతశుద్ధిం ప్రకుర్వీత ప్రాణానాం స్థాపనం తథా ।
దిగ్బంధ పూర్వం దేవాంశ్చ గణేశాదీన్ మేత్పురా ॥ 20

అంతర్బహిర్మాతృకాశ్చన్య సేదాగమ మార్గతః ।
సన్నిధానాదికా ముద్రాః దర్శయేద్గురు మార్గతః ॥ 21

మంత్రన్యాసం తతఃకృత్వా షడంగ న్యాసమేవచ ।
పూజాద్రవ్యాణి సంశోధ్య తతో ధ్యాయేత్ గజాననం ॥ 22

ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం । 23

పాశాంకుశధరం దేవం మోదకాన్ బిభ్రతం కరైః ।
రక్తపుష్పమయీం మాలాం కంఠేహస్తే పరాం శుభాం ॥ 24

భక్తానాం వరదం సిద్ధిబుద్ధిభ్యాం సేవితం సదా ।
సిద్ధి బుద్ధి ప్రదం నృణాం ధర్మార్ధ కామమోక్షదం ॥ 25

బ్రహ్మ రుద్ర హరీంద్రాద్యైః సంస్తుతం పరమర్షిభిః ।
ఆగచ్ఛ జగదాధార సురాసుర వరార్చిత ॥ 26

అనాధనాథ సర్వజ్ఞ గీర్వాణ పరిపూజిత ।
స్వర్ణసింహాసనం దివ్యం నానారత్న సమన్వితం ॥ 27

సమర్పితం మయాదేవ తత్రత్వం సముపావిశ ॥
దేవదేవేశ సర్వేశ సర్వతీర్థ హృతం జలం । 28

పాద్యం గృహాణ గణప గంధపుష్పాక్షతైర్యుతం ॥ 29

ప్రవాళముక్తాఫల పూగరత్న తాంబూల జాంబూనద మష్టగంధం ।
పుష్పాక్షతా యుక్త మమోఘశక్తే దత్తం మయార్ఘ్యం సఫలీకురుష్వ ॥ 30

గంగాది సర్వతీర్థేభ్యః ప్రార్థితం తోయముత్తమం ।
కర్పూరైలాలవంగాది వాసితం స్వీకురుప్రభో ॥ 31

చంపకాశోక వకుళ మాలతీ మోగరాదిభిః
వాసితం స్నిగ్ధతా హేతు తైలం చారు ప్రగృహ్యతాం । 32

కామధేను సముద్భూతం సర్వేషాం జీవనం పరం ।
పావనం యజ్ఞహేతుస్తేన యత్స్నానార్థ మర్పితం ॥ 33

ధేనుదుగ్ధ సముద్భూతం శుద్ధం సర్వజనప్రియం ।
మయానీతం దధివరం స్నానార్థం ప్రతిగృహ్యతాం ॥ 34

నవనీత సముత్పన్నం సర్వసంతోషకారణం ।
యజ్ఞాంగం దేవతాహారో ఘృుతం స్నాతుం సమర్పితం । 35

సర్వపుష్టికరం దేవ మధుస్నానార్థ మర్పితం ।
ఇక్షుసార సముద్భూతం శార్కరాం మనునోహరాం ॥ 36

మలాపహారిణీం స్నాతుం గృహాణత్వం మయార్పితాం । 37

సర్వ మాధుర్యతా హేతుః స్వాదుః సర్వప్రియంకరః ॥ 38

పుష్టికృత్ స్నాతు మానీత ఇక్షుసారభవో గుడః ।
కాంస్యే కాంస్యేన పిహితో దధిమధ్వాజ్య పూరితః । 39

మధుపర్కో మయానీతః పూజార్థం ప్రతిగృహ్యతాం ।
సర్వతీర్థ హృతం తోయం మయా ప్రార్థనయా విభో । 40

సువాసితం గృహాణేదం సమ్యక్స్నాతుం సురేశ్వర । 41

రక్తవస్త్రయుతం దేవలోక లజ్జా నివారణం ।
అనర్ఘ్య మతిసూక్ష్మంచ గృహాణేదం మయార్పితం ॥ 42

రాజితం బ్రహ్మసూత్రంచ కాంచనం రత్నసంయుతం ।
భక్త్యోపపాదితందేవ గృహాణ పరమేశ్వర ॥ 43

అనేక రత్నయుక్తాని భూషణాని బహూనిచ ।
తత్తదంగే కాంచనాని యోజయామి తవాజ్ఞయా ॥ 44

అష్టగంధ సమాయుక్తం రక్తచందన మిశ్రితం ।
ద్వాదశాంగేషు తే దేవ తేవయామి కృపాంకురు ॥ 45

రక్తచందన సంమ్మిశ్రాంస్తండులాం స్తిలకోపరి ।
శోభాయై సంప్రదాస్యామి గృహాణ జగదీశ్వర ॥ 46

పాటలం కర్ణికారంచ బంధూకం రక్తపంకజం ।
మోగరం మాలతీపుష్పం గృహ్యతాం పరమేశ్వర ॥ 47

నానాపంకజ పుష్పైశ్చ గ్రధితాం పల్లవైరపి ।
బిల్వ పత్రయుతాం మాలాం గృహాణ సుమనోహరాం ॥ 48

దశాంగం గుగ్గులం ధూపం సర్వ సౌంగధ్యకారకం ।
సర్వ పాపక్షయ కరం త్వం గృహాణ మయార్పితం ॥ 49

సర్వజ్ఞ సర్వలోకేశ తమో నాశన ముత్తమం
గృహాణ మంగళం దీపం దేవదేవ నమోస్తుతే ॥ 50

నానాపక్వాన్న సంయుక్తం పాయసం శర్కరాన్వితం ।
నానా వ్యంజన శోభాఢ్యం శాల్యోదన మనుత్తమం ॥ 51

దధిదుగ్ధ ఘృతైర్యుక్తం లవంగైలా సమన్వితం ।
మరీచి చూర్ణసహితం క్వధికా వటకాన్వితం 52

రాజితా ధాన్యసంయుక్తం మేథీపిష్టం స తక్రకం ।
హింగూ జీరక కూష్మాండ మరీచి మాషపిష్టకైః ॥ 53

సంపాదితై స్సుపక్వై శ్చభర్జితై ర్వటకైర్యుతం ।
మోదకాపూప లడ్డూక శష్కులీ మండకాది భిః ॥ 54

పర్పటైరపి సంయుక్తం నైవేద్యం అమృతాన్వితం 55

హరిద్రా హింగు లవణసహితం సూపముత్తమం
ససాముద్రం గృహాణేదం భోజనం కురుసాదరం । 56

సు తృప్తికారకం తోయం సుగంధం చ పిబేచ్ఛయా ।
త్వయి తృప్తే జగత్తృప్తం నిత్యతృప్తే మహాత్మని । 57

ఉత్తరాపోశనార్థం తే దద్మి తోయం సువాసితం ।
ముఖపాణి విశుధ్యర్థం పునస్తోయం దదామితే । 58

దాడిమం మధురం నింబ జంబ్వాంమ్ర పనసాదికం ।
ద్రాక్షా రంభాఫలం పక్వ కర్కంధూః ఖార్జురం ఫలం ॥ 59

నారికేళంచ నారింగ మాంజిరం జంబీరం తథా ।
ఉర్వారుకంచ దేవేశ ఫలాన్యేతాని దృహ్యతాం ॥ 60

ముఖపోఙి విశుధ్యర్థం పునస్తోయం దదామితే ।
గృహాణాచమనం చారు కరాంగో ద్వర్తనం శుభం ॥ 61

నానాపరిమళ ద్రవ్యైర్నిర్మితం చూర్ణముత్తమం ।
సుగంధినామకం పుణ్యగంధి చారు ప్రగృహ్యతాం ॥ 62

చారు శాలూర సంభూతం వంశసార సముద్భవం ।
సీమంత భూషణం చూర్ణం లాక్షారంజిత మస్తుతే ॥ 63

సచంద్రపూగ చూర్ణాఢ్యం ఖాద్య ఖాదిర సంయుతం ।
ఏలా లవంగ సంమిశ్రం తాంబూలం కేసరాన్వితం ॥ 64

న్యూనాతి రిక్తపూజాయాః సంపూర్ణ ఫలహేతవే ।
దక్షిణాం కాంచనీం దేవ స్థాపయామి తవాగ్రతః ॥ 65

సితపీతై ధారకైః జలజై కుసుమై శ్శుభైః ।
గ్రథితాం సుందరాం మాలాం గృహాణ పరమేశ్వర ॥ 66

హరితాః శ్వేతవర్ణావా పంచ త్రిపత్ర సంయుతాః । 67

దూర్వాంకురా మయాదత్తా ఏకవింశతి సంమితాః । 68

ఏకవింశతి సంఖ్యాకాః కుర్యాద్దేవ ప్రదక్షిణాః ।
పదే పదేతే దేవేశ నశ్యంతు పాతకాని మే ॥ 69

ఔదుంబరే రాజతే వాకాంస్యే కాంచన సంభవే ।
పాత్రేప్రకల్పితాన్ దీపాన్ గృహాణ చక్షురర్పకాన్ ॥ 70

పంచారార్తిం పంచదీపై ర్దీపితాం పరమేశ్వర ।
చారుచంద్రనిభం దీపం గృహాణ వీచివారణం । 71

యథాస్య నేక్ష్యతే భస్మ తథాపాపం వినాశయ ।
స్తోత్రైర్నానావిధైః సూక్తైః సహస్రనామభిస్తతః ॥ 72

ఉపవిశ్యస్తు వీతైనం కృత్వా స్థిర తరం మనః । 73

దీనాధీశ దయానిధే సురగణైః సంసేవ్యమాన ।
ద్విజ బ్రహ్మేశాన మహేంద్ర శేషగిరిజా గంధర్వ సిద్ధైస్తుత ॥ 74

సర్వారిష్ట నివారణైక నిపుణ త్రైలోక్యనాథప్రబో ।
భక్తింమే సఫలాం కురుష్వ సకలాంక్షాంత్వా పరాధాన్మమ ॥ 75

ఇతి మూర్తిం సమభ్యర్చ్య దండవత్రృణిపత్యచ ।
జపేన్మంత్రం తతో దేవి సర్వసిద్ధి ప్రదాయకం ॥ 76

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనా ఖండే**
**గణేశపార్థివపూజా విధానం నామ ఏకోన చత్వారింశో అధ్యాయః**



# గణేశ పార్థివ పూజవిధానం
# 49-వ అధ్యాయము

గిరినందనయైన పార్వతీదేవి తన తండ్రిని యిలా ప్రశ్నించింది.

"ఓ జనకా! ఆ గజాననుడెట్టివాడు? అతని ఉపాసనా విధాన మెట్టిది? ఆ గణేశుని అనుగ్రహవిశేషం వలన తిరిగి నా నాథుని పొందగలనా? ఈ పవిత్ర ఉపాసనను తెలపటంవల్ల మానవులకు కూడా అమిత ప్రయోజనం చేకూరుతుంది! కనుక ఆ వివరం నాకు తెలియ జేయి!" ఈ మాటలకు ఆనందభాష్పములు జాలువారగా, భక్తితో అతని కంఠము గాద్గదికమైంది. ప్రేమతో ఆమె తల నిమురుతూ హిమవంతు డిలా అన్నాడు.

"అమ్మాయీ! ఈ గణేశ ఉపాసన అతిగోపనీయమైనది. ఇది మహా ప్రభావవంతమైనదికూడాను! లోకకళ్యాణార్థం ఈ వ్రతవిధానాన్ని తెలియజేస్తాను. సావధానమనస్కురాలవై విను.

బ్రాహ్మీముహూర్తంలోనే ఈ ఉపాసన చేయగోరేవారు నిద్ర మేల్కొ నాలి! ఆతరువాత కాలకృత్యాదులను విధివత్తుగా పూర్తిచేసుకుని, దంత ధావనం, మలాపకర్షణస్నానం, మంత్రస్నానం ఆచరించి ముఖమున తిలకాన్ని ధరించాలి! శుచిగా ఆరవేసిన మడివస్త్రములను ధరించి ఏకాగ్ర చిత్తంతో సుఖాసనంపై కూర్చుని నిత్యకర్మలైన సంధ్యాదికాలు నిర్వర్తించు కోవాలి! రాళ్లు, రప్పలు లేని ఒండ్రుమట్టిని నీటితో తడిపి ముద్దగా చేసి మర్దించాలి! ఆ పరిశుద్ధమైన బంకమట్టితో సర్వావయవ సంపూర్ణ డైన గణేశుని ప్రతిమను తయారుచేయాలి. నాలుగు చేతులతో పరశువు మొదలైన ఆయుధాలు ధరించిన దివ్యమంగళమూర్తిని అలా తయారు చేశాక ఒకపీఠంపై ఉంచి చేతులను చక్కగా కడుక్కోవాలి!

పవిత్రోదకాన్ని స్నానమునకు సమకూర్చాలి! గంధము, ఎఱ్ఱటి అక్షతలు, ఎఱ్ఱటి పుష్పాలు, ధూపం వేసేందుకు గుగ్గిలము, మూడు, ఐదు, ఏడు పత్రాలుగల శ్వేత దూర్వాంకురాలు సంపాదించుకోవాలి! ఆవునేతితో దీపానికి ఏర్పాటుచేయాలి! ఇక నైవేద్యానికి గజాననునికి అత్యంత ప్రీతికరములైన ఉండ్రాళ్ళును, అప్పాలు, లడ్డూలు, పరమా న్నము, సన్నబియ్యపు వరిఅన్నము సమస్త ఆధరువులతోనూ సిద్ధపరచాలి! సుగంధ చూర్ణయుక్తమైన తాంబూలమును, నేరేడు, మామిడి, పనస, ద్రాక్ష, అరటి మొదలైన ఫలములు సమకూర్చుకోవాలి! కొబ్బరికాయ మొదలైన పూజాద్రవ్యాలను బంగారుపళ్ళెములో హారతికర్పూరంతోసహా సిద్ధపరచుకోవాలి!

ఏకాంత స్థలంలో దర్భాసనమూ, దానిపైన లేడిచర్మము పరచు కొని సుఖాసనంలో కూర్చున్నాక, భూతశుద్ధినిచేసి ప్రాణాయామాదికములు

చేసి గణేశవిగ్రహానికి ప్రాణప్రతిష్ఠచేసి దిగ్బంధన చేయాలి.

ఆతరువాత గజాననుని శ్రద్ధాపూర్వకంగా నమస్కరించి, అంతర్బహి ర్మాతృకా న్యాసములు చేసుకోవాలి! సన్నిధిముద్రతో గణాధిపుని ఆవాహ నంచేసి మంత్రాన్ని బీజాక్షరసహితంగా, అంగన్యాస కరన్యాసములతో తనపై న్యాసం చేసుకుని, పూజాద్రవ్యాలన్నింటినీ శుద్ధిచేసుకుని గణేశుని ఈవిధంగా ధ్యానించాలి!

ఏకదంతముతోనూ, చేటలవంటి విశాలమైన చెవులతోనూ, గజ వదనముతో, నాలుగు బాహువులలోనూ పాశము, అంకుశము, పరశువు మొదలైన ఆయుధములు ధరించినవాడిగనూ, మెడలో ఎఱ్ఱటి వర్ణంగల పుష్పముల మాల (మందారపూలు) ధరించినవాడిగనూ, భక్తు లకు అనుగ్రహాన్ని వర్షించే వరదునిగా, సిద్ధి బుద్ధి ప్రసాదించువాడూ, ధర్మార్థ కామమోక్షాలనే నాలుగు పురుషార్థములు యిచ్చేవాడూ, బ్రహ్మ, ఇంద్ర రుద్రాది, విష్ణుదేవతలందరిచేతా, నారదాది దేవర్షులచేతా, స్తుతింపబడే వాడైనట్టి గజాననుని దివ్యమంగళమూర్తిని ధ్యానించాలి!

ఆ తరువాత ఆతడిని షోడశోపచారములచేత భక్తిశ్రద్ధలతో పూజించి, నీరాజన మంత్రపుష్పములను సదక్షిణకంగా సమర్పించాక, అపరాధ క్షమాపణను వేడి నానా స్తోత్రములచేతా గణపతిని స్తుతించి, సాష్టాంగనమస్కారముచేసి ఆ తరువాత యధాశక్తిగా సర్వసిద్ధిప్రదాయక మైన గణేశుని మంత్రజపము చేయాలి!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'గణేశ పార్థివపూజా విధానం' అనే 49-వ అధ్యాయం.



50

# చతుర్థీవ్రత కథనం

(మూలం)

## పంచ దశో అధ్యాయః

**పార్వత్యువాచ :-**

అహం మంత్రం నజానామి గిరీంద్ర మేవద స్వయం ।
అనుగ్రహం గణేశస్య యామి యామి శివం శివం ॥ 1

**హిమవానువాచ :-**

మంత్రా నానావిధా దేవి నానాసిద్ధి ప్రదాయకాః ।
అసంఖ్యాతా గణేశస్య కాంశ్చిత్తేషు వదామి తే ॥ 2

కృత్వాపద్మాసనం నమ్యక్ నియమ్యాఖాని సర్వశః ।
కృత న్యాసవిధిః పశ్చాజ్జపం కుర్యా న్నిజేచ్ఛయా ॥ 3

ఏకాక్షరస్య మంత్రస్య లక్షం లక్షార్థమేవచ ।
షడక్షరస్య మంత్రస్య నియుతం చాయుతం తథా । 4

తథా పంచాక్షరస్యాపి దశాష్టాక్షరయోరపి ।
అష్టావింశ ద్వర్ణమంత్రో జప్తవ్యో అయుత సంఖ్యయా ॥ 5

ఏవం నానావిధాన్ మంత్రాన్ జపంతి స్వేష్టసిద్ధయే ।
త్వంతు పార్వతి మేవాక్యం శృణు హ్యైకాగ్ర మానసా ॥ 6

ఏకాక్షరం షడర్ణంచ గృహాణ మంత్ర ముత్తమం । 7

నభశ్శుక్ల చతుర్ధ్యాంత్వం ఆరంభం కురు సువ్రతే । 8

అనుష్టానం మాసమాత్రం కురుకార్యం భవిష్యతి ।
శివం ప్రాప్స్యసి నువ్యక్తం అన్యద్యచ్చాపి వాంఛితం ॥ 9

పార్థివీ పూజితామూర్తిః స్త్రీయావా పురుషేణవా ।
ఏకా దదాతి సా కామ్యం ధన పుత్ర పశూనపి ॥ 10

అసాధ్యం సాధయేన్మర్త్యో మూర్తిద్వయ ప్రపూజనాత్ ।
త్రిమూర్తి పూజనాద్రాజ్యం రత్నాని సర్వసంపదః ॥ 11

చతుర్మూర్తేః పూజయేద్యో ధర్మార్థ కామ మోక్షభాక్ ।
సార్వభౌమో భవేద్రాజా పంచమూర్తి ప్రపూజనాత్ ॥ 12

షణ్మూర్తిపూజయా సృష్టిప్రస్థితి ప్రళయ కృద్భవేత్ ॥ 13

భూతం భవ్యం భవిష్యంచ వేత్తిదేవ ప్రసాదతః ।
త్రయ స్త్రింశత్కోటి దేవా వహ్నీంద్ర శివవిష్ణవః ॥ 14

సనకాద్యా మునిగణాః సేవంతే దశ పూజనాత్ ।
ఏకాదశ అర్చనా ద్దేకాదశ రుద్రాధిపో భవేత్ ॥ 15

ద్వాదశాదిత్య రాజ్యంచ లభేచ్చ ద్వాదశార్చనాత్ ।
అతిసంకట వేలాసు కుర్యాద్వృద్ధ్యా ప్రపూజనం । 16

అష్టోత్తర శతం యావత్తావ త్తత్తదవాప్నుయాత్ ।
మహాముక్తి మవాప్నోతి లక్షపూజనతో న్వహం ॥ 17

కారాగృహాన్ముక్తి కామః కారయేన్మూర్తిపంచకం ।
త్రిస్సప్త రాత్రాన్ముచ్యేత గణేశానుగ్రహాన్మనే ॥ 18

సప్తమూర్తీః ప్రకుర్వీత ప్రత్యహం పంచవత్సరం ।
మహాపాపాత్ ప్రముచ్యేత గణేశే భక్తిమాన్నరః । 19

ఆజన్మ మరణాదేకాం పూజయేత్పార్థివీం నరః ।
గణేశస్సతు విజ్ఞేయో దర్శనా ద్విఘ్ననాశనః । 20

తమేవ సర్వకామేషు పూజయేన్న గణాధిపం ।
తస్యైవ పూజయాప్రీతో సదేవః స్యా త్తథాస్వయం । 21

సర్వరోగ ప్రపీడాసు మూర్తినాం త్రయ ముత్తమం ।
నవాహం పూజయేద్యస్తు సర్వపీడాం వ్యపోహతి ॥ 22

సౌవర్ణీ రాజతీ తామ్రీ రీతికాంస్య సముద్భవా ।
మౌక్తికీచ ప్రవాలీచ సర్వమేత త్ర్పయచ్ఛతి ॥ 23

ఏవంకృతే వ్రతేదేవి సర్వాన్కామా నవాప్స్యసి ।
యావద్భాద్రపదే మాసి చతుర్థీ పరిలభ్యతే ॥ 24

తస్యాం మహోత్సవః కార్యోఽయథా విభవ మాదరాత్ ।
రాత్రౌ జాగరణం కార్యం తత్కథా వాద్య గాయనైః ॥ 25

ప్రభాతే విమలే స్నాత్వా పూర్వవత్పూజయే ద్విభుం ।
గణేశం వరదం దేవం తతోహోమం సమాచరేత్ ॥ 26

కుండేసాంగే స్థండిలే వా జుహుయా జ్జపేదశాంశతః ।
పూర్ణాహుతిం తతః కుర్యాద్భవి దానపురస్సరం ॥ 27

ఆచార్యం పూజయేత్పశ్చాద్గో భూవాసో ధనాదిభిః ।
బ్రాహ్మణాన్ వేదవిదుషః సపత్నీకాంశ్చ కాంశ్చన ॥ 28

తేభ్యో భూషణ వాసాంసి దద్యాత్ శక్త్యాచ దక్షిణాం ।
దద్యాత్స్త్రీణా మలంకారాన్ యోషిద్భ్యశ్చస కంచుకాన్ ॥ 29

తుష్టయే గణానాథస్య సిద్ధి బుద్ధి యుతస్య హ ॥ 30

విత్తశాఠ్యం నకుర్వీత యథా విభవ మాచరేత్ ॥ 31

తతః సుహృజ్జన యుతః స్వయం భుంజీత సాదరం ।
అపరస్మిన్ దినేమూర్తిం నృయానే స్థాపయేన్ముదా ॥ 32

ఛత్ర ధ్వజ పతాకాభిః శ్చామరై రుపశోభితాం ।
కిశోరై ర్ధండయుద్ధేన యుధ్యద్భిశ్చ పురస్సరం ॥ 33

మహాజలాశయం గత్వా విసృజ్య వినమలే జలే ।
వాద్య గీత ధ్వని యుతో నిజమందిరమా ప్రజేత్ ॥ 34

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**హిమవద్గిరిజాసంవాదేచతుర్థీవ్రత కథనం నామ**
**పంచాదశో అధ్యాయః**



# చతుర్థీవ్రత కథనం
# 50-వ అధ్యాయము

ఓ వ్యాసమునీంద్రా! ఆ విధంగా తన తండ్రియైన హిమవంతుడు చెప్పిన 'గణేశ పార్థివ పూజా'విధానాన్నంతనీ శ్రద్ధగావిన్న గిరినందనయైన పార్వతి తిరిగి యిలా తన తండ్రిని ప్రశ్నించింది!

"ఓతండ్రీ! పూజకు చివర మంత్రజపం చేయవలెనని చెప్పావు! ఆ మంత్రమేమిటో దాని వివరమేమిటో — ఎట్టి మహాప్రభావయుత మంత్రజపంవల్ల నా భర్తయైన పరమేశ్వరుడిని కూడి సుఖించగలనో ఆ మంత్రమును నాకుపదేశించవలసింది!"

ఆ మాటలకు పర్వతరాజైన హిమవంతుడిలా అన్నాడు :

"ఓదేవీ! గణేశుని దివ్యమంత్రాలనేకం వున్నాయి! అవి సకల సిద్ధులనూ కలుగజేస్తాయి! నీకు తగిన మంత్రాన్ని ఉపదేశిస్తాను. ఇంద్రి

యాలను పరిపరివిధాల పోనివ్వకుండా నియమించి, గణేశుని దివ్య మంత్రాన్ని న్యాసం చేసుకొని ఏకాగ్రచిత్తంతో జపించి, ధ్యానించాలి!

ఏకాక్షరమంత్రాన్ని లక్షసంఖ్యకు తక్కువకాకుండా జపించాలి. షడక్షరమంత్రాన్ని లక్షగాని, పదివేలకు తక్కువకాకుండా జపించాలి! పంచాక్షరీ, దశాక్షరీ, అష్టాక్షరీ మహామంత్రాలనుకూడా అదేసంఖ్యలో జపించాలి! ఇరవైఎనిమిది అక్షరాలుగల మంత్రాన్ని కూడా పదివేలు జపించాలి! నీవు ఏకాక్షర, షడక్షర మంత్రాలను నానుంచి స్వీకరించి మంత్రజపాన్ని శ్రావణశుద్ధ చతుర్థిరోజున ఆరంభించు! ఈ వ్రతాన్ని ఒక మాసంరోజులు నిష్టగా చేసినట్లైతే నీవు తప్పక పరమశివుని పొందగలవు! ఇంకా యితరములైన నీ సకల కోరికలు కూడా నెరవేరతాయి!"

స్త్రీగానీ, పురుషుడుగాని ఒక్క పార్థివగణపతిమూర్తిని స్థాపించి పూజించినట్లైతే ధన, పుత్ర, పశు సమృద్ధిని పొందగలరు. రెండుమూర్తు లను స్థాపించితే అసాధ్యమైనవికూడా సుసాధ్యమౌతాయి. మూడు మూర్తు లను పూజించితే రాజ్యప్రాప్తి, రత్నాది సర్వసంపదలూ కలుగుతాయి!

ఐదు మూర్తులను పూజించటంచేత సార్వభౌమత్వాన్ని సిద్ధింప చేసుకోవచ్చు. ఆరింటిని పూజించితే సృష్టిస్థితిలయకారకత్వం వస్తుంది! ఏడు, ఎనిమిది, తొమ్మిది విగ్రహాలను పూజిస్తే సర్వజ్ఞత్వం కలుగుతుంది! పదిమూర్తుల నర్చిస్తే సకల దేవతా, మునిగణములచేత పూజ్యత్వం వస్తుంది. పదకొండు మూర్తుల పూజవల్ల దశరుద్రులకధిపతి కాగలడు. పన్నెండుమూర్తులను శ్రద్ధతో అర్చిస్తే ద్వాదశాదిత్యుల రాజ్యం సంప్రాప్తి స్తుంది. అతి సంకష్టసమయాలలో యింకా ఎక్కువ మూర్తులను

పూజించాలి! నూటఎనిమిది మూర్తులవరకూ పూజిస్తే సమస్త కామనలూ నెరవేరతాయి! ప్రతిదినమూ లక్షమూర్తులను అర్చించటంచేత మహా ముక్తిని పొందగలరు. అలాగే కారాగృహ విమోచనం కోరేవారూ ప్రతీ నిత్యం ఐదుగురు మృత్తికాగణేశమూర్తులను పూజించాలి! అలాచేస్తే ఇరవైఒక్క రోజులలో విముక్తి కల్గుతుంది. అలాగే ప్రతీరోజూ ఏడు మూర్తుల చొప్పున ఐదు సంవత్సరాలకాలం పూజిస్తే — గణేశానుగ్రహాన్ని పొంది మహాపాపములనుండి విడువబడతారు. జన్మించినప్పటినుండి ఆమరణాంతం ఒకే పార్థివమూర్తిని పూజిస్తే వాడు సాక్షాత్తూ గజాననుడే అవుతాడు. అట్టివాని దర్శనంవల్లనే సమస్త విఘ్నాలూ నశిస్తాయి. అట్టి భక్తునే గణపతికి మారుగా సర్వకార్యాల ఆరంభంలోనూ పూజించవచ్చు. అట్టి భక్తుని పూజించటంవల్ల గణేశుడు తృప్తుడైనట్లు, స్వయంగా తననే అర్చించినా అంత ప్రసన్నుడు కాడు.

మూడు గణేశమూర్తులను 9 రోజులకాలం పూజిస్తే రోగాది సకల పీడలూ నశిస్తాయి. అలాగే బంగారము, వెండి, రాగి మొదలైన మూర్తులు సహితం అటువంటి ఉత్కృష్ట ఫలితాన్నే యిస్తాయి.

అమ్మా! పార్వతీ! నీవు ఈ వ్రతాన్ని చేయటంవలన సకల అభీష్టా లనూ పొందగలవు! చివరికి భాద్రపద శుక్ల చతుర్థిరోజున మాత్రము శక్తికొలది మహోత్సవము చేయాలి! మర్నాడు ఉదయాన్నే స్నానసంధ్యాది కములు ముగించుకొని పూర్వంలాగానే గణేశుని మూర్తిని పూజించ వలసింది! ఆతరువాత జపసంఖ్యలో పదోవంతు హోమం చేయాలి! అందులో పదోవంతు తర్పణం యివ్వాలి! ఆతరువాత బలి, దానపురస్స రంగా పూర్ణాహుతి చేయాలి! తరువాత ఆచార్యుని భూ, వాసో, ధనాది

కములచేత పూజించాలి! బ్రాహ్మణులకు భోజన సమారాధన జరిపి వారిని సంతుష్టులను చేసి, వేదవేత్తలు భార్యాసహితులైన బ్రాహ్మణులను దక్షిణాదికములతో సత్కరించి, సువాసినులకు అలంకారములు, రవికెల గుడ్డలు యివ్వాలి!

ఈ ప్రకారం విధివత్తుగా అర్చిస్తే సిద్ధిబుద్ధియుతుడైన గజాననుడు సంతుష్టుడౌతాడు. ఆతరువాత బంధుమిత్రులతో కలిసి తానూ భుజించాలి! ఆ మరునాడు ఆ మూర్తిని పల్లకీలో ఉంచి ఛత్రమూ, ధ్వజమూ, పతాకాలతో అలంకరించి వాద్యఘోషలతో, ఊరేగింపుగా తీసుకువెళ్ళి జలాశయానికి పోయి ఆమూర్తిని జలములో నిమజ్జనం చేసి తన యింటికి మరలాలి! వాద్యగీత ధ్వనులతో ఇల్లు చేరుకోవాలి! ఓ పార్వతీ! ఇది పార్థివ గణేశవ్రత విధానం! దీన్ని నీవాచరిస్తే నీ భర్త సాన్నిధ్యమును తిరిగి పొందగలవు!" అంటూ హిమవంతుడు తన కుమార్తెకు ఉపదేశించాడు.

ఇది శ్రీగణేశపురం ఉపాసనాఖండంలోని
"చతుర్థీవ్రత కథనం" అనే 50-వ అధ్యాయం.



51

# వరదగణేశవ్రత విధానం

(మూలం)

## ఏకోన పంచదశో అధ్యాయః

**పార్వత్యువాచ :-**

తవ వాక్యామృతేనాహంపితః ప్రీతాస్మి సాంప్రతం ।
పరంతు సంశయో మేస్తితం నుదస్వహిమాలయ ॥ 1

కేన కేన కృతం పూర్వం వ్రతమేతత్ మహీధర ।
ఆఖ్యాతం కేనవా కస్మైకః కాం సిద్ధిమితో అగమత్ ॥ 2

ఏతత్సవిస్తరం బ్రూహి సంశయచ్ఛేదనాయ మే ।
యశ్చపృచ్ఛతియో వ్యక్తి గజానన కథాశ్శుభాః ॥ 3

శృణోతి అన్యోపి యో మర్త్యః స్త్రయస్తే పుణ్యభాగినః ॥ 4

జీవితం సఫలం తేషాం జన్మజ్ఞానంచ కర్మచ ॥ 5

బ్రహ్మోవాచ :-

ఏవం తయా కృతప్రశ్నో హిమవానభ్యభాషత ।
వరదస్య గణేశస్య నానాజనకృతం వ్రతం । 6

హిమవానువాచ :-

శృణుపార్వతివక్ష్యామి సంవాదంతే పురాతనం ।
సేతిహసం వ్రతస్యాస్య సర్వసిద్ధి కరస్యహ । 7

కైలాసే గిరివర్యేతు సుఖాసీనం జగద్గురుం ।
క్రీడమానం ముదాదేవైః గంధర్వైః పరమర్షిభిః । 8

నత్వాస్తుత్వా మహాతేజాః పరిపప్రచ్ఛ షణ్ముఖః । 9

స్కంద ఉవాచ :-

దేవదేవ జగన్నాథ భక్తానా మభయంకర ।
నానాఖ్యానాని దివ్యాని శృతాని త్వత్ప్రసాదతః ॥ 10

తృప్తింతా తవ గచ్ఛా మిపాయం పాయంసుధామివ ।
అధునా బ్రూహిమే దేవ వ్రతం సర్వార్థసిద్ధిదం । 11

అనుష్ఠానేన కస్యాథకరస్థాః సిద్ధయో నృణాం ।
జాయంతే సాధకానాంతు వరదస్య ప్రసాదతః ॥ 12

శివ ఉవాచ :-

సాధుపృష్టం త్వయాస్కంద సర్వేషాం హితకారకం ॥ 13

కథయామి తవప్రీత్యా మహాసిద్ధిప్రదం భువి ॥ 14

వినాయక ప్రియంతా త వ్రతానాముత్తమం వ్రతం ।
సర్వేషాం పురుషార్థానాం సాధకం కృత్తికాత్మజ ॥ 15

వినాయజ్ఞై స్తథాదానై ర్జపహోమాది భిర్వినా ।
సర్వసిద్ధికరం స్కంద పుత్రపౌత్ర ప్రవర్ధనం ॥ 16

రాజానం రాజపుత్రంవా తన్మంత్రిణ మథాపివా ।
వశమానయతి క్షిప్రం వ్రతమే తన్మహత్తమం ॥ 17

మహాపాపోప పాపైశ్చ బహుజన్మ సుసంచితైః ।
వ్రతస్యాస్య ప్రభావేణతైః పుమాన్ముచ్యతే క్షణాత్ ॥ 18

భాజనం సర్వసిద్ధీనాం జాయతేమానవో భువి ।
ప్రీతిదంతు గణేశస్యనానేనమ్ దృశక్షితౌ ॥ 19

**స్కంద ఉవాచ :-**

తాతకస్మి న్భవేన్మాసి వ్రతమే తన్మహోత్తమం ।
విధానం కీ దృశంచాస్య కేన వాచరితంపురా ॥ 20

సర్వమే తన్మమాచక్ష్వ యద్యస్తి కరుణామయి । 21

**శివ ఉవాచ :-**

నభశ్శుక్ల చతుర్థ్యాంతు స్నాత్వా గురుగృహం వ్రజేత్ ।
ప్రణమ్యతంగురుం పశ్చాత్పూజయిత్వా యథావిధి ॥ 22

పాద్యాచమనవస్త్రాద్యైః భూషణైశ్చమహత్తరైః ।
తోషయిత్వాంతు తం సమ్యగాజ్ఞయా ప్రారభేద్వ్రతం ॥ 23

సర్వసిద్ధికరం తా తద్వ్రతం గాణేశ్వరం గురో ।
త్వమేవ శ్రీగణేశోసి దిశకామప్రదం ప్రభో । 24

ఉపదిష్టే వ్రతేతేనసార్ధం గంగాతటం వ్రజేత్ ।
తటాకంవా దేవఖాతం తత్ర స్నాయా ద్యథావిధి ॥ 25

శ్వేతసర్షపయుక్తేన తిలకల్కేన షణ్ముఖ ।
స్నాత్వా ధాత్రీయుతే నేహకృత్వా నిత్యంగృహం వ్రజేత్ । 26

ఉపవిశ్యాసనే శుద్ధే పూజయిత్వా గణాదిపం ।
గురూపదిష్ట మార్గేణ వ్రతం పశ్యాత్సమారభేత్ । 27

మృదామూర్తిం గణేశస్య చతుర్థ్యాం శ్రావణస్యతు ।
ప్రత్యహం పూజయేత్త్ర్కృత్వా యావద్భాద్ర చతుర్థికా ॥ 28

బ్రహ్మచర్యవ్రతే స్థిత్వా కర్తవ్యం వ్రతముత్తమం ।
ఉపవాసైక భక్తాభ్యాం నక్తే నాయాచితేనవా । 29

చతుర్థకాలే భుంజీత హవిష్యాన్నం సమాహితః ।
అక్షారం మధురం భుంజన్ భక్తిమా నాచరేద్వ్రతం । 30

జపన్గణేశ్వరీం విద్యాం షడానన షడక్షరం ॥ 31

ద్విచతురక్షరాం వాపి తథైవైకాక్షరామపి ॥ 32

దశాక్షరామథస్కంద, ద్వాదశార్ణామథాఽపివా ।
నియుతం వా యుతంవాపి ప్రత్యహం జపఇష్యతే ॥ 33

తదర్థం వా తదర్థం వా దశాంశం హోమమాచరేత్
ధ్యాయన్ గజాననం దేవం అహోరాత్ర మతంద్రితః ॥ 34

ప్రాప్తేప్రోష్ఠపదేమాసి చతుర్థ్యాంతు గజాననం ।
సౌవర్ణం పలమానేన తదర్థార్థేన వాపునః ॥ 35

మాయూర వాహనంకుర్యా దథవాఖుగతం శుభం ।
కృవామండపికాం తత్ర ధాన్యరాశిం ప్రకల్పయేత్ ॥ 36

సౌవర్ణం రాజతం తామ్రం కలశం స్థాపయేత్తతః ।
తస్యోపరి న్యసేత్పాత్రేం రుక్మరాజ తతామ్రకం ॥ 37

వస్త్రయుగ్మేన సంవేష్ట్య సపాత్రం కలశం తతః ।
పంచపల్లవ సంయుక్తం పంచరత్న సమన్వితం ॥ 38

పీఠపూజాం పురాకృత్వా స్థాపయే త్తత్రంవిభుం ।
మూలమంత్రైశ్చ వేదోక్తైః పూర్వోక్తైరపి షణ్ముఖ ॥ 39

ధ్యాత్వా గజాననం దేవ మావాహ్య వరయాముదా ।
ఆసనంచ తథాపాద్యం దద్యాదాచమనీయకం । 40

అర్ఘ్యం రత్నయుతం స్కందస్నానం పంచామృతై శ్శుభం ।
సువాసితాభి రద్భిశ్చ స్నాపయే త్పరమేశ్వరం ॥ 41

రక్తవస్త్రద్వయం దద్యా దుపవీతం తథోత్తమం । 42

నానావిధై రాభరణై ర్భూషయేత్పర మేశ్వరం ।
గంధాక్షతై ర్ధూపదీపై ర్నైవేద్యై ర్వివిధైరపి । 43

## స్కందునకు శంకరుడు గణేశవ్రతము నుపదేశించుట :-

వటకా పూపలడ్డూక శాల్యన్న పాయసాదిభిః ।
పంచామృతై ర్వ్యంజనైశ్చ భోజయే త్పరమేశ్వరం । 44

ఉద్వర్తనం కరే దద్యాత్ ఫలం తాంబూలమేవచ । 45

కాంచనీం దక్షిణాం దద్యాచ్ఛత్రం వ్యజనచామరే । 46

నీరాజనం మంత్రపుష్పం దత్వా స్తోత్రాణ్యుదీరయేత్ ।
సహస్రనామ భిస్తుత్వా బ్రాహ్మణాన్పూజయేత్తతః ॥ 47

రాత్రౌజాగరణం కృత్వా గీతనృత్యాది మంగలైః ।
ప్రభాతే విమలేస్నాత్వా నిత్యంకృత్వా యథావిధి ॥ 48

పూజయేత్పూర్వవద్దేవం తతోహోమం సమాచరేత్ ।
ద్రవ్యై ర్నానావిధైర్యుత్వా కుర్యా దాచార్యపూజనం ॥ 49

గో భూ తిల హిరణ్యాద్యం గురవే తన్నివేదయేత్ ।
అన్యేభ్యో బ్రాహ్మణేభ్యశ్చ ప్రదద్యా ద్భూరిదక్షిణాం ॥ 50

బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాచ్ఛత మష్టోత్తరం తథా ।
అధికాన్యది శక్తిశ్చె దథావాప్యేకవింశతిం ॥ 51

దీనాంధ కృపణేభ్యశ్చ దద్యాదన్నం సపాయసం ।
పునశ్చదక్షిణాం దద్యా త్తృగృహ్యా శిషముత్తమాం ॥ 52

సుహృద్బంధుయుతోమానీ స్వయంభుంజీత సాదరం ॥ 53

శివ ఉవాచ :-

ఏవంతేకథితం స్కంద వరదస్య వ్రతం శుభం ।
భుక్తి ముక్తిప్రదం నృణాం సర్వకామఫలప్రదం ॥ 54

పురాతన మితిహాస మస్మిన్నర్థే వదామితే । 55

మహాధర్మపరో రాజా పురాభూత్కర్ధమాభిదః । 56

పాలయామాస వసుధాం సాగరాంతాం స్వతేజసా ।
గుణైర్యస్య హృతాదేవా నిత్యం యత్పదసి స్థితాః ॥ 57

కదాచి ద్దైవయోగేన భ్రుగుస్త్రస్య గృహంయయౌ ।
తతఉద్ధాయరాజా స బహుమాన పురస్సరం ॥ 58

ఉపవిశ్యాసనేశ్రేష్ఠే పూజితోగురువత్తతః
భుక్త్వాస్థితం మునివరం రాజా వచనమబ్రవీత్ ॥ 59

**రాజోవాచ :-**

భగవన్ సర్వతత్వజ్ఞ కించిత్ప్రుచ్ఛామి తద్వద ।
పూర్వజన్మనికశ్చాహం కిం మయా సుకృతం కృతం । 60

యేనేదృశం మయారాజ్యం ప్రాప్తం నిహతకంటకం ।
ప్రాప్తంనైవ నృపైరన్యైః నచప్రాప్స్యంతి చాపరే । 61

దేవానామపిపూజ్యోహం గంధర్వోరగ రక్షసాం ।
కుబేరసంపదాతుల్యాం సంపదం పశ్యమేమునే 62

త్రిలోక్యాం రత్నభూతం యత్రదానీతం స్వతేజిసా ।
యంయం పదార్థమిచ్ఛామి తం తం పశ్యామివేశ్మని ॥ 63

కేనేద్ధం కర్మణాప్రాప్తం తద్వదస్వ మమప్రభో
కామయేతత్పునః కర్తుం పుణ్యం పుణ్యవతాం వర । 64

**భ్రుగురువాచ :-**

కథయామి నృపశేష్ఠ ప్రణిధాన బలాదహం ।
త్వమాసీః పూర్వజనుషి క్షత్రియోదుర్బలః శుచిః । 65

కుటుంబ భరణార్ధంత్వం నానాకర్మాణ్యధాకరోః । 66

క్రియామాణం చ తత్కర్మన చాసీత్ఫలదం తవ ।
అత్యంతనిష్ఠురైర్వాక్యై ర్దారాపత్యైశ్చపీడితః ॥ 67

అపృష్ట్వా పుత్రదారాం స్త్వం గతవాన్ గహనం వనం ॥ 68

విభ్రమన్ దిక్షుసర్వాసు దృష్టవానపి సౌభరిం ।
సిద్ధాసనే సమాసీనం సేవితం మునిపుంగవైః ॥ 69

కథయంతం మహావిద్యాం శిష్యేభ్యో దుఃఖనాశనీం ।
దృష్ట్వాతం సౌభరిం దివ్యమన్యాం శ్చార్షిగణాన్నృప ॥ 70

దండవత్ప్ర తితోసిత్వం భువితైశ్చాబి నందితః ।
ఉపవిష్టః స్వాసనేచ మునినాతే నదర్శితే ॥ 71

పృష్టవానసితం దివ్యం లబ్ధ్వావసర మాదృతః । 72

**క్షత్రియ ఉవాచ :-**

స్వామిన్ సంసార దుఃఖేన బహుధా క్లేశితో మునే ॥ 73

దారాపత్య సుహృద్భిశ్చ వాగ్బాణై ర్భృశతాడితః ।
నవైరాగ్యం మనోయాతి నిష్ఠురేషు సుహృత్సుచ ॥ 74

శీతోష్ణ క్షుత్పిపాసాభిః పీడితోపి భృశంమునే
ఉపాయం వదమే కించి ద్దుఃఖసాగర తారకం ॥ 75

**శివ ఉవాచ :-**

ఇతిశృత్వా వచస్తస్య సౌభరిః కృపయాయుతః ।
ఉపాయం చింతయామాస నృపదుఃఖ వినాశనం ॥ 76

తతస్తం క్షత్రియం ప్రాహ సర్వపాప విమోచనం 77

**ఋషిః ఉవాచ :-**

వ్రతం యత్కథయిష్యామి కురు నిశ్చితమానసః । 78

యస్యానుష్ఠానమాత్రేణ సర్వదుఃఖలయో భవేత్ ।
బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యై స్తథా బ్రహ్మర్షిభిః క్రుతం । 79

ముక్తాస్తే సర్వదుఃఖేభ్యః ప్రాప్తాః సిద్ధిమనుత్తమాం ।
వరదస్య గణేశస్య ధర్మార్థ కామమోక్ష కృత్ ॥ 80

**క్షత్రియ ఉవాచ :-**

కోసౌ గణేశ: కిం శీల కిం రూపః కిం స్వభావవాన్ । 81

కిం కర్మా కథముత్పన్న స్తత్సర్వం కథయస్వమే ।
యదిమేశ్రవఖాయాలం । యద్యనుగ్రాహ్యాతా మయి ॥ 82

**ఋషి ఉవాచ :-**

యద్బ్రహ్మనిత్యం విరజం విశోకం జ్ఞానస్వరూపం పరమార్థభూతం ।
అనాదిమధ్యాంత మనంతపారం గణాధిపం తం ప్రవదంతిసంతః ॥ 83

యస్మాదోంకార సంభూతిర్యతో వేదాయతో జగత్ ।
యేనసర్వమిదం వ్యాప్తం తం విద్ధి గణనాయకం ॥ 84

జగత్సర్జనకామేన బ్రహ్మణా యస్య తుష్టయే ।
అబ్దానాంతు శతం పూర్ణం తపస్తప్తం సుదుష్కరం ॥ 85

తతోహృష్టమనా వేధాః ప్రసన్నం తమపూజయత్ ।
నానా విధోపచారైశ్చ దివ్యరత్నైః ఫలైస్తథా ॥ 86

సిద్ధి బుద్ధీఉభేకన్యే మనసాకల్పితేదదౌ ।
తుష్టోదేవో దదౌ తస్మై విద్యామేకాక్షరీం విభుః ॥ 87

తతోలబ్ధవరో బ్రహ్మాచకార సకలం జగత్ ।
షడక్షరేణ మంత్రేణ విష్ణునాత్తోషితః పురా ॥ 88

కృత్వామూర్తిం గణేశస్య పూర్వోక్త విధినావ్రతం ।
అవ్యంగం వర్షమేకంతు నియమాన్ కృతనాన్హరిః ॥ 89

వరంలబ్ధ్వా గణేశాత్తు పాలయామాసవైజగత్
ఏవం విధం విజానీహి గణేశం భువి సంస్తుతం ॥ 90

విశ్వరూపమనాదించ సర్వకారణ కారణం ।
తమరాధయ యత్నేన సర్వదుఃఖాద్వియుం క్ష్యసే ॥ 91

**క్షత్రియ ఉవాచ :-**

కస్మిన్కాలే ప్రకర్తవ్యం ఏతద్వ్రత మనుత్తమం ।
విధినా కేనమే బ్రూహి సాంప్రతం మునిసత్తమ ॥ 92

కరిష్యే వచనాత్తేహం సర్వదుఃఖ ప్రశాంతయే ॥ 93

**మునిరువాచ :-**

శ్రావణేఽబహుళేపక్షే చతుర్థ్యా మారభేద్వ్రతం ।
కుర్వీత పరయా భక్త్యా యావద్భాద్ర చతుర్థికా ॥ 94

ఉపచారైః షోడశిభః పార్థివం గణనాయకం ।
ప్రత్యహం పూజయేద్భక్త్యా బ్రాహ్మణాన్పూజయే త్తతః ॥ 95

త్వమేతత్కురు భూపాల సర్వాన్కామాన వాప్స్యసి ॥ 96

ఇతి శృత్వా వ్రతం తస్మాత్కృతవానసి సువ్రత । 97

సమాప్తేతు వ్రతే తత్ర సౌభర్యాశ్రమమండలే ।
తాపత్తస్య గృహం దివ్యం గణేశస్య ప్రసాదతః ॥ 98

దివ్యనారీ నరయుతం దాసీదాస సమన్వితం ।
వేదఘోష సమాయుక్తం జాతం గో ధన సంకులం ॥ 99

దివ్యవస్త్ర సమాయుక్తా నానాలంకార సంయుతా ।
అప త్ర్యైస్తా ద్భృశైర్యుక్తా విస్మితాసీ త్ర్పతీక్షతీ ॥ 100

ఆయాస్యతికదా భర్తేత్యేవం చింతాపరాభవత్ ।
తావత్త్వం మునిమా మంత్ర్యగతోసి నిజమాలయం ॥ 101

దివ్యం తచ్ఛరణం హిత్వా స్వగృహం పరిమార్గయన్ ।
తావద్భార్యాప్రేషితాస్త్వాం నిన్యుస్తద్భువనం నరాః ॥ 102

తతస్త్వయాపి విజ్ఞాతః ప్రభావో వరదస్యసః ।
తద్వ్రతస్య ప్రభావేణ రాజ్యభాగిహ జన్మని ॥ 103

శివ ఉవాచ :-

ఇతిశృత్వా భ్రుగోర్వాక్యం కర్ణయో హర్షనిర్భరః ।
చకారసకలం రాజా భ్రుగుణా యత్సమీరితం ॥ 104

వ్రతస్యాస్య ప్రభావేణ జ్ఞానవైరాగ్య వాన్నృపః । 105

భుక్త్వాభోగాన్ యథాకామం స్థాప్యపుత్రా న్నిజేపదే ।
గతోగాణేశ్వరం ధామ యతోనావర్తతేపునః ॥ 106

సర్వార్ధ సాధకం స్కందవ్రతానాం వ్రతముత్తమం । 107

నైతాదృశం వ్రతం దానం శృతమన్యత్కదాచన । 108

సర్వార్థ సాధకం స్కందవ్రతం కురుయదీచ్ఛసి । 109

దేవదానవ గంధర్వై ఋషిభిర్మనుజైః కృతం । 110

నలేన ఇందుమత్యాచ రాజ్ఞా చంద్రాంగదేనచ ।
సంప్రాప్తాః సర్వకామాంస్తే గతాగాణేశ్వరం పదం ॥ 111

**గిరిరువాచ :-**

ఇతితే కథితం సర్వం సేతిహాసం వ్రతం మహత్ ।
కురుత్వం మనసాధ్యాత్వా వరదం గణనాయకం ॥ 112

వ్రతమే తన్మహాభాగే శంకరం ప్రాప్స్యసే తత ।
స్నేహేన కథితం తేద్య ప్రకాశం కురుమావ్రతం ॥ 113

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**హిమవత్పార్వతీ సంవాదేఏకోన**
**పంచదశో అధ్యాయః**



# వరదగణేశ వ్రతవిధానం
## 51-వ అధ్యాయము

ఓ వ్యాసమునీంద్రా! హిమవంతుని ఉపదేశాన్ని విన్న గిరినందన తిరిగి తన తండ్రినిలా ప్రశ్నించింది :

"ఓ తండ్రీ! నీ ఉపదేశము నా చెవులకు అమృతపుజల్లై కురిసింది! ఐతే ఈ వరదగణేశ వ్రతాన్ని యింతకు పూర్వం ఎవరాచరించారు? ఎలాంటి సిద్ధుల్ని పొందారు? ఆ వివరాలను నాపై కృప వహించి తెలియజేయవలసింది."

కుమార్తె యొక్క శ్రద్ధాసక్తులకు ఆనందంపొందిన హిమవంతుడిలా అన్నాడు :

"అమ్మా! నీవూ, నీకై గణేశుని గాథలను వివరించే నేనూ కూడా ఇందువల్ల ధన్యులమౌతాము! ఎందుకంటే — గణనాథుని దివ్యలీలల

కథనమూ, శ్రవణమూ కూడా అత్యంత కమనీయమైనవి! పరమపావన మైన ఆ కథావృత్తాంతాన్ని నీకు తెలుపుతాను! విను!"

"ఓపార్వతీ! పూర్వం కైలాసంలో ప్రమధగణాలతో సేవించబడుతూ సుఖాసీనుడైవున్న శంకరునికి అభివాదముచేసి, స్తుతించి, షణ్ముఖుడైన స్కందుడిలా ప్రార్థించాడు :

"భక్తులపాలిట కొంగుబంగారమై, అభయ వరప్రదుడవైన ఓ శంకరా! నీయొక్క కృపావిశేషములచేత అనేక ఉపాఖ్యానాలను నీనుంచి తెలుసు కున్నాను! ఐనా, ఆ దివ్యగాధల మకరందాన్ని ఎంతగా గ్రోలినా, తనివి తీరటంలేదు! అందుకని ఇప్పుడు సర్వార్థసిద్ధికరమైన ఒక వ్రతము గురించి చెప్పు! ఎవరి సంబంధమైన వ్రతాన్ననుష్ఠించటంవల్ల జనులకు సర్వసిద్ధులూ కరస్థము కాగలవో, అట్టి వరప్రదుని వ్రతాన్ని నాకు ఉపదేశించవలసింది!" అంటూ వేడిన స్కందునితో శంకరుడిలా అన్నాడు.

## వరదవ్రత ఫలం :

"కుమారా! లోకోపకారార్థమై నీవడిగిన ఈప్రశ్న ఎంతో ఉచిత మైనది! నీయందు నాకుగల ప్రేమ, వాత్సల్యాలవల్ల భూలోకంలో సమస్త మహాసిద్ధులను యివ్వగల వ్రతాన్ని గురించి చెబుతాను! అదే వినాయకుని వ్రతము! ఇది సర్వవ్రతాలలోకీ శ్రేష్టమైనదేకాక అత్యుత్తమ మైన ఫలాన్ని యివ్వగలది!

ఓ కుమారా! యజ్ఞ, దాన, జప, హోమాదులనే ఉత్కృష్టములైన సాధనాంగాల గురించిన ప్రసక్తి ఏమాత్రం లేకుండా, సకల సిద్ధులను

ప్రదానం చేసేదీ, పుత్రపౌత్రాభివృద్ధిని కల్గించేదీ, ఈ గణేశ వ్రతమేసుమా!

ఈ వ్రతప్రభావంవల్ల, రాజాధిరాజులూ, సమస్తమైన అధికారిక పురుషులూ కూడా సులభంగా వశ్యులౌతారు! ఈ వ్రతానుష్ఠాన మహిమ అనేక జన్మార్జిత పాపకోటినంతటినీ భస్మంచేస్తుంది! అంతేకాదు ఈ వ్రతప్రభావంవల్ల మానవుడు దుర్లభమైన ముక్తినిసైతం బడయగలడు! ఈ వ్రతము సకలార్ధప్రదుడైన గణేశునికి అత్యంత ప్రీతిపాత్రమైనది! దీనితో సాటైన మరోవ్రతమేదీలేదు! ఈ వ్రతాన్ని ఆచరించినవాడు సకల సిద్ధులచేతా ఆశ్రయించబడతాడు!"

ఈ మాటలకు స్కందుడు తిరిగి యిలా ప్రశ్నించాడు. "తండ్రీ! యింతటి మహామహిమోపేతమైన వ్రతాన్ని ఎప్పుడు అనుష్ఠించాలి? దీని విధానమేమిటి? ఇదివరలో దీన్ని ఎవరు ఆచరించి శ్రేయస్సును పొందారు? ఈ వృత్తాంతాన్నటినీ దయతో సెలవివ్వండి!" అని అడుగగా శంకరుడిలా బదులుచెప్పాడు :

## వ్రతానుష్టాన కాలం :

"ఓ కుమారా! ఈ వ్రతాన్ని శ్రావణశుద్ధ చవితినాడు ఆరంభించాలి! ఆ రోజున స్నానసంధ్యాదులను గావించుకొని, గురుగృహానికి వెళ్ళి — సాక్షాత్ గణేశస్వరూపునిగా ఆయనకు సాష్టాంగనమస్కారము, పాద్యము, ఆచమనం, వస్త్రములను సమర్పించి, వారిని సంతుష్టపరచి వారినుంచి ఉపదేశంగా పొందాక, వారి అనుజ్ఞతో, ఈ వ్రతాన్ని ఆరంభించాలి!

అక్కడినుండి వచ్చి తన గృహంలో సుఖాసీనుడై, గురూపదిష్ట-మార్గంలో ఈ వ్రతాన్ని ఆచరించాలి! దీనికై మృత్తికతో గజాననుని

మూర్తిని తయారుచేసి ప్రతిదినమూ పూజించాలి! ఇలా భాద్రపద శుక్ల చవితి వచ్చేవరకూ పూజిస్తూండాలి!

**వ్రతనియమాలు :**

బ్రహ్మచర్యము, అధఃశయనము, ఏకభూక్తము (నక్తం) తో గడపాలి. ఉప్పు, కారములను వర్జించి, మధురపదార్ధాలనే భుజిస్తూ, భక్తిశ్రద్ధలతో ఈ వ్రతాన్ని ఆచరించాలి!

ప్రతిరోజూ వ్రతం ముగిశాక, గణేశ **ఏకాక్షరీ, షడక్షరీ, చతురక్షరీ, దశాక్షర, ద్వాదశాక్షరులలో** ఒక మంత్రాన్ని **ఏకాగ్రచిత్తంతో జపించాలి!**

**జపసంఖ్య :**

"ఓ కుమారా! ప్రతీరోజూ యింత అని నియమంగాగాని లేదా పదివేలుగాని జపించాలి! ఇలా జపంచేస్తూ, గణేశుని **హృదయపద్మంలో ధ్యానిస్తూ**, సావధానమనస్కుడై ఉండాలి! భాద్రపద శుక్ల చతుర్థినాడు గజాననుని స్వర్ణమూర్తినీ, ఎలుక లేదా నెమలి వాహనాన్నీ చేయించాలి!

**వ్రతవిధానం :**

ముందుగా పూజాస్థలంలో ఒక మంటపాన్ని ఏర్పరచి, దానిపై ధాన్యంపోసి, బంగారు, వెండి లేదా రాగి కలశాన్ని స్థాపించి, దానిమీద యింకో లోహపుపాత్రనుంచి, దాన్ని వస్త్రద్వయంతో చుట్టబెట్టాలి!

ఆ కలశంలో పంచపల్లవాలనూ, పంచరత్నాలను ఉంచి ముందుగా పీఠపూజను చేయాలి! ఆ తరువాత కలశంపైన గణేశుని మూర్తిని స్థాపించి, మూలమంత్రాలతోనూ, వేదమంత్రాలతోనూ గజాననుణ్ణి ధ్యానించి పరమప్రీతితో ఆహ్వానించాలి!

ఇలా ఆవాహనచేశాక, గణేశమూర్తికి పాద్యం, అర్ఘ్యం, ఆచమనం మధుపర్కం సమర్పించి, పంచామృతాలతోనూ, ఆ తరువాత శుద్ధోదకం తోనూ స్నానంచేయించాలి!

ఆ తరువాత ఎఱ్ఱటి వస్త్రద్వయాన్ని సమర్పించి, యజ్ఞోపవీతాన్ని, దివ్యాలంకారాలను సమర్పించాలి! గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాది షోడశోపచారాలతో గణేశుని అర్చించాలి!

## నైవేద్యం :

ఇక నైవేద్య ద్రవ్యాలేమిటంటే — గారెలు, అప్పాలు, లడ్లు, అన్నపాయసము, మొదలైన మధుర పదార్థాలను నివేదనగా సమర్పిం చాలి! హస్తప్రక్షాళనం తరువాత, తాంబూలాన్ని సువర్ణ దక్షిణాదికాలతో సమర్పించి, గౌరవించి, ఛత్రంచామరం మొదలైన సకలమైన రాజోపచారా లను చేయాలి!

నీరాజన, మంత్రపుష్పాలను సమర్పించి అనంతరం గణేశుని సహస్రనామాలను పఠించాలి! ఆ తరువాత బ్రాహ్మణులను దానములతో సంతోషపరచి, ఆరాత్రి నృత్యగీతాలతో జాగరణ చేయాలి!

"నాయనా! ఆ మర్నాడు ప్రాతఃకాలంలోనే స్నానసంధ్యాదికాలు చేసి ఇదివరకులాగే ఆ దేవదేవుని ఆరాధించి, హోమంచేయాలి! ఇలా హోమం ముగించాక, ఆ అధ్వర్యుని దక్షిణాదికాలచేత సత్కరించి, తన శక్తికొలదీ ఇరవైఒక్కమందికి తగ్గకుండా బ్రాహ్మణ భోజనం పెట్టాలి!

బీదసాదలకు అన్నదానంచేసి, పిదప తాను బంధుమిత్రులతో కూడి భుజించాలి! ఓ స్కందా! ఇది ఈ వ్రతవిధానం! ఈ వరదవ్రతము

మానవులకు భుక్తి, ముక్తిప్రదము! సకల కామనలనూ నెరవేర్చగలదు! ఇందుకు దృష్టాంతంగా నీకో పురాతన ఇతిహాసాన్ని వివరిస్తాను!

## కర్దమోపాఖ్యానము

ఓ స్కందా! పూర్వం మహాపరాక్రమవంతుడైన కర్దముడనే రాజు యావద్భూమండలాన్నీ పరిపాలించేవాడు. ధర్మబద్ధమైన ఆతని పరిపాలనలో ప్రజలు చిరకాలం సంతుష్టులై గడిపారు! ఆతని గుణగణాలకు మెచ్చిన దేవతలు అదృశ్యరూపంలో ఆతని కొలువుకూటంలో ఉండేవారు.

ఒకనాడు మహాతపస్సంపన్నుడూ, త్రికాలవేదీయైన భృగుమహర్షి ఆతని గృహమునకు వచ్చాడు! తన సింహాసనంనుండి దిగ్గునలేచి ఆ మహర్షిని సాదరంగా ఆహ్వానించి ఉచితాసనాసీనుణ్ణిచేసి పూజించి, భోజనమిడి, ఆ తరువాత స్వస్థచిత్తుడైన ఆ మహర్షిని యిలా ప్రశ్నించాడు :

"ఓ మహర్షీ! తాము త్రికాలవేదులు! మిమ్మల్ని ఒకచిన్న విషయమై ప్రశ్నిస్తాను. దయతో ఆ వివరం తెలియజేయండి!" పూర్వజన్మలో నేనెవడను? ఏ పుణ్యం చేయటంవల్ల ఇలా నిష్కంటకంగా ఈ మహాసామ్రాజ్యం ఏలగల్గుతున్నాను? ఇదివరలోగాని, ఇకముందుగాని ఇట్టి వైభవాన్ని మరెవ్వరూ పొందలేరు! దేవతలచేతా గంధర్వులచేతా కూడా పూజనీయుడనైనాను! సాక్షాత్తూ యక్షుల అధిపతియైన అలకానగరాధిపతి — కుబేరుని మించిన సిరిసంపదలతో తులతూగుతున్నాను! మూడు లోకాలలోనూ సర్వశ్రేష్ఠవస్తువులన్నీ నా చెంతనే ఉన్నాయి! కనుక ఓ మహర్షీ! ఏ పుణ్యప్రభావంగా నాకివన్నీ సంప్రాప్తించాయో ఆ వివరం

దయతో సెలవియ్యండి! ఓ పుణ్యమూర్తీ! దాని వివరం చెబితే తిరిగి అలాంటి పుణ్యకర్మనే చేస్తాను!"

ఆ మాటలకు మందస్మితవదనుడైన భృగువిలా అన్నాడు :

"ఓ రాజా! నీవడిగిన వివరాన్ని దివ్యదృష్టితో గ్రహించి తెలియ జేస్తాను!

## కర్దముని పూర్వజన్మ చరిత్ర

"ఓ కర్దమా! నీవు పూర్వజన్మలో ఒక దుర్బల క్షత్రీయుడవై జన్మిం చావు! కుటుంబపోషణమే గగనమై అనేక కర్మలు చేసేవాడివి! ఐతే ఎన్నివిధాల శ్రమించినా నీ ఆర్జన సరిపోయేదేకాదు! దానికితోడు భార్యా పుత్రులుకూడా నిన్ను అనేక నిష్ఠూరాలాడుతూ అనేకరకాల బాధించే వారు. ఆ బాధనుండి దూరమవటానికి ఎవరికీ తెలియరాని ఘోరా రణ్యంలోకి వెళ్ళావు! ఆ అరణ్యంలో అటూయిటూ తిరిగి చిట్టచివరకు 'సౌభరి' అనే ఋషిని దర్శించావు! అయన సిద్ధాసనంలో కూర్చుని అనేక మునులచేత సేవించబడుతూ దుఃఖనివారణకరమైన మహావిద్యను ఉపదేశిస్తూండగా వారిని దర్శించి, భక్తితో సాష్టాంగ దండప్రణామాన్ని ఆచరించావు!

అప్పుడాముని నిన్ను ఆదరంతో ఉచితాసీనుణ్ణి చేసాడు. ఒక శుభతరుణంలో ఆ సౌభరినిలా ప్రశ్నించావు :

"ఓస్వామీ! భార్యాబిడ్డల నిరసనవాక్యాలచే తీవ్రంగా నొచ్చి, ఈ సంసారకూపంలో చిక్కుకొని అమితమైన కేశాన్ననుభవిస్తున్నాను. సుఖ

దుఃఖాలనే ద్వంద్వాలతో తీవ్రంగా పీడించబడుతున్న నాకు, ఈ సంసార సాగరాన్ని తరింపచేసే ఉపాయాన్ని సెలవియ్యండి!''

''నాయనా! స్కందా! ఆ కర్ణముని మాటలకు విచలితుడైన మహర్షి అతడి బాధానివారణకై యోచించసాగాడు! కొంతతడవైనాక ఆ క్షత్రీయుణ్ణి చేరబిలిచి ఈవిధంగా ఉపదేశించాడు :

''ఓరాజా! నీయొక్క సకల దుఃఖాలనూ పోగొట్టి, సమస్త శుభాలనూ ప్రసాదించగల మహోత్కృష్టమైన వరమొకటున్నది! దానిని **"వరదగణేశవ్రత"**మని అంటారు. ఈ వ్రతాన్ని అనుష్టించి పూర్వం నాలుగు వర్ణాలవారూ, (బ్రహ్మ, క్షత్రీయ, వైశ్య, శూద్రులు), ఋషులూకూడా సమస్త దుఃఖాలనుండి విముక్తులై సర్వసిద్ధులనూ పొందారు! ఈ వ్రతం చతుర్విధ పురుషార్థాలను నిస్సంశయంగా యిస్తుంది!''

సౌభరిఋషియొక్క మాటలు ఆ క్షత్రియుని హృదయంపై పన్నీటి జల్లులా కురిసాయి! ఆ మాటలకు అతడి అంతరంగమంతా చంద్రుడిని చూసిన కడలిలా సంతోషంతో ఉప్పొంగింది! అతడు సౌభరిమహర్షి నిలా ప్రశ్నించాడు :

''ఓమహర్షీ! ఆ గణేశుడెవరు? ఎట్టివాడు? అతని మహిమలెలాంటివి? అతడు ఏయే లీలలను చేశాడు? అతడెలా ఆవిర్భవించాడు? ఆ వివరాన్నంతటినీ నాకు దయతో తెలియజేయవలసింది!''

అప్పుడా సౌభరిమహర్షి తన ప్రశాంత మృదుభాషణను యిలా కొనసాగించాడు.

''నిర్వికారము, శోకరహితము, ఆదిమధ్యాంత రహితము, జ్ఞాన

స్వరూపమైన ఏ పరబ్రహ్మతత్త్వం వేదాలచేత వర్ణించబడుతున్నదో, అట్టి పరబ్రహ్మస్వరూపమే గజాననుడని వేదవిదులు చెబుతారు!

ఆయననుండే ఆదిలో ప్రణవనాదం ఓంకారంగా **ఉద్భవించింది!** సకలజగత్తూ, **వేదాలూ ఆయననుండే ఉద్భవించాయి!** ఆతడే ఈ యావద్బ్రహ్మాండమంతా వ్యాపించినవాడు! సృష్టిచేయగోరిన చతురాస్యు డెవరికై నూరుసంవత్సరాలు ఘోరమైన దివ్యతపస్సు ఆచరించాడో, సకల ఉపచారములతో ఎవరిని పూజించి, సిద్ధిబుద్ధియనే తన కుమార్తెలను సమర్పించాడో, ఎవరివల్ల ఆ బ్రహ్మ **ఏకాక్షరీ విద్యను పొందాడో** ఆ ఘనుడు విఘ్నేశుడైన గజాననుడే! ఆ ఏకాక్షరీ మంత్రప్రభావంచేతనే బ్రహ్మ ఈ యావత్ సృష్టికార్యాన్నీ గణేశానుగ్రహంవల్ల నిర్వహించగలిగాడు.

అలాగే షడక్షర మంత్రముద్వారా విష్ణువుచే జపించబడి, ఆరాధింపబడ్డవాడూ, తన అనుగ్రహాన్ని కురిపించి లోకపాలనశక్తిని విష్ణువుకు ప్రసాదించినదీ ఆ భక్తవత్సలుడే!

కనుక విశ్వమే రూపమైనట్టివాడూ, అనాదినిలయుడూ, కారణాలకే కారణమైనవాడూ ఐన ఆ గజాననుని ఆరాధించి, ఓరాజా! నీవూ సఫలీకృతుడవు కావలసింది! ఆయన అనుగ్రహాన్ని పొందిననాడు సకలమూ నీకు సులభసాధ్యమౌతుంది! నీవు సకల దుఃఖాలనుండీ విముక్తుడవు అవుతావు!''

అప్పుడు ఆరాజు మహర్షితో తనకా వ్రతవిధానాన్ని, ఆచరించటానికి అనువైన సమయాన్ని తెలియజేయమని శ్రద్ధగా కోరాడు! అప్పుడు

సౌభరిమహర్షి చిరునవ్వు చిందిస్తూ ప్రసన్నంగా యిలా తెలియజేసాడు.

"ఓరాజా! ఈ వరదగణేశ వ్రతాన్ని శ్రావణశుద్ధ చవితినాడు ఆరంభించాలి! అక్కడినుంచి భాద్రపదశుద్ధ చవితివరకూ చేయాలి! ప్రతి దినమూ ఒక నూతనమైన పార్థివగణేశమూర్తిని నిర్మించి షోడశోపచారాలతోనూ పూజించాలి! వ్రతాంతములో బ్రాహ్మణభోజనాన్ని దక్షిణపూర్వకంగా సమర్పించాలి! నీవుగనుక ఈవిధంగా శ్రద్ధతో ఆచరించినట్లైతే నీకు సర్వ దుఃఖశాంతీ అవటమేకాక నీయొక్క సకలాభీష్టాలూ తప్పక నెరవేరతాయి!

"ఓ కర్దముడా! నీవీరీతిగా పలికిన సౌభరిమహర్షి స్వాదువచనాలని ఆలకించి, శ్రద్ధగా ఆయన ఆశ్రమంలోనే ఈ వరదగణేశవ్రతాన్ని నిర్వహించావు! అలా నీచేత వ్రతం పరిపూర్తి చేయబడగానే గణేశానుగ్రహం చేత దాసదాసీజనంతోనూ, వేదఘోషలతో ప్రతిధ్వనించే, గోధన, సంపదలతో కూడిన ఒక సుందరమైనభవనం ఏర్పడింది! నీ సంతానంకూడా అందులో దివ్యవస్త్రాలంకార భూషితులై ఉండటాన్ని చూచావు! నీభార్య ఈ విశేషాన్ని అంతటినీ చూసి నీకై నిరీక్షించసాగింది. నీవు మునివద్ద అనుజ్ఞ తీసుకొని యింటికి తిరిగి చేరుకున్నావు!

నీ భార్యచేత పంపబడిన సేవకులు నీకు ఎదురువచ్చి స్వాగతం పలుకుతూ అమితోత్సాహముతో యింటికి తీసుకువెళ్ళారు. నీవు ఆ గణేశుని ప్రభావానికి అత్యంత ఆశ్చర్యచకితుడవై, ఇదంతా ఆయన అనుగ్రహమేనని భావించావు! ఆ వ్రతాన్ని ఆనాడు ఆచరించినందువల్లనే యిప్పుడిలా ఘనకీర్తి వహించిన మహారాజువైనావు!"

అంటూ భృగుమహర్షి తాను దివ్యదృష్టిద్వారా దర్శించిన కర్దముడి

పూర్వజన్మ వృత్తాంతాన్ని ఆతడికి వివరించాడు. అప్పుడు ఆనందంతో పులకాంకితుడైన కర్దముడు తిరిగి అదేవిధంగా ఘనంగా వరదగణేశుని వ్రతాన్ని అనుష్ఠించి, ఆ వ్రత ప్రభావంవల్ల జ్ఞానవైరాగ్య సంపన్నుడై, ఇహంలో సర్వసౌఖ్యాలనూ అనుభవించి, తన కుమారులకు పట్టంకట్టి, పునరావృత్తిరహితమైన గణేశలోకానికి చేరుకున్నాడు.

'ఓస్కందా! ఈ వ్రతం సర్వార్థసాధకమైనది. దీనితో సాటియైన వ్రతంగానీ, దానంకానీ మరొకటిలేదు! కనుక నీకు యిచ్ఛవుంటే దీన్ని అనుష్ఠించు! దీన్ని గతంలో అనేకమంది దేవతలు, గంధర్వులు, మానవులుకూడా చేసారు! నలుడు, ఇందుమతి, చంద్రాంగదుడు మొదలైన వారు ఈ వ్రతాన్ని ఆచరించి, తమ ఇష్టార్థములను పొంది, చివరకు గణేశపదాన్ని పొందారు!' అంటూ పరమశివుడు అనుగ్రహించాడు.

"కనుక ఓపార్వతీ! స్త్రీవూ నీభర్తతో సాన్నిధ్యాన్ని కోరావు. అందుకై ఉత్తమవ్రతాన్ని ఉపదేశించమని కోరావు కనుక, ఆ వ్రతాన్ని ఇతిహాసంతో, కూడా ఉపదేశించాను. నీవు మనసా ఆ వరదుడినే ధ్యానిస్తూ, ఈ వ్రతాన్ని నిష్ఠతో ఆచరించితే నీ మనోభీష్టాన్ని అవశ్యం పొందగలవు! అమ్మా! నీయ్యందుగల ప్రేమచేత ఈ వ్రతాన్ని చెప్పాను. ఇది ఇతరులెవ్వరికీ ప్రకటించకు! పరమ గోపనీయమైనదీ మహత్తర ఫలప్రదమైనదీ ఈ వరదగణేశ వ్రతము!" అన్నాడు హిమవంతుడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'వరదగణేశ వ్రతవిధానం' అనే 51-వ అధ్యాయం.



52

# నలవ్రత నిరూపణం

(మూలం)

## ద్విపంచా రింశో అధ్యాయః

**పార్వత్యువాచ :-**

నలేనేదం కృతం కస్మా త్కేనలో వదమే పితః ।
మనోవిశ్రాంతి మాయాతి శృణ్వంత్యామే కధానకం ॥ 1

**హిమవానువాచ :-**

నిషధేషు మహారాజో నలోనామా భవత్పురా ।
బ్రహ్మణ్యోవేద విచ్ఛూరో దానీ మానీ ధనీ మునిః ॥ 2

రథీఖడ్గీశరీ చాపీనిషంగీ కవచీబలీ ।
కృతాస్త్రో దేవపూజ్యశ్చ త్రిలోకీగమనశ్శుచిః ॥ 3

శేషోపిమూకతాం యాతి పర్ణితుం యద్గుణానపి ।
నసంఖ్యా విద్యతేశ్వానాం గజానాం రథినాం తథా ॥ 4

ధానుష్కాణాం శస్త్రభ్రుతాం అగ్నిశస్త్ర భ్రుతామపిః
చకం పుర్యద్భయాద్దేవాః ఇంద్రాద్యాః సదిగీశ్వరాః । 5

దమయంతీతి భార్యా సీద్యస్య సౌందర్య మందిరం ।
దమయిత్వాఖిలాన్ బ్రహ్మసారం సారం ప్రగృహ్యాచ ॥ 6

దమయంతీతి విఖ్యాతా యతస్తేనేతి నిర్మితా ।
దయమంత్ర్యై త్రిలోకస్థ నారీణాం చారుతామదాత్ ॥ 7

నానా లంకార సంయుక్తా నానా మణివిభూషితా ।
ముక్తాహారలసత్కంఠా సద్గుణాఢ్యాసుశోభనా ॥ 8

యస్యామాత్యో మహానాసీత్పద్మ హస్తః పరాక్రమీ ।
బుధ్యా బృహస్పతి సమో నయే చాంగిరసా సమః । 9

తుంగత్వేమేరు సదృశో గాంభీర్యే చోదధేస్సమః ।
కదా చిదుపవిష్టోసౌ నలోరాజా మహామనాః ॥ 10

నిషసాద సభాగేహే నృపమండల మధ్యగః । 11

నృత్యంత్యప్సరస ష్ఠస్య పురతశ్చారు దర్శనాః । 12

స్తువంతి బందినస్తంచ బ్రహ్మర్షి గణసంయుతం । 13

ఏ తస్మిన్నేవ కాలేతు గౌతమో నృపతిం యయౌః । 14

ఉద్ధాయసాదరం రాజ్ఞా స్వాసనే వినివేశితః ।
పూజితః పరయాభక్త్యా తతః పప్రచ్ఛతం నలః ॥ 15

**నల ఉవాచ :-**

స్వామిన్నను గృహీతస్తే దర్శనేన మహామునే ।
జన్మరాజ్యం పితామాతా కులం జీవితమద్యమే ॥ 16

సఫలంస్వాగ మేహేతుం వద తూర్ణం మహామునే । 17

**గౌతమ ఉవాచ :-**

మమాసీన్మహత్వాంఛా ద్రష్టుంతే వైభవన్నృప ॥ 18

స్తువంతిదేవాః స్వర్గస్థా బ్రహ్మేంద్ర హరిశూలినః । 19

ధన్యోసి మర్త్యలోకస్థోమర్త్యైర్దేవై శ్చశస్యసే । 20

నిత్యతృప్తో ప్యహంతృప్తః పూజాం దృష్ట్వాచ వైభవం ।
ఇదానీ మనుజానీహి గమిష్యేస్వాశ్రమం ప్రతి ॥ 21

**నృప ఉవాచ :-**

వేదవేదాంగవిద్బ్రహ్మన్ సర్వశాస్త్ర ప్రవర్తక ।
దయానిధే క్షణంస్థిత్వా ఛిందిమే సంశయం మునే ॥ 22

మునిరువాచ :-

సాధుపృష్టం మహారాజస్థితోహం స్నేహభావతః ।
నాగాన్నృపాశ్చ దేవాశ్చ యత్రైనాజ్ఞా విలంఘినః ॥ 23

నృప ఉవాచ :-

మమైవవిస్మయో బ్రహ్మ న్నిరీక్ష్య వైభవం స్వకం ।
ఐద్ధం మమాభవత్కేన పుణ్యేన తపసా పివా ॥ 24

వదతత్వేన కశ్చాహం అభవం పూర్వజన్మని । 25

మునిరువాచ :-

గౌడదేశాత్పరే దేశే పురే పిప్పల సంజ్ఞకే ॥ 26

త్వమాసీః క్షత్రియః పూర్వం దరిద్రో జ్ఞానవాన్మునిః ।
జాయాపత్యై స్సుహృద్భిశ్చ వాక్పరైః తాడితో భ్రుశం ॥ 27

రాత్రావపృష్ట్వా సర్వాంస్త్వం నిర్వేదాద్గహనం వనం ।
గతవాన్ వృక్షవల్లీభిః సింహ వ్యాఘ్ర గజైర్మృగైః । 28

సేవితం శీతల జలైః సరోభి ర్జలజాదిభిః ।
ఆశ్రమోథత్వయాదర్శి భ్రమతా భ్రమతావనే ॥ 29

తపోనిధేః కౌశికస్య వేదఘోష నినాదితః ।
తత్రగత్వా మునిం తం త్వం ప్రణతో భక్తిభావతః । 30

ఉద్ధాపితః కౌశికేన దీనా నాథ దయావతా ।
దుఃఖితం త్వాం విదిత్వాస ఆశీర్వాద మవీవదత్ ॥ 31

గజాననో మే దేవే శోభవితాతే శుభతరః ।
శృత్వా తదాశిషం సౌమ్యాం ప్రాప్తోసి పరమాం ముదం ॥ 32

పృష్టవానసితం విప్ర ముపాయం సర్వకామదం ।
దారిద్ర్యనాశకం రాజన్ భుక్తి ముక్తి ప్రదం శివం ॥ 33

గణేశారాధనం తుభ్యం కథయామాస కౌశికః । 34

**కౌశిక ఉవాచ :-**

వ్రతం కురుగణేశస్య మాసమాత్రం నరాధిప ॥ 35

కురుమూర్తిం గణేశస్య మృణ్మయీం చారుదర్శనాం ।
పూర్వోక్త విధినా పూజాం కురు శృణు కథానకం ॥ 36

దినేదినే మాసమాత్రం తతః సిద్ధిధ మవాప్స్యసి । 37

**మునిరువాచ :-**

ఇతిశృత్వా కౌశికం తం పప్రచ్ఛ భూమిపః పునః । 38

**నృప ఉవాచ :-**

గజాననం నజానామి తత్స్వ రూపం వదస్వమే ।
జ్ఞాత్వాతం దేవ దేవేశం కరిష్యే వ్రతముత్తమం ॥ 39

**మునిరువాచ :-**

ఇతి తేన కృతే ప్రశ్నే జగాద మునిసత్తమః ।
అనిర్వాచ్య స్వరూపస్య పరబ్రహ్మ స్వరూపిణః ॥ 40

వైకారిక స్వరూపాణి గజానన కృతానితం । 41

**కౌశిక ఉవాచ :-**

యః కర్తా సర్వలోకానాం పితామాతా జగద్గురుః ॥ 42

బ్రహ్మేంద్ర శివవిష్ణూనాం ధ్యేయోయః స గజాననః । 43

**మునిరువాచ :-**

ఇతి శృత్వాతు తద్వాక్యం ప్రణిపత్య మునీశ్వరం ।
అనుజ్ఞా తస్త తస్తేన గతోపి నిజమందిరం ॥ 44

అరభ్య శ్రావణే శుద్ధే చతుర్థ్యాం వ్రతముత్తమం ।
అకరోన్మృణ్మయీాం మూర్తిం గణేశస్య యథోదితం । 45

స్థానేచ వచనే మానే గమనే శయనే భువి ।
ధ్యాయన్ గజాననం దేవం ప్రాయాః సిద్ధి మనుత్తమాః ॥ 46

నానారథ గజాశ్వాద్యైర్గోధనై ర్ధన సంచితైః । 47

దాసీదాసయుతః శ్రీమాన్ జాతో వ్రతప్రభావతః ।
దత్తవానసి దానాని సర్వాణి దేవతుష్టయే ॥ 48

గణేశస్య మహామౌల్యం ప్రాసాదం కృతవాన్ ముదా ॥ 49

భుక్త్వా భోగాన్ యథాకామం కాలేన నిధనం గతః ।
జాతోసి నిషధే దేశే నృపస్త్వం నలనామకః । 50

అతస్త్వయ్యచలాలక్ష్మీ స్త్రీలోకే జనవందితే ।
ఇదానీ మనుజానీహి యత్త్రృష్టం తన్నిరూపితం । 51-

**హిమవానువాచ :-**

ఏవంగతే గౌతమేతు వ్రతం చక్రేనలో నృపః ।
తద్వాక్యా జ్ఞాత విశ్వాసోమూర్తిం కృత్వా సుశోభనాం ॥ 62

శృత్వా కథాం గణేశస్య ప్రత్యహం పూజ్యభక్తితః
అలభత్సర్వకామాన్న వ్రతస్యాస్య ప్రభావతః । 63

ఇతితే కథితం కన్యేనలే నేద్ధకృతం వ్రతం 64

ఉపదిష్టం గౌతమేన పూర్వజన్మి కృతం వ్రతం । 65

యస్య ప్రభావః సంపూర్ణోవక్తుం కేనాపినేష్యతే । 66

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**నలవ్రతనిరూపణం నామ ద్విపంచాశింశో అధ్యాయః**



# నలవ్రత నిరూపణం
## 52-వ అధ్యాయము

తండ్రియైన హిమవంతుడు తనకు ప్రేమతో ఉపదేశించిన 'వరద గణేశ వ్రతవిధానం' అంతావిన్నాక పార్వతి యిలా ప్రశ్నించింది :

"ఓ తండ్రీ! ఈ వ్రతాన్ని ఇంతకుపూర్వం నలుడు చేశాడని చెప్పావు! ఇంతకీ ఆ నలుడెవ్వరు? ఎందుకని ఈ వ్రతాన్ని ఆచరించాడు? ఈ వృత్తాంతాన్ని చెప్పి నాకు ప్రశాంతిని చేకూర్చవలసింది!"

హిమవంతుడీవిధంగా చెప్పసాగాడు :

"అమ్మా! పార్వతీ! ఈ నలుడనే మహారాజు పూర్వం నిషధదేశాన్ని పరిపాలించేవాడు. అతడొక మహాదాత! అమిత తపస్సంపన్నుడై, శుభ లక్షణాలతోనూ, సకల సంపదలతోనూ తులతూగేవాడు.

ఈ నలమహారాజు సమస్త యుద్ధవిద్యలలో ఆరితేరినవాడై, అంతు లేని పరాక్రమంతో శత్రువుల పాలిట సింహస్వప్నమై ఉండేవాడు. ఆ నలమహారాజుకు మహాసౌందర్యవతి, మహాపతివ్రతా, సుగణవతీయైన దమయంతి భార్య! నలమహారాజు కొలువులో పద్మహస్తుడనే కుశాగ్రబుద్ధి గల మంత్రి ఉండేవాడు. ఈ మంత్రి నీతివిషయంలో అంగీరసుని, ఔన్నత్యం విషయంలో మేరుపర్వతాన్ని మించి, సముద్రునివంటివాడై, గాంభీర్యంలో, బుద్ధికి బృహస్పతిలా ప్రతిభావంతుడై శోభించేవాడు.

ఈ నలమహారాజు ఒకనాడు మంత్రి సామంత దండనాధులతో కొలువుతీరి, రాజనర్తకీమణులు చేసే అద్భుతమైన నృత్యప్రదర్శనను తిలకించసాగాడు. అట్టి సమయంలో గౌతమమహర్షి ఆయన వద్దకు వచ్చాడు. రాజు ఎంతో గౌరవాదరాలతో తన సింహాసనంపైనుండి లేచి, ఆ మహర్షిని తన ఆసనంపై కూర్చుండచేసి యిలా ప్రశ్నించాడు.

"ఓ మహర్షీ! మీరాకచే నేను అనుగ్రహించబడినాను! నాజన్మ కులము, మాతాపితరులూ, రాజ్యమూ సమస్తమూ ధన్యములైనాయి! తమరాకకు గల కారణం వెంటనే సెలవియ్యండి!"

ఆ మాటలకు గౌతముడిలా అన్నాడు

'ఓ మహారాజా! త్రిమూర్తులచేతా, త్రిలోకాధిపతియైన ఇంద్రునిచేతా కూడా ప్రశంసించబడుతున్న నీ ఐశ్వర్యాన్నీ, వైభవాన్నీ చూడాలని వచ్చాను. మనుష్యలోకంలోఉన్నా, దేవతలచేతా, మానవులచేతా కూడా కొనియాడబడుతున్నావు! నేను నిత్యతృప్తుడనైనప్పటికీ, నీయొక్క వినయమూ, సౌశీల్యమూకూడా నాకు ఎనలేని తృప్తినిచ్చాయి! ఇక నీవు

అనుజ్ఞనిస్తే నా ఆశ్రమానికి తిరిగి వెడతాను!" ఆ మాటలకు మహారాజైన నలుడిలా అన్నాడు

"ఓ మునివర్యా! తాము సర్వజ్ఞులు! వేదవేదాంగాలను క్షుణ్ణంగా ఎరిగినవారు! సకలశాస్త్ర ప్రవర్తకులూ! ఓ దయానిధీ! క్షణకాలం తాము దయతో కూర్చుండి, నాకుగల ఒక సందేహాన్ని తీర్చప్రార్ధన!" అప్పుడు గౌత ముడు ఆదరంగా :

"ఓ నలమహారాజా! నీ శ్రద్ధాభక్తులకు అమితంగా ప్రసన్నుడనైనాను. సకల దేవతలూ, రాజులూసైతం నీమాటను జవదాటక అజ్ఞగా శిరసావహి స్తారు! కనుక నేనూ నీమాటను తప్పక పాటిస్తాను! కనుక నీ సందేహాన్ని తెలుపు!" అన్నాడు.

"ఓ ఋషివర్యా! ఈ నా అపూర్వ వైభవంచూస్తే నాకే ఆశ్చర్యం కలుగుతోంది! పూర్వజన్మలోని ఏపుణ్యవిశేషంచేత ఇట్టి వైభవం నాకు కలిగింది? ఇంతకూ పూర్వజన్మంలో నేనెవర్ని?" ఆ వివరాన్ని దయతో నాకు తెలియజేయండి!" అంటూ ప్రశ్నించగా గౌతమముని నలునితో యిలాఅన్నాడు :

"ఓరాజా! పూర్వజన్మములో నీవు గౌడదేశానికి అవల గల పిప్పల నగరంలో ఒక దరిద్రుడైన క్షత్రీయుడవై జన్మించావు! ధనహీనుడవైన నీవు భార్యాబిడ్డల నిరసనవాక్యాలకు ఎంతో బాధపడి, విరక్తుడవై, ఎవరికీ తెలియకుండా ఒక మహారణ్యంలోకి వెళ్ళావు! క్రూరమృగాలతో నిండి, దట్టమైన మహావృక్షాలతోనూ మధ్యమధ్య సరస్సులతోనూ ఉన్న ఆ అరణ్యంలో తిరుగుతూ వెళ్ళి ఒకానొక ఋష్యాశ్రమాన్ని చేరుకున్నావు!

ఆ ఆశ్రమం వేదఘోషతో ప్రతిధ్వనిస్తూన్నది. అది మహాతపస్వియైన కౌశికుని ఆశ్రమము!

లోనికివెళ్ళి భక్తితత్పరుడవై ఆ ఋషికి ప్రణమిల్లావు! దీనుల బాధలకు కరిగిపోయే స్వభావంగల కరుణాపూరితుడైన ఆ మహర్షి నిన్ను ప్రేమారగా లేవనెత్తి, నీ దుఃఖకారణం ఎరిగి, నిన్ను ఇలా ఆశీర్వదించాడు.

"ఆ దేవేశుడైన గజాననుడు నీకు సకల శుభాలనూ చేకూర్చు గాక!"

ఇలా ఆ ఋషిసత్తమునివద్ద అమోఘమైన ఆశీర్వచనాన్నిపొంది, సంతోషభరితుడవై ఆ మునిని నీ దారిద్ర్యనాశనానికై తగు ఉపాయం చెప్పమంటూ వేడుకున్నావు! అప్పుడా మహర్షి భుక్తిముక్తిప్రదమైన, సకలాభీష్టాలనూ నెరవేర్చగల, ఉత్కృష్టమైన గణేశారాధనను నీకు ఉపదేశించాడు. ఆ తరువాత ఆ కౌశికుడిలా అన్నాడు : "ఓరాజా! నీవు ఒక మాసమాత్రం క్రమంతప్పక ఈ గణేశవ్రతాన్ని ఆచరించు!" అంటూ ఆ వ్రతవిధానాన్ని నీకు కౌశికుడిలా చెప్పాడు :

## పూజావిధానం

"ఓరాజా! ముందుగా వరదుడైన గణేశుని దివ్యసుందరవిగ్రహాన్ని మట్టితోచేసుకొని, ఆ విగ్రహానికి ప్రాణప్రతిష్ఠచేసి, షోడశోపచారములతో భక్తిగా పూజించాలి. ఇలా ప్రతిదినమూ శ్రద్ధగా ఒక మాసంరోజులపాటు చేయాలి! అలా నియమబద్ధుడవై ఆచరిస్తే, నీకు సకలసిద్ధులూ సంప్రాప్తిస్తాయి!" ఆ మాటలకు :

"ఓ కౌశిక మునిపుంగవా! గజాననుని మూర్తిని కృతికతో చేయా లంటున్నారు. ఇంతకీ ఆతడి స్వరూపమెలాంటిది? అది నాకు దయతో తెలపండి. ఆతడి స్వరూపాన్ని తెలుసుకున్నాక, గణేశవ్రతాన్ని మీరుచెప్పిన రీతిలో నియమంగా ఆచరిస్తాను!" అన్న ఆతడి మాటలకు కౌశికుడిలా అన్నాడు :

"ఓ రాజా! గణేశుడంటే 'ఇతడు' అని నిర్వచించరానివాడు! సాక్షాత్తూ పరబ్రహ్మస్వరూపుడే ఆతడు! ఈ జగత్తంతా ఆ గజాననుని నుండే ఉత్పన్నమైనది! ఆయన సంకల్పంవల్లనే ఈ సమస్త జగత్తూ కూడా నిర్మించబడ్డది! అందువల్ల ఈ జగత్తంతటికీ ఆతడే తల్లీ, తండ్రీ కూడా!

బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు, విష్ణువు మొదలైన వారందరూ ఆయననే నిత్యం తమ హృదయకమలంలో ధ్యానిస్తూంటారు!"

"ఓ రాజా! నీవా కౌశికముని మాటలను ఆలకించి, ఆతడికి నమస్కరించి, అతనివద్ద అనుజ్ఞను గైకొని తిరిగి నీ యిల్లు చేరుకున్నావు! ఆ ఋషి ఆదేశించినట్లుగా, శ్రావణశుక్ల చతుర్థినాడు నీవా గణేశవ్రతాన్ని ఆరంభించి, మృత్తికతో ఒక గణపతిమూర్తిని తయారుచేసి, ఆ గణేశునే నీ హృదయపద్మములో సర్వకాల సర్వావస్థలయందూ ధ్యానిస్తూ, ఆతడి అనుగ్రహంచేత సర్వోత్తమమైనట్టి సకలసిద్ధులనూ పొందావు! ఆ జన్మములో నీవు సకల దాసదాసీ జనములతో కూడిన మహదైశ్వర్యాన్ని పొందావు! దానితో దేవతాతృప్తికై అనేక దానాదికాలు చేశావు! ఎంతో పుణ్యప్రదమైనట్టి ఒక గొప్ప విలువైన గణేశుని ఆలయాన్నికూడా సర్వాంగ

సుందరంగా అక్కడే నిర్మించావు! ఇహలోకంలో సకల భోగాలన్నీ అనుభవించాక కాలధర్మం చెంది, తిరిగి ఆ పుణ్యవశాన రాజకుటుంబంలో జన్మించి నిషధదేశానికే రాజుగా నలుడన్నపేరుతో రాజ్యం చేస్తున్నావు! ఓ నలమహారాజా! ఇదే నీవడిగిన సందేహానికి జవాబు!" అంటూ వెళ్ళిపోయాడా గౌతమమహర్షి!

"కనుక అమ్మాయీ! ఇలా గౌతమమహర్షి వెళ్ళిపోయాక నలుడు తిరిగి ఆ జన్మలోకూడా వరదగణేశవ్రతాన్ని అనుష్ఠించాడు! ప్రతీరోజూ వ్రతం పూర్తయ్యాక వ్రతకధనుకూడా భక్తితో వినేవాడు. ఈ వ్రతప్రభావం చేతనే అతడు తన సకలాభీష్టాలనూ పొందగలిగాడు! కనుక ఓ పార్వతీ! ఈ విధంగా గౌతమునిచే ఉపదేశించబడిన నలమహారాజు, పూర్వజన్మలో తాను చేసిన వ్రతాన్ని తిరిగి ఆచరించి, కృతార్థుడయ్యాడు! ఆ విధానం అంతా నీ కోరికమేరకు ఇప్పుడు చెప్పాను! ఈ వ్రతప్రభావాన్ని పూర్ణిగా వర్ణించడం ఎవరితరమూ కాదుతల్లీ!" అంటూ ముగించాడు హిమవంతుడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'నలవ్రత నిరూపణం' అనే 52-వ అధ్యాయం.



53

# చంద్రాంగదోపాఖ్యానం

(మూలం)

## త్రిపంచాశత్తమో అధ్యాయః

**హిమవానువాచ :-**

ఇదానీం కథయిష్యామి రాజ్ఞా చంద్రాంగదేనచ ।
తత్పత్న్యాచ కృతం హ్యేత దిందుమత్యా శుభాననే ॥ 1

మాలవే విషయేఖ్యాతం నగరం కర్ణనామకం ।
తత్ర చంద్రాంగదో రాజా బభూవాతి పరాక్రమీ ॥ 2

అణిమాది గుణోపేతః సర్వశాస్త్రార్థ తత్వవిత్ ।
యజ్వాదానీ మహాజ్ఞానీ వేదవేదాంగ పారగః ॥ 3

అతిక్రాంతా సభాయస్య సుధర్మామతి మానుషీం ।
ముష్ణాతి చక్షుషస్తేజో రవికాంత మరీచిభిః ॥ 4

అతి స్వచ్ఛానివాసాంసి రత్నస్తంభాశ్రయాంత్సుతే ।
నీలలోహిత పీతత్వాచ్చిత్రతాం యాంతికానిచత్ ॥ 5

అతి సాధ్వీ మహాభాగా పతిశుశ్రూషణేరతా
ధర్మశీలా వ్రతపరా శ్వశ్రూశ్వశురసేవినీ । 6

గృహకృత్యేషుచా వ్యగ్రా దేవతాతిథిపూజికా ।
నామ్నాచేందుమతీ ఖ్యాతా సర్వావయవసుందరా । 7

ధర్మశీలోపి నృపతిః రమాత్యైః ప్రార్థితో భృశం ।
జీవహింసాం మహాఘోరాం పాపార్థం పరివర్జయ ॥ 8

కదాచిద్దైవయోగేన మృగయాంక్రీడితుంయయౌ ।
తరక్షురురువారాహ మృగపక్షి యుతం వనం ॥ 9

నీలకంచుక సంవీతో నీలోష్ణీషోత్తరచ్ఛదః ।
బద్ధగోధాంగుళి త్రాణః శస్త్రికా ఖడ్గ ఖేటవాన్ ॥ 10

జవేనాశ్వ సమారూఢో శరచాపకరోబలీ ।
తాదృశైర్వీర నికరై రమాత్యైః సేవకైర్వృతః । 11

నిఘ్నన్మృగాన్ వరాహాంశ్చ ప్రేషయన్నగరం ప్రతి ।
భ్రమమాణోవనే రాజా దృష్టో రాక్షస పుంగవైః ॥ 12

చకంపే రాక్షసాన్ దృష్ట్వా శీతజ్వర యతోయథా ।
దరీముఖాన్ గర్త నేత్రా న్వ్యాదితాస్యాన్నభనస్పృశః ॥ 13

దృష్ట్వాతాన్ విద్రుతా స్సర్వే వీరాః సే విజనా అపి ।
కేచిద్య మక్షయం యాతాః మూర్ఛితాః కేపిభూగతాః ॥ 14

తత్రైకా రాక్షసీ క్రూరా దృష్ట్వా కామాతి సుందరం ।
తం న్నృపం పరిరభ్యైవచు చుంబే కామమోహితా ॥ 15

తస్యామాత్యాన్ భగేకృత్వా భక్షయామాస సేవకాన్ ।
ఏతస్మిన్నంతరే రాజా పలాయన పరోయయౌ ॥ 16

కాసారమధ్యే మగ్నో భూన్నా ద్రాక్షేద్రాక్షసీ చతం ।
సభ్రుతో నాగకన్యా భిర్నీతః పాతాల మందిరం ॥ 17

భూషితో నాగకన్యా భిర్వస్త్రాలంకార భూషణైః ।
పప్రచ్ఛుర్నాగ కన్యాస్తం కుత ఆగమనం తవ ॥ 18

కోసికస్యాసి కిం నామ వదసత్యం నరోత్తమ ।
ఇతి తద్వచనం శృత్వా తాం జగాద నరాధిపః ॥ 19

అహం చంద్రాంగదో నామ హేమాంగద సుతోబలీ ।
మాలవే విషయే కర్ణ నగరే వసతిర్మమ ॥ 20

రాక్షసీ భయవిత్రస్తః ప్రవిష్టః సలిలం మహత్ ।
భవతీ భిరిహానీతో యత్ర్పుష్టం తన్నివేదితం ॥ 21

భక్షితాః సర్వలోకామే మృగయా భిరతస్యహ ।
సరోజల ప్రసాదేన జీవం స్త్రిష్యామిసాంప్రతం ॥ 22

ఇతితా వచనం శృత్వా పునరూచుర్నృసం తదా । 23

**తాః ఊచు :-**

భవాస్మాకం పతిరిహ సర్వం సేత్స్యతితేప్రియం ॥ 24

అస్మాకం నాగకన్యానాం భోగశ్చాతీవ దుర్లభః ।
తాసామితి వచశ్రుత్వా ప్రోవాచ నృపసత్తమః ॥ 25

ఏకపత్నీ వ్రతం మేస్తిమాతర స్తత్కధం త్యజే । 26

సోమవంశ ప్రసూతానాం రాజ్ఞాం ధర్మాన్ బ్రవీమివః ।
పరద్రవ్యం పరద్రోహం పరదారాం స్తదైవచ ॥ 27

పరనిందాం చనేచ్ఛంతి నృపాః సౌమ్యాచ్ఛ సాధవః ।
అధీతిర్య జనం దానం శరణాగత పాలనం ॥ 28

నిషిద్ధా చరణం నైవ విధ్యర్ధ ప్రతిపాలనం ।
ఏతేధర్మాః త్రివర్ణానాం యాజనాదిత్రయం ద్విజే ॥ 29

అధికం సర్వ వర్ణనామాతిథ్యం పరమం మతం ।
ఇతి శృత్వానృపవచో ఖిలా నాగకుమారికాః ॥ 30

ప్రశేపుస్తం వియుక్తస్త్వం బహుధాస్వస్త్రియా భవ ।
బబంధుర్నిగడైస్తంతాః దుఃఖితాః కామవిహ్వలాః ॥ 31

రాక్షసీతుజలం ప్రాశ్య తదర్ధే తత్పురోగతం ।
భక్షయిత్వాజల చరాన్ నాతృప్యత్పరమం తదా ॥ 32

ఇమం వృత్తాంత మశృణోద్రాజ్ఞీ రాజీవలోచనా ।
పర్యంకస్థా స్వదూతాత్సా రాక్షసీతో వశేషితాత్ ॥ 33

మగ్నం నిశమ్య నృపతిం దుఃఖితా పతితాభువి ।
మూర్ఛామవాప మహతీం సఖీభిః పరివీజితా ॥ 34

సిక్తా శీతలతోయే నరుదంతీ భిర్ముహుర్ముహుః । 35

ఉపవిష్టా ప్రరుదతీ ఘ్నతీ వక్షః శిరోముఖం । 36

శుశోచ పరమాలాపై ర్భర్తః కాంతేతిజల్పతీ ।
క్వగతః ప్రాణనాథోమే హిత్వామాం ప్రియవాదినీం ॥ 37

సర్వావయవ సంపూర్ణాం ప్రణతాం ప్రియకారిణీం ।
భర్తృకార్య రతాం నిత్యం నిత్యం చాతిథి పూజికాం ॥ 38

కుత్రభోక్ష్యతి మే నాథో నిద్రాం వాకుత్ర యాస్యతి ।
కాచంనం శయనం హిత్వా పరార్ధ్వా స్తరణైర్వృతం ॥ 39

కథం స్నాస్యతి కాంతోమే హిత్వా తైలం సుగంధికం ।
లోకానాం పాలనం కోద్య వినాతేన కరిష్యతి । 40

ప్రజానాం సర్వలోకానాం బాలానాం రంజనం చకః ।
అస్తంయాతో గుణనిధిః ప్రతాపనిధి రద్యకిం । 41

దిశః శూన్యాః ప్రపశ్యామి వినాతేన మహాత్మనా ।
క్వాహం సుఖం ప్రపశ్యామి క్వసుఖం సోపియాస్యతి ॥ 42

ఇహలోకే పరేవాపి నసుఖంకుల యోషితాం ।
హీనానాం స్వామినా దేవయదే తత్స్వామినాసహ ॥ 43

శరణాగత గుప్తించ దీనానాంకః కరిష్యతి ।
ఏవం బహువిధం దీనారుదతీ భ్రుశవిహ్వలా ॥ 44

తత్యా జ త్రోటయిత్వా సాభూషణాని చ దూరతః ।
కంకణా నిచ సర్వాణి భభంజచము మూర్ఛచ ॥ 45

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**చంద్రాంగదోపాఖ్యానం నామ త్రిపంచారింశో అధ్యాయః**



# చంద్రాంగదోపాఖ్యానం

## 53-వ అధ్యాయము

పర్వతరాజైన హిమవంతుడు తన కుమార్తెయైన గిరిజతో ఇలా అన్నాడు :

"అమ్మాయీ! పార్వతీ! నలుడేకాక యింకా చంద్రాంగదుడనే రాజు చేతా, యింకా అతని భార్య ఇందుమతిచేతా కూడా ఈ గణేశవ్రతం అనుష్ఠించబడింది. ఆ విశేషాన్ని చెబుతాను విను!"

మాలవదేశంలో కర్ణనగరమనే పట్టణం ఉన్నది. ఆ దేశాన్ని అష్టైశ్వర్యసంపన్నుడూ, సకలశాస్త్రార్థ తత్వజ్ఞుడూ, యజ్ఞయాగాది క్రతువులు చేసిన ధార్మికుడూ, దాత, వేదవేదాంగ పారంగతుడైన చంద్రాంగదుడనే మహారాజు పరిపాలించాడు.

సకలైశ్వర్యాలతోనూ వైభవంగా అలరారే ఆ రాజు కొలువుకూటం స్వర్గాధిపతియైన ఇంద్రుడి సభను మరపించేదిగా ఉండేది. ఆ రాజుకు ఇందుమతి అన్న పేరుగల సర్వాంగసుందరియైన మహాపతివ్రత ధర్మ పత్నిగా ఉండేది. ఆమె దేవతాతిధి పూజాతత్పరురాలూ, ధర్మశీలీ, అత్త మామలను సేవించేదీయైన సుగుణాలరాశిగా ఉండేది.

ఆ చంద్రాంగద మహారాజుకు వేట అంటే చాలా మక్కువగా ఉండేది. 'హింసాయుతమైన వేటను విడనాడండి మహారాజా!' అంటూ మంత్రులు ఆయనకు ఎంతగానో హితవుచెప్పారు. ఇలావుండగా ఒకనాడు అతడు వేటకై కొంత పరివారాన్ని వెంటగొని, నల్లటి చొక్కా, నల్లటి తలపాగా, కండువా మొదలైనవి ధరించి, ఖడ్గాన్నీ, ధనుస్సునూ చేతబూని అశ్వారూఢుడై వెళ్ళాడు!

ఘోరారణ్యంలో అనేక క్రూరమృగాలను వేటాడి, వాటిని నగరికి పంపుతూ, అశ్వాన్ని అధిరోహించి అరణ్యంలో తిరుగుతూ కొందరు రాక్షసుల కంటబడ్డాడు. భీకరాకారులైన ఆ రాక్షసులు గుహలవంటి నోళ్ళుకలిగి, అతిభయంకరంగా కన్పించారు. వారిని చూడగానే భీతావహు లైన సేన నలుదిక్కులకూ పారిపోయారు. మన్మధుడో, నలకూబరుడో అన్నంత అందంగావున్న ఆ చంద్రాంగదుణ్ణి చూసి మోహించిన ఒక రాక్షసవనిత ముద్దుపెట్టుకొంది. అతడి వెంటనున్న సేనల్ని కకావికలు చేస్తూ, ఆ రాజును వెంబడించింది. ఎలాగో ఆమె బారినుంచి తప్పించు కున్న చంద్రాంగదుడు ఆమెవెంట తరముతూ రాగా, దారిలోవున్న ఒక సరోవరంలోపడి మునిగిపోయాడు! అప్పుడు ఆ సరస్సులోంచి నాగకన్య

కలు బైటికివచ్చి, ఆ రాజును తమవెంట పాతాళానికి తీసుకెళ్ళి, అతడిని నానాలంకారములతోనూ అలంకరించి, అతడిని యిలా ప్రశ్నించారు :

'నీవెవరవు? ఎక్కడినుంచి వచ్చావు? ఎవరి కుమారుడవు?' అన్న వారి మాటలకు అరాజు యిలా బదులిచ్చాడు

"ఓ నాగకన్యకలారా! నేను హేమాంగదుడి కుమారుడను! నాపేరు చంద్రాంగదుడు! మాది మాళవదేశం. అందులోని కర్ణనగరం నా నివాస స్థలం! వేటకని వచ్చిన నేను ఒక క్రూరరక్కసి బారినుంచి తప్పించుకొని వస్తూ ఈ జలాశయంలో ప్రవేశించాను. మీవల్ల ఇక్కడికి కొని తేబడ్డాను! ఇదీ నాచరిత్ర! వేటకని వచ్చిన నా పరివారమంతా రాక్షసి పాలబడ్డారు. నేను మాత్రం ఈ సరోవర జలాలలో ప్రవేశించటంవల్ల బ్రతికాను!"

రాజుయొక్క పై వచనాలను విన్న నాగకన్యలు యిలాఅన్నారు :

"ఓ రాజా! నీవు మమ్మల్ని వరించి మాకు భర్తవుకా! నీకు సకల సుఖభోగాలనూ సమకూరుస్తాము! మాతో భోగము నరులకు దుర్లభం!"

ఆ మాటలకు తన చెవులను రెండుచేతులా మూసుకుంటూ రాజిలా బదులుచెప్పాడు :

"ఓ తల్లులారా! నేను ఏకపత్నీవ్రతుడను! ఆ వ్రతాన్ని నేను యిప్పుడెలా వీడగలను? మేము సోమవంశానికి చెందిన సుక్షత్రియులం! మా వంశీయులు పరద్రవ్యాన్నీ, పరదారలనూ కలలోనైనా ఆశించనివారు. పరద్రోహ, పరనిందలు మాచే సర్వదా వర్జితములు. సౌమ్యత, సాధుత్వం, సుస్వభావమూ, యజ్ఞ, దాన, తపో వ్రతాదులందు అనురక్తీ — ఇవి

మాకు వెన్నతోపెట్టిన విద్యలు! శరణాగతుడైన వానిని తప్పక రక్షించాలన్న నియమమూ, నిషిద్ధకర కర్మలను వర్జించాలన్న నియమమూ కల వారము! విధివత్తుగా చేయాల్సిన కర్మలను ఏమరుపాటుగా తప్పక ఆచరించే నియమపరులం! ఎటువంటి వారికైనా అతిథిసత్కారమనేది ముఖ్యనియమం! కాబట్టి మీకు ఆదరణీయులం!" ఆ మాటలు విన్న నాగకన్యకలు క్రోధపరవశులై తమను తిరస్కరించిన చంద్రాంగదుడిని 'నీకు స్వ-స్త్రీవియోగము కలుగుగాక!' అని శపించి అతడిని కారాగృహ బద్ధుణ్ణి చేశారు.

ఈకథ ఇలాఉండగా, ఓపార్వతీ! చంద్రాంగదుడిని వెంబడిస్తూ తరుముకు వచ్చిన ఆ రక్కసి అతడివెంట తానూ ఆ జలాశయంలోకి దూకి, దానిలోని నీటిని యావత్తూ త్రాగివేసి, జలచరాలనన్నింటినీ భక్షించి — ఆ రాజు జాడ తెలియక ఎంతో అసహనంగా వెతకసాగింది.

'ఓ పార్వతీ! జరిగిన ఈ వృత్తాంతాన్నంతటనీ పారిపోయి నగరును చేరుకున్న సైనికులు మహారాణియైన ఇందుమతికి చెప్పారు. రాజు సరోవరంలో బడినాడన్న వార్త చెవినబడగానే ఆమె భరింపలేని దుఃఖంతో మూర్ఛిల్లింది! కొద్దిసేపటికి శైత్యోపచారములచేత తేరుకుని భర్త ఎడ బాటును తట్టుకొనలేక గుండెలనూ, నెత్తినీ మోదుకుంటూ దుఃఖించ సాగింది!

"ఓ నాదా! పరిపూర్ణ యవ్వనంలోఉన్న నన్ను వీడి, దేవతాతిథి పూజాపరురాలనైన నాకు కంటికే కనిపించకుండా, పతివ్రతనైన నన్ను వీడి ఎక్కడికి వెళ్ళావు? రాజోచితమైన షడ్రసోపేతమైన భోజనాన్ని వీడి

ఏమి భుజిస్తున్నావోకదా? బంగారు హంసతూలికాతల్పం వీడి ఎక్కడ నిద్రిస్తు న్నావోకదా! సుగంధతైలాదికాలతో అభ్యంగనంచేసే నీవు ఇప్పుడు ఎలా స్నానంచేస్తున్నావో? నీవు లేని ఈ రాజ్యానికీ, ప్రజలకూ దిక్కెవ్వరు? వారంతా యిప్పుడు అనాధలైనారే? ఇక వీరిని పాలించగలవారెవ్వరు? నీవు లేని నాకు సర్వం శూన్యంగా జీవితమే అంధకారబంధురంగా తోస్తోంది! కులస్త్రీలను రక్షించటానికి, పోషించటానికి, ఇహపరసుఖాలకూ భర్తయేకదా జీవనాధారం!'' అంటూ అనేకవిధాలుగా విలపిస్తూ తన ఆభరణాలన్నీ విసర్జించి, దుఃఖంతో, బాధతో మూర్ఛిల్లింది!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'చంద్రాంగదోపాఖ్యానం' అనే 53-వ అధ్యాయం.



# ఇందుమతీ - నారద సంవాదం

(మూలం)

## చతుర్పంచా రింశో అధ్యాయః

**పార్వత్యువాచ :-**

తస్యాంతు మూర్ఛితాయాంతు కిమకుర్వన్ జనాస్తదా ।
తన్మే విస్తరతో బ్రూహి హృదయానందనం పితః ॥ 1

**హిమవానువాచ :-**

తదాసర్వే నాగరికాః నానావాక్య విశారదాః ।
ప్రమృజ్యస్యానిచా శ్రూణి సమాదధ్యుర్నృపస్త్రియం ॥ 2

**జనా ఊచు :-**

మాతరుత్తిష్ఠ మాశోకం కురుపుత్రే మనః కృథాః ।
ప్రేతం దహతి శోకాశ్రుతస్మాద్భర్తు హితంకురు ॥ 3

మర్త్యేషునహి దృష్టోస్తి చిరంజీవీ శుభాననే ।
యథాజీర్ణం పరిత్యజ్య వానస్యోద్గృహ్యతే జనైః ॥ 4

వర్ణాపి దేహినా తద్వత్ త్యక్త్వాన్య ద్గృహ్యతే శుభం ।
అత్యాశ్చర్య మిదం భద్రే స్వయంమృత్యు ముఖేస్థితః ॥ 5

శోచతే మృతమ పరం స్వయం మరణ ధర్మవాన్ ।
స్వదేహేన వియోగంచ నవేత్తి బావినం జనః ॥ 6

మదీయం మన్యతే సర్వం దైవకాల వశేస్థితం ।
బ్రహ్మాది స్థావరాంతం యద్విశ్వం సాబ్ధి చరాచరం ॥ 7

జ్ఞాత్వాతం నశ్వరం శోకం త్యక్త్వోత్తిష్ఠ సుపుత్రిణీ । 8

ధర్మవాన్ పుణ్యశీలస్తే భర్తాముక్తింగతో భవేత్ ।
జీవన్యది భవేత్స్వర్గే తదాయాస్యతి కర్హిచిత్ ॥ 9

అతి పుణ్యాన్మానవోపి యాతి స్వర్గం గతః పునః ।
అథవా పరిపృచ్ఛామో మునిం కించి దిహాగతం ॥ 10

అతీతానాగత విదం కథయిష్యతి సోఖిలం ।
అనంతరం హియత్కార్యం తత్సర్వం విదధామహే ॥ 11

**హిమవానువాచ :-**

ఏవంప్రబోధితాలోకైః క్షణమిందుమతే తదా ।
ఆశ్వస్థా సర్వ వాక్యేన ప్రమృజ్యాశ్రూణి వాససా ॥ 12

విసర్జయామాన తదా లోకాన్సర్వాన్స మాగతాన్
త్యక్త్వా సౌభాగ్య చిహ్నాని ప్రపేదేకృశతాం భ్రుశం ॥ 13

రుదతీ శోచతీ తస్థౌశ్వసతీ మూర్ఛితాముహుః ।
తతో ద్వాదశ వర్షాంతే నారదో దివ్యదర్శనః ॥ 14

అజగామ గృహం తస్యాః యదృచ్ఛా విచరన్మునిః
దృష్ట్వాతం విలలాపాశు వదంతీ భర్తృచేష్టితం ॥ 15

దుఃఖంచా కథ యత్తస్మై జాతం ద్వాదశ వార్షికం ।
నిశమ్య రుదితం తస్యాః హర్షయన్ముని రబ్రవీత్ ॥ 16

**నారద ఉవాచ :-**

క్వాపి తిష్ఠతి తే భర్తా నత్వం శోచితు మర్హసి ।
శిరశ్ఛాదయ నీలేన వాససాకర్ణ భూషణే ॥ 17

కర్ణయోః కురుబాలేత్వం బిభ్రతీ కుంకుమం శుభం ।
వలయానిచ కరయోః కంఠే మంగల సూత్రకం ॥ 18

**హిమవానువాచ :-**

సర్వజ్ఞస్య మునేర్వాక్యా ద్విశ్వస్తా సత్యవాదినః ।
తత్కాలం సర్వమానాయ్య హర్షితాసా తథాకరోత్ ॥ 19

ఆకార్య బ్రాహ్మణా స్సర్వాన్ సంపూజ్య నారదం పురా ।
సంపూజ్య సకలాం స్తాంస్తు దదౌదానాన్యనేకశః ॥ 20

వాదయామాస వాద్యని శర్కరాంచ గృహే గృహే ।
ప్రేషయామాస చ తదా హర్షాదిందుమతీ శుభా ॥ 21

వస్త్రతాంబూల దానేన దదా వాజ్ఞాంజనస్యసా ।
ప్రణితప్యపునర్దేవ మునిం నారద మాదరాత్ । 22

స్వభర్త్రు ప్రాప్తయే పృచ్ఛ దుపాయం రాజకన్యకా । 23

**ఇందుమత్యువాచ :-**

కుత్ర తిష్ఠతిమేభర్తా కథంతిష్ఠతివామునే ॥ 24

కేనోపాయేన వేదజ్ఞ దర్శనం తస్య మే భవేత్ ।
అనుగ్రహం కురుమునే తముపాయం వదస్వమే । 25

వ్రతం దానం తపోవాపి దుస్సామపి యద్భవేత్ । 26

**నారద ఉవాచ :-**

వ్రతంతు పరమంతేహం కథయామి సమాసతః ।
నభశ్శుక్ల చతుర్థ్యాంత దారభేత్పరయాముదా ॥ 27

నద్యాం తటాకే వాప్యాం వా దంతధావన పూర్వకం ।
స్నానం ప్రభాతసమయే కురు సంకల్పపూర్వకం । 28

శుక్ల వాసాగృహం గత్వా మృణ్మయీం మూర్తిముత్తమాం
కుర్యా చ్చతుర్భుజాం సమ్యగ్గణేశస్య మనోరమాం 29

ఉపచారై ష్షోడశభిః పూజయేత్థ్సిరచేతసా । 30

ఏకాన్నమేక భుక్తంవా స్వయం కుర్యాత్ప్రయత్నతః
ఉపోషణం వా కుర్వీత యావద్భాద్ర చతుర్థికా ॥ 31

గీతవాదిత్ర నృత్యాద్యై ర్బ్రాహ్మణానాంచ భోజనైః ।
మహోత్సవం ప్రకుర్వీత విభవే సతిశోభనే ॥ 32

ఏవం వ్రతం కురుశుభేభర్త్రా సహసమేష్యసి
పాతాలే నాగకన్యా భీరుద్ధేన జీవితాశుభే । 33

సత్యం బ్రవీమి తే సత్యే నాన్యథా మమభాషితం । 34

**హిమవానువాచ :-**

ఇత్యుక్తా తేన మునినా వ్రతం ప్రారభదాదరాత్ ॥ 35

గతేమునౌనభోమాసి దినైః కతిభిరాగతే
ద్విరదానన మూర్తిం సా చకారపార్థివీం శుభాం 36

పూర్వోక్త విధినాపూజాం చకార సుమనోహరాం
దివ్యగంధై ర్దివ్య వస్త్రై ర్దివ్యైశ్చ కుసుమై రపి । 37

దివ్యైర్నానా విధైశ్చైవ నైవేద్యైః ఫలకాంచనైః
దీపైః పుష్పాంజలీభిశ్చ ప్రక్రమైర్నతిభిస్తవైః ॥ 38

తన్నామ స్మరణైర్ధ్యానై స్తోషయామాసతం విభుం ॥ 39

గీతవాదిత్ర నృత్యాద్యైర్బ్రాహ్మణానాంచ భోజనైః ॥ 40

ఫలమాత్రం పయోభుక్త్వా చకారవ్రత ముత్తమాం ॥ 41

నభశ్శుక్ల చతుర్థ్యాది చిరనష్ట ప్రియాప్తయే ।
నారదస్యమునేర్వాక్యా ద్యావద్భాద్ర చతుర్థికా ॥ 42

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**ఇందుమతీ నారద సంవాదే చతుశ్చత్వారింశో అధ్యాయః**



# ఇందుమతీ - నారద సంవాదం
# 54-వ అధ్యాయము

గిరిరాజనందినియైన పార్వతి తండ్రియైన హిమవంతుని తిరిగి యిలా ప్రశ్నించింది. "ఓ తండ్రీ! మహారాణియైన ఇందుమతి ఆ విషాద వార్తకు నిర్ఘాంతపోయి మూర్ఛిల్లిన తరువాత ఏం జరిగిందో, ఆ రాజ్య ప్రజలేమి చేశారో ఆ వివరాన్నంతటినీ దయతో నాకు తెలియచేయి!"

"అమ్మాయీ! అప్పుడు కొందరు ప్రజలు ముందుగా తెప్పరిల్లి తమ కన్నీళ్ళు తుడుచుకొని ఆ మహారాణివద్దకు వచ్చి ఆమెను యిలా ఊరడించారు. 'ఓ దేవీ! నీవు దుఃఖింపవద్దు! నీకింకా పసితనం వీడని పుత్రుడున్నాడుకదా! వాడియందు నీ ఆపేక్ష ఉంచుకో! ఐనా మరణించిన వ్యక్తి ప్రేతాత్మను బంధువుల కన్నీళ్ళు కాల్చివేస్తాయి! అందుచేత నీ భర్తయొక్క శ్రేయస్సును ఆపేక్షించి, దుఃఖాన్ని విరమించుకొని నీ భర్తకు

ఉత్తరగతులను చేకూర్చుకో! ఎందుకంటే, ఎంతటివారైనా ఏనాటికైనాసరే జన్మించిన ప్రతీవారూ మరణించకా తప్పదు. జీర్ణమైన వస్త్రాన్నివీడి, మనమెలా కొత్తవస్త్రాన్ని ధరిస్తామో, అలానే ప్రతీ జీవుడూకూడా తన పాతబడ్డ దేహాన్ని వీడి, మరో నూతన దేహాన్ని ధరిస్తూంటాడు!

అన్నిటికన్నా అమితంగా ఆశ్చర్యంగొలిపే విషయమేమంటే — ఇలా మానవులు నిరంతరం మృత్యుముఖంలో ఉండి, మరణధర్మము కలవారై ఉండికూడా, అలా మరణించినవారిని గురించి దుఃఖిస్తారు. ప్రతి జీవికీ దేహధారణా, దేహం నుంచి విముక్తీ అత్యంత సహజమైనవి! దైవసంకల్పానుసారమే ఈ చరాచర జగత్తంతా వర్తిస్తుందన్న నిత్యసత్యాన్ని విస్మరించి, సర్వమూ తానేనన్న అహంకారంతో, భ్రాంతుడై జీవి చరిస్తుంటాడు. కేవలం భగవదనుగ్రహమే భమప్రమాదములైన వీటినుంచి — ఈ అజ్ఞానపు అంధకారంనుండీ అతడిని ఉద్ధరించగలది! కనుక నీవు అశాశ్వతమైన వాటికై దుఃఖశోకాలను వీడు! మహారాజు పుణ్యశీలి! ధర్మవంతుడు గనుక శాశ్వతముక్తిని పొందియున్నాడు!

మానవుడిచ్చట ఒనర్చిన పుణ్యకర్మలు అతడికి స్వర్గవాసమును తాత్కాలికంగా కల్గించినా, ఆ పుణ్యమంతా ఆతడనుభవించాక తిరిగి భూలోకంలో జన్మించక తప్పదు! ఇక్కడికి ఒక్క మహాత్ముడైన ఋషి వచ్చివున్నాడు. ఆయననడిగి మనం సందేహం నివృత్తిచేసుకొని నీ కర్తవ్య బోధనుకూడా ఉపదేశంగా పొందుదాము!

ఆతరువాత జరగవల్సిన కార్యక్రమాలు నెరవేర్చవచ్చు!" అంటూ ఊరడించారు. ఆతరువాత జరిగిన కథని హిమవంతుడిలా చెప్పాడు.

“ఓ పార్వతీ! ఈవిధంగా ప్రజానీకంచేత మహారాణి ఊరడించబడి క్షణకాలం ధైర్యంతెచ్చుకొని కన్నీళ్లు తుడుచుకొని ప్రజానీకాన్నందరినీ పంపించివేసి, తన సౌభాగ్యచిహ్నాలను వదలి, క్రమంగా కృశించసాగింది. ఇట్లా భర్తృవియోగానికై అనుక్షణం దుఃఖిస్తూ, నిట్టూర్పులు విడుస్తూ నామమాత్రంగా తాను రాజుకు ప్రతినిధియై, పరిపాలన నిర్వహించ సాగింది. ఈ రీతిగా పన్నెండుసంవత్సరాలు గడిచాయి. ఒకనాడు యాదృచ్ఛికంగా అక్కడికి నారదమహర్షి విచ్చేశాడు. ఆ ఇందుమతి దుఃఖిస్తూ తన భర్త వియోగాన్ని గురించీ, అందుకు తాను పడిన పరితాపాన్నంతటినీ ఆ మహర్షికి వివరించింది. అప్పుడు ఆ నారదమునీంద్రుడు ఆమె దుఃఖకారణం తెలుసుకొని ఆమెను ఉత్సాహపరుస్తూ ఇలా అన్నాడు.

“ఓ ఇందుమతీ! నీభర్త ఒకానొకచోట జీవించియే ఉన్నాడు. కనుక నీవు మంగళకరమైన ఆభరణాలను ధరించి, సుమంగళిగా సుశోభితురాలవై ఉండు!” అని ఆమెకు ధైర్యం చెప్పాడు.

“ఓ పార్వతీ! ఆ రాణి ఇందుమతి మహర్షి వాక్కులను విశ్వసించి తన ఆభరణాలన్నింటినీ తెప్పించి సంతోషంతో వాటిని తిరిగి అలంకరించుకుంది. భూసురులైన బ్రాహ్మణోత్తములను పిలిపించి వారికి శక్తికొలది దానాదులను చేసి తృప్తులను కావించింది. ఆతరువాత దేవమునియైన నారదునికి నమస్కరించి, తన భర్తను తిరిగిపొందే ఉపాయాన్ని తెలుపమని ఇలా ప్రార్థించింది. ‘ఓ మహర్షీ! నా భర్త ఎచ్చట ఉన్నాడు, ఎలా ఉన్నాడు? ఏ ఉపాయంవల్ల ఆతడి దర్శనం, సమాగమం నాకు కల్గుతుంది? నన్ను అనుగ్రహించి అందుకు అనువైన వ్రతముగాని,

దానముగాని, తపస్సుగాని ఎంతటి దుష్కరమైనదైనాసరే నాకు తెలియ చేయండి! దాన్ని నిర్వహించి భగవదనుగ్రహాన్ని పొంది తిరిగి నా భర్తను చేరుకుంటాను.' అంటూ వేడగా, ఆ నారదమహర్షి ఆమెతో ఇలా అన్నాడు.

"ఓ సాధ్వీమణీ! ఇందుమతీ! నీ మనోభీష్టాన్ని పొందటానికై నీకొక వ్రతాన్ని ఉపదేశిస్తాను! దాన్ని అనుష్టించటంవల్ల నీ కోరికలీడేరి నీభర్తను తిరిగి పొందగలవు! ఆ వ్రతవిధానం ఎలాంటిదంటే శ్రావణశుద్ధ చతుర్థి నాడు ఆ వ్రతాన్ని ప్రారంభించాలి! ఆ రోజు ఉదయాన్నే నదీతీరానికి వెళ్ళి సమంత్రకంగా స్నానాదులను పూర్తిచేసుకొని గణేశవ్రతాన్ని చేస్తాను అనుకొని సంకల్పించుకోవాలి. అనంతరం తెల్లటి వస్త్రాలను ధరించి, మట్టితో నాలుగు బాహువులతోకూడిన వినాయకుడి మూర్తిని తయారు చేసి నిశ్చలబుద్ధితో, షోడశోపచారములతో ఆ మూర్తిని పూజించాలి. హవిష్యఅన్నాన్నిమాత్రం ఏకభుక్తంగా భుజించాలి — లేదా శక్తివుంటే ఉపవాసమైనా చేయవచ్చు! ఈవిధంగా ఒక మాసంరోజులు అనగా భాద్రపద శుద్ధ చవితివరకూ నిష్టగా వ్రతంచేసిన తరువాత, ఆనాడు సంగీత నృత్యాదికములతో, బ్రాహ్మణ భోజనములతో, బీదలకు అన్న సమారాధన చేయాలి. ఈవిధంగా ఆచరించినట్లయితే ఓ మహారాణీ! నీవు నీభర్తను తిరిగి కలుసుకొన గలుగుతావు. నీభర్త సజీవుడే! పాతాళంలో నాగకన్యకలచేత బంధితుడై ఉన్నాడు. నేను చెప్పినదంతా నిజమేసుమా! ఇందులో అక్షరంకూడా అసత్యంలేదు. నీవారకంగా ఆచరించి శుభాన్ని పొందు! అంటూ ఆశీర్వదించి ఆముని వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళకు శ్రావణ శుద్ధ చతుర్థితిథిరాగా మహారాణియైన ఇందుమతి నారదముని చెప్పిన

ప్రకారం మట్టితో గణేశమూర్తిని తయారుచేసి యథావిధిగా పూజించి, దివ్యగంధంతోనూ, దివ్యపుష్పాలతోనూ, నానావిధ నైవేద్యాలతోనూ, ఫలములూ, బంగారమూ మొదలైన దక్షిణలతోనూ, నీరాజన, మంత్రపుష్ప, ప్రదక్షిణ, సాష్టాంగనమస్కారాలనుచేసి, ఆ వరదగణేశుని సంతృప్తిపరచింది. ఆ తరువాత సంగీత నృత్యాలతోనూ, బ్రాహ్మణ భోజనంతోనూ ఆ దేవదేవుని సంతోషపరచి, తాను ఒక గ్లాసు పాలు మాత్రము ఆహారంగా తీసుకొని, ఉత్తమమైన ఈ వ్రతాన్ని శ్రద్ధాభక్తులతో ఆచరించింది. ఓ పార్వతీ! ఈవిధంగా ఆ ఇందుమతి నారదవాక్యానుసారం శ్రావణ శుద్ధ చతుర్థినుంచి భాద్రపద శుద్ధ చతుర్థివరకూ భక్తిశ్రద్ధలతో ఆచరించింది.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండమున
**'ఇందుమతీ-నారద సంవాదం'** అనే 54-వ అధ్యాయం.



55

# శివపార్వతీ సంయోగం

(మూలం)

## పంచ పంచాశత్తమోఽధ్యాయః

**హిమవానువాచ :-**

సమాప్తేతు వ్రతే తస్యా గణేశస్య ప్రసాదతః ।
పాతాలేనాగకన్యా నామన్యథా భూన్మతిస్తదా ॥ 1

మోచయామా సూ రాజానం పుపూజుశ్చ యథావిధి । 2

వస్త్రైరాభరణై శ్చైవ నానారత్న మహాధనైః ।
అశ్వం మనోజవం దత్వా విససర్జుర్నృపం తథా ॥ 3

కాసారాద్భహిరాగత్య బధ్వాచాశ్వం మహాద్రుమే । 4

స్నాతియావన్నాగరికై ర్దృష్టం కతిపయైర్నృపః ।
అపరేప్రణిపత్త్యేనం పప్రచ్ఛుః కోభవానితి ॥ 5

కుత్రత్యః కుత ఆయాతః కించ నామావదనః ప్రభో ।
ఇతితేషాం వచశ్రృత్వా పప్రచ్ఛ నృపసత్తమః 6

ఇందుమత్యాః కుమారస్య కుశలం ఖేదసంయుతః ।
తతోఋ బుధిరేతే తమాలి లింగుర్ముదా జనాః ॥ 7

ఊచుశ్చ నృపతే భార్యాస్నాత్వే దానీం గతాగృహం ।
ఉపవాస వ్రతవతీ కృశా ధర్మని సంయుతా । 8

కుమారే జీవమాస్థాయ జీవమాత్రావ శేషితా ।
కేచిచ్ఛ నగరం గత్వా శుభాం వార్తామఘోషయన్ ॥ 9

అత్యాప్త జనవాక్యేన శృత్వాసా నృపమాగతం ।
ఆనందాబ్ధౌ నిమగ్నా భూభ్రృహ్మజ్ఞానీ వయోగవిత్ । 10

తతో మాత్యాన్ పురస్కృత్య సైన్యాన్య ప్రేషయచ్ఛతం ।
చిత్రధ్వజ పతాకాభిర శోభయతసాపురం । 11

వీధీరాసించయామాస ససభాః సంపాద్యయత్నతః ।
స్వాత్మానం భూషయామాస వాసోలంకార భూషణైః ॥ 12

గోభూ హిరణ్యదానాద్యై స్తోషయిత్వా ద్విజాన్బహూన్ ।
ఆరార్తిక్యం కరే దత్వాపతివత్త్నీ జనస్యసా । 13

గీతవాదిత్ర ఘోషేణ పురాత్పుర ఉపాగమత్ ।
అమాత్యాస్తు పురోగత్వా ప్రణమ్య నృపపుంగవం ॥ 14

ఆలిలింగుర్ముదా సర్వే ప్రణేముశ్చ యథాక్రమం ।
ఉపవిష్టేతు నృపతౌ ఉపవిష్టాస్తథాజ్ఞయా ॥ 15

సర్వాన్కుశల ప్రశ్నాద్యై స్తోషయిత్వా యథాక్రమం ।
మానయిత్వా తథా లోకాన్ దత్వా తాంబూల వాససీ ॥ 16

స్వయం జగామ శిబిర మిందుమత్యా నృపోత్తమః ।
కారయామాస సవిధిం ద్వాదశాబ్ద దృశే ద్విజైః ॥ 17

పుణ్యాహవచనం కృత్వా గణేశార్చన పూర్వకం ।
సంపూజ్యశంకరం సమ్యక్ద్విజాంశ్చ దక్షిణాదిభిః ॥ 18

బభంజ శ్రీఫలం త్యక్త్వా తతస్తత్పురతోయయౌ ।
దదర్శతత్రైందుమతీ మిందోః శేషాం కలామివ ॥ 19

నీరాజ యిత్వారాజానం యువతీభిస్సభర్తృభిః ।
లాజపుష్ప మయీం వృష్టిం తాభిః సాకారయత్తదా ॥ 20

ప్రమృజ్యన యనే సమ్యగానందాశ్రు పరిప్లుతే ।
హర్ష శోకాన్వితౌ తౌతు పరస్పర మథోచతుః ॥ 21

పరస్పర వియోగాధిం కథయామాసతుశ్చుచా ।
అనివార్య ప్రకృతిభిః సాంత్వితౌ బహులోక్తిభిః । 22

ఆన యిత్వాతు రాజానం సమారోహ్య మహాగజే ।
నానా లంకార సంయుక్తే పతాకా ఛత్రసంయుతే ॥ 23

పాదరక్ష్యైః పరివృతే చతుర్ఘంటా విరాజితే
శతం యష్టి ధరాస్తస్య వారయంతో యయుః పురః ॥ 24

అగ్ని శస్త్రధారశ్చాశ్వ రథారోహా అనేకశః ।
నవ్య దక్షిణతో రాజ్ఞో గజలక్షం యయుర్లఘు ॥ 25

నటా నృత్యాంగనా వాద్యవాదకా బందినః పురః ।
తతః పశ్చాద్గజా నీకాః పురం వివిశురాదరాత్ ॥ 26

సైన్యేనరజసా వ్యాప్తేదిననాథే హతప్రభే ।
అలంకృతే పురేతస్మిన్న ప్రాజ్ఞాయతకించన ॥ 27

తతః పరస్పరం నత్వా జగ్ముః స్వంస్వం నివేశనం ।
ముఖ్యారాజ గృహం నీతాః పునారాజ్ఞా ప్రపూజితాః ॥ 28

వస్త్రతాంబూల దానేన తే నాజ్ఞాతా గృహం యయుః ।
రాజాథ బ్రాహ్మణాన్ భోజ్య బుభుజేజ్ఞాతిభిస్సహ ॥ 29



ఉచ్ఛిష్ట గణపతి

తతో రాత్రౌ సుషువ్తతుః పర్యంకే చారునిర్మితే ।
పరార్థ్యాస్తరణో పేతేః పరిచ్ఛదుపధాన్వితే ॥ 30

ఊచతుః స్వస్వదుఃఖంతౌ శోచంతౌ చ పునః పునః ।
పురోధ సాసాంత్వి తౌ తౌ శయాతేస్మ సుఖం తతః ॥ 31

శ్రుత్వా వినాయకవ్రత మహిమానం నృపోత్తమః ।
పత్న్యాను భూతం సకలం స్వయం కర్తుం మనోరథే ॥ 32

ఆగతే శ్రావణే మాసి రాజాచంద్రాంగద స్తదా ।
మహోత్సవేన కృతవాన్వ్రతమే తచ్ఛుభావనే ॥ 33

హిమవానువాచ :-

ఏవం పితృవచశ్శ్రుత్వా పార్వతీ భ్రుశహర్షితా ।
నభోమాసం సమాసాద్య చకారవ్రత మాదరాత్ ॥ 34

యథోక్త విధినామూర్తిం కృత్వా పూజాంచ యత్నతః ।
భక్షయంతీ పయోమాత్రం ధ్యాయంతీ ద్విరదాననం ॥ 35

తతశ్చంచలతాం యాతం శంకరస్యాపి మానసం ।
ఆనసాదాశ్రమం తస్యాః పార్వత్యాః సూలభ్రుత్స్వయం ॥ 36

గణేశస్య చతుర్థ్యాంతు సంపూర్ణే తద్వ్రతేశుభే ।
పశ్యతిస్మ హరందేవీ వృషారూఢం నిజాశ్రమే ॥ 37

